శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## సుందరకాండము.

ఇది

బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడి








వారి పుత్త్రుఁడగు

రాఘవనారాయణశాస్త్రిగారిచే

ప్రకటింపఁబడియె.




నిడుబ్రోలు:

తాతా ముద్రాక్షరశాల యందు

ముద్రితము.

సర్వస్వామ్యసంకలితము. 1935 [వెల రు 3-0-0



శ్రీశివాయగురవేనమః

# విషయసూచిక.

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## సుందరకాండము.

---

### ప్రథమాశ్వాసము.

---


మన్నిజపరిజననిహి
తామేయైశ్వర్యసత్క • లాంచితభూమ
స్థేమమహామాత్రవైరివి
రామాఖ్యక్రిమణముక్తి • రామారమణా! ౧

తే॥ అవధరింపుము దేవ! క • ల్యాణమూర్తి
గౌరితో నిట్టు లనియె శం • కరుఁడు ప్రీతి
నంతరంగము రామకా • ర్యప్రసంగ
మట్టు లుప్పొంగ నాపవ • నాత్మజుండు. ౨

తే॥ ప్రబలసత్వోర్మికలతోడఁ • బలుపుఁగాంచు, కడలిఁ బుట్టువుకడలితోఁగడచి సీత
లోకమాత విలోకింప • లోఁదలంచి, కపివరేణ్యుల పూజల • గరిమఁగాంచి. ౩

— హనుమంతుఁడు లంకకేగ నుత్సహించుట. —

సీ॥ పొడవుగాఁ దలయెత్తి • మెడసాచి లంకకై, నిగుడించుఁ జూపుల • నిట్టనిలిపి
పసరారు పచ్చిక • పట్టుల విహరించు, మదవృషంబట్లు స • మ్మదము పొదల
నెదురుతాఁకున మార్ఁకు • లిట్టట్టు లురలించు, వారణేంద్రము లీల • వలను మెఱయ
పెఱమెకంబుల పీఁకఁ • బ్రిదిలించు వింత కే, సరి నాఁగ నార్భటిఁ • జాల నెగడి.

యళులఁ దోలుఁ బూవు ♦ లల్లార్చుఁ బెరలఁ దే
నియలు గ్రోలుఁ దెరలు ♦ నియతి రామ
గీతు లోలిఁ బాడుఁ ♦ గీర్తించు నర్తించు
నసము వెనుచు కర్జ ♦ మబ్బె ననుచు. ౪

శా॥ ఆనందంబు హృదంతరాళమున నిం ♦ డారంగఁ బొంగారి ప్రి
స్థానావేశమున న్నిజాంగముల భా ♦ స్వద్బాష్పరోమాంచము
ఖ్యానద్ధస్వరసాదయం బగుచు నొ ♦ య్యం దోఁప నింద్రధ్వజ
శ్రీ నల్వొందెడు వాల మెత్తి జయల ♦ క్ష్మీశ్రప్రార్థితాశంసియై. ౫

ఆ॥ ఆక్రమించె జగము ♦ లన్నియు మూఁటఁ ద్రి
విక్రమాఖ్య మున్న ♦ విష్ణుఁ డనుచుఁ
దానుఁ బెఱిగె నొకటఁ ♦ దద్దయు నాహరి
కీర్తిఁ బెనుతు ననుచుఁ ♦ గీశవిభుఁడు. ౬

ఆ॥ అమ్మహేంద్రశిఖరి ♦ యం దర్కుఁ డుదయాద్రి
యందుఁ బోలె నుదయ ♦ మందు వేళఁ
జాల మెఱసెఁ గపి వి ♦ శాలయశోర్థియై
యెల్లవారుఁ జేతు ♦ లెత్తి పొగడ. ౭

సీ॥ కాళ్లఁ జేతుల నూఁది♦కాటింప గజ మట్టు, లొలయుచు రసధార♦లోలి నెఱపుఁ
దోఁకతోఁ దాటింపఁ♦దోఁగాడుచు వణికుఁ., కరణిఁ దా రతనాల♦గనులు సూపు
మ్రాఁకులు గదలింప♦మహితదైవతలీల, సూనవర్షణమున♦సొగియఁ జేయు
నల్లాటలాడింప♦నలరి యంబుదవృత్తిఁ గర్జిల్లు నుత్సాహ♦కలన మెఱయఁ
దన్మహేంద్రపదంబునఁ♦దనరు నెఱియ, కాని చుట్టఱికం బొండు♦గానఁబడదు
కులగిరి భరించె నమ్మేటి♦క్రొఁతి చేష్ట, లెవ్వరు జగద్ధితుని మెచ్చ♦రిందువదన! ౮

ఆ॥ పూవు లెల్ల దుల్పి ♦ పూజించెఁ గాకేమి
కొండఁ బెద్ద సేసి ♦ క్రొఁతివాఁడు
దాన నయ్యెఁ బర్వ ♦ తము సుమనోమయ
మతఁడు నయ్యె వైష్ణ ♦ వాగ్రసరుఁడు. ౯

తే॥ చుట్టు గుండులఁ దెరలింప ♦ నట్టనడుమ
ధాతురాగచ్ఛురితములు ♦ తద్ద మెఱసెఁ
గపివరేణ్యు ప్రతాపాగ్ని ♦ కణము లట్లు
నిండ గండోపలము లవి ♦ నీరజాక్షి! ౧౦

తే॥ హోమము నొనరింపఁ గపివరుం ♦ డూఁదఁ బ్రజ్వ
లించు జ్వలనుని జ్వాలల ♦ లీల మెఱసె
నీలవుం గుండులఁ గదల్ప ♦ నెలవుకొను మ
నశ్శిలాశిల లొండొండ ♦ నగతనూజ! ౧౧

క॥ తలఁకి మహానాగము లి, మ్ముల నుమియ విషాగ్ని లెగిచి♦మోసల జ్వాలా
వలయము రచించెఁ గపిజయ, కలనానీరాజనాప్ర♦కారాధ్యముగన్. ౧౨

తే॥ ధరగుహావిష్టము లగు భూ ♦ తములు దెరలి
పుడమి యాకస మొకఁడుగా ♦ భోరుకొలుపు
శబ్దములు హరివీరు ప్ర ♦ స్థానమునఁ బొ
సంగెఁ బరిజనకృతజయా ♦ శంస లనఁగ. ౧౩

ఆ॥ ఉప్పు డచట నెగడు♦నౌషధజాలంబు, లవ్విషాగ్ని లెగువ♦నార్పలేమి
కలికి పగులు శైల♦మను శంకఁ దత్రిత్య, భూతరాజి దాని♦పొరుగు బాసె ౧౪

వ॥ సాధ్యచారణ గంధర్వ కిన్నర విద్యాధరప్రముఖులు తమతమ ప్రియురాండ్రతో
నచటువాసి చదల నిలిచి యమ్మహోపద్రవముంగూర్చి శంకించుచుండ నందుఁ
గొందఱు సిద్ధమునివరేణ్యు లవ్వారలు విన నిట్లనిరి. ౧౫

చ॥ జగదుపకారి మారుతి వి ♦ శంకటతేజుఁడు వార్ధి దాఁటి లం
కఁ గలయఁ జొచ్చి రామవిభు ♦ కర్జము మేకొనఁ జేయఁ బోవువాఁ
డగవరధైర్యశాలి యతఁ ♦ డాఁగఁ గలంగెడు శైల మింతె పొం
డగణితతచ్చరిత్రమహి ♦ మాతిశయం బటుఁ దోఁపనయ్యెడున్. ౧౬

ఆ॥ అనిన సంతసించి ♦ యవ్వార లాహరిఁ
గాంచి పులక లంగ ♦ కముల నెఱయఁ
బొగడి రతనిఁ గల్ప ♦ భూరుహమ్మున భంగిఁ
జొక్కు తేఁటు లట్లు ♦ చూడ్కు లలర. ౧౭

వ॥ ఆసమయంబున. ౧౮

సీ॥ వందనమ్ములు సేసె♦వానరశ్రేష్ఠుండు, గురుఁ డంచు భాస్కరుఁ♦గూర్చి భక్తిఁ
గైవార మొనరించెఁ♦గర మెత్తి కపిహస్తి, హితబుద్ధిఁ ద్రిదశాల♦యేంద్రునకును
బరిచర్య లొనరించెఁ♦భావించి హరిమూర్తి, కన్నతండ్రికి సదా♦గతికిఁ బ్రీతిఁ
బ్రార్థించెఁ దాదాత్మ్య♦పరత వలీముఖు, హంసంబు హంసవా ♦ హనుని మదినిఁ
బొసఁగ భూతములకు♦భూతనాథున కాది, విష్ణువునకు రామ♦విభున కెలమి
వెలయఁ గేలు మోడ్చె♦వివిధోపచారము, ల్నెఱపె హనుమ ధృతి వి♦నిద్రుఁ డగుచు.

క॥ అసహాయశూరుఁ డఖిలై, కసహాయుం డతఁడు రామ ♦ కార్యపరత్వో
ల్లసన మొలసె నైనను శ్వస, నసహాయుం బగ్ని కటు ద ♦ నకుఁదాఁ బెరసెన్.

మ॥ ద్విగుణం బయ్యె బలంబు వేగము మహా ♦ తేజంబు పెంపొందె భా
వగతు ల్బారులు దీర్చె సం సహనము ♦ న్వాకృచ్చె సత్త్వంబు వ్యో
మగతస్తోత్రము లందె గాత్రము హనూ ♦ మంతుఁడు దా వార్ధి దా
టఁగ సంకించిన యంత మాత్రిన నిశా ♦ టస్తోమభీమంబుగన్. ౨౧

ఆ॥ తలఁచిన యవి కొన్ని ♦ తలఁపని యవి కొన్ని, కడలి దాఁటి లంకఁ ♦ గలయఁ జొచ్చె
హనుమ తలఁపు లింత ♦ యనఁగ నేల పరోప, కారి వేడ్క కిదియ ♦ దారి నగజ.

సీ॥ విదిలించె బలురోమ ♦ వితతి మోఁకలగుమిఁ, బర్వతంబున గాలి ♦ భంగిఁ బొదలి
గర్జిల్లెఁ దోయద ♦ కలన దిశాచక్రి, మునఁ బ్రతిధ్వానంబు ♦ మొనయ నదరి
యాడించె లాంగూల ♦ మది సుపర్ణాక్రాంతి, గతమహానాగంబు ♦ గాఁగ నిగచి
కట్టె బాహోపరి ♦ ఘములఁ దోరణజయ, శ్రీప్రవేశకశుభ ♦ స్థితికిఁ గూర్చి

దూరమార్గప్రసారమ్ము ♦ తోరముగను
సునిశితము లగు దృష్టులఁ ♦ జొనిపి యుత్స
హనము తోడ్తోడఁ ♦ బెనుగ నెయ్యమునఁ దోడి
వారితో నిట్టు లనియె న ♦ వ్వాయుసుతుఁడు. ౨౩

మ॥ ఇదె రామాస్త్రము పోలె లంక పస మా ♦ యింపం బ్రవేశింపఁ బో
యెద సీతం గని కాని నాఁ డసురతో ♦ నేతెంతుఁ దద్వాసభూ
పద మెంం బెకలించి మోచికొని సం ♦ పల్లీల కైకోలు గాం
చెద మీ కెల్లరకుం బ్రియంబుగ యశ ♦ శ్శ్రీలాల నోత్సాహినై. ౨౪

ఆ॥ మేలి వార్తఁ దెత్తు ♦ జాలింబడకుఁ డిఁక, రిత్తవోవు దనె మ ♦ రుత్తనయుఁడ
ననిన వారు జయజ ♦ యధ్వానములు నింగి, ముట్ట సంతసమున ♦ మొనసి రంత.

తే॥ తేజ సత్త్వంబు వీర్యంబు ♦ ధృతిసమున్న, తత్వమును నంత కంతకుఁ ♦ దనువు గూర్ప
ధీరుఁ డాతని పై దృష్టి ♦ దెరలనీక, గాంచుచుండిరి వానరు ♦ ల్కంజనేత్రి. . ౨౬

—♦ హనుమంతుఁడు సాగరముదాఁట నెగయుట ♦—

సీ॥ పొలదట్టిపై బాహు ♦ వులు మోపి పాదము, లించుక గుదియించి ♦ యొరవు సేసి
యిలఁ ద్రొక్కి యిమ్మున ♦ నిలిచి కంఠమ్మును, మూఁపులుఁ గర్ణము ♦ ల్మోనయఁ దిగిచి
యెడఁ బ్రాణధారణం ♦ బొదవించి నిక్కొని, నింగిపై దృష్టులు ♦ నెలవు కొలిపి
పులకలు నెమ్మేనఁ ♦ బొదల నూష్మలభావ, మునవొప్పి శరవేగ ♦ మునఁ దనర్చి

యెగసెఁ గుప్పింపఁ గ్రుంగి తో ♦ నెగసి యమ్మ
హేంద్రధర మనుయాయిత్వ ♦ మెఱుకసేయ
నెదిరి భంగంబు స్వీయస ♦ మృద్ధి నోటఁ
దెలుపకయ తెల్పుచును వాయు ♦ దేవసుతుఁడు. ౨౭

ఉ॥ లేదు విచార మింతయును ♦ లేదు తలంకు మనోజవంబు సం
మోదము నొక్కడై తదను ♦ మోదనవశ్యముఁ బారవశ్యమున్
బాదుకొనంగఁజేయ నొక ♦ పట్టునఁ బోవఁదొడంగె రామకా
ర్యోదితసంప్రసాదన మ ♦ నుత్తమసాహ్య మొనర్చుచుండఁగన్, ౨౮

ఆ॥ ఆర్జవమ్ము జవము ♦ నసదృక్షములు గాఁగ
మానధనుఁడు వాఁడు ♦ మానసమున
గరుడుఁ డనఁగ నేనె ♦ కాని వే ఱొండు లేఁ
డనుచు నుప్పరమ్ము ♦ నంటఁ గదిసె. ౨౯

ఆ॥ కూడముట్టి తిరిగెఁ♦గొన్ని బంధువు లట్లు, గొన్ని సేన లట్లు♦గూడఁ బాఱెఁ
గొన్ని వానిఁ జుట్టి♦కొలిచె వేగాహృత, వృక్షరాజి రాజ♦వృత్తి దోఁప. 30

క॥ పెనుగొండ వోలెఁ దరువుల, పెనకువ నతఁ డొప్పె మేలి♦విరు లిగురులు నె
ట్టన శోభిల నద్భుతద, ర్శనుఁడై యాకసమునన్ ధ♦రాధరతనయా. 3౧

ఆ॥ పెద్దమ్రాఁకు లబ్ధిఁ♦బెరసి డాగిన కొండ, లయ్యెఁ దేలి కొన్ని♦యలరుగములఁ
దారకాపథమ్ము♦తరమున దాని న, లంకరించె హనుమ♦లాఁగి విడువ. 3౨

క॥ నానావర్ణసుమోత్కర, మానీతము గాఁగ నాతఁ♦డంబరవీథిన్
దా నింద్రచాపకలితా, నూనతటిత్వద్విలాస♦మొప్ప దనర్చెన్. 33

ఆ॥ హనుమ నీడ నీటి♦యం దవగాఢమై, యోడ పోలెఁ బాఱు♦చుండె వాని
వేగమున హతప్ర♦వృత్తియై వార్ధి యు, న్మత్తు లీలఁ దెఱఁగు♦మాలి తెరలె.

తే॥ ప్రజల కింద్రధ్వజమ్ము రా ♦ వణునిపాలి
ధూమకేతువు రాక్షస ♦ స్తోమదావ
పావకజ్వాల రాము మ ♦ హావిజయప
తాక తోఁకొని హనుమని ♦ తోఁక మెఱసె. 3౪

క॥ ఆతని యురువేగంబున, నాతతపాతాళకుహర♦మగపడ ద్రోణీ
భూతమయి సంద్ర మొదికిలె, వీతస్థితి నడుమఁ బాయ♦విచ్చి మృగాక్షీ! 3౫

సీ॥ దూదిపింజెలు వోలెఁ♦దూలి మొగిళ్లు తో, నేగమిన్నున వేగ♦మెగువ నెగసి
మారుతస్కంధంబు♦మలసి చయ్యన డిగ్గి, మున్నీటి తరగల♦ముట్టరాచి
నీరు పాయలు విచ్చ♦నెఱిఁ దోఁచు ఘాతుక, సత్త్వమ్ములకు భీతి♦సంతరించి
తెక్కలకొండ పే♦రుక్కన నడిచక్కి, దారిఁ బేరెమువాఱు♦తరము మీఱి

యరుగుచుండెఁ దఱిమి ♦ యమ్మహాబలసూనుఁ
డట్లు ముందు వెనుక ♦ యనక యుత్త
రముననుండి దక్షి ♦ ణమునకుఁ జొరఁబాఱ
నురవడించి చను మ ♦ హోల్క వోలె. 32

ఆ॥ తిరిగిచూడఁ జెలమిఁ ♦ దేఁకువ నడలింపఁ
డాఁకలి యని డప్పి ♦ యని తలఁపఁడు
విభుని కర్జ మూని ♦ వెరవొందు కృతికి వే
ఱొండు సహ్య మగునె ♦ యుత్పలాక్షి! 33

క॥ పదియామడ వెడలుపు ము, ప్పదియామడ పొడవు పవను♦పట్టి తనుచ్ఛా
య దనికె వార్నిధి నప్పటి, కదె యబ్రం బనుచుఁ బొగడి♦రమరులు ప్రీతి. 34

వ॥ వెండియు నాప్రచండవిక్రముండు మహావేగంబున నంబరంబునఁ బఱతెంచు నత్తఱిఁ బురఃప్రసారితం బగు బాహుయుగళంబు పంచాస్యపన్నగయుగంబును బశ్చాద్భాగోల్లసితం బగు లాంగూలంబు మహాభోగిభోగాభోగంబును ననుకరింప భూభారహరణదక్షుం డయ్యును భూభారభరణశీలుం డగు పాఁపతేని లీలాకృతికిం బాసట యగు మూర్తివిశేషంబున నొప్పారి రంగుమీఱు కడానిబంగరు మెఱుంగు లీను నెమ్మేని పేరిటి పసిండికొండ నుండి వింత విద్యుద్వల్లికలు పొడసూపి యాకసంబు తలంబు నాక్రమించి యల్లిబిల్లిగా నల్లుచున్నవో యనఁ గ్రొత్త కాంతులు చూచువారల కన్నులకు మిఱుమిట్లు గొలుప మహాతేజస్స్ఫురితంబు లగు నేత్రంబు లుదితంబు లగు చంద్రసూర్యబింబంబుల డంబు విడంబింప నెఱ్ఱని నెమ్మొగంబు సంధ్యారాగరసరంజితం బగు భానుమండలంబునకుం దోడు నీడ యై కనుపట్టఁ దెల్లని దంతముక్తాఫలపంక్తికి జన్మభూమి యగు వదనశుక్తిక విద్రుమఫలం బెట్లు కనియెనో యన రుచి మీఱు రదనచ్ఛదంబు విష్ణుపదంబు నకుం గూడఁ గొండొక కౌస్తుభమణిరత్నంబు సంపాదింప గైరికధాతురాగచ్ఛురితం బగుట నితంబప్రదేశంబు మహాశైలంబునకుం దనకును నభిన్నాక్రమాంతరంబ యై యుండు నని లక్షణపరిష్కారం బొనరించువిధంబు దోఁపఁ బుచ్ఛం బల్లార్చుచు నీరేడులోకంబుల నెందునేనిఁ ద న్నెదిర్చి పోరున విజయం బందు వీరుండు కాన్పింపం బోవం డనియో యాచక్రవాళ శైలంబుగాఁ గడ లెల్లం దడవి తడవి

పుడమికన్నియ సందర్శించి యమ్మౌళివార్త రామమహీజానికిం దెలుప వత్తున
కాని రిత్తకరిత్తగా రానేర ననియో రాక్షసనిలయంబుఁ బ్రవేశించి యమ్మెయిన
కొఱవిం ద్రిప్పిన తెఱంగునఁ బ్రవర్తిల్లుదు ననియో సన్నసేయు వడువున
వాలంబు చక్రాకారంబుగాఁ బరిభ్రమింపంజేయుచుం బరివేషమధ్యగతుం డగు
నంశుమంతుని కరణి వారాంనిధి గర్భంబు వెలువడి ద్రిమ్మరుచున్న బాడబవీతి
హోత్రుని పగిది మకరిఁ ద్రుంచి కరిణీనాథునిం దేర్పఁ దోఁతెంచు సుదర్శ
నాయుధంబు భాతిఁ ద్రిపురంబులపై నుఱుకు మదీయం బగు నాగ్నేయశరంబు
కైవడి రోదసీకుహరంబు మాయించునో బ్రహ్మాండకర్పరం బగల్చునో దిక్కులు
వ్రక్కలించునో యంతరిక్షం బప్పళించునో పారావారపూరంబు గ్రోలునో వారి
వాహసమూహంబు విదారించునో యని వియచ్చరభూతంబులు పిచ్చలించి
యెదుఁగంబాఱ ననివార్యశౌర్యవిజృంభణంబునం బోవుచున్న సమయంబున.

క॥ అనుకూలుఁ డగుచుఁ బవనుఁడు, తనసుతునకుఁ దోడు సూపెఁ ♦ దపనుఁడు తాపం
బొనరింపకుండెఁ బేరిమి, వినమ్రమై నిఖిలభూత ♦ వితతియుఁ బొగడెన్. ౨౦

క॥ అచ్చర లాడిరి హెచ్చి వి, యచ్చరు లలరుజడిఁ గురిసి ♦ రమ్మహితు కథల్
మెచ్చఁగఁ బాడిరి కిన్నరు, లచ్చపుదీవెన లొసంగి ♦ రఖిలమునీంద్రుల్. ౨౧

ఆ॥ అట్టు లేగుదెంచు ♦ నతని నాలోకించి, యంబునిధి పరార్ధ్య ♦ మైన యర్ఘ
మంత రాత్మ నునిచి ♦ యర్థి మై నంతస్థుఁ, డగు గిరీంద్రసుతున ♦ కనియె నిట్లు.

—♦ సముద్రప్రేరితుఁడై మైనాకుఁడు హనుమనికి నతిథిసత్కారము సేయబూనుట. ♦—

క॥ నాకును నీకును హిత మిది, నాకౌకసులకుఁ బ్రియంబు ♦ నందితగుణ మై
నాక! యెయిదు మనిలజుఁ డొక, శ్రీకర మగు కర్జ మూని ♦ చేరఁగవచ్చెన్. ౨౨

తే॥ ఆప్రియాతిథి సత్కార ♦ మాచరింపు
మపగతక్లమఁ జేసి త ♦ దాదృతిఁ గను
మన్నిఁటికిఁ జాలు దీవన ♦ నతఁడు పొంగి
యఖిలవృత్తాంత మెఱిఁగి చ ♦ య్యనఁ గడంగి. ౨౩

క॥ అంబునిధి గర్భగతుఁ డుద, కంబులఁ దెరలించి పై కె ♦ గసె నబ్దపిధా
నం బెడసి భాసురం బగు, నంబరమణిబింబమునకు ♦ ననుగుంజెలి యై ౨౪

సీ॥ చొక్కంపుఁ బసిఁడి ర ♦ శ్ములు దిక్కులం బ్రాఁకి, విద్యుల్లతల సొంపు ♦ వెల్లడింపఁ
బవడపుం దీవెలు ♦ బయలఁ గ్రిక్కిఱిసి బ, ల్సాంధ్యరాగశ్రీల ♦ సంతరింపఁ
బచ్చలమొలకలు ♦ బాఱు తళ్కులు మేఘ, మండలిఁ బచ్చిక ♦ ల్మెందుకొలుప
మగఱాల దీప్తులు ♦ మలసి రోదసి నిండ, భానుకోటిస్ఫుర ♦ ల్ప్రస్తరింపఁ

బరిపరిపరశ్శతంబు లై ♦ పరఁగు శిఖర, కటకపాదము లెల్ల జ♦గమ్ము లోడియఁ
జాలఁగ హిరణ్యనాభసం♦జ్ఞం దనర్చు, నతఁడు హనుమని కెదుటఁ♦బ్రత్యక్షమయ్యె.

క॥ ఫలభారనమ్రములు తరు, వులుఁ బూఁబొదల మృతసార♦పూర్ణములు సర
స్సులు దివ్యౌషధులును స్ఫుర, దళిముఖనాదములతోడ♦నగ్గిరి నొప్పెన్. ౪౮

క॥ కిన్నరగీతంబులు విల, సన్నగబంధుస్తుతిప్ర♦చారంబులు సం
పన్నతఁ జెలువ గిరీట్సుతు, సన్నాహ మనీదృశప్ర♦సక్తిఁ దలిర్పన్. ౪౯

తే॥ అతని తెలఁగంత కంతకు ♦ నగ్గలముగఁ
దోఁపఁ బెను విఘ్న మిత్తోవ ♦ దొరసె ననుచు
ఱొమ్ముతాఁకునఁ దాటించె ♦ నిమ్ము లెడలి
పర్వతాధిపాపత్యమ్ము ♦ బమ్మరిల్ల. ౫౦

క॥ తెప్పిఱిలి ముప్పునం బడ, కప్పాటనె దివ్యరూప♦మంది శిఖరమం
దొప్పుగ నిలిచి యతం డెద, మెప్పు గదుర సమ్మదమ్ము♦మెయికొనఁ బలికెన్.

సీ॥ నీకు విఘ్న మొనర్చు♦నెఱి గాదు మాయింటి, బంధు వైతివి నీవు♦పవనతనయ!
రాచవారికి విందు♦రాణించు సంద్రమే, మిరువురమును నీదు♦హితము మదిని
భావించి నినుఁ గాంచి♦సేవింపఁగా నాతఁ, డనుప వచ్చితి నింత♦యనుమతించి
సత్కారము ల్గొనఁ♦జను దెమ్ముచనవుమా, కింతమాత్ర మొసంగి♦మెలమిఁగూర్పు

మిందు ఫలకందమూలము ♦ లించుగడలుఁ
బుట్టతేనియ లమృతమ్ము ♦ గుట్టు వాపఁ
జాలు సరసీరసమ్ములు ♦ జాల నెగడు
నింపు మై నారగించి సు ♦ ఖింపు మయ్య! ౫౧

క॥ మందారతరుచ్ఛాయల, నిందలి పననాంకురమ్ము♦లెలయింపఁగ శ్రాం
తిం దలఁగి యవలఁ గర్జము, పొం దరయుము మామనంబు♦పొంగారంగన్.

తే॥ ఱెక్క లెగుర గిరు ల్చెల ♦ రేగి యెల్ల
జగముఁ బీడింప నింద్రుండు ♦ చాలివాని
చట్టుప ల్దెగఁ జూచె వ ♦ జ్రంబు సాఁచి
యవి విపక్షంబు లయ్యె న ♦ య్యదనునందు. ౫౨

క॥ నాపై నాతం డుఱికినఁ, బ్రాపై నీతండ్రి పవన♦భట్టారకుఁ డే
నాపదలఁ బొరయకుండఁగఁ, గాపాడెను వార్ధి సఖునిఁ♦గావించి దయన్. ౫౩

తే॥ సగరసంతతి పెనుపున♦సాగరంబు, నాఁగ వర్ధిల్లుటనుఁ దద♦న్వయమువారి
కర్జ మీ పూని వచ్చిన♦కారణమున, నబ్ధి నాతోడి బందుగుఁ♦డనఁగ నయ్యె. ౫౬

క॥ ఎలమి నుపకారి కుపకృతిఁ, దలఁపని వాఁ డెనయు నంధ♦తామిస్రమనన్
గలవె జగ మెల్ల మనుపం, గల నినుఁ బూజింపకున్న♦గతు లిఁక మాకున్. ౫౭

శా॥ ఆనృణ్యంబునఁ దేర్పు మయ్య! మము ని ♦ య్యర్థమ్ము కైకోలునం
దా నింద్రాదులతోడ మెచ్చును జగ ♦ త్ప్రాణుండు మత్ప్రార్థితం
బూనత్వం బెనయంగఁ జూడకుము ని ♦ త్యోల్లాసి! నీసేవఁ దో
డ్తో నీరేడుజగమ్ము లేకధృతిమై ♦ దోఁగాడు హర్షాంబుధిన్. ౫౮

క॥ అని వేఁడెడు నాతనిఁ గని, యనిలసుతుం డనియె నట్టు♦లొఁగా కెలమిన్
మొనయించితి వాతిథ్యము, వినిర్మలము నీదు తలఁపు♦విశ్రుత మయ్యెన్. ౫౯

— ♦ హనుమంతుఁడు మైనాకుని వీడ్కొని యరుగుట. ♦ —

చ॥ మసలఁగఁ గాదు నా కిట ని ♦ మంత్రితుఁడ న్రఘురాము కార్యమున్
బొసఁగ ఘటింపఁ జేయ నెడఁ ♦ బొద్దు గ్రమింపక మున్నె పూని య
ద్దెసఁ గని కాని యొండు గనఁ ♦ ద్రిక్కొన నాకలిడప్పి యుంచు ని
య్యసదృశ మైన సంగరము ♦ నాఁగ గుణాకర! మెట్టు లేనియున్. ౬౦

క॥ నెన రుంచుము గిరివరనం, దన! సంతోషించినాడఁ♦దలఁగు మెఱుఁగ కేఁ
బూనరించిన యపరాధము, ఘనుఁ డగు సాగరున కిట్లు♦గాఁగఁ దెలుపుమీ. ౬౧

మ॥ అని కేల్సాఁచి కవుంగిలించుకొని య ♦ న్నా పోయి వత్తుం దలం
పున మే లుంచు మటంచు నెమ్మనమున ♦ న్బొల్పారు హర్షంబు పెం
పునఁ గన్నుల్వికసింప వాని నెలమిం ♦ బొందించి వీడ్కొల్పుచున్
ఘనమార్గంబుఁ గ్రమించెఁ దద్విభవము ♦ న్గనంట వీక్షింపుచున్. ౬౨

క॥ దానికి వాఁడును గడలియు, మే నెఱుఁగగనీని ధృతిని♦మించి ప్రశంసా
ఖ్యానముఖరు లై రమ్మెయి, నానందంబున నుతించి♦రంబరచరులున్. ౬౩

— ♦ ఇంద్రుఁడు మైనాకునకు వరము లిచ్చుట. ♦ —

ఉ॥ మెచ్చి సురేంద్రుఁ డద్రి ధృతి ♦ మేకొనఁ గాంచి హిరణ్యనాభ! నీ
సచ్చరితంబు పెంపుమెయిఁ ♦ జాలితి విట్లు శుభంబుఁ గూర్పఁగన్
బొచ్చెములేని యీకృతినిఁ ♦ బొం దొనఁగూడెను నీకు నాకు నీ
యిచ్చఁ జరింపు మెట్లయిన ♦ నేమొడఁ గీడు వొసంగ దెద్దియున్. ౬౪

క॥ అని వర మొసంగి నెమ్మిం, జనెఁ బర్వతభేది ముదము♦జాల్కొన గిరిరా
ట్తనయుఁడు నమ్మెయిఁ దిరమా, మనముననో వ్వారె సుకృత♦మహితుం డగుచున్.

ఉ॥ అంతట శైలవార్నిధి స ♦ మాదృతుఁ డై జవ మొప్ప నాహనూ
మంతుఁడు పోవుచుండె ఘన ♦ మార్గము వట్టి ప్రసక్తిమై సుర
ల్మంతన మొప్ప వాని గరి ♦ మం బరికింపఁగ సర్వశక్తుల
న్మంతున కెక్క నయ్యురగ ♦ మాతను గాంచి వచించి రిమ్మెయిన్. ౧౮

ఉ॥ మాయిక లెల్లరక్కసు ల ♦ మాయికుఁ డొంటిఁ జరింప నెప్పు డే
శ్లోయవలేప మేయుపధి ♦ నెంచి యలంతుగొ లోకబంధుఁ డి
వ్వాయుజుఁ డబ్ధి దాఁటి యని ♦ వార్యత లంకకుఁ బోవఁ జూచెడుం
బోయి పరీక్షసేయు మెడ ♦ వోవక మున్నె ప్రభూతమూర్తివై. ౧౯

క॥ రక్షోరూపంబున నీ, వక్షోభ్యతఁ గానిపింప ♦ నలమటపడునో
దక్షతమైఁ గ్రమియించునొ, లక్షణ మెఱుగంగ నగుఁ గ ♦ లానిధి! నీకున్.

క॥ ఆతతజవసత్త్వంబుల, నాతం డుడివోనివాఁడ ♦ యగు బుద్ధిబలం
బే తెఱఁగు గలదొ చూతము, మాతలఁపునఁ దలఁకు మాన్వ ♦ మలయుము తల్లీ!

మ॥ అని యద్దేవిఁ బురస్కరించి యనుపన్ ♦ హర్షించుచుం బోయి గ్రి
ద్దన ముప్పట్టులు మిగ్రింగఁ జూచు పెనుభూ ♦ తం బట్టు లవ్వాయుసూ
నుని మార్గం బరికట్టె మిత్తి కడఁక ♦ న్నోనాఁడు నమ్మేని పెం
పును దంష్ట్రి ల్వికృతాస్యము న్భయ మెద ♦ న్బుట్టింప దట్టింపుచున్. ౨౦

వ॥ అట్లు విజృంభించి యన్నెఅవాది నెదుర్కొని. ౨౧

—♦ దేవతాప్రేరిత యైన సురస హనుమనిఁబరీక్షించుట ♦—

ఆ॥ సురస నాగమాతఁ ♦ జూచె యే వానర, కామరూపసత్త్వ ♦ కలిత నన్నుఁ
గడచువారు లేరు ♦ గ్రసియింతు నాకలి, పెనుపు దనుక నెదియుఁ ♦ బెరసెనేని.

క॥ చిక్కితి నా కీయెడ నీ, కెక్కడఁ బోవనగు నింక ♦ నిమ్మెయి భక్ష్యం
బెక్కరణి విడువనోపుదు, నిక్కాలము దైవ మిట్టు ♦ లేర్పడఁ జేయన్ 23

క॥ నాయాస్యగహ్వరం బెడఁ, బాయక చొరఁబాఱి కనుము ♦ పరలోకసుఖం
బీయెడ నే మన నే మా, నాయాసమె కాని పిదప ♦ నదియగ్లెయగున్. ౨౪

క॥ అని యడరిన నతఁ డిట్లనె, ననిలసుతుఁడ హనుమ నెలమి ♦ నమ్మరొ నీ కే
నొనరింతు వినతి రాముని, పనుపున సీత నెల వరయు ♦ పని నా కొదవెన్.




ఆ॥ అతఁడు దాశరథి యు ♦ నంతసత్త్వుఁడు తండ్రి
వనుప సాధ్వి దాను ♦ ననుజుఁడునుఁ బ
రార్థ మొలసి దండ ♦ కాటవిఁ జరియించు
చుండ వారు లేని ♦ యొక్కతఱిని. ౨౫

ఆ॥ రావణుఁడు వెఱంగి♦రాణివాసము గొని, చనియె దూతకృత్య♦మున మెలంగఁ
బోవు చున్నవాఁడఁ♦బున్నెంబు నీ కగు, నన్ను విడువు మేను♦నయ మెఱింగి. ౨౬

క॥ వార్త నెఱిఁగించి తుది మది, నార్తిపడక యొడలు నీక ♦ యర్పించెద స
త్కీర్తిఁ గనుము శపథమ్మున, వర్తిలుదుఁ దలంపుమింత ♦ వట్టు నిజముగన్. ౨౭

ఆ॥ అనినఁ బొల్లుమాట ♦ లవి యేల యే నిన్ను, దదలి వ్రేలు నోట ♦ వైచికొనఁగ
నీవు వత్తు గాక ♦ నేమమ్మున నటంచు, నలఁతి గాని రభస ♦ మందుటయును. ౨౮

క॥ నీచాలినయంతలుగా, నాఁచికొనం దగు నటంచు ♦ నాయమ మోమున్
దోఁచికొనఁగఁ బదియామడ, లై చాల్పు వెడల్పు నొప్ప♦నా మైఁ బెనిచెన్.

సీ॥ సురస యాతని పెంపు♦జూచి వింశతియోజనా, క్రాంతవక్త్రోర్ధ్వ♦యగుడు హనుమ
ముప్పదియోజన♦మ్ములుగ వర్ధిల్లిన, నలువది యామడ♦ల్నాఁతి గ్రిమ్మె
నోరెత్తి యిమ్మెయి♦నూఱామడలు గాఁగ, నా నంతకును మారు♦తాత్మజుండు
పెనుచుచుండెను మేను♦పిఱు తివియక యప్పు, డంగుష్ఠమాత్రుఁడై ♦ యాపె గర్భ
మందుఁ జొరఁబాఱి వెలువడి ♦ యతివఁ గాంచి
యంబ ! నీయుదరంబున ♦ ధుందు నలఁతి
జొచ్చి వచ్చితిఁ జెల్లె నీ ♦ యిచ్చ యింక
సెల వొసఁగుమే నమస్కృతు ♦ ల్సేయువాఁడ. ౩౧

క॥ అన మెచ్చుచు దాక్షాయణి, తన నిజరూపంబు దాల్చి♦తనయా! నినుఁ బో
లినవానిఁ గాన మెందును, జనః మింక జయించి తెల్ల♦జగముల నొకటన్. ౩౨

తే॥ సురలు నీబుద్ధిబలమున ♦ చూ ప్పరయఁగ
వేఁడి ననుఁ బంప వచ్చితి ♦ వెఱపు సూపఁ
దలఁపు మెలఁకువ దాక్ష్యంబు ♦ ధైర్యసార
బలము లనువొందు నీయందుఁ ♦ బవనునందు. ౩౩

—♦ సురస హనుమని మెచ్చి దీవించుట. ♦—

క॥ నీకీర్తి నెగడుఁగాపుత, మీకువలయ మెల్ల నునుప♦నిదె తఱి ప్రాజ్య
శ్రీకారి రాము కార్యము, చేకొని ఘటియించి మనెదు♦చిరకాలంబున్. ౩౪

ఆ॥ అనుచు వర్ధిలంగ♦నాతని దీవించి, యఱిగె సురస యంత♦రంగ మలర
సురలు హర్ష మంది♦సూనము ల్వర్షించి, రుదయ మెనసి హనుమ♦యుత్సహించె.

సీ॥ మెఱుఁగుఁదీఁగెలు మ్రోల♦మెలఁగ నభ్రగజంబు, నందును బర్జన్యుఁ♦డమరుచోటు
ద్యోగంగ తరగల♦దోఁగి కమ్మనిగాడ్పు, లెలయింప సుకృతుల♦నెనయుచోటు
వ్యోమయానము లెక్కి♦యువతులతో స్వర్గు, లింపు మైకొనఁ జరి♦యించుచోటు
క్రతుహవ్యములు మోచి♦క్రతుభుక్కులకు హవ్య, వాహుఁడర్థినొసంగ♦వచ్చుచోటు

తారకాలింగమూర్తికిఁ ♦ దపసు లెల్ల
సారసరసీరుహార్చన ♦ ల్జరుపు చోటు
గాన నా మింటిమార్గంబు ♦ గవియఁ జొచ్చి
యరుగుచుండెను వాఁడు ప ♦ ద్మాయతాక్షి ! ౮౬

ఉ॥ చుక్కలతేని యిక్క నెఱి ♦ సొం పల రిక్కలరాణి వాసపుం
జక్కఁదనంబు డంబు గ్రహ ♦ సద్మవినిద్రవిలాసవైఖరుల్
మ్రొక్కులవేల్పు మండలము ♦ ముంగిటి తేజము దేవతామృగీ
దృక్కలనాథ్యధామమున ♦ తీరును గాంచె హరీంద్రుఁ డద్రిజా! ౮౭

చ॥ అసమము పొంగువాఱ నటు ♦ లంబరవీథినిఁ బాఱుతెంచు న
ప్పురుషవరేణ్యునిం బవన ♦ పుత్త్రునిఁ బావనమూర్తిఁ గానవ
త్తురు సురసిద్ధముఖ్యు లగు ♦ ద్యోసదు లిమ్ముల నిల్చి స్వీయసుం
దరులకుఁ దచ్చరిత్రములఁ ♦ దత్పరతం దనుపారఁ దెల్పుచున్. ౮౮

ఆ॥ ఱెక్క లున్న పులుఁగు ♦ ఱేనికిఁ బఱపున
సిగ్గు గూర్పఁ బ్లవగ ♦ సింహ మబ్ధి
గడవఁ బెట్టి నట్లు ♦ గగనవీధి మహోజ్జ్వ
లాంగుఁ డై క్రమించు ♦ నవసరమున. ౮౯

—♦ సింహికానిగ్రహము. ♦—

ఆ॥ అతని చాయ సింహి ♦ కాఖ్య మహా ఛాయాగ్ర
హము గ్రసించె నాగ్ర ♦ హంబు దనుకఁ
బెద్దకాలమునకుఁ ♦ బేరు మాలిన క్షుధా
వ్యథఁ దొలంచు తరుణ ♦ మబ్బె ననుచు. ౯౦

క॥ అవకుంఠితుఁ డై లోఁబడి, పవనజుఁ డెదఁ దలఁచె నసుర♦ప్రాబల్యము ము
న్నివరించెఁ బ్లవగనాథుఁడు, జవదాటఁగ లేరు దీని♦జవనుల యేనిన్. ౯౧

క॥ కాని మ్మని మే నమ్మెయిఁ, బూని పెనుప నదియు నోరు♦భూమికి దివికిం
దా నొకఁడుగఁ దెఱచినఁ గని, వానరపతిమంత్రి పిన్న♦వాఁడై తోడ్తోన్. ౯౨

తే॥ కదిసి యాపెనుభూతంబు ♦ గర్భగోళ
మెనయఁ బరికించి యొక్కింత ♦ యేనిఁ దడయఁ
బోక హృత్క్రోడ మాంత్రము ♦ ల్ప్రాలను వజ్ర
నఖములఁ జెకల్చికొని గగ ♦ నమున కుఱికె. ౯౩

ఆ॥ అనిలతనయుఁ డట్టు♦లక్కాళ బలుకుక్షి, లోయఁ జొరసి యంత♦లోన కెడసి
రాహువదనగహ్వ♦రము సొచ్చి వెలువడు, పూర్ణచంద్రు లీలఁ♦బొలుపుఁ గాంచె.

క॥ ఏచాయన్ గ్రసియించెనో, యాచాయనె గ్రాస మయ్యె ♦ నది మిత్తికి సం
కోచ మెడలి వేల్పులు వ్యా, కోచముఖు ల్గాఁగఁ దుహిన ♦ కుధరతనూజా!

ఆ॥ తెఱచి నట్టి నోరు ♦ తెఱచి నట్టులె యుండఁ
దెఱవ యుసురు వెడల ♦ దిటవుపడియె
నది యొకొండు కొండ ♦ యన మేను వైచి యు
దరము కందరమ్ముగ ♦ దారి సూప. ౯౬

క॥ హనుమని దార్ఢ్యముఁ గని యూ, హను మనిచెం గాక మనల♦నందఱు మఱియే
మని తరము మీఱు ధృతి క్షణ, మనితరవాగ్గుంభనముల♦నమరిరి దివిజుల్. ౯౭

క॥ అంబరతలముం జొరసి తి, రం బగు నుల్లాసమునఁ బ ♦ రం బంబుధిపా
రంబు గనె దృక్ప్రసంగం, బింబుగఁ దనకన్న మున్నె ♦ యొయిది మెలంగన్.

చ॥ పెరిగెను మేనుఁ దేజ మటు ♦ పెంపు వహించెను వేగ మెక్కుడై
పెరసెను సత్త్వసారములు ♦ పిక్కటిలె న్ఘనహర్షపూర మ
ప్పరుసున మీఱె నత్తొడసు ♦ వాసిసముత్సహనంబున న్గుణో
త్తరుఁ డట గోష్పదం బెడయు ♦ దారి సముద్రము దాఁటు నత్తఱిన్. ౯౯

ఆ॥ ఆతఁ డూర్పు వుచ్చఁ ♦ డలమట నొందఁ డ,
య్యబ్ధి దాఁటు టెక్కుఁ ♦ డని తలపఁడు
పెక్కు లామడలునుఁ ♦ బేర్కొననిది యేటి
లెక్క నాకు నూటి ♦ లెక్క యనుచు. ౧౦౦

ఆ॥ ఎవని నంతకాల ♦ మెనయుచో నొకపరిఁ యేనిఁ దలఁచి మనుజు ♦ లీఁదువార
లలభవాబ్ధి నతని♦యలఘుకింకరున కి, క్కడలిఁ గడచు టెంత♦కమలనయన.

క॥ తొలుదొల్తఁ దోఁచె ద్వీపం, బలఘుతరంబవల గిరి వ♦నాంతతరులతా
ఫలపుష్పమంజరీశ్రీ, విలసనరేఖాప్రసక్తి ♦ విశ్రుత మగుచున్. ౧౦౨

వ॥ పదంపడి యయ్యంజనానందకందళంబు. ౧౦౩

——♦ హనుమంతుఁ డవ్వలితీరముఁ జేరి ప్రకృతి ననుగమించుట ♦——

క॥ ఇలఁ ద్రొ... ను వాహినులి, మ్ముల నంబుధిఁ దేర్చు హర్మ్యములు♦మొగకొను తెరలం
గల సౌభా ము మలయా, చలోపవనవిలసనములు♦చాల్పుగఁ గనుచున్.

ఆ॥ బలి వినిగ్ర... ంచి♦ప్రకృతి నందిన విష్ణు, నట్లు మోహ మెడలి♦యాత్మరూప
మెనయఁ గ... యోగి♦పౌనరిక వాఁ డబ్ధిఁ, గడచి సహజమూర్తి♦కలన మెఱసె

ఉ॥ ఆపవనాత్మజుం ... కనె ♦ నంబుధి వేల సువేల మెక్కి లం
కాపురి నాత్రిక... టమునఁ ♦ గాంచనకూటవదంచలాంచిత
ద్యోపురి నట్లు పుణ్యజన ♦ యోగనియోగవదర్థనిత్యభో
గోపచితప్రభావవిభ ♦ వోచితవిభ్రమసీమ నయ్యెడన్. ౧౦౬

సీ॥ తనవారిదళముతోఁ♦దనుఁ జుట్టి మున్నీరు, గొలువ నార్భటి నొడ్డఁ♦గలఁచుదాని
గిరుల మొత్తమ్ముతో♦గిల్కొన్న పెనుగొండ, పై నెక్కి పరులఁ జే♦ద్పఱుచుదాని
వజ్రసాలముతోడి♦వరసాలములు గొంచు, నాకసం బెగయింప♦నఱుముదాని
గోపురాట్టాలక♦గుంభితయంత్రాస్త్ర, తతి వ్యోమచరుల న♦దల్చుదాని
నసురకల్పమహోభైర♦వాట్టహాస, చకితయమపరిహాసప్ర♦సక్తిదాని
లంక గతశంకఁ గని రామ♦కింకరుండు, విస్మయాంబుధిఁ దోఁగె సు♦గ్రీవ్రధతనయ!

క॥ కన్నులపండు వగుచు విభ, వోన్నతిఁ దనరారు దాని♦యొఱపు ప్రసక్తి
గ్గన్నది కన్నట్లుగఁ దా, నెన్నఁదొడరె నతఁడు హిమము♦హీధరపుత్రీ! ౧౦౭

సీ॥ ఇది చొక్కటమ్ముల♦కిక్కగా సంద్రమ్ము, సార మై పొడమిన♦స్వర్గలోక
మిది మెల్లగట్టుల♦కెర వై త్రికూటమ్ము, దాఁచికొన్న మహాని♦ధానము తల
మిది దేవశిల్పి పే♦రెనయ నెక్కటి వింత, లుంచిన శిల్పప్ర♦పంచశాల
యిది సుప్రసన్నస♦ర్వేశ్వరవిస్తార్య, మాణాఖిలైశ్వర్య♦మహితశక్తి

యిది యసురజీవనాళ మి ♦ య్యది సురాఘ
పాశబంధమ్ము సుకృతసౌ ♦ భాగ్యసీమ
దీనిఁ బోలంగఁ జాలునే ♦ దివిజపురియు
గిరియు నిద్దాని వర్ణన ♦ కేవలంబె. ౧౦౮

తే॥ నాఁటి దుర్వాసు తిట్టున ♦ నాకలక్ష్మి
యుదధిఁ జొర బాటి యిమ్మెయి ♦ నుండనోపు
మంథగిరి యొరపుక రాలి ♦ మలసినట్టి
త్రుప్పు డల సారసంపదాం ♦ దోళనంబు. ౧౧౦

క॥ దనుజగురుఁడు మృతసంజీ, వని విద్యం గొనియె హరుని♦వలన నదె పురం
బున రూపు దాల్పఁ జనుఁ గా, దన మిత్త్రికిఁ జేరరాని♦దై మనఁగలదే. ౧౧౧

తే॥ డెందములు దేవళమ్ములుఁ♦బొందుపఱచి, కాలకాలునిఁ బూజించు♦కలన లెంచి
రక్కసులజోలి కెన్నఁడు♦రాదు మిత్త్రి, పగఱమాటకు నింకేమి♦బాట గలదు.

ఆ॥ ఎఱిఁగి యెఱిఁగి మున్నె ♦ యెల్లగట్టుల చట్టు
పలు దెరల్చి వజ్రి ♦ నిలువరించెఁ
గాక యున్నఁ గొండ ♦ కాణాచి యిది పుర
మ్ములను మూఁటి నెగసి ♦ మొత్తకున్నె. ౧౧౩

చ॥ తొలుతనె దీనికై యెగచి ♦ తోఁచెను వైశ్రవణు న్నిజాగ్రజున్
గెలిచెను గాక లోకములఁ ♦ గీర్తికి నైయటు నాదరింపఁ డ
య్యలకను నైంద్రి భోగవతి ♦ నబ్రమె రక్కసిమున్నెఱేని మే
ల్వాలపుల కుప్ప యిప్పురికి ♦ వచ్చునె సాటికి నెద్దియేనియున్. ౧౧౪

తే॥ విశ్వరూపుఁడు త్వాష్ట్రుఁడ♦వ్విధము సేసె, నసురపక్షమ్మువార పో♦యమరశిల్పు
లెన్ని పురముల నిర్మింప♦రి ట్లటంచు, దీని యసమానగుంభన♦ తెలుపకున్నె. ౧౧౫

తే॥ వార్ధి నడిగట్టుపై నిది♦వఱలుచుంట, మూఁటి కూటమి నద్రి త్రి♦కూట మయ్యె
తనకనకకూటకోటులుఁ దవుల గగన, మేల బహుకూటసంజ్ఞ వ♦హింప దొక్కొ.

క॥ అసురపురమ్ముల మూఁటిం, గసి దీఱం గాల్చె నాఁడు ♦ కామహరుం డీ
యసురపురిఁ గాచు మఱవఁడొ, యసిపదనున నెఱపినట్టి ♦ యాతప మెదలోన్.

క॥ అని యెన్నుచునె త్రికూట, మ్మున కూటము మొనసి వీఁడు ♦ మొగకొని సౌభా
గ్యనవోదయ మనఁ దోఁచిన, గని యిట్లని పొగడె మేన ♦ కాసుకృతశ్రీ!

సీ॥ ఇది కల్మిచెలి పుట్టి ♦ నిల్లు గాదన నబ్ధి, నాకధునీలాల ♦ నము లమరునె
యిది గౌరి కైశోర ♦ కేప్సితం బనకున్న, గిరి యెత్తి ముద్దాడు ♦ గరిమఁ గనునె
యిది భారతీకలా ♦ సదనంబుగాక హి, రణ్యగర్భవిలాస ♦ రక్తి మనునె
యిది శచీరూపసం ♦ పద పెంపు గాకున్న, నైంద్రిసామ్రాజ్యంబు ♦ నాచికొనునె
యిదియె రాక్షసరాజస ♦ మీహితార్థ, సిద్ధి గాదేని నవిహత ♦ స్థితిఁ దనరునె
యిది సపత్నదురాసద♦మిది యసాధ్య, మిది యనన్యాదృశము దీని♦నెన్నఁదరమె.

ఉ॥ నిచ్చలు బచ్చతోరణల ♦ నిద్దపుబంగరుగోడలన్ బ్రభా
త్యుచ్చపతాకలన్ శశధ ♦ రోపలవేదులఁ బద్మరాగసం
పచ్చయ యోగివజ్రమణి ♦ వప్రసుతారవితానలక్ష్ములన్
మచ్చిక గూర్చు నిన్నగరి ♦ మారవిరోధికి శంబరారికిన్. ౧౨౦

తే॥ గోపురమ్ము లనుస్యూత♦గోపురములు, వైజయంతిక లాక్రాంత♦వైజయంత
వైభవాంచిత శిప్పూరి♦వైభవంబు, గలయఁ గాంచుట కన్నులు♦గల ఫలంబు.

తే॥ ఇచటి దనుజుల నెనసి మం ♦ దేహు లెట్లు
తన్ను బాధింతురో యని ♦ తలఁచియే మొ
చేరఁ డిప్పూరి దరి నొంటఁ ♦ జేరు ప్రతిఫ
లించు రవికోటి సాహాయ్య ♦ మెంచియినుఁడు. ౧౨౨

సీ॥ వప్రంబు ప్రాకార♦వలయంబు బిరుదు లౌ, పిఱుదుల చక్కటిఁ♦బెరయఁజేయ
బటువు లౌ జంత్రింపుఁ♦బని మెచ్చు మేడలఁ, బాలిండ్ల నెలవునఁ♦బాదుకొలుపఁ
జంద్రశాలాసుధా♦చాకచక్యంబున, నెమ్మోముతలమున ♦ నెమ్మి నూప
వివిధరత్నప్రభా ♦ వేల్లితరసపూర, మంబరంబునయందు ♦ ననువుపఱుప
నీలపుంగొప్పరమ్ముల♦నెఱుల యొప్పు, కొప్పు గీలింపఁ గొనచెవి♦కువలయముగ
గోష్ఠపాళి నమర్పఁ దాఁ గూర్చె నసుర, శిల్పి తలఁపున దీని సృ ♦జించునపుడె.

తే॥ సప్తభౌమాష్టభౌమవా♦క్సలలితముగ, నొండెడల హర్మ్యమాలిక♦లుండవొక్క—
యన్నియుఁ బసిండికొండలే♦యన్ని జీవ, రత్నరాసులె యన విన♦రాదుకాని.

తే॥ మేరుకైలాసశిఖరాళి ♦ మేలుకొలుపఁ, జాలెడు విమానతతుల నీ ♦ జంత విష్ణు
పదము చిత్రపటమ్మున ♦ భంగి నొరసి, వ్రాయుచున్నది తనభర్త ♦ వైభవంబు.

తే॥ చంద్రికాధవళప్రభ ♦ ల్స్వర్ణకాంతు, లింద్రనీలద్యుతులు హీర ♦ సాంద్రరోచు
ల్జగరాగరుచు ల్స్రక్తి ♦ కాంశుకములుఁ, దీయరాని యలంకృతు ♦ ల్దీని కెపుడు.

తే॥ ఏల చతురంగసైన్యంబు ♦ లేల పగఱ, జాల మేలికయే వంపఁ ♦ జాలియుండ
నదియు నగరి కలంకార♦మనఁగ నొప్పుఁ, బ్రాభవాంచితు నాతని♦బలసి కొలిచి.

ఉ॥ ఇందలి సుందరీమణుల ♦ నెన్నఁగ నౌనె జగత్త్రయిం బురీ
సుందరి తా జయించెఁ బ్రీతి ♦ శూరుల గెల్చె విభుండు తజ్జయా
త్తేందిరలో స్వయంవరలొ ♦ యెట్లును బందులు గాక పోరు సం
క్రిందనుఁ దట్లుగాక కల ♦ కాలముఁగింకరుఁడై మెలంగునే. ౧౨౮

ఆ॥ కోడెకాండ్రి నిచటి ♦ కోమలాంగుల కను, సన్నలను మెలంగఁ ♦ జాలుకొలుపు
లాఁతివాఁడె మరుఁడు ♦ సీతిఁ బాయునె రతి, వారి కిదియె నిత్య ♦ వైభవంబు.

సీ॥ నిట్టనిల్వున గండ్ల ♦ నిలువఁబెట్టదె వీరి, సోగకన్నులచూడ్కి ♦ సోయగంబె
పలుకనేరని గొడ్లఁ ♦ బలికింపదే వీరి, కప్రింపుఁబలుకుల ♦ కమ్మదనమె

కళలు కెఱుంగని జాలఁ ♦ గరఁగింపదే వీరి, నగుమోము వెన్నెల ♦ నాయికంబె
బాఱుతీర్చిన గొంట్లఁ ♦ గాఱింపదే వీరి, నెఱిమచ్చుఁదీవెల ♦ నేవళంబె
యింక నచ్చర లెవ్వరీ ♦ యిందుముఖుల, బానిసల కాకకాదన్నఁ ♦ బట్టి తెచ్చి
యిచట నిలిపెనో యేమన్న♦నేమి దీని, రమణుఁ డెట్లును శోకవి♦ద్రావణుండు.

చ॥ లలితవిపంచికాసముప ♦ లాలితమర్దల వేణునాద సం
వలితకలావిలాసములఁ ♦ బాటలు నిచ్చటి గానవైఖరిం
దలఁపునఁ బెట్టి వేడ్కమెయిఁ ♦ దాఁ దలఁగండు నళేశ్వరుండు నే
వలనుననేనిఁ దత్ప్రసిత ♦ వాంఛితము ల్సమకూర్చుచుం బురిన్. ౧౩౧

తే॥ ఏమి నందనవనములో ♦ యేమిచైత్ర
రథములో యెవ్వ రేమనో ♦ రథములు ఫల
వంతము లనంగ మఱి పుష్ప ♦ వంతము లన
వింటిమె యదృష్టవంతు లి ♦ వ్వీటి ప్రజలు. ౧౩౨

సీ॥ కలకాల మొకరీతి♦ఫలభారనమ్రంబు, లై యుండు గద నిఖి♦లాగమములు
జిగిపూవుగుత్తుల♦సిరి యెమ్మె లెలయించు, లేఁదీవెలకు లేదు♦ పేదఱికము
రతిఁ గూడి వలరాజు♦రహిమించు పొదరిండ్ల, పడిగాపు లిమ్మోటి♦బంభరములు
చిలుకఁ దామరకొలం♦కులఁ దోఁగి చన్నీరు, మోకలపై గాడ్పు♦మొలక లెలమిఁ
దోఁటమాలి వసంతుండు ♦ తోడి ఋతువు
లోలసి యానతి మెలఁగ ని ♦ య్యుపవనములఁ
బాలనము సేయుచున్నాఁడు ♦ పదిలముగను
మించు పొలదిండి యొడయని ♦ మెప్పు గోరి. ౧౩౩

తే॥ అఖిలసౌభాగ్యనిధి సీత♦నపహరింప, నెంచి పురి కిట్టి గుప్తిఁ గా♦వించె నొక్క
రక్కసులదొర కాకున్న♦నిక్క లెన్ని, లేవు మెలఁకువ కలదె యీ♦లీల నొకట.

తే॥ కాచియున్నారు దీని ర ♦ క్కసులు ప్రలయ
భైరవుల యట్లు వివిధాస్త్ర ♦ పాణు లగుచు
మిత్తికోటులఁ జోరఁబాఱి ♦ మెలఁగవచ్చుఁ
గాని యిటఁ జొచ్చి మన నొండు ♦ గలదె తెరువు. ౧౩౪

ఉ॥ విద్య లుపాసనావిధులు ♦ విశ్వజనీనము లిందును న్సురా
భేద్యులు బ్రహ్మరాక్షసు ల ♦ వేద్యగుణం బిది బ్రహ్మ కేనియున్
వేద్యవవేదివేదధృతి ♦ విత్తము దీని జయింప నేరి కే
పద్య ఘటిల్లు మొక్కలపుఁ ♦ బాటన వచ్చుట కాక యెమ్మెయిన్. ౧౩౫

తే॥ ఏమి సేయంగఁ గలఁ డాంటి ♦ నేగుదెంచి
రాముఁడేనిఁ బ్రళయకాల ♦ భీముఁడేని
నెట్లొనర్పంగవలయునో ♦ యెఱుకపడదు
చిత్తము విచారమూఢ మై ♦ చిక్కుపడఁగ. ౧౩౮

ఉ॥ రాజును రాజనందనుఁడు ♦ రామవిభుండును లక్ష్మణుండు సం
పూజితు లందఱుఁ గొందఱుక ♦ పుల్బలుబాముల నోర్చి యిందు రా
నోజఁ గడంగువార లట ♦ నుందురుకా కెటు దక్కువార లె
ట్టీజగజెట్టిపోరి లెనయ ♦ నెంతురో యెయ్యది గాఁగ నుండెనో. ౧౩౯

క॥ ఎది యెట్టు లైన నిందున, దుది మొదలుం గాన కెట్లు♦తూఁగుదు సీత
న్నాదితాత్మకఁ గనఁ గని య, య్యదనున యోజింతుఁగాక♦యవ్వలివిధముల్.

తే॥ పోఁతుటీఁగకు నిటఁ జొరఁ ♦ బోల దనిన
నలఁతిమెయి నాకుఁ జొరఁబాఱ ♦ నలవి యగునె
ప్రొద్దు గ్రుంకిన పిమ్మటఁ ♦ బొడవు దక్కి
సూక్ష్మరూపంబుఁ గొని యిందుఁ ♦ జొత్తుఁగాక. ౧౪౦

ఉ॥ ఏమనువాఁడ నివ్వలను ♦ కే నరుదెంచిన వేళ యెట్టిదో
భూమిజఁ గాంతునో కొఁ కనఁ ♦ బోలున పో నెటు లొంటి నొడ్లఁ గ
న్బ్రామి వచింపనేస్తునొ త ♦ పస్విని యాయమ పల్కుపల్కులన్
రామున కెట్లు తెల్పుదునొ ♦ రక్కసు లాసతి నెట్లు చూతురో. ౧౪౧

తే॥ సంకటం బిట్టి కర్జంబు♦చక్కఁబఱుపఁ, జాలుదున కాక దైవప్ర♦సాదకలనఁ
గూళ లీయసప్రిపులు కనుం♦గొనకమున్న, యప్పతివ్రత దర్శనం♦బబ్బె నేని. ౧౪౨

క॥ నా కేమి భయము దితిసుతు, లే కా కటు ముజ్జగంబు♦లేకం బైనన్
డీకొని మోకా లొడ్డెద, నాకస మగలింతు మిత్తి♦నైనఁ దెరల్తున్. ౧౪౩

ఆ॥ ఏలువాని కర్జ♦మే నంచుఁ దొలుదొల్తఁ, బూని కడఁగి సడలి ♦ పోవఁ జూచు
వానికన్న దుష్ట♦వర్తనుఁ డెందునుఁ, గానఁబడఁడు భవముఁ♦గడవఁ డతఁడు.

క॥ మంత్రిముగుప్తియుఁ గార్యము, తంత్రిమ్మున నేర్మి దక్ష♦తయుఁ దనరారన్
యంత్రణఁబొరయని తెలివి ని, యంత్రధికృతి మెలఁగునతఁడె♦యగు సుకృతియనన్

ఆ॥ దూతకృత్యమునకు ♦ దొరకొని నేనియు
నేల ప్రొద్దెజంగి ♦ చాలి నేమ
మొలయఁ దమము దుల్చి ♦ వెలయించు విభు ధన్యుఁ
డరుణుఁ డినుని నెట్టు ♦ లట్లుగాఁగ. ౧౪౬

క॥ తనరూపు జూపి మెలఁగిన, ననిలునయిన నిలువరింతు ♦ రన నొడ్లకు నె
ట్లనఁ దగు గతి దైత్యు లిట, న్మొనసినఁ గలవరము దొలుత ♦ మొనకొనునేనిన్.

ఉ॥ ఆయమ నేమి సేయుదునొ ♦ యాదట నే జయ మబ్బె నేనియున్
బాయునె గాయ మట్లగుటఁ ♦ బావులఁ గన్నుమొఱంగి నేఁటి యీ
రేయి నలక్ష్య లక్ష్య మగు ♦ రీతిని జైకొని తెప్పఁ గంటిపై
వేయక వీటి నద్దెసలు ♦ విచ్చి కనుంగొనుచు న్మెలంగెదన్. ౧౪౮

క॥ కనుఁగొనియెద మాతల్లిం, గనుఁగొనల ముదశ్రుజలము ♦ గడలుకొనంగన్
దన కీశ్వరసాహాయ్యం, బనయముఁ బొడకట్టుచుండ ♦ నడ రేమిటికిన్. ౧౪౯

ఆ॥ అనుచుఁ గలఁగఁబాఱి ♦ యాదటఁ దేఱి య, క్కార్జమున తెఱంగు ♦ గడనసేసి
యిష్టదైవ మెడ ని ♦ విష్టంబు గావించి, యాతఁ డొదిఁగి యుండె ♦ నబ్జవదన ! ౧౫౦

—♦ సూర్యాస్తమయము ♦—

క॥ తన వంగడమున మేలున, కను వగు పనిఁబూని తఱికి ♦ నఱిమెడు శిష్యుం
డనఘుఁడు వీఁ డిట మసలం, జన దిఁక నా కనుచుఁ బ్రొద్దు ♦ చయ్యనఁ గ్రుంకెన్.

సీ॥ పతిఁ బాసి యొంటిమై ♦ బడలు సాధ్వుల మోము, లట్లు తామరపూవు ♦ లంద మెడలె
వెడఁగు నేస్తముల కు ♦ వ్విళ్లూరు నువిదల, కనులట్లు తొవలు వి ♦ కాస మెనసెఁ
గై సేసి మగని రా ♦ కకు వేచు నెలనాగ, లట్లు తారలు బయ ♦ లంది మెఱసె
గడన చొప్పడ నింటి ♦ కై మరుల్కొను గేస్తు, లట్లు పుల్గులు గూండ్ల ♦ కరుగుదెంచె
సందు గని యొడ్లఁ గాఱింప ♦ సంభ్రమించు
దొంగ లట్టులు తొలుదొల్తఁ ♦ దోఁచి నిలిచి
క్రమ్మెఁ గడ లెల్లఁ గటికి చీఁ ♦ కటులు కడఁగి
సవిత్రుఁ డొంజెడ కేగిన ♦ సమయమునను. ౧౫౨

తే॥ మిఱ్ఱు పల్లమ్ము నన రాక ♦ మేలి రంగు
కప్పు నను భిద లేక యె ♦ కండుగాఁగ
భ్రాంతులకుఁ బుట్టినిల్లయి ♦ పరఁగు నంధ
కార మమ్మెయిఁ బెనుచు న ♦ క్కాలమునను. ౧౫౩

ఉ॥ నీడలు లేని దీపికల ♦ నిగ్గులు సూపెడు రత్నదీధితు
ల్వీడని పండువెన్నెలలు ♦ వీటికి మా పెకలింపఁ జూడ నే
జాడనునేని నన్యజన ♦ సంగతికి న్వెలి యైన దాని పొం
దొడక వాఁడు గైకొనఁగ ♦ నల్లము నద్దలపెట్టె నట్టనన్. ౧౫౪

ఉ॥ ఒండెడ కేఁగ నట్టి జన ♦ మోలిమిక న్సదనంబు సేర నొం
డొండెడు రైన చొప్పు గని ♦ యుద్ధపడి న్బరికించి పిల్వ ధీ
రుండు కపీంద్రుఁ డట్టియెడ ♦ రూఢికిఁ దాఁ బృషదంశకంబు న
ట్లుండి చొరంబడం గవిసె ♦ నుత్తరపుం గవిణి న్మనస్వినీ ! ౧౪౬

ఆ॥ పిన్నవాఁడె వీఁడు ♦ పెద్దల కెల్లనుఁ, బెద్ద యనుచు వాని ♦ పెంపు నొడువఁ
గడఁగి తేఁట తెలివి ♦ కలిమి తేజమ్మున, బలువు నడర ముట్టఁ♦ బాఱుటయును.

— ♦ హనుమంతుఁ డుత్తరద్వారమున లంకఁ బ్రవేశించుచో లంకిని యడ్డుపడుట ♦

ఉ॥ ఓపికనాణి! యప్డు వికృ ♦ తోజ్జ్వలవేషముఁ దాల్చి నిల్చె లం
కాపురి వాని కడ్డెదుటఁ♦ గ్రన్నన నెవ్వఁడ వోరి ! దొంగ వై
యేపనివెంట నిందుఁ జొర ♦ నెంచెదు నన్ను జయింప కెట్లు పో
నోపుదు నిల్వు మీఫలిత ♦ మొందెదు కా కనుచు న్మహాగ్రహై. ౧౪౮

తే॥ అట్టు లడరెడు దాని ప ♦ ల్కాలకించి
యింతలో నింత వేగిరం ♦ బేల యేమి
చెడియె నీ వెవ్వతెవొ సుంత ♦ నొడువు మవలఁ
దెలుపుదును నాయుదంతంబు ♦ తేటపడఁగ. ౧౪౯

కం॥ అను హనుమని పలుకుల కది, కనలుచు నివ్వోటికాఁపు♦గలదానను లం
కిని యాఁదురు నను మన్నో, హనరూపమె లంక యనఁగ♦నను వై యుండున్.

ఆ॥ దోమకేనిఁ గాదు ♦ దొరయు నాయాన లే
కెఱిఁగి మొఱిఁగి యిట్టు ♦ లేల చెడెదు
తీపు లేదె యుసురుఁ ♦ దిఁగలపై నీకు
జనుని పొగ్రఁపు నమ్మి ♦ చనియె దెట్లు. ౧౫౦

కం॥ కాలము మూఁడెను గా కిటు, లాలము సేయంగఁ బలిత♦మంతలు గలదే
వేలుపులేనియుఁ దలఁకుదు, రాలోలత నాయనుజ్ఞ♦నందెడుదనుకన్. ౧౫౧

ఆ॥ కడఁగి దైత్యులైనఁ ♦ గాల్చి తిందుర కాక
విభు ననుజ్ఞ నిందు ♦ వెరవు దక్కి
మిత్తియేనిఁ దలఁకు ♦ మెయికొన నన నెంత
నీదు బలువు చాలు ♦ నిలువు మింక. ౧౫౨

మ॥ అని ధర్షింపఁగ వాఁడు హర్షమున నొ ♦ య్యారంబు మీఱంగ ని
ట్లనె లీలావతి! యిందుఁ బొల్పెసఁగు ను ♦ ద్యానస్థలు ల్నందనం

బున గొక్కింత మెఱుంగు సూపు నమృతం ♦ బుంబోని పానీయముల్
ఘనకాసారముల న్దనర్చు ననఁగాఁ ♦ గాంక్షించితిం జూడఁగన్. ౧౬౩

తే॥ పురము సౌభాగ్యమున కొండు ♦ పోల దనఁగ
నదియు విని చూచు వేడుక ♦ నాత్మ నలరి
యిట్లు నారాక యొకపరి ♦ యెఱుకపడఁగఁ
గాంచి మఱలుదు నింత ని ♦ క్కమ్ము సుమ్ము. ౧౬౪

మ॥ అనిన న్భీమనినాద యై యసుర య ♦ య్యబ్జాప్తభూమంత్రివ
ర్యునిఁ దాటించె నురస్థ్సలి న్దలమున ♦ న్హుంకార మొప్పార నె
ట్టనఁ దోఁపాడెదు కూడఁ దన్న నిటు ఏ ♦ డంబోక నీవంచుఁ బ
ల్కి నితాంతప్రథమానరోషదవకీ ♦ లిజ్వాల లుప్పొంగఁగన్. ౧౬౫

క॥ దానికిఁ గినిసియు మదిలో, దీనిం దెగఁజూతు నెట్లు ♦ తెలియవ కదా యం
చూనియు నూనని డాపలి, కై నడుకుచు నురమువంక♦గదియం బొడిచెన్.

ఆ॥ అంతమాత్రమునకె ♦ యది విహ్వలాంగి యై
నెత్తు రురలఁ దెరలి ♦ నేల వ్రాలి
దివ్యరూప మొంది ♦ దేదీప్యమాన యై
పలికె ని ట్లటంచుఁ ♦ బద్మనయన! ౧౬౭

క॥ శాపాంతము ఘటియించితి, వోపవనతనూజ! నా క♦హో చిరకాలం
బోపి నిలిచి నేఁటి కిట, న్నీపదపద్మములు గొలిచి♦నిర్మల నైతిన్. ౧౬౮

—♦ హనుమని తలప్రహారమున లంకిని విశాప యగుట. ♦—

ఉ॥ నలువ నచించె ను న్ననిల ♦ నందనుఁ డారఘురాముఁ డంప మై
థిలు సుతి సేమ మారయు మ ♦ తిం జనుదెంచి భవన్నిరుద్ధుఁ డై
బలితపు ముష్టి నైవభవ ♦ బంధము శాపము బానిసంబుతోఁ
దలఁగి సుఖింతు నాపలుకు ♦ తప్ప దటంచు దయార్ద్రచిత్తుఁ డై. ౧౬౯

తే॥ మఱియు ననె నష్ట యా లంక ♦ మత్తు లవలఁ
గూలుదురు దైత్యు లెల్లరుఁ♦గువలయాక్షి!
వానరేంద్రుని సేవించి ♦ వలను మెఱయ
దివిజపురిఁ జేరుదు వటంచు ♦ దిటవుపడఁగ. ౧౭౦

క॥ కావున నిఁక వీరికిఁ దమ, కావరమున నొదవె నంత ♦ కాలము భూజన్
సేవింపు మమలఁ దాఁ బ్రమ, దావనమున నున్నయది స ♦ దారక్షితమై. ౧౭౧

ఆ॥ అరయుమయ్య! పురము♦నందలి వైభవ, మఱి యొకింత లేక♦యవల సీతఁ
గాంచు మయ్య! కీర్తిఁ♦గంటిరే నీసాటిఁ, గాంచు నెవఁడు ముజ్జ♦గమ్ములందు.

క॥ నాయపరాధము తలఁగఁగ, నాయన్నా! కూర్తు వంద♦నశతమ్ములు నా
కీయవె యనుజ్ఞ నే దివి, కీయనువునఁ బోవుదాన ♦ నిడు మిది మదిలోన్.

తే॥ కలిగె రామపదస్మృతి♦కలిగెదానఁ, గలిమలాపహ మగు మేలి♦కలిమి బత్తి
చెలిమిఁ జరితార్థనైతి నీ♦చెలిమి మఱవ, భవహరౌషధిసారసం♦భవముగాఁగ.

క॥ అని తెలిపి యతని వలగొని, చని వది సంతసము పొదల ♦ సామీరియు ధ్వ
స్తనిరోధుఁడై పురమ్మున, మొనకొని విహరించె నఖిల ♦ మునిముఖ్యనుతా!

—♦ హనుమని లంకాపుర ప్రవేశము ♦—

ఆ॥ వప్రలంఘనమున ♦ వాఁడెప్పు డప్పురి, మలసె నపుడె శత్రు ♦ మస్తకముల
నడుగుఁ బెట్టె నింక ♦ నుడుగునె వారల, నుక్కుమడఁగ నడఁగఁ♦ద్రొక్కకుండ.

ఉ॥ అన్నిటి నప్పురి న్దొరసి ♦ యంజననోముఫలంబు క్రొమ్మెఱున్
దిన్నని త్రోవఁ బట్టి బలు ♦ తీర్పుల నేర్పుల కెల్ల నొజ్జయై
మన్ననఁ గన్న దాని గరి ♦ మం బరికించుచు సంచరించెఁ దా
ము న్నెద నిడ్డ లక్ష్యమున ♦ మోసము వాటిలనీక శ్రీకరీ! ౧౭౯

తే॥ రామమంత్రాధివాసమ్మ♦శ్రీమహితుఁడు, వాఁడు తద్దేవి సేవింప♦వార్ధి దాఁటి
లంక శోధించు నప్పటి♦లా వెఱింగి, విస్మయాంబుధిఁ దోఁగెఁ♦వేల్పు లగజ.

సీ॥ ఒకహర్మ్య మీక్షించి♦యొందు గన్గొనినంత, నదెయిది యనుభ్రాంతి♦యావహిల్ల
నొకవీధిఁగాంచి వే♦ఱొండు గైకొన మున్ను, దాఁగన్న యద్దాని♦తత్త్వమెులయ
నొకమణిస్తంభంబు♦నొరసి యొండెడఁ జూడ, నొక్కఁడే యను తలం♦పుల్లసిల్ల
నొకభిత్తిఁ దిలకించి♦యొగి నన్యఁ బరికింపఁ, గైవల్యమున రెండు♦గ్రాలుచుండ
నబ్రమున మున్గి తేలుచు♦నాతఁ డరసి, పోలుప కా కెందు దీనికి♦పొరపు లేదు
దీని మర్మంబు బ్రహ్మకే♦ తెలియఁబోలు, నని మదిఁ దలంచె విద్యార♦హాస్యమూర్తి!

శా॥ చాలోక్యింతయుఁ దప్ప కొక్కరకమై ♦ చాల్పు న్వెడల్పుం దగన్
డాలెం దేయది పోల నౌ నటులె యుం ♦ డం జొక్కపుం జాళువా
కీలుంబొమ్మల యొప్పు లప్పగిది నే ♦ కీభూతము ల్గాఁగ వాఁ
డాలోలాత్మతఁ గాంచె సృష్టి యవురా ♦ యంచు న్స్మరోల్లాసినీ! ౧౮౦

ఉ॥ పచ్చల కాంతు లొక్కయెడఁ ♦ బచ్చికపట్టున యొప్పు నూపఁ గ
న్విచ్చిన మూసిన న్సరిగ ♦ నీలమణిద్యుతు లావరింపఁ బై

పెచ్చుగ స్ఫాటికస్ఫురణ ♦ వీచులు దాఁకొనఁ జిత్తవృత్తి పా
టచ్చరి యైన యన్నగరి ♦ డంబున కోడె నతండు శంకరీ! ౧౮౧

—♦ చన్ద్రోదయ వర్ణనము. ♦—

తే॥ ఓడకు మటంచు నటఁ బ్రొద్దు ♦ జోడుకోడె
తోడు సూపెను హనుమకుఁ ♦ దోరముగను
నుదయగిరిదుర్గమున నుండి ♦ యుల్లసిల్లి
వాని కప్పురి తోనె కై ♦ వసముగాఁగ. ౧౮౨

చ॥ కలువలదాయ దీప్తి తన ♦ కాంతుల కబ్బిన కారణంబునన్
జెలువు వహించి మించి యల ♦ చీఁకటిపిండు దెరల్చి యెక్కుడే
వెలసె జగత్త్రయింగలఁడె ♦ వీనికి సాటి మఱొం డనంగ నై
చలువలఱేఁడు పద్మినులు ♦ చాటువడ న్నవమోహనాకృతీ! ౧౮౩

తే॥ మందిరము వెన్న యుదయాద్రి ♦ కందరహరి
రజతగిరిపంజరముహంస ♦ రాణఁదనరె
నాకసం బను నేనుంగు ♦ నధిగమించి
చంద్రుఁ డప్పుడు రుచిజిత ♦ చంద్రవదన! ౧౮౪

తే॥ కొలువు సాగించె నుబ్బి చ ♦ కోరవితతి
కుముదినుల కబ్బె ముదము సం ♦ కోచ మెడలఁ
గల్లరిండ్రకు దారులు ♦ కట్టువడియె
శశి ప్రకాశించుచుండ వి ♦ శాలనయన! ౧౮౫

సీ॥ అమృతమ్ము కొలనిచా♦యనుదోఁచి వలపుల, వలను మీఱు జిగి మ♦వ్వంపుమొలక
రతిఁ జొక్కు సొగసుకాం♦డను దేర్చి యెప్పటి, నీటు ఘటించు ప♦న్నీటిఘటము
పొలయల్క మగల బి♦ట్టులికించు ఱాఁగల, మరులుకొల్పి సడల్చు♦మచ్చుమందు
తాప మార్చ రసాప్తిఁ♦దవను రశ్ముల పొడి, నెఱపి చేసిన నవ♦నీతఘుటిక
కళల పుట్టువు నెలవు వె ♦ న్నెలలదీవి
గడ్డ యానందకందమ్ము ♦ కాంతిసీమ
యుత్సవమ్ముల పంట స్నే ♦ హోల్లసనము
చలివెలుం గంత కంతకుఁ ♦ జాల మెఱసె. ౧౮౬

తే॥ తోఁచె సిరి దొత్త మందరాం ♦ దోళనమునఁ
బర్వముల నంబునిధి నిల్పుఁ ♦ బ్రాభవమున

బద్మవీథిని విహరించుఁ ♦ బవలు రేలఁ
జంద్రు సైదోడు వెలయించుఁ ♦ జాలికళల. ౧౮౭

ఆ॥ వానకారు వోని ♦ వంబు రాకున్న య
మ్మొలితతి మఱింత ♦ మేల్మి సూపు
చందురుని వికాస ♦ చాకచక్యంబున
జగము మిగుల వెలసెఁ ♦ జారుహాస ! ౧౮౮

క॥ మి న్నను పచ్చికపట్టున, నున్నది హరిణాంకవృషభ♦మున్నతలీలన్
ద న్నెదిరి పొగడుకొనఁగ వి, యన్నది చెంగటఁ ద్రివిష్ట♦పాలయవంద్యా!

వ॥ వెండియు నమృతగభస్తి మండలంబున రుచులు భూమండలమున నెల్లెడ మెండు కొని పండువెన్నెలల పేరిటి వెండిసీరునఁ బిచండిలం బగు బ్రహ్మాండకటాహంబునకు మెఱుంగువెట్టి వర్షాంబుతుషారపంకవిరహితత్వంబుననో ప్రకాశలక్ష్మీవికాసవిశేషంబుననో గ్రహాగ్రసననిరవశేషితకలంకతా ప్రసంగంబుననో భగవంతుం డగు శశాంకుం డిత్తఱి నింత లింతలు వింతలుపచరించుచున్నవాఁడని మెల్లవారును బ్రశంసింప నొప్పారి జనికర్తృకతా ప్రకృతికభావశాబల్యంబున నని కాక యదసీయం బగు కువలయ సామ్రాజ్యాధిరాజయోగంబునకు సంతసిల్లి నిఖిలభువనాధారుం డగు రత్నాకరుం డంతరంగం బుప్పొంగ నైవాత్మకుం డగు కుమారుని సమాలింగితునిం గావించి ముద్దిడుకొనం బోవుచున్నవాఁ డల్లదెహో యను జనశ్రుతియె ప్రతిశ్రుతంబుగా వేల నతిక్రమించి వియత్పథంబున కెగయు నప్పగటున సొంపు కలిమి నపాంపతికి సంపాదించి నెలఱాకట్టుగట్టుల పట్టులనుండి తొట్టుకొను తేటనీటియూట లెల్ల నొక్కండుగాఁ గదిసి జాలువాఱి నిమ్నప్రదేశంబులం బడి మడుంగులుగ నేర్పడి తొరంగి చీలుకాలువ లై చనిచని యొండొంటి సంగడంబున డంబు మీఱి బ్రబలి బలితంపుఁ బ్రవాహంబు లై యగాధంబు లనం దనరి పెన్నేఱు లై వారాంనిధిపై విరాళిమెయిం జేర నరుగ నాతనికిఁ (గ్రొత్త పెండ్లికూతులతోడి పొత్తున సుమాళంబు సంఘటించి స్ఫటికోపలసౌధవీథికాదీధితులం గలసి చాకచక్యంబు దనుపార నోడలు పెంచి యచ్చంపు జగ్గునిగ్గుల దట్టంబుగా దట్టించి మట్టం బొనరించి మేలి మగఱాల గోడల పై నెగయ నెఱయఁ బురికొని దెస లంటఁ గ్రాలు నిద్దంపుఁ గ్రొంజిగి పాళియలం బేర్చి సుధాధవళిమాసారపూర రససారంబు సేర్చి కూర్చిన సోపాన పరంపరలు మిన్నేటి పొలయలుక వారింప నెంచి తమకించి మున్నీరు వనుప బారులు తీర్చి యంబరంబునం బఱతెంచు తమ్మిచూలి వారువమ్ముల తీరునఁ బెను పారుచుండఁ దత్సమాసత్తివలన నయ్యేటి బోటిమగనికి జేజేలపీటి చెంగటఁ

దుఱుంగలించు నద్దేవి యంతిపురికిం బోవఁ బ్రస్థానసౌలభ్యంబు ప్రతిపాదించియుఁ దనివోక స్వర్లోకగమనసుకరత్వం బభివాంఛించు రక్కసులజేని పై ననుత్తరణీయం బైన ఋుణంబు మోపి నవనవప్రభాజాలసరాగపద్మరాగమణిరత్నఫలకంబు లమర్చి మేలి పసిండి కరఁగి పోసి యాకసం బంటఁ దీర్చికట్టిన కొండొక వరణంబు పై నుఱికి పీతారుణప్రస్ఫురణంబుల దెసలఁ గలయంద్రాఁకికొనముట్ట నిట్టలమ్మై లగు నమ్మోఁడురంగుల మెఱుంగు లెల్ల నొక్కచాయం బ్రవర్తిల్లఁ జేసి యొండు రాజమాత్రునకేనియు నొసంగఁబోలు నివ్వరంబు నాఁబోటి కేల సమకూర్పం జన దను నీసునఁ గైలాసం బెత్తిన లంకేశ్వరుని యమ్మనికికి వహ్నిప్రాకారంబు తోరంబుగా సమర్థించి పసరుచాయ మానికంబుల పలకలు గట్టించిన కుట్టిమస్థలంబులం గల మేలి మిట్టల మట్టుకొని మట్టుమీఱి నిట్టలు వొడుచుచు చదలంటఁద్రాఁకిన క్రొందళుకు లన్నియు దీర్ఘదీర్ఘంబు లై తలం బాక్రమించి యచ్చోటునఁ బెచ్చుపెరిఁగిన పచ్చని పచ్చికల మవ్వంబు నివ్వటిలం జేయ నుల్లసిల్లి మచ్చికమెయిం జేరఁబాఱు పుడుకుదోడుకు వంగడంబునకు మహోరుచిరం బగు రాత్రి గోచరంబు గోచరం బొనరించి విమానశ్రేణికల నధిష్ఠించి మురువొందుట నప్సరస్సీమంతినీరత్నంబులో వైహాయసపథంబునం బొడసూపి రోదసీకుహరం బెల్ల నిజకాంతిస్ఫురణంబులఁ జూపఱ కన్నులకు మిఱుమిట్లు కొలుపం జాలి వర్తించుట మించుఁ దీఁగలో యనఁ బొలుపారు కాంచనపాంచాలికామతల్లికల యవయవసౌష్ఠవంబునకు వన్నియవెట్ట నై తనుయష్టికలకుం దగిన జిలుంగు పనుల రంగారు హజారంగు చెఱంగులఁ దొంగలించు వలిపంపుఁ దెలిపట్టు పుట్టంబులును తళుకుతళుక్కనుచు రింగులు వాఱు మేలి చల్వపైఠిణీలును ననుసంధించి నీలపుం గొప్పరంబుల నుప్పతిల్లి యుప్పరంబు పై నురవడించు కప్పుడాలు వెలుంగుల నప్పళించి తెలిమించులతో మొగిళ్ల సంచను శంక నుత్పాదింప సంచలించు కేళాకూళుల పంచకావు లగు రాయంచల గరుదంచలమ్ముల ధాళధళ్యంబునకు ద్వైగుణ్యంబు సంధానించు తెఱంగు నిందీవరదృష్టుల నీక్షించి కైరవవికాసంబునం గిలకిల నవ్వు సరసీందిర పొదలికఁ గ్రందుకొను గిలుకుటందియల మొరవంబుల మఱపించు షట్పదఝుంకారంబుల కులికిపడు గండుమీల మేనులఁ దొనుకాడు సితద్యుతిస్ఫురణలు కెలంకుల మెలంగు చమరీమృగంబుల వాలవ్యజనంబులపై విదిర్చి యొక్కింత తడవు విహారంబు సలిపి చందురాల తిన్నెల నిలిపిన పటికంపుఁ గంబంబుల పై పవడంపుం దీవెల యల్లునదిద్ది తీర్చిన గొప్ప నుప్పాణి ముత్తెంపుసరుల సవరణ లన ననువొందు చందువాల సందుగొందుల మలసి యచ్చోటి లావణ్యంబునకు మాధుర్యంబు సంతరించి వైదూర్యమణిమయ భిత్తికల నత్తమిల్లి తోడుతోన తదీయస్ఫురితంబుల భరితంబు లై సోరణగండ్లం

జారఁబాటి స్మరవ్యాధానువిద్ధ లగు హరిణాక్షులకు మార్జాలేక్షణవిభ్రమంబున భీతి పుట్టించి ప్రణయకలహదంభంబున మగల నిరాకరించి బయలొందిన దిట్టల చందురాచట్టులంబోని యెదలు ముట్టఁదాఁకి కరంచి కమ్మతెమ్మెరల సోఁకున వాకట్టు కట్టి చాటూక్తులు పన్ని వలపులు పుట్టించు దూతికల వడువున లోఁగొని కొనిపోయి యొక్కవలనున నొదిఁగియున్న వల్లభులదృగంచలప్రపాతపూర్వకంబు లగు కిలికించితంబుల సమంచితానందరసార్ణవంబున నోలలాడించి చంద్రశాల లెక్కి యన్నెలవుల వన్నె కెక్కిన మేలి వీణియల పాటల బాటల తోడ్పాటున విజృంభించి యమందోత్సాహంబు వెనుచు తాండవోత్సవంబున నవ్వారల మెచ్చు వడసి శీధురసపూరితంబు లగు పానపాత్రికలఁ బ్రతిబింబించు తారకాకోరకావళి తోడి పొత్తున నపూర్వాస్వాదసంపాదకం బగు ఫలోత్పత్తి నొదవించి మానినుల దురభిమానంబుఁ దెరల్చి మొక్కలీండ్రి మొక్కలమ్ము వారించి పాంథుల నద లించి విప్రలబ్ధలం బెదరించి కాముకుల కామనలం బెనిచి సంయుక్తుల సమర సభావంబున నలరించి ముద్దుల మురియించి ముచ్చటలఁ దేలించి యాటపాటల నలవార్చి తెలివితేటలు ప్రసాదించి యాస్వాదంబున నోలయించి ముగుదల మొగకొల్పి ప్రోడల నోడించి కౌముదీమహోత్సవోల్లసనంబులకు మూలకందంబు లై చకోరికాభ్యుదయవిలాసరూపణంబునకు మంగళాచరణంబు లై నిండారఁబండి మెండుకొనిన ముంగటి పంటచేల విధంబున నామూలాగ్రంబుగాఁ బూచిన యుద్యానవనపాలికల భంగి ఫలించిన తపశ్శ్రీల కరణి సిద్ధించిన యోగ సంపదల భాతి సాక్షాత్కరించిన విజ్ఞాలక్ష్మి కళల చెలువున వికసించిన కవిప్రతి భాశక్తివిశేషంబు లట్లు విష్టపత్రయానందకందళంబు లగుచు సర్వసమృద్ధులు నొడఁగూర్చి రతివల్లభుని జగదేకమోహనకలనాసామ్రాజ్య పట్టభద్రునిఁ గా మొనయించి యనన్యసాధారణత్వంబునఁ గొమరారుచుండు నయ్యవసరంబున.

క॥ తన కైందవసాహాయ్యం, బనుపమ మై యొలయ నతని ♦ నగ్గించి పురం
బున సీత తెరు వరసి కనుఁ, గొన మొనకొని మెలఁగె వాఁడు ♦ కోకిలవాణీ!

ఉ॥ జాటిన నల్లపూసయునుఁ ♦ జా టనరా కెడఁ దోఁప నేలపైఁ
బాఱెడు చిన్న చీమయును ♦ బట్టువడం దనపట్టు చెల్లఁ బ
ల్మా అనఁబోక వేసరక ♦ మార్మొగ మం చను మాట లేక య
మ్మాఱటగాడ్పు దా వెదకె ♦ మాటని వీడక వీఁట నెల్లెడన్. ౧౯౨

ఉ॥ ఒక్కొక కక్ష్యకు న్మొనసి ♦ యున్న నివేశము లెల్ల నొక్కఁడుం
ద్రిక్కఁగనీక చొచ్చి కని ♦ తీరుగ నొంటెడ కేగుచుండు వాఁ

డొక్కటిపోటుబంటు గొనె ♦ నిమ్మెయి కర్జము ధాత యింక నా
రక్కసిమన్నతేని నెటు ♦ రాయిడి వెట్ట దలంచుచుండెనో. ౧౯౩

తే॥ కాంచువారలు లే రొండు ♦ గాంచి వైన
వాని నడవడి గణియించు ♦ వలను గొనఁడు
కప్పె నవ్వింటి జనముల ♦ కన్నుఁగవల
నెందు దైవోపహతుల కిం ♦ కేమి గలదు ౧౯౪

క॥ విహరించెను వాఁ డంబుధి, మహోర్మిషం బెట్టు లట్లు ♦ మార్పడియు లస
న్మహిమ శుభ్రతిమూర్తి సీతా, మహిళం గనఁ దలఁపు లెడద ♦ మల్లడిగొనఁగన్.

తే॥ చొచ్చి చూచినచో టెడ ♦ సొచ్చి చూచు
వింతమట్టులు గనుపట్ట ♦ వెదకు మఱల
నన్యగుల్మంబు పెరసిన ♦ నచటు నెమకు
రామకార్యమ్ము భరమున ♦ రమణి! యతఁడు. ౧౯౬

క॥ పురమని యంతఃపుర మని, యరణ్య మని మఱియు మంది ♦ రారామ మిదే
యరయ నని తెలియ వానికిఁ, దరబడి లే కట్లు తిరిగెఁ ♦ దామరసాక్షీ! ౧౭౯

సీ॥ శోధించె గమకించు♦చొక్కారముల మించు, మందురల్ జవనాశ్వ♦సుందరములు
గాలించెఁ బనిబూని ♦ గాలికే చొరరాని, సింధురశాలలు ♦ శ్రీవిశాల
లొరసికాంచె మహామ♦హోద్దామరథధామ, తలములు మణిఖచి♦తస్థలములు
చొచ్చిచూచెఁ బ్రతీక్ష్య♦శుభరమాసంలక్ష్య, మందిరమ్ములు యోధ♦మంది రములు
గోష్ఠములు నిత్యలక్ష్మీగ♦రిష్ఠములు బ, లిష్ఠసురభిసమాఖ్యగో ♦ ప్రేష్ఠములు వ
రిష్ఠుఁడు మరుత్సుతుండు ని♦ర్నిద్రుఁ డగుచుఁ, గలయఁ బరికించె వికసిత♦కంజనేత్ర!

తే॥ రచ్చపట్టులఁ జవికెల ♦ రచ్చమ్రాఁకు
లచ్చముగ బున్నెమున కుంచి ♦ నట్టి మ్రాఁకు
తెలయు చోటుల జూదరు ♦ ల్బలక లాడు
నెలవుల బరాబరిక సేసె ♦ నెలంత! యతఁడు. ౧౯౯

క॥ దేవాయతనంబుల వి, ద్యావిహితనికేతనముల ♦ ధ్యానోచితసం
స్థావినివేశంబుల న, ప్పావని యవనీజ వెదకెఁ ♦ బావనమూర్తీ! ౨౦౦

సీ॥ పటికంపు మెటికలఁ♦బఱచి యేడంతరు, వుల మేడ లొం డొండఁ♦గలయఁ గాంచి
సోరణ గండ్లలోఁ♦జొరఁబాఱి యిచ్చమై, జోటులు విహరించు♦చోటు లరసి
పసిఁడిగోడల పయి♦పయిఁ బ్రాఁకి యవ్వలి,వలనున నెలవున♦వ్రాలి వెదకి
యుపవనమ్మల యిమ్ము♦లొరసి మఱుంగులు, శోధింప దృష్టులు♦జొనిపి చొనిపి

మెల్లకక్ష్యాంతరమ్ముల♦నింతమాత్ర, ద్రిక్కుకుండంగఁ గన నగు ♦ నిక్క.లోకట
గాలిఁ దూర్పాఱఁ బట్టిన♦కరణి నెమకి, జానకీదేవిఁ గనఁడయ్యెఁ♦జంద్రవదన!

క॥ కాంతలు పురుషు లెలయు నే, కాంతస్థలము ల్గణించి♦కలయ వెదకె ధీ
మంతుఁ డతఁడు చిత్త మనే, కాంతము గానీక శుద్ధ♦కలనాంచితుఁడై. ౨౦౨

క॥ కాంచీనినదమ్ములును స, మంచితనూపురరవములు♦నమ్మొయి వలయో
దంచత్కింకారమ్ములుఁ, బంచాననవిక్రముండు♦పనుపడ వినియెన్.  ౨౦౩

సీ॥ అంకిలి దేఱి ప♦ర్యంకమందు సుమధ్య, యంఘ్రి లొత్తు శయాను♦లైనవారి
నేనె గల్చితిఁ దెమ్ము♦సీపి సీవి కటంచుఁ, దెఱవ ముంగొంగునఁ♦దిగుచువారిఁ
గౌఁగిటఁబ్రియు గాలిఁ♦గదియించికూర్మిమై, నొక్కఁడౌ మది మేన♦నొదుఁగువారిఁ
బానగోష్ఠీరస♦పారతంత్ర్యమ్మున, నొడలు వెంచిన తమి♦నూగువారి
వెన్నెలబయళ్లఁ జేరి ప్రా♦వీణ్య మొప్ప, సరసగీతిప్రసక్తిఁ బొ♦సంగువారిఁ
గాంచెఁ బౌరులఁ గార్యయో♦గంబుకతనఁ, బావనాత్ముఁ డతండు సం♦భావ్యచరిత!

క॥ మవ్వమున నొలయు తేఁటులు, పువ్వుల నెఱి నెట్టు లట్లు♦పూబోఁడుల మే
ల్జవ్వనము మగలు మొగకొని, కవ్వం గనఁ గాంచి వాఁడు♦కన్నులు మొగిచెన్.

క॥ సిగ్గునకు సిగ్గు లే దెటు, లెగ్గని యెగ్గునుఁ దలంప♦కేణాక్షు లొడ
ల్లొగ్గి పరవసము మేకొను, లగ్గున విహరించు నపుడు♦లజ్జావతిరో. ౨౦౬

తే॥ మగలఁ బైకొని వారల ♦ మమతఁ బెనిచి
సంవరణ మించుకేనియుఁ ♦ జక్కపఱుపఁ
జాలక విరాళిఁ జొక్కెడు ♦ సతులఁ గాంచి
మార్గ్గమము వెట్టె వాఁ డభి ♦ మానమహిత! ౨౦౭

క॥ ఇమ్మెయిఁ బురమ్మునం గల, యిమ్ముల శోధించి మఱల♦నెడనెడఁ బొలముల్
గ్రిమ్మ కనుంగొనుచుండెను, సమ్మాన్యుఁడు వాఁడు హారిణ♦శాబకనేత్రా! ౨౦౮

శా॥ త్రిస్థానస్వరలాలితం బగుచు తం ♦ త్రీశోభివీణాకలా
వస్థానశ్రుతిమాధురీకలిత మై ♦ వర్ధిల్లు గీతిక్రమం
బాస్థం దా విని గీతకోవిదుఁడు వాఁ ♦ డచ్చోటఁ బాటిల్లునే
స్వస్థానం బని కాక యిట్టి సుభగ ♦ త్వం బంచుఁ గానప్రియా! ౨౦౯

సీ॥ గిలుకు టందెల రవ, ఘులు కంకణక్వణ, నములుఁ జొప్పడ నొప్పు♦నాట్యశాల
లల రశనాకల♦నాంచితమధురవా, జ్మణితాఢ్యములు కేళి♦మందిరములు
సిరి విహారంబున♦చెలు వంచు మట్టెలు, మొరయించు సోపాన♦ముల పదములు
తలకొను నాస్ఫోటి♦తక్ష్వేళితాదుల, నలుకుడు లూనపు మ♦హాగృహములు

సుమహితాధ్యయనప్రపా ♦ ఠములఁ దంత్ర
యోజితాధ్వరమంత్రప్ర ♦ యోగములఁ బ్ర
పంచితస్ఫురితంబు లౌ ♦ భవనములును
గాంచె మఱియును నచ్చోటఁ ♦ గలికి! యతఁడు. ౨౧౦

తే॥ రావణస్తోత్రపరు లయి ♦ రాణఁ దనరు
చరుల రాత్రించరులఁ గాంచెఁ ♦ దరుణి! కపట
వానరుఁడు వాఁడు నడయింటి ♦ వరుసఁ బ్రళయ
కాలభైరవార్భటులకు ♦ గాసిపడక. ౨౧౧

వ॥ వెండియుం గొండొకండు ఖండం బుపలక్షించి. ౨౧౨

ఉ॥ కొందఱు దీక్షితు ల్జటులు ♦ గోవృషచర్మగు లగ్నికుండక
ర్మందులు దర్భముష్టికులు ♦ మాంత్రికహోమవిధానతత్పరుల్
నందితవేదనిష్ఠులు స ♦ నాతనతత్త్వవిచారు లాశతా
నందుని లెక్కసేయరు గొ ♦ నంబుల యిక్కలు రక్కసు ల్పురిన్. ౨౧౩

క॥ అన్నెలవు లరసి రక్కసి, మన్నీఁడుఁ వసించు నగరు ♦ మలసిన కోటం
గన్నిడి కాచెడు సద్భటు, లున్నతలము లొరయఁ దొడరె ♦ నుజ్జ్వలమూర్తీ!

శా॥ ఘోరాకారులు శస్త్రపాణులు మదా ♦ ఘూర్ణేక్షణు ల్తీవ్రసం
చారు ల్ధీరులు దంష్ట్రితాస్యులు మహా ♦ సారు ల్పరాక్రాంతి సం
భారోదగ్రు లనామయుల్ సకలభూ ♦ భారాయితాచారు లౌ
శూరు ల్మేకొను చోటు లెల్ల నటులే ♦ శోధించె వాఁ డంగనా! ౨౧౪

సీ॥ బాహురూప్యంబునఁ ♦ బరఁగి సువర్చస్కు, లై భాస్కరు నదల్తు ♦ మనెడువారి
ద్వైరూప్యమున నొప్పి ♦ వజ్రింపుఁ దునియలై, యద్రుల నగలింప ♦ నడరువారి
వైరూప్యమున నుండి ♦ వారిదమ్ముల భంగి, శరవృష్టి ధర ముంపఁ ♦ జాలువారి
సారూప్యమున మీఱి ♦ స్మరసాహసమున జే, జేల కన్నెలఁ దెచ్చి ♦ యేలువారి
శక్రవైరుల మృత్యుదం ♦ ష్ట్రాకరాళ, ముఖవిమర్దనకలనాభి ♦ ముఖ్యవిహిత
సాట్టహాసోల్లసనసమ ♦ స్వార్థపరులఁ, గాంచి వాఁ డుల్కిపడియెఁ బ్రా ♦ కామ్యలలిత.

తే॥ ధీరుఁ డై మించి యచ్చోటి ♦ తెరువు లెల్లఁ
గాంచి యెడనెడ శోధించి ♦ కాంచనాంగి!
హీరమణిమాల సంపద ♦ హీన లలిత
రావణునియంతిపురిఁ జొచ్చి ♦ రా దలంచి. ౨౧౫

క॥ ఆకోట దాఁటి కనుఁగొనెఁ, బ్రాకట విభవముల కోట ♦ పట్టయి సిరిక
న్నాకగు నెల వై భూకాం, తాకీర్తివిలాస మనఁగఁ ♦ దనరెడు దానిన్.

తే॥ కేతనమ్ముల బిరుదులఁ♦గెలని యుక్కు, రముల పలకల గుఱుతుల♦రాణ లరసి
కనె విభీషణఘటకర్ణ♦ఘనరవాతి, కాయముఖ్యుల సదనము♦ల్కాంబుకంఠి! ౧౦౯

క॥ అమ్మేలివిమానమ్ముల, నమ్మారుతసూతి యరసె ♦ నంతియ పో యా
యమ్మ నెలవు గనఁడయ్యెను, జు మ్మావల నెద్ది గతియొ♦ శోధింపంగన్. ౧౧౦

ఆ॥ తలఁచె రామకార్య ♦ తత్పరత్వంబున, నోడ లెఱుంగ కట్టు ♦ లొదిఁగి తిరిగి
యన్నగరుల మేల్మి♦కబ్బుర మందుచు, నుల్లమున మహామ ♦ హిమాజ్య లాంగి!

ఆ॥ మునుము వెట్టుకొనను ♦ మొదలంట రుచి గొనఁ,
జెఱకు నందు బలెనె♦ చెలువ మిందు
నంత కంత కెక్కుఁ ♦ డయి తోఁచె వర్ణింప
నలవి కాదు పిదప ♦ నజునకైన. ౧౧౧

సీ॥ పా లారఁబోసిన ♦ పగిది వెన్నెలతీఁగె, లల్లుచున్నవి వీని ♦ నాశ్రయించి
నిలువ నీడలు లేక ♦ నెఱిఁబాఱు మించులు, పరిఢవిల్లెడు దీని ♦ పంచ సేరి
వ్యోమయానంబుల ♦ దీమసంబున నట్టు, లచ్చర ల్వీనియం ♦ దదె చరింతు
రటు వీని దరి జీవ ♦ నార్థి యౌ మున్నీరు, రత్నాకరాఖ్య బే ♦ రముల నడుపు
మేడ లివి మేడ లొందెడి యి ♦ మ్మెలవుఁ గాంచెఁ
గాక యెండొక్క నెలవునఁ♦గలవె యిట్లు
విశ్వమోహనకలనాప్రి ♦ వీనిఁ డెవఁడు
దీని సృజియింప నెంతటి ♦ దీక్షఁ గొనెనొ. ౧౧౩

తే॥ దీనిఁ బాసి యక్షేశుండు ♦ తెరలి యయ్యె
నాదిభిక్షుని వేఁడిన ♦ నాతఁ డిడిన
భిక్ష కలకాపురం బను ♦ పేరు పెట్టి
నిధుల కాపున కున్నాఁడు ♦ నిదురఁ దొఱఁగి ౧౧౪

మ॥ ఇది సంకల్పవిలాససంభవమ కా ♦ కిబ్భంగి శృంగారసం
పదధిష్ఠానతఁ గాంచునే పరవిధి ♦ ప్రాబల్య మి ట్లొప్పునే
కదియంజాలదు దీని నొం డనుట పా్రి ♦ గల్భ్యంబె యెందు న్మొద
ల్తుదియుం గానఁగఁ బోల దీశ్వరునకే ♦ తోఁచుం బ్రిభా వంబునన్. ౧౧౫

క॥ అచ్చరలేనియు దీనిం, జొచ్చి మఱల నొందుతలముఁ♦జొరఁబాఱుదురే
విచ్చలవిడిఁ జరియింతురు, పొచ్చెము లేదింతవట్టు♦పోలును దలఁపన్. ౧౧౬

ఆ॥ అమ్మహామహుని కు♦లాంగన యైన మా, తల్లి సీత దక్కఁ♦దక్కఁగల మ
హిళలు తలఁచినంత♦వలచి పైఁబడుదు రి, వ్వీటి తేని కనుట♦వేడబంబె. ౨౨౭

క॥ నాఁడే కంటి మమృతమయి, నాడిక యద్దేవి గరిమ♦ననుచు నె పెఱవా
గాడంబర మామెడ నా, కీడు దలఁగ నామె నెపుడు♦కీర్తింతునొకో. ౨౨౮

ఆ॥ కాంతునొక్కొ కనుల ♦ కఱవు దీరంగ మా
యమ్మ నామె సేమ ♦ మరసి మాట
లాడి పనుపు సేయు ♦ సంతతి భాగ్యంబు
గలదొ యింక నెద్ది ♦ గాఁగఁగలదొ ౨౨౯

ఆ॥ చిత్కలాఖ్య లక్ష్మి ♦ సిరిని విద్యుల్లేఖ
భాఁతి నెందు దాపఁ ♦ బడెనొ కాల
మహిమ రాము దేవి ♦ మహిత యామమఁ బొడ
గాంచి భవము గడవఁ ♦ గాంతునొక్కొ. ౨౩౦

—♦ హనుమంతుఁడు రావణాంతఃపురమునఁ బ్రవేశించుట. ♦—

క॥ అని లక్ష్యము మది నిడి య, య్యనిలసుతుఁడు సొచ్చె రాక్ష♦సాధిపు శుద్ధాం
తనివేశ మట సరిత్కాం, తనివేశము మత్స్యమూర్తి♦తరబడి నవలా! ౨౩౧

క॥ ఆనగరునఁ గల భవనము, లానగరిపు సభ వనమ్ము♦నంతిపురియు నొం
డేనియు మాసిరులకు నీ, డే నియుతంబేని ననుచు♦నెదిరి వచింపన్. ౨౩౨

ఆ॥ ఎంత జంత యిది యొ ♦ కింత జంకదు దేని
కేని దీని నాస్య ♦ మెత్తి యెత్తి
పొడిచి గడవ నొండు ♦ పురుషుండు గలఁడె యి
య్యంతిపురికి సాటి ♦ యనియుఁ గలదె. ౨౩౩

ఆ॥ తొలుత రాజరాజు ♦ దొరసిన సిరి యింద్రు
వైభవంబు తపను ♦ వలని వెలుఁగు
లెల్ల దిక్పతుల స ♦ మిద్ధసంపదలు ని
య్యెడనె మొనసె ననుచు ♦ నెంచె నతఁడు. ౨౩౪

సీ॥ ఎది తాత మది కెక్క♦నెంచిన సురశిల్పి, వరతపస్సారస♦ర్వస్వఫలమొ
యెది నల్వ చాగకా♦నిదిగా నొసంగిన, ఘననిష్ఠ వినిమయ♦మ్మున ధనమ్మొ
యెది జయశ్రీతోడ♦నే దైత్యు కైవసం, బైన యారోధని♦కాభ్యుదయమొ
యెది సర్వలోకసం♦పద లాఁచికొన నొడ్డి, నట్టి మోహనమహా♦యంత్రపదమొ

అల్ల పుష్పక మసదృశ ♦ మబ్బురముల, దీవి రతనాల గని కామ ♦ ధేను విష్ట
కల్పవల్లి చింతామణి ♦ కల్పశిఖరి, గని కనియె వాఁడు మైమఱ ♦ పును బురంధ్రి.
తే॥ అదియు నపరంజిపోత నీ ♦ హామృగములఁ, దీర్చి కూర్చిన కంబము ♦ ల్దివిని వ్రాయు
కొప్పరంబులు నీలపుఁ ♦ గోణిగెలు పటి, కంపు మెట్టులు వేదులు ♦ గలిగి వెలుఁగ.
క॥ అబ్బురపడుచు నె దాని, 'న్నిబ్బరమున నాక్రమించి ♦ నెలవు లరసి యా
యుబ్బున నె కాంచి కైకొనె, లిబ్బిపడఁతి విడిది జేని ♦ లీలావసతిన్. ౨౩౭

మ॥ జిలుఁగుంబయ్యెద లొత్తి గుబ్బలపయిం ♦ జేయూఁది మైపూఁతలం
గలతావు ల్పరికించి యంగనల యి ♦ క్కం జొక్కి చొక్కారము
ల్గలయ న్మూర్ఛ వహించి గంధవహుఁ డ ♦ క్కాలంబున న్బాంధవం
బొలయన్ రమ్మని పిల్చె వాని ఘనర ♦ స్యోల్లాసిగంధాంచితిన్. ౨౩౮

శా॥ దాన న్దానవనాథుఁ డున్న నగరి ♦ ద్దాని న్విమర్శించి కా
కే నొం డెద్దియుఁ గాంచ నంచు హనుమం ♦ డీక్షించె లోఁ జొచ్చి యు
త్తానోల్లాసిని సత్కలామయి గల ♦ ధ్యానన్ లసద్భూషణ
స్థానం దత్ప్రియకాంత నట్లు రతిభూ ♦ శాల న్విశాలప్రథా! ౨౩౯

సీ॥ జిలుఁగుఁ బల్కులఁ బ్రేము ♦ డులు వెంచుమరువారు, వమ్ముల పొదలిక ♦ ల్వలను సూపఁ
గెలని వీజనయంత్ర ♦ ములఁ దోఁచి యిమ్ముల, మలసి గాడ్పుల మొల ♦ కలు దలిర్ప
మిఱుమిట్లుగొలుపు క్రొ ♦ మ్మెఱుఁగుల సకలాంగ, రత్న సంపదలు స్వా ♦ రాజ్య మొడియఁ
బసిఁడిపళ్లెరములఁ ♦ బంచియిడ్డ మహార్హ, పక్వాన్నములు రుచు ♦ ల్ప్రస్తరింప
వివిధపానీయములనుండి ♦ వెడలి ధూప
ధూమముఖ్యమ్ము లెనసిన ♦ దోహదమ్ము
ఘ్రాణతర్పణ మొనరింపఁ ♦ గాంచె నాతఁ
డైదిఁటను దృష్టి నిత్యాత్మ ♦ ప్రాంతరంగ! ౨౪౦

ఉ॥ శాల విశాల హేమమణి ♦ సాలవినిర్మితసాలభంజికా
జాలఁ బ్రివాలనీలగుణ ♦ జాలసుమౌక్తికహారవల్లరీ
శ్రీలలితోజ్జ్వలాంగపరి ♦ శీలనలోల సలీలదృక్ప్రచా
రాలసలోకపాలఁ గని ♦ యాతఁడు సస్మయవిస్మయంబునన్. ౨౪౧

తే॥ ఇచ్ఛమైఁ గన నయ్యె ని ♦ య్యెక్క యనుచు
నంతరాంతరమునఁ జొచ్చి ♦ యచట గాంచె
రావణుని తేజు భూషణ ♦ రాజి వెలుఁగు
దీపరత్నప్రభలు నొంట ♦ దివము దివియ. ౨౪౨

క॥ ఇమ్మెయి ప్రకాశమున దివి, గ్రమ్మె జగ మ్మెంతఁ గమియఁ ♦ గాఁ జాలదె యా
యిమ్మున యి మ్మెఱుఁగక పరుఁ, డిమ్మహిఁ బరసిద్ధి నొంట ♦ నెనయంగలఁడే.

తే॥ దేవలోక మటంచును ♦ దివమటంచు
నింద్రభవన మటంచు నే ♦ మేమొ యంచుఁ
బొగడుదురు గాని యిద్దాని ♦ పొడ వెఱుంగఁ
జాలకున్నారు కవు లొండు ♦ చాయ మలసి. ౨౪౪

క॥ పుడమి నగనగరవనముఖ విడంబనలు వెలయు నెన్ని ♦ విశ్రుతముగ ని
య్యెడ రత్నకంబళంబులు, నడరెడు నయ్యవి మహామ ♦ హస్సంపదలన్. ౨౪౫

ఆ॥ ఎన్ని తాల మెట్లు ♦ హేమజాలము లెన్ని, యెన్ని రత్నవేదు ♦ లెన్ని ముత్తి
యముల చాందినీ ల♦యారె స్తంభముల చా, ళ్లెన్ని దీని విభవ♦మెన్నఁ దరమె.

తే॥ జూదమున నోడి పెఱదెసఁ ♦ జూడఁ బోక
యుల్లమున నెద్దియొ తలంచు ♦ చున్న కితవు
లట్టు లీబలు వెల్గుల ♦ యంతరమునఁ
బదరకున్నవి పసిఁడిదీ ♦ పంబు లొదిఁగి. ౨౪౭

చ॥ పొనరెడు మానసంబునను ♦ బొందిక నియ్యది హంసతూలిక
ల్దనరెడు నంచపిండుల వి ♦ ధంబున నిందలి సుందరాంగు లా
వనితలు పద్మిను ల్మొరువు ♦ వాయని మోములు వారిజంబు లి
ట్లనయముఁ గాంతిపూరమున ♦ నబ్రపు సంపదల న్దలిర్చెడున్. ౨౪౮

ఆ॥ నిదుర వేళ నిట్లు♦ నెగడెడుఁ గా ల్సేయి, గదల కెందు శబ్ద♦కలనఁ దోఁప
కంచ లళులు నున్న♦యటు లుండ స్త్రైణాబ్జ, వనము తెలిసి యెంత♦వఱలునొక్కొ.

క॥ మరుపనుల కగ్గమై మద, భరమున నటు పొదలి పొదలి♦పఱపగు నిద్రా
పరవశత నిట్టు లున్నది, తరమే దీని నెఱి వేఁగు♦తఱి యగునేనిన్. ౨౫౦

క॥ అని మది నెంచుచు మాయా, వనచరుఁ డంతర్గృహమున♦వరణీయమహా
ర్హానవోదయమణికలనా, కనత్కనకహంసతూలి♦కాతల్పమునన్. ౨౫౧

క॥ శయనించి తారకల నడి, బయలున రాకాశశాంకు♦భాతిని నవలా
లయుతము నియతి బలయు ను, చ్ఛ్రయమున నొప్పారు నిశిచ♦రప్రభుఁ గాంచెన్.

శా॥ విద్యుద్వల్లిక లభ్ర మట్లు నదు ల ♦ బ్ధిం బోలెఁ దార ల్తుషా
రద్యోతుం బలె హస్తిను ల్మదకరిం ♦ ద్రంబు న్వలె న్దైత్యు సం
పద్యుక్తుం గొని స్మారతంత్ర ధృతికిం ♦ బా లై విరామంబునన్
హృద్యశ్రీల శయాన లైన కోమల ♦ న్వీక్షించెఁ బద్మేక్షణా! ౨౫౩

క॥ వాహిత్థము క్తకిశోరిక, లాహేలావతులు హనుమ♦కగపడిరి సుము
క్తాహారలు సృస్తాన్యతు, లాహతరశనాఖ్యదామ♦లై సుశ్రోణీ! ౨౫౪
తే॥ తావులం దొఱంగి పూవుదం ♦ డలును దార
హారనూపురరశనాంబ ♦ రాంగనాగ
చిత్రికంబులుం దెలిపె వి ♦ శేషఫణితి
మదమదననిద్ర లవ్వారి ♦ మలయు టబల! ౨౫౫
క॥ పెనఁగొను ముత్తెపుసరుల, న్నొనకొను తాటంకరుచుల♦మొగి వికసనముం
గని గజమృదితలు లతలుగ, ననబోఁడు లెలర్తు రందు♦నవరసభరితా! ౨౫౬
తే॥ ముత్తెముల సరు లంచలు♦మొగి విదూర, జములు కలహంస లపరంజి♦జగ్గు నిగ్గు
నగలు జక్కవలుగ జఘ♦నపులినాస్య, కమలభావస త్త్వయశ స్త♦టములు దనర.
క॥ నిద్దుర వోయెడు నదు లన, ముద్దియ లల కాంతిపూర♦ములం జిత్రిత లై
యద్దయితు మొనసి వెలయుట, ముద్దులగుమ్మా! యతండు♦మొగకొనఁ గాంచెన్
తే॥ అచ్చరలు కింనరులును వి ♦ ద్యాధరాంగ
నలు నురగసుందరులును స ♦ న్నల మెలంగ
నేర్తు రసురేంద్రు వలగొని ♦ నెఱికిఁ జిక్కి
వాని శయ్యాగృహంబున ♦ వామనయన! ౨౫౯
ఆ॥ మదనమోహశక్తి♦మలసి రందును గొంద, ఱాతఁ డొడిచి తెచ్చె♦నన్ని తెగల
వనజముఖుల మఱియు♦వరవర్ణినుల దైత్య, కన్యకల వరించెఁ గలికి♦యతఁడు.
క॥ దక్షిణనాయకు నాతని, నక్షీణపరాక్రముని మ ♦ హాసత్త్వుని వా
రీక్షణము లలరఁ గొలుతురు, దాక్షాయణి! యిచ్చవలపు ♦ దైవారంగన్.
తే॥ మఱియుఁ జెఱసాల నొదిఁగెడు ♦ మానవతులు
గలరు నలకూబరుని శాప ♦ కలన కవల
లీలమైఁ గొనితేర వే ♦ వేలు వార
లలఁతి మేకొన కుండుట ♦ నంతవట్టు. ౨౬౨
క॥ ఆమెయి దైత్యవసంతుని, రామారామమున నచటు ♦ రహి యలరారన్
దా మహిసుతఁ బరికించెను, నేమంబున రామవిభువి ♦ నేయుఁడు లలనా!
తే॥ రక్కసుల రా కొమల భాసు ♦ రప్రదీప్తు
లెగిచి బయలున ముఖమారు ♦ తేరణమున
వీని సిరి యొందు లే దని ♦ వివృతిసేయు
జయపతాక లనంగ వి ♦ శాలనేత్రి! ౨౬౪

సీ॥ తమ్మియిమ్ముల నీడి ♦ తారసిల్లిన తేఁటి, బాటసార్ల పిపాసఁ ♦ బాపఁజాలి
మగఱాలకమ్ముల ♦ మలసి తచ్ఛాయల, కనువు మేకొనఁ జేయ ♦ నాటసూపి
యెడనెడ మేల్గాంచి ♦ యెలమిఁ గోరెడు ప్రియు, చిత్తవృత్తికిఁ దృప్తిఁ ♦ జెలిమిఁగూర్చి
సకుల నెమ్మోముల ♦ చవు లెంచి యవ్వాని, కామోదజృంభణం ♦ బావహించి
శర్కరాసవగంధమ్ము ♦ సహజగంధ, మును మొనసి పద్మగంధుల ♦ మోములందుఁ
బొడము నిట్టూర్పులలగాడ్పు ♦ పొత్తు గూడి, యిచ్చమై విహరించె మ ♦ నీషివంద్య!

వ॥ మఱియు నారావణస్త్రీవనంబు మధుమదనసంశ్లేషణంబున విలసిల్లి వాయునిషేవణంబున వాడుదేఱి చలివెలుంగు వెలుంగుల చల్లదనంబున వికాసంబు గాంచి లలితభూషణమణికాంతులఁ దళిర్చు కల్యాణప్రతీకలావణ్యసంస్థానంబులం బుష్పించి సమస్కంధం బై యన్యోన్యమనోహరబాహులతాభిరామ మాలాగ్రథితం బై మత్తభ్రమరకులాకులం బై శుకశారికాదిశకుంతవాఙ్మధురం బై చంద్రకిచయనృత్తసుందరం బై హంసగమనలలితం బై మనోజ్ఞం బై యొప్పారుచుండ నందలి వరాంగనల భూషణాంగాంబరస్రజంబులం బొడమి పొలుపారు మేలిసిరులు పరిమళసంపదలతోడి యద్వైతంబున ననిమిషత్వంబు సేకొని రత్నప్రదీపలక్ష్ములుం దారును నిట్టనిలువున నిలువఁబడి యిట్లు వివేచింప నశక్యం బగు నేకలక్ష్యవిలోకనంబున సుఖసంవిష్టుం డగు నాలంకేశ్వరుని తత్త్వం బుపలక్షించి బ్రహ్మభూయంబునఁ దృప్తినొందుచున్న తెఱంగున రంగుసూప నలవడిన మైత్ర్యాదిగుణవిశేషంబుల నలువొందు నమ్ముదితలు నిద్దుర పరవశంబున నుండు నయ్యెడనేనియు సపత్నుల కప్రియం బొనరింపఁబోవ రను నట్లు సంస్కారబలంబునఁ బ్రియాననశంకం దోడిచెలియల నెమ్మొగంబుల ముద్దిడుకొను వారును నొండొరుల భుజస్రజంబుల నుపధానంబులుగా నొనరించుకొనెడు వారును బరస్పరావేల్లనంబునం బొదలువారును బ్రియభాషణంబులఁ బచరింపఁ దొడరువారును బరిధానవినిమయంబులం బొనర్చువారును నొకరిత వక్షస్స్థలంబున నొండొకర్తుకయుఁ గొండొక్క యువతి భుజంబున వేఱొక్క తరుణియు నద్దాని యంకపాళి మఱొక్కతెయును నిప్పరుసున నితరేతరావయవంబుల ముఖపద్మంబుల నలంకరించి నెమ్మనుల నొదిఁగియు నొయ్యారంబు మీఱ శయనించి మవ్వంబునం దనరు నవ్వరవర్ణినులకుం దోడుతోడనఁ బవ్వళించిన కలావతీమండలంబున నృత్తశాలిని యగు నొక మత్తకాశిని కోమలాంగంబుల విన్యసించిన యప్పటి శుభాంగహారవిహారంబ పొడకట్టుచుండ నఖండమండితప్రచారంబు పనుపడం జేయ రసవాహినీసంగత యై యట్టిద యగు సరోజిని యొక్కండు పోతమాశ్రయించి విశ్రమించి యున్న వడువున నొక్క సారసానన వీణియ మట్టున

నెమ్మేను వైచి మోహపరవశత్వంబు పట్టునఁ జూపఁబడఁగూడఁ దనతోడి వారలఁ గావింప నొకయసితేక్షణ మడ్డుకంబుఁ గక్షంబున నమర్చుకొని నిదురించి బాలపుత్రిలక్షణం బభివర్ణింప వృత్తవక్షోజ యగు నొండొక్క సరోజాక్షి పటహంబుఁ జిరలబ్ధుం డగు రమణునిఁ బోలెఁ గౌఁగిటం గదియించి నిద్రావేశలక్ష్యంబునం దనదు తమకంబు వెల్లడింప వేఱొక్క చపలాక్షి సకామ యగు కామిని యేకాంతంబునఁ జిక్కిన కాముకునిం బోలె వంశవాద్యంబుఁ బొదివికొని మైమఱపునం బొదలుట సుషుప్తిమిషంబున ననుసంధానింపఁ గొండొకర్తుక నర్తకి సన్నాహంబు దనుపారఁ గిన్నెర మీటి దానితోడన సహకాంతయగు కాంతామణి సుఖనిద్ర సేయు విన్ననువున నభినయం బెఱిఁగింప డిండిమోచిత యగు నొక్క యండజయాన డిండిమం బొరసి నిద్రించి తరుణవత్సోపగూహంబున ముద్రితయగు తరుణి విధంబునం గనుపట్ట నొక్క మత్తచకోరాక్షి కనకసంకాశంబులు మృదుపీనంబులు మనోహరంబులు నగు నిజాంగంబులు మృదంగంబు సంగడంబునం దుఱంగలించియు నొక్క యుద్యానలతిక యాతోద్యంబును నొక్క కృశోదరి పణవంబును నొక్క మృగీవిలోకన యాడంబరంబును నొక్క వసంతమాలిక కలశికను నొక్క కాంచనాంగి హేమకుంభోపమితంబు లగు నిజపయోధరంబులను నొండొక్క లావణ్యలహరి కొండొక్క సైకతశ్రోణిని నలముకొని మంధరాచలమథితం బగు క్షీరసాగరంబున కలువుల చెలువతోడి నెచ్చెలు లై పొడసూపిన యచ్చరలకుం దోడునీడ లగుచు శోభనదేవతలో యన నుల్లసిల్లి నేత్రపర్వం బొనఁగూర్ప మకరకేతను శరవేదికం బోని యారహాస్యనికేతనంబున. ౨౬౬

మ॥ కలతాన్వు ల్పరికించి సీత కథ యా ♦ కర్ణింప రాకున్నచోఁ
గలఁకం బాఱియు ధైర్య మూని యెదుట ♦ న్గాంచె న్విచిత్రాంగని
స్తులశోభారమణీయకాంచనమణి ♦ స్తోమాత్మకక్ష్మాంచితో
జ్జ్వలమూర్తి న్సుఖపారిబర్హ దనుజ ♦ క్ష్మానాథశయ్యాస్థలిన్. ౨౬౭

సీ॥ ఎచ్చోటఁ గనుఁగొన్న ♦ నిదె దారి యని తాఱు, మాఱు తళ్కులఁ గను ♦ ల్మఱలఁచు దాని
నాల్గుదిక్కుల మాట ♦ నా కేల యని దశ, దిశలుఁ దా నొక్కటఁ ♦ దివియుదాని
విభుజయశ్రీసంని ♦ వేశచిత్రకలాభి, సంసత్తిఁ బండెమ్ము ♦ చఱచుదాని
నిత్యశోభనలక్ష్మి ♦ నే నంచు సురభిలా, గురుధూపధూమము ♦ ల్గుప్పుదానిఁ

దా నియతిఁ గాంచె హనుమ పూ ♦ జానిషక్త
కల్పసుమహారిచందన ♦ గంధకామ
ధేనుఘృతదీపకణికాప్ర ♦ ధానలలిత
దైత్యవిభు శయ్య హిమధరా ♦ ధరతనూజ ! ౨౬౮

క॥ ఎందులనేనియుఁ గనఁబో, మిందున కనరాని విభవ ♦ మిదె సిరి నెల వం
చుం దలఁచెవాఁడు తలఁపున, సుందరి! యచ్చోటె చోటు ♦ చోద్యమ్ములకున్.

తే॥ కలికి కాంచనపాంచాలి♦కలనుఁజూచి, చామరగ్రాహిణులఁ జూచి♦శక్య మగునె
భేద మెంచంగ నేపాటి♦భేదవాదు, లనఁగ నద్వైతమే లెస్స♦యగును దలఁప.

* క॥ వరవర్ణినీవతంసమ !, వరవర్ణాంచితము దాని ♦ వైభవ మమరున్
వరవార్ణపదరమాభా, వరవార్ణవముల నెలవగు ♦ వాగ్వల్లి లలిన్. ౨౨౧

—♦ హనుమ నిద్రితుఁ డైన రావణునిఁ జూచుట ♦—

క॥ ఆశయనాగారంబున, కాశయ్యాతలమునకు శు ♦ భాలంకార
ప్రాశస్త్యము దనరఁగ లం, కేశుడు శయనించి తగె న ♦ నీదృశలక్ష్మిన్.

సీ॥ ఐరమ్మదస్ఫూర్తి ♦ ననువొందు కాలమే, ఘుమ్ము సంపద మేని ♦ కలనక్రమ్మ
రోహణాచలమున ♦ రూఢి నానారత్న, విభ లింద్రచాపమ్ము ♦ వెక్కిరింప
గుటిపెట్టు నచ్చోటు ♦ గూల్ప నౌ గుఱుతోడి, కలవరింతల పేరి ♦ గర్జలెసఁగ
నాశాధిపతుల సౌ♦ఖ్యముఁ బాప నెడసొచ్చు, నిట్టూర్పులు విమాన♦నివహ మూఁగ
మిత్తి యేనియు దర్పమ్ము ♦ మెలఁకువఁ గని
బ్రదుకు జీవుఁడ! యని దారిఁ ♦ బట్టి పాఱఁ
గామరూపుఁ డతండు ని ♦ కామదివ్య
భావరూపోజ్జ్వలతఁ గను ♦ పట్టుటయును. ౨౨౩

క॥ మెచ్చుచు వాని మహోన్నతి, యచ్చెరువున ముంప మారు♦తాత్మజుఁ డరరే
యిచ్చెలువము దొర దొరకొన, హెచ్చుమరె దిగీశులేని♦నిందుద్రిఁడయేనిన్.

తే॥ అస్తమించిన భానుని♦యావెలుంగు, లగ్నిరూపు నీతనిఁ గవి♦యుంగ నోపు
లేకయున్న నధీశ్వరు♦ల్లేరె జగతి, నిట్టి స్ఫురణమ్ము లెచ్చోట♦నెగయఁగలవు.

ఆ॥ రక్తచందనమున♦రహి మించు నెమ్మేన, మెఱుపు లట్లు నగల♦మెఱుఁగు లొప్ప
సాంధ్యరాగరక్తి♦సంగతతోయద, వృత్తి నున్నవాఁడు♦వీఁడు చూడ. ౨౨౪

క॥ ఇష్టక్రీడావాప్తిం, దుష్టిం గని మదము నిదురఁ♦దోకొని పొదువన్
స్పష్టానుభావముద్రా, వష్టంభత నున్నవాఁడు♦వశ్యుఁడ పోలెన్. ౨౨౫

తే॥ నిట్టనీల్గుచు నెలకొని ♦ నిదురవోవు
వీని శయనోత్తమంబునఁ ♦ గానవయ్యె
మదపుటేనుంగు చొరఁబాఱి ♦ మలఁచు నపుడు
ప్రసవణమునఁ దోఁచు సం ♦ పత్ప్రసక్తి. ౨౨౬

తే॥ చిత్రభానుని సిరి వీని♦చెలువ మొప్పె, జాతరూపపరిచ్ఛద♦ద్యోతమునను
సారిదిఁ బుష్పించి నట్టి య♦శోకమునకు, దీటుగా శయనాసన♦స్థితియుఁ దనర.

తే॥ చంద్రుఁ డిరురూపులను గొని ♦ చామరముల
సిరుల నొప్పారఁ దానునుఁ ♦ జేరెనొక్క-
నిండువెలుఁగుల ఛత్రంబు ♦ నెలవుకొనుచు
వీని తేజ మెఱింగింప ♦ వేఁడివేల్పు. ౨౮౦

తే॥ భానుకోటిప్రభాజాల♦భాసమాన, ముకుటకుండలకేయూర♦ముఖ్యమండ
నాంచితుఁడు వీని సిరి యిట్టు♦లనువుపడఁగ, నైంద్రిసంపద లెవ్వార♦లడుగువారు.

ఉ॥ చందనచర్చితంబులు సు ♦ సంగతము ల్గురుపీనవృత్తని
ష్పందము లింద్రకేతుసదృ ♦ శంబులు రత్నవిభూషితంబు లీ
సుందరవేషు బాహువులు ♦ చూఁడగ నొప్పెడుఁ బంచశీర్షత
న్మందరసానుగంబు లయి ♦ మానగు సుప్తమహోహులో యనన్. ౨౮౧

తే॥ తెలియ డైరావణవిషాణ ♦ దృష్టి యెట్లు
తెలిసె భిదురసుదర్శనో ♦ దీర్ణశక్తి
వీని హస్తాగ్రనఖముల ♦ నేనిఁ జెఱుప
వున్నను భుజక్షతాంకమ్ము ♦ లొసఁగుఁ గీర్తి. ౨౮౩

మ॥ వలనొప్పం వొలిపాలవెల్లికలన ♦ ల్వ్యాకుచ్చు సెజ్జన్మహో
జ్జ్వలుఁ డీతం డొలయుంగ దీపకణిక ♦ ల్జాజ్జ్వల్యమానంబు లౌ
కలిమి స్త్రీ తగ నన్య లచ్చరలు నై ♦ కన్పట్టఁగా మందరా
చలశృంగంబులు వీని బాహువులు ని ♦ చ్చ ల్గూర్పవే సంపదల్. ౨౮౪

సీ॥ పాదమూలమ్మునఁ♦బడియుండి రెందఱు, ప్రార్థనా యోజన♦పరిఘవిల్ల
హస్తాగ్రగత లయి♦యలరు వీరలఁ దెచ్చె, భుజశక్తి స్ఫురణంబె♦బోధసేసి
తలమానికమ్ము లు♦త్తలమున నున్నారు, తవులున మెచ్చులు♦దవిలి కొంద
ఱటు కెలఁకులవార♦లలఁతులే యివ్వాని, మోహనలీలకై ♦ మొనసినారు

బళిర యిటు లుండవలె మహా ♦ ప్రాభవం బ
హీనపరమార్థసంపద ♦ మెట్టు లౌనో
షో తృతీయంబు పురుషార్థ ♦ మీతనిదియ
వీని సరివత్తురే లోక ♦ విభులు సిరుల. ౨౮౫

క॥ సిరి రూపము సద్వంశము, తరుణత్వము విద్య యెలమి♦దాతృత్వము శ్రేయం
బరయకె యిందఱు యువతులు, వరియించెద రెట్లు వీని♦వారని కూర్మిన్. ౨౮౬

ఆ॥ ఆల మంద నడిమి♦యాఁబోతును గరేణు, మండలాంతరమున♦మదకరీంద్రుఁ
బోలి యున్నవాఁడు♦ప్రాభోఁడు లిమ్మోయిఁ, దన్నుఁ గొలువ వారి♦తవులు వెనిచి.

తే॥ చూతపున్నాగవకులాది ♦ సురభిలంబు
పానగంధంబుఁ దోకొని ♦ బయలు దేరె
నిష్టమృష్టాన్నరసపుష్టి ♦ యెలమిసూప
మహితములు వీని నిశ్శ్వాస ♦ మారుతములు. ౨౮౮

క॥ అని యెన్నుచు నారోహణ, మున వేద్యంతరము తల ను♦మొనకొని భీతుం
డన నొదిఁగి యతని పార్శ్వ, మ్మున సామ్రాజ్యమున కలిమి♦మురు వమరారన్.

సీ॥ పసిఁడిక్కిల్లడఁ జేతఁ♦బట్టి నట్టులె యుండి, విభుని జంకించెడి♦వెరవు సూపఁ
గెంగేలు గేలునఁ♦గీలించు నేరిమి, మగని మాలిమి తోడి♦మమతఁ దెలుప
నెగచి యుపాంతమ్ము♦నెడఁ గ్రిమ్మ పొదలిక, యర్థాంగసౌభాగ్య♦మనువదింప
నెమ్మోము ప్రియు మోము♦నెక్కొల్పు నొడికమ్ము, రసపారతంత్ర్యమ్ము♦రాణ నొడువ
నొక కనకగౌరి మణిభూష ♦ ణోజ్జ్వలాంగి
యంతిపురి నెల్లఁ దనకాంతు ♦ లలముకొనఁగఁ
బూచియున్నట్టి తంగేటి ♦ పొలప మెనసి
పావనికిఁ గానఁబడెఁ బద్మ ♦ పత్రనేత్ర. ౨౯౦

తే॥ ఎన్నఁగఁ ద్రిలోకసుందరి ♦ యిదె యనంగ
రూపయౌవనసంపద ♦ రూఢిఁ గూర్పఁ
దర్క మొనరించె నాతఁ డ ♦ తర్కితముగఁ
గాంచి భూపుత్రిక యటంచుఁ ♦ గమలవదన! ౨౯౧

క॥ త్రొలికా న్నాతని నిద్ద పుఁ, దెలివి మఱువుపఱుప వాని♦దేవి యిది యటం
చలఁతి నెఱుఁగఁబోడయ్యెను, విలసిల్లునకాదె తలఁచు♦విధమున నెదియున్.

—♦ హనుమంతుఁడు మందోదరిం జూచి సీత యనుకొని భ్రాంతుఁ డగుట. ♦—

తే॥ కొట్టెఁ జప్పట్లు ముద్దిడు ♦ కొనియెఁ దోఁక
నందె నానంద మెద నాట ♦ లాఁడెఁ బాటఁ
బాడె నడిచెఁ గంబములకుఁ ♦ బ్రాఁకె దుమికెఁ
గపుల ప్రకృతి నిదర్శింపఁ ♦ గాఁ గడంగి. ౨౯౩

ఆ॥ అంతలోనె తెల్వి♦నంది యక్కట యిట్టు, లగునె తలఁపఁ జెట్ట♦యయ్యెఁ గాదె
నాదు ప్రజ్ఞ యే మ♦నం దగుఁ బాప మే, నెట్టు లీఁగువాఁడ ♦ నింతవట్టు. ౨౯౪

క॥ ఇది యితని దేవి యనఁ దగు, మదవతి రూపవతి వేల్పు♦మండలిలోఁ బు
ట్టొద వనిటు లుండనోపును, బొదలెడు సంపదల మగని♦పొరువునఁ బేర్మిన్.

ఆ॥ మేలి రూపమునను ♦ మెఱుఁగారు నంతన
యామె యనుచు నెంచ ♦ ననువుపడును
లోకనాథు సతి వి ♦ లోకాత్మిక విశుద్ధ
మూర్తి యొడ్డ పొందు ♦ మొనసి మను నె. ౨౯౬

క॥ రాముఁడు జగదభిరాముఁడు, రామారత్నము తదేక♦రస జానకి శ్రీ
రామ యనం దగు గొనముల, నామహిసుత మహితచరిత♦మన్యాదృశమే.

క॥ ఒండొకసతియేనియు మగఁ, డొండెడ నుండుతఱి సౌఖ్య♦మొందునె సెజ్జం
బండుకొనునె కై సేఁతకుఁ, దిండికి మొనయునె సుషుప్తిఁ♦దెరలకయున్నే. ౨౯౭

తే॥ అనుచు యోజించి తలఁగిన ♦ యట్టి బుద్ధి
మఱలి పొదుకొనం గపి ♦ మండనుండు
గలుగు చోట్లెల్ల నొండొండఁ ♦ గలయ వెదకి
జనకనందినిఁ గనఁడయ్యెఁ ♦ జంద్రవదన! ౨౯౮

ఆ॥ అంతిపురము పొందు ♦ నంది నట్టిద యొండు
పానభూమిఁ గాంచి ♦ పవనసుతుఁడు
దాని యొఱపు మెచ్చెఁ ♦ దద్దయు సర్వస
ముదిత మగుచు మదికి ♦ ముదముఁ గూర్ప. 300

—♦ పానశాలాన్వేషణము.♦—

సీ॥ పుష్పోపహారము♦ల్పూచినట్లుగ నుండ, ఫలవృక్షసంగతి♦పరిఢవిల్లఁ
బచ్చలఁదోరణ♦పరిస్తార మొప్పార, స్ఫటికకుడ్యములు జ్యో♦త్స్నలు ఘటింప
మణిరత్నదీపిక♦ల్మహి యేలఁగాఁ జాల, జిత్రకంబళములు♦సిరులు గూర్పఁ
గాంచనకుంభము♦ల్గనులపండువు సేయ, ముక్తావితానము♦ల్మురు వొసంగ
మంజువాగ్గుంభనల మేలి♦మంజిమంబు, పంజరాంతరగతశుక♦పాళి వెనుప
మంగళాయతనంబన♦మహితకళల, నొప్పు నప్పాల మాతని♦మెప్పు వడసె.

చ॥ అతిరసము ల్రసాయనము ♦ లంచితగంధరసోదయంబు లా
రతిఫలముఖ్యపాకగుణ ♦ రస్యమహౌషధసారము ల్సుధా
ప్రతికృతపౌష్పగౌడముఖ ♦ పానవిశేషములు న్సభక్ష్యభో
జ్యతతులుఁ జూడ నొప్పె మధు ♦ శాల రసాలసనేత్రశోభినీ. 303

తే॥ మఱియు నంజుళ్లఁ బచ్చళ్లు ♦ మరిచపుంబొడు
లూరఁగాయలు మెంతిపిం ♦ డ్లోలయు పెరుగు
లార్ద్రికములు జంబీరమ్ము ♦ లలఘుఫలర
సములు పాయసములు నందుఁ ♦ జాలఁ గలవు. ౩౦౪

తే॥ అత్తరుల బుడ్లు పన్నీటి♦హైమకలశ, కలును జందనమణిపాత్రి♦కలును మున్న
గలుగు భోగ్యవస్తువు లందుఁ♦గానఁబడియె, నవ్విలాసావసథమున♦నబ్జగంధి.

క॥ బంగరుపీటలు రతనపు, భృంగారిక లుజ్జ్వలమణి♦వేదికలును మే
ల్రింగారు హంసతూలిక, లంగనలు చెలంగు జాడ♦లయ్యెడఁ దోఁపన్. ౩౦౬

ఆ॥ అంతరాంతరముల కరిగి♦యువ్వలనుల, నధికపానమత్తు♦లగుచు మగలు
నంగనలును గ్రీడ♦నాసక్తిమై నోడ, గ్లెఱుఁగకున్న వారి♦నెఱిఁగి మఱలి. ౩౦౭

ఉ॥ నా కిది ప్రత్యవాయమొకొ♦నాకనులం బడి రెల్లచోటులం
బ్రాకటకామరాజ్యపర ♦ భాగవశంవదచిత్తు లిట్టి వీ
రేకత ముండు నయ్యెడల ♦ కేగుట ధర్మమె కా దనంగ రా
దీకృతి స్త్రీప్రసంగమున ♦ నెట్టులనేనిఁ బొసంగుఁ గావునన్. ౩౦౮

ఆ॥ వేఁగు నంతలోన♦వెదకి చూచినఁ గాక, కాంచరాదు పిదపఁ♦గాంచనాంగి
నైన నుంత వికృతి♦నందదు నామది, దోస మెట్లు నన్ను♦దొరయఁగలదు. ౩౦౯

క॥ మన మఘకారణ మగు న, మ్మనమే శ్రేయంబిడు న్న♦మాహిత మైనన్
దన కొండు గతియ లే దిట, జనని జనకజాత నరయు♦సంగతి దక్కన్. ౩౧౦

ఉ॥ కాననిచోటు లేదు మఱి ♦ కానఁగ రాదు ధరిత్రి పుత్రి యే
నీనలి కేమి మం దిడుదు ♦ నెద్దియుఁ దోఁపదు మిన్న కెట్లు వో
నా నొకమాటు క్రమ్మఱ మ ♦ హాత్ముని రాముఁ దలంచి కాంచ నెం
దే నెఱి నామె యున్న తల ♦ మేర్పడునో తనపుణ్య మెట్టిదో. ౩౧౧

ఆ॥ అనుచు రాత్రిగృహము♦లలరు లతానికే, తనము లట్లు చిత్ర♦ధామములును
గరుడయక్ష దేవ♦గంధర్వనాగక, న్యలు మెలంగు నెడలు♦గలయఁజొచ్చి. ౩౧౨

—♦ కారాగారగవేషణము ♦—

క॥ అం దరసి యామె లేమికి, డెందము కొందలముపడ వ♦డిం జని చెఱసా
లం దడవి యందుఁ గుందెడు, సుందరులం గాంచె మోము♦శోషింప సతీ! ౩౧౩

క॥ కార్యాకార్యజ్ఞుం డఖి, లార్యప్రస్తూయమానుఁ♦డాతఁడు వినె న
య్యార్యల దీనాలాపము, లార్యా! యట నేమి కల్ప♦మరయంగలఁడో. ౩౧౪

సీ॥ వీని బారిం బడి♦వెత లొందుఁ డని విధి, వ్రాయ నోం డెది పాయ♦వల నటంచు
నేనాఁటికిని విన♦మివ్వాని కడపటి, మాట యిట్టిదె దైవ♦మర్మ మనుచు
మగలు లేరేమెందు♦మలసియీాతనినోంపఁ, గోమలపాపం బాఁచి♦కొనెనో యనుచుఁ
బడరానిపా ట్లెల్లఁ♦బడి చేసె నఁట యాత, పంబునకా యిట్టి♦ఫలమటంచు

నింక మనవారిఁ జూతుమె ♦ యింతకన్నఁ
గలదె దుర్గతి మిత్తియుఁ ♦ గలదో లేదో
యనుచుఁ దమలోనఁ దల ♦ పోసి కొనెడు సతులఁ
గాంచి కన్నుల నశ్రువు ♦ ల్గ్రమ్ముదేర. ౩౧౪

తే॥ ఏ నశోకంబుఁ గనినప్డె ♦ యింతులార !
మీాకును నశోక మగును న ♦ మ్మి మనఁ డనుచు
బాసఁ జేసెను సాధు సం ♦ ప్రజ్ఞుఁ డతఁడు
తనదు నెదపైనిఁ జే వైచి ♦ తరలనయన. ౩౧౫

సీ॥ శోధించెఁ గాకేమి♦శుద్ధాంతముల నెల్ల, ద్రొక్కిచూడని యిక్క♦దొరయ దనఁగఁ
బొడఁగాంచెఁ గాకేమి♦పుష్పావసథముల, నాడిన యాటలే♦యాడె ననఁగఁ
నవరించెఁ గాకేమి♦ సంగీతశాలలఁ, బాడిన పాటయే♦పాడె ననఁగ
దిరుగాడెఁ గాకేమి♦దీర్ఘికాదులపట్ల, నీటిపైఁ జాలిక ♦ నెఱపె ననఁగ

నవనిజాత కదా యశో ♦ కాఖ్యవనిక
నవనిజాతాశ్రయము నొంద ♦ నౌ నటంచుఁ
దలఁపఁడో లంక చూపిన ♦ దారి యేల
వదలెనో వాని మెలఁకువ ♦ వాఁడె యెఱుఁగు. ౩౧౬

—♦ హనుమఁడు సీతం గానక విషణ్ణుఁ డగుట ♦—

క॥ అమ్మాయిఁ గని కని యబ్రపుఁ, దిమ్మఁడు విసివి విసువకయ ♦ తేఁకువ నొక్కం
డిమ్మున నిలఁబడి కర్జం, బిమ్మగఁ దలపోయఁదొడఁరె ♦ నిట్లని మదిలోన్. ౩౧౭

ఉ॥ ముప్పది యోజనంబు లిది ♦ మొల్లముగాఁ గలయంతవట్టు నే
చొప్పునఁ జొచ్చి యైనఁ దన ♦ చూడనిచో టొకయింత లే దనన్
మె ప్పని కాక యోలమున ♦ మేలున కొగ్గక కాంచినాడ నా
యెప్పటి కర్మ మెట్టిదొ మ ♦ హీసుతజాడ యెఱుంగరా దెటన్. ౩౧౮

క॥ చతురంగుళమాత్రము నీ, క్షితి నాయరయనిది లేమి ♦ సిద్ధమ యింకే
గతి నెందుఁ గల దనం దగు, మతి కేమియు వింత వలను ♦ మార్గాన దింకన్.

సీ॥ రాముమే లెఱుఁగంగ♦రాముమే నెరియంగ, నొండెడ వరట యై♦యుండెనొక్కొ
రావణగ్రహపీడ♦రహి వీడి తనుఁ దానె, యుసుఱుల పై నేమి♦కసటు గొనెనొ
కాళరాత్రులపోలెఁ♦గాచియుందురు పాడు, రక్కెస లెట్టిగో♦రమున కైరొ
కూడు నీరని ప్రూచి♦కొను వారు లేకున్నఁ, జొక్కి యేమెయి గతిఁ♦గ్రక్కదలెనొ
కెడపి కొని వచ్చునెడ నబ్ధిఁ ♦ బడెనొ నడుమఁ
దోడరు రాయిడి సుడివడి ♦ మడిగె నేమొ
మాఱురూపంబు పడియెనో ♦ మానవతికిఁ
దలఁపఁగా రాని వెత లెల్లఁ ♦ దారసిల్లె. ౩౨౧

క॥ రక్షఃపతిఁ జేర్పుటకై, విక్షేపముఁ గూర్పనట్లు ♦ వినకుండిన నా
రాక్షసభామిను లాయమ, భక్షించిరొ చెట్టకొలము ♦ పాపం బనునే. ౩౨౨

ఆ॥ కడలి దాఁటు గొడవఁ ♦ గడచి యిక్కడ రేయి
దనుక మోస మనక ♦ మొనయరాని
చోటు లరసి తుదకు ♦ సుడియించు వెతకుఁ బా
ల్పడితి నింకఁ దనకుఁ ♦ బార మెదియొ. ౩౨౩

చ॥ మసలినఁ దెల్లవాఱు నట ♦ మాఱట మిత్తులు బమ్మరక్కసు
ల్గసిమసఁగం గడల్కొనినఁ ♦ గాఱియపా టనికాక మేలు లే
దసమునుఁ బ్రోవుఁ ద్రోచి చను ♦ నన్నిటి యాదట నానొ కాదొ యి
ద్దెస కిది దారి యంచు మది ♦ దెల్ప దొకండన నెట్టు లీయెడన్. ౩౨౪

సీ॥ త్రొడిబాటు నెమ్మేనఁ♦దోనుకాడ నెమ్మెయి, మున్నీరు గడువంగ♦మొనయువాఁడఁ
దోఁక లాడించుచుఁ♦దారసి మేల్వినఁగోరు, చెలికాండ్ర కేమని♦చెప్పువాఁడ
దమరాక నెమ్మదిఁ♦దవులఁ దిన్నసిచూడ్కిఁ, గను కపీశ్వరు నెట్లు♦గాంచువాఁడ
ప్రాణంబు ప్రాణమై♦పరఁగు సీతఁ దలంచి, పొక్కు రామున కేమి♦బొంకువాఁడ
నల్లవారలఁ దెరలింప ♦ నేఁగి యైనఁ, జేయునది యెద్ది యింక నా ♦ [illegible] మేల
యనశనవ్రతమున దీక్ష ♦ యైన పిదప, వేలుపుల వీటి చక్కటి ♦ [illegible]యువాఁడ.

ఆ॥ మేను వాయ నేమి♦మేలఁగు నియ్యెడ, భైక్షవృత్తి కలనఁ♦బర[illegible] వేస
మూని నిల్చి యైన♦నుర్వరాసుత జాడ, నరయుచుందుఁ దెలి[illegible]యు♦నంతవఱకు.

క॥ రాముఁ డిది యెఱయకుండునె, రామామణి మహిజఁ దలఁచి♦రహి చెడి తోనే
తా మేను దొఱఁగకుండునె, యామెత్తనిమదికి నింత♦[illegible]నే యిడుమల్. ౩౨౫

తే॥ రాము నొడ లొండన గుణాభి ♦ రాముఁ డతఁడు
లక్ష్మణుం డెట్లు పడునొ కు ♦ లంబె చెడునొ

వానరుల గతి యింక నే ♦ వలని దగునొ
యింతటికి హానిమూల మే ♦ నెట్టు లగుదు. 3౨౯

ఆ॥ భ్రాతృవత్సలుండు♦భరతుఁ డొం డైనఁ ద, జ్జనను లట్లుగాఁగ♦సవితృసుతుఁడు
మైత్రికలిమిఁ జేరు♦మాసినఁ దత్సుతు, ల్సుతులుఁ దెరల నింకఁ♦జొప్పు గలదె.

క॥ ఉండినఁ ద ప్పటుపోయిన, నొండొకఁ డగు దోస మూర♦కుండినఁ బాపం
బెండయు వానయు నొక్కట, గండు మిగిలె నింక నేమి♦గానున్నదియో. 330

తే॥ శఠుని రావణుఁ బట్టి వీఁ ♦ చం బడంచి
సీత మిగ్రింగెనొ లేదొ చ ♦ ర్చించువాఁడ
నొక్కఁ యివ్వీఁడు గిరితోడ ♦ వ్రక్కలించి
శ్రీరఘూ త్తంసు పదభూమిఁ ♦ జేర్తునొక్క. 33౧

క॥ నా వేఁడు వేల్పు లెల్లరు, నేవెరవున నేమి సాయ♦మీ యెడఁ జేయం
గావలతురొ యిఁకఁ దొలిక, న్నేవిధమున తలఁపు మదికి♦నేర్పడఁగలదో. 33౨

తే॥ అనుచుఁ బ్రాకార మెక్కి యొ ♦ య్యన స్మరించి
యల్లదె యశోకవనిక యి ♦ య్యదియ కాఁగ
నోపు సంపాతి లంకయు ♦ నొనర మున్ను
దెలిపినార వనిజ యున్న ♦ నెల వటంచు. 333

క॥ ఇం దుండవలయు జానకి, ముం దిట నే వెదకు నెడల♦మొనయుని దిదె భూ.
మిం దిర మగు నందన మనఁ, బొం దొలసెడు నుత్సవంబ♦పోలెఁ గనులతోఁ.

—♦ హనుమంతుఁ డశోకవనిఁ బ్రవేశించుట. ♦—

ఉ॥ రామునకు నతి జగదభి ♦ రామునకు స
లక్ష్మణునకు సీతామహా ♦ లక్ష్మి కిం ద్రి
చంద్రరవియమవరుణాశ్వ ♦ సనముఖులకు
బ్రహ్మవిష్ణ్వీశ్వరులకుఁ బ్ర ♦ ణ త్తి నిడుదు. 33౪

క॥ అమ్మహనీయుల కృప నా, యమ్మఁ గనంగంటి నేని♦నావల నిడుదుర్
ద్రిమ్మరి రావణు తలపై, నిమ్మహిజను లెల్లఁ బొగడ♦నేఁ బాదమ్మున్. 33౫

సీ॥ తండ్రి! నీదయ నెట్టు♦దలిగొంటిని సమీర!, నా ముద్దు చెల్లింప♦ననుచు మయ్య!
నీయండ గల దంచు నే నమ్మితిని గర్మ, సాక్షి! మే లొనఁగూర్చు♦మీ క్షణమున
దేవతాకార్యంబుఁ♦దీర్పఁ జూడుము సహ, స్రాక్ష! దై తేయుల♦యెడ రడంగఁ
గీ ర్తింతు రని దుష్ట♦వ ర్తనులకు సాయ. మాచరింపకుము త్రి♦లోచనుండ!

వంగడమువంకఁ బోకుము ♦ వనజగర్భ!
శౌరి! నామదిలో నీవు ♦ చక్క నిలువు
మెల్లభూతంబులార! నా ♦ మొఱను మీర
లుండి జనకజ కాన్పు నా ♦ కొసఁగుఁ డరసి. ౩౩౭

క॥ వెన్నెలయొడయని మేల్సిరి, కిన్నెల వయి చూడ్కి నెనరు♦కీర్తిఁ బెనుప సం
పన్నతఁ దనరెడి యాననుఁ, గన్న జనని నెమ్మొగమ్ము♦గాంతునొ తలఁపన్. ౩౩౮

తే॥ ఎట్లు నాదృష్టిపథముఁ దా ♦ నెనయఁగలదొ
రామపత్ని యనింద్య సు ♦ ధామమహిత
పావుఁ డామాంసభుక్కుల ♦ పాంసనుండు
వేచి తోడితెచ్చి యెందున ♦ డాఁచినాఁడొ. ౩౩౯

ఆ॥ అని ముహూర్తకాల♦మాధ్యానమొనరించి, యమ్మతలఁపులోన♦ననువుసూప
వాఁడువప్రగుణము♦వదలియాశుగమట్లు, లక్ష్యమవ్వనస్థ♦లమ్ము మొనసె. ౩౪౦

ఆ॥ మేను పొంగె వలను♦మెయికొనె ధైర్యంబు, పాదుకొనె వికార♦భంగి తరలె
నయ్యశోకవనిక♦నాక్రమించినయంత, నచటుమహిమ లెట్టు♦లంతగలవొ.

—♦ ఆంజనేయుఁ డశోకవనమును బరికించుట ♦—

సీ॥ మితిమీఱు పొలుపున♦మించు పుష్పితలతా, శతములు తరువుల♦సంగడమున
నెగడ నద్ధులు గ్రమ్ము♦నెఱిఁ దుమ్మెదలు నేరఁ, బాఱి గీతమ్ములు♦పాడి మెచ్చు
నెలకొనఁ జేయంగఁ♦గలిమి పెంపున నిడ్డ, రసమునఁ దృప్తిమై♦రాణఁ దనర
మేలిబందుగు లట్లు♦మేకొని శుకపిక, శారికాదులు నిచ్చ♦సంచరింపఁ

బొసఁగు గార్హస్థ్యధర్మమ్ము ♦ పొలుమ కాఁగ
నఖిలపురుషార్థములకుఁ దా ♦ ననఁగఁ జాలి
వెలయు నయ్యుపవనము న ♦ వీన మగుచు
వాని దృష్టుల నలరించె ♦ వామనయన! ౩౪౨

ఉ॥ అంచల ఱెక్కల న్నిలిచి ♦ యట్టె విదిర్చినఁ జిందు దీర్ఘికా
భ్యంచితశీకరమ్ములు స ♦ మాహితవృత్తి గ్రహించి తావుల
న్మించిగ నేర్చికూర్చికొని ♦ మారుతుఁ డత్తఱిఁ జేరి బిడ్డ మే
లెంచుచు వీవఁగాఁ దొడరె ♦ నిక్కము వాయు నటంచుఁ దెల్పుచున్. ౩౪౩

తే॥ వింతభూతమ్ము పొదలిక♦విదితమైనఁ, గదలు పులుఁగుల ఱెక్కల♦గాలి నురలు
విరుల నాతనిపై పుష్ప♦వృష్టిఁ గురిసె, నయ్యుపారామవిలసన్మ♦హాగమములు.

ఆ॥ పుష్పమయము నగము♦పోలిక నిట నటఁ, బూల పఱపు నేల♦లీల మలయు
నతనిఁ గని వసంతుఁ♦డరుదెంచె నని వన, దేవతలు ప్రసన్న♦దృష్టు లైరి. ౩౪౫

కం॥ ఆగాలిపట్టి వేగము, సాగించినఁ బూలు పండ్లుఁ ♦ జాల్పున దొరలం
గాఁ గన్పడె సిరు లన్న్యలు, లాగికొన న్నిలుచు ధూర్తు ♦ ల గతిం దరువుల్.

కం॥ అంజెడు పొదరులఁ దీవెల, నంజన కొమరుఁడు తెరల్చి ♦ యరుగుటఁ దెలిపెన్
వింజమున మొగిలు గాలి త, టిం జెదరఁగఁజేయు నన్నె ♦ ఱి న్నగతనయా!

తే॥ పదరి గోళ్లఁ బండ్లనుఁ బూలఁ ♦ బండ్లు నొరయ
రెమ్మలఁ గదల్పఁ జిగురుల ♦ రేప ననిచె
నవ్వని ప్రియోపభుక్తావ ♦ యవవిశేష
యగుచుఁ బరిమళశ్రీ నించు ♦ మగువపోలె. ౩౪౮

కం॥ కాంచె మణిభూములను హరి, కాంచనరాజతమయప్ర ♦ కాండస్థలులన్
గాంచెద నిదె యదె హాటక, పాంచాలిక సీత ననుచుఁ♦బరు విడి యచటన్

శా॥ మందారాదిసురద్రుమాళు లొకటన్ ♦ మాకందముఖ్యాటవీ
సందోహంబులు నొంట లాంగలితతు ♦ ల్సొవర్ణరంభామహా
బృందంబు ల్వరజంబుజంభలముఖో ♦ ర్వీజప్రతానంబులున్
బొం దొప్పం దగు చాళ్ల నందుఁ బొసఁగున్ ♦ భూకాంత భాగ్యంబులై. ౩౫౦

తే॥ చంద్రకాంతాలవాలము♦ల్స్ఫాటికప్ర, ణాళికలు స్వర్ణవేదిక♦ల్నీలవజ్ర
పద్మరాగాదిక్ళ్ప్తోప♦భవనకేళి, శైలములు జాలు నందన♦శతముఁ దివియ. ౩౫౧

కం॥ అం దొక క్రీడాశైలము, ముందటి బంగారుకొండ♦మురు వెంచెడు వా
రిం దిట్టు సర్వసంపద, లం దిర మై దాని నాక♦లానిధి గాంచెన్. ౩౫౨

సీ॥ ఆగట్టుచఱియఁ బ్రి♦యాంకంబుగతిఁ బొల, యలుక నట్లుతొలంగి♦యరుగునదియు
వాలుగొమ్మలఁ గేళ్ల♦వలెనూని విందుల, నెఱిని భ్రమఁకులుమాన్ప♦నిలుచునదియు
మనసుమాద్రిఝురమ్ము♦మఱలించుకొనియొండు, దారి నెప్పటియిక్కఁ♦జేరునదియుఁ
కం॥ ప్రవ్వాల మణిరత్న♦భూషణస్ఫురణలఁ, గై సేసి వల్లభుఁ♦గదియు నదియు
ద్రిశైలని మేలి కొలఁకుల ♦ యందు నిరుగుఁ
సాధ్వుల పోలెఁ గు ♦ ముదినులబ్జి
సీ॥ తండ్రి! స వ్యకొనంగ మో ♦ ములు మొగుడ్చ
నీయండ గట్టేటి బోఁటినిఁ ♦ గని నతండు. ౩౫౩
దేవతాకార్యం ♦ బట్లయి స్ఫాటికకుట్టిమంబులన్
గీర్తింతు రని దుష్ట ఖల వి ♦ రాజితమౌక్తికసైకతంబులన్

బ్రాంగణహేమశాఖలఁ బ్ర ♦ వాళలతావలయంబులన్ సుధో
పాంగరసాఢ్యము ల్సరసు ♦ లప్పొలమందున మెప్పు సూపఁగన్. ౩౫౪

ఉ॥ చల్లని నీటి తేట యళి ♦ సంతతి పాట శుకాలి మాట సం
ఫుల్లసువర్ణపద్మవన ♦ భూమిచరత్కలహంసమండలీ
వేల్లితచాటుకారకృతి ♦ విశ్రుత మా ధ్వని బాట యొక్కఁడై
యుల్లసిలంగఁ జేసెఁ గపి ♦ యుల్లము నచ్చటున న్మనస్వినీ! ౩౫౫

తే॥ దాని కవ్వల నమృతోప ♦ మానతోయ
దానశీల విశాల స ♦ దాప్రసాద
లీల మానససరసి నే ♦ శ్రీల నేని
గేలిఁగొనఁ జాలు దీర్ఘిక ♦ చాల నెగడు. ౩౫౬

క॥ పావనజల దానిం గని, పావని తత్తీరశింశు♦పాతరుపంక్తిన్
గేవలస్వర్ణమయాకృతి, శ్రీవిలసితఁ గాంచి మెచ్చెఁ♦జిద్ఘనమూర్తీ! ౩౫౭

ఆ॥ అయ్యశోకవనిక♦కదె యర్థవత్త్వంబు, గూర్చునది ధ్వజములు♦గొడుగు లరుఁగు
లలరు లిగురుల గము♦లందలి ఖగములుఁ, గనకమయము లగుచుఁ♦గానిపింప.

క॥ ఆరసి యారసికుఁడు మన, సార సిరులు గూర్చు నిదియ♦యాఁ గాక మహా
శ్రీరమణీరమణీయము, శ్రీరమణి మహీజ నిలుచు♦సీమయుఁ గాఁగన్. ౩౫౯

తే॥ అనుచు నబ్బురపడుచుఁ దా♦నధిగమించె, నప్పొలమ్మున మే లగు♦నప్పదమ్ము
జానకీదేవిపదపద్మ♦సద్మసీమఁ, దన వివేచించు నెఱు లెల్లఁ♦దారసిల్ల. ౩౬౦

సీ॥ ఇదె తోఁచు నాతల్లి♦యిందిరారమణికిఁ, బ్రతిమూర్తి భూమిజ♦పద్మవదన
యేతెంచెదు యదృచ్ఛ♦నిట్టట్టు మెలఁగంగ, రామైకరసమనో♦రామ యగుచుఁ
జెట్టి రావణు వీడు♦జెనయు నేనియు నిది, రమ్య మా నేకాంత♦గమ్య మగుట
ద్విజబృందసేవిత♦దీర్ఘిక యిదియుఁ దా, నందియున్నది దీని♦యందమునకు
నిదిశివోదక యియ్యెడ♦నిర్థచరిత, సాంధ్యసముపాసనావిధు♦ల్జరుప నిష్ట
దైవతప్రార్థన మొనర్పఁ♦దనువు దొఱఁగ, నున్న నెమ్మెయినేని రా♦నుండఁగలద

క॥ అని తలఁచుచు నచ్చోటునఁ, దన దృష్టులు నిగుడఁజేసి♦తలకొను నబ్రిం బ
బునఁ జైత్యప్రాసాదం, బును గాంచి యతండు పొగడ♦మొనకొనె నగజాత

సీ॥ బ్రహ్మాండమునఁ గల♦బహురత్నముల కెళ, ల్గనినప్డె కొని యుంచఁ♦గాని
వైజయంతమ్మున♦వలని మేళ్లమ్మెయి, నెదఁజేర్చి పరిపూర♦ణేచ్ఛదే ౩౬౨
పుష్పకమ్మున పొలు♦పున మించు తావుల, మొగకొను సిరులెల్ల♦న
రహి లేత ముదు రని♦రంగు సింగారమ్ముఁ, గనఁగల్గు తననేర్పి♦నను చున్. ౩౬౩

దీని సృజియించి నప్పుడే♦దేవుఁ డనిన, నతఁ డసురశిల్పి సురశిల్పి♦యనఁగ నేల
కట్టుగట్టుచునున్నది♦కాంచువారి, కనుల కియ్యది యబ్బంగి♦గాన మెందు. ౩౬౩

క॥ పవడపుదూలముల మణి, ప్రవర స్తంభముల మేలి♦పటికపు మెట్లన్
సవిధశ్రీ నిది కైలా, సవిధంబున దివిని వ్రాయు♦సరణిఁ దనర్చున్. ౩౬౪

క॥ ఇన్నగరిన యని శాక మ, రున్నగరిన యేని నెఱి ని♦రూఢికి సరి సం
పన్నతఁ బూనగు విమానం, బున్నదె పలుకులును మదియు♦నొరయునె దీనిన్.

ఆ॥ అనుచు మెచ్చుకొనుచు♦నల్లంతఁ జను నంతఁ, గనకకాంతి మేనఁ♦గ్రమ్ముకొనిన
శాఖితతికిఁ దనదు♦సాధర్మ్య మొదవె నిం, దనుచు నొక్క తరువు♦నధిగమించి.

చ॥ అటఁ బొడఁగాంచె మారుతి మ ♦ హారజతద్యుతిమగ్ననాకమున్
నటదురుచంచరీకము ద్వి ♦ జాశ్రియణాప్తగుణాతిరేకమున్
ఘటితసమూలపుష్పదళ ♦ కాండసమృద్ధిపరీతలోకమున్
స్ఫుటదృగపాస్తశోకము న ♦ శోకముఁ బుణ్యదశావిపాకమున్. ౩౬౭

తే॥ ఉద్యదరుణాగ్రిసరమండ ♦ లీద్యుతితతి
యఖిలహారిదంతరస్థలి ♦ నలముపగిదిఁ
గనకశింశుపావని నెల్లఁ ♦ గ్రమ్మఁజాలి
దాని సిరి యంత కంతకుఁ ♦ దరము మీఱి. ౩౬౮

క॥ చిత్త మొక వింతతనువున, మత్తత్వముఁ గాంచి ధృతిస♦మాహిత మగుచున్
హత్తికొన మ్రానినల వగు, నత్తలమున శ్రీవనాంత♦రాంతరసీమన్. ౩౬౯

క॥ అనలజ్వాలావృత మై, పెనుబాముల కాఁపు గనిన♦పీనశ్రీవ్య
క్తి నెఱి న్దోఁచు సుధాఘటి, యన నేతరసాధ్యతాని♦యంత్రిత యగుచున్.

—♦ ఆంజనేయుఁడు సీతాదేవిని సందర్శించుట. ♦—

సీ॥ ఉపవాసములఁ గృస్సి♦యునుఁ జంద్రరేఖ య, ట్లతిదర్శనీయత్వ♦మందు నదియు
నొంటిమైఁ జిక్కియు♦నుదితానుభావల, త్కుమ్మలఁ బెక్కుబలగంబు♦గలుగు నదియు
విభావసు జ్వాల♦యనఁ దగి రాక్షసీ, ధూమజాలావృతిఁ♦దోఁచు నదియుఁ
చక్కటి వెల♦పెద్దమానికము నా, మాపు గట్టియు దీప్తి♦మలయునదియుఁ

నా... ంధవు నెడసి స ♦ పంకయు నన
నీయండ... నగు పద్మిని ♦ లాగున వగఁ
దేవతాకార... యట్టిదియు నా ♦ దివ్యమూర్తి
గీర్తింతు రని... వోలెఁ బ్రి ♦ త్యక్షమయ్యె. ౩౭౧

తే॥ అధరపల్లవమును మాయు ♦ నట్టు సేయ
నిగుడు నిట్టూర్పుగాడ్పుల ♦ నెఱిని నెదిరి
గొడవ తనవారి మేలు బే ♦ ర్కొనఁగఁజాలు
మానవతిఁ గాంచె వాఁడు స ♦ న్మాన్యచరిత. ౩౨౨

తే॥ పాప మెద నిడ్డ చెట్టపైఁ ♦ బరఁగు నలుక
చిచ్చు నిట్టూర్పు లెగయింపఁ ♦ గ్రిచ్చుకొనిన
నవ్వనస్థలి మండెడు ♦ ననుచు నార్ప
నెంచి కన్నీటిధారలఁ ♦ నించుదాని. ౩౨౩

తే॥ ప్రియజనముఁ బాసి రక్కసి ♦ పిండు పొదువ
వృకతతికాక్రాంత యగు మృగి ♦ విధము దోఁప
నల్ల బిత్తరి చూపుల ♦ నెల్ల దెసలఁ
గాంచు నమ్మహాసాధ్విని ♦ గాంచె నతఁడు. ౩౨౪

వ॥ మఱియు నమ్మంగళాంగి శార్దూలంబు పొదరు చెంగటి కురంగియుం బోలె భీత భీతయై ధూమజాలముంబోని శోకనివహంబు పొదువ మఱుంగువడిన యనలశిఖ భాతి ననతిస్ఫురణవిరాజమాన యై సంశ్రితవ్రత యగు తాపసాంగనవిధంబున వృక్షమూలతలాసీన యై సంస్కారంబుతోడి వియోగంబున నర్థాంతరగత యగు వాక్కుకరణి సామర్థ్యవిహీన యై యనధికారనిగ్రహంబున నయథావిధామ్నాత యగు త్రియీవిద్యపోలిక శిథిలానుభావ యై వృత్త్యంతరాంతరిత యగు చిత్కల తెఱంగున నవిభావ్యమాన యై సర్వలోకసమ్మత యయ్యు మేఘరేఖావృత యగు పూర్ణచంద్రప్రభ యట్టు లనిర్దేశ్యప్రకాశ యై యపవాదోపహత యగు కీర్తివిధంబున సందిగ్ధ యగు స్మృతిరీతి నిపతిత యగు సమృద్ధిసరణి వ్యాహత యగు శ్రద్ధలాగునఁ బ్రతిహత యైన యాశగమనిక సోపసర్గ యగు సిద్ధిసర్గంబున సకలుష యగు బుద్ధితీరున సంస్క్రియాలోపంబున మాలిన్యయుక్త యగుటఁ బంకంబుఁ బాయక మండనార్హ యయ్యు నమండిత యై యభిరామపద లగు వాఙ్మానసవృత్తులకు నేకతానత్వంబునఁ గైవల్యంబు సంపాదించుచుఁ బతిదేవతా వతంసం బనఁగ నిమ్మహితనయయే యను నిట్టి ప్రశ్నోత్తరంబుల శ్రుతా ప్రమాణవిహితంబులు గావించుచు జనకదుహిత భూజాత సీత యని ౩౫౨
బునం దలంచు జనంబునకు నపూర్వసాక్షాత్కారంబున కలిమి నాపద
జాలియు నిజాపన్నత్వంబునం జాలిఁజూపుచున్న యన్నలినాక్షిం దన
లక్ష్మిం బోలె నయనాతిథి నొనరించి యయ్యనిలతనయుండు తనసుచుఁ. ౩౫౩

క॥ ధన్యుఁడ నైతిని శ్రీయు మ, నన్యాప్యం బందఁ గలిగె♦నవనిజఁ గనె స
న్మాన్యుఁడు వీఁడన నెగడఁగ, జన్యంతరతపము లెంత♦చాలినయవియో. ౩౨౬

సీ॥ కోమలాంగి వినీల♦కుంతల బింబోష్ఠి, తనుమధ్య శుభపయో♦ధర మృగాక్షి
చాంపేయనాస కాం♦చనగౌరి చంద్రాస్య, సుదతి రేఖాత్రయ♦శోభితగళ
లలితసుభ్రూవల్లి♦లావణ్యశేవధి, మానిని సుచరిత్రి♦మంజువాణి
నిమ్ననాభి విలాస♦నిష్ఠిత కలహంస, యాన హ్రీమతి మహా♦వ్యక్తి మహిత
యనుచు నన్నుఁ బనుచు ♦ నపుడు రాముఁడు సెప్పె
నేమి లక్షణంబు ♦ లింతిఁ గూర్చి
యనఘు యీమెవలని ♦ వయ్యె నయ్యవి యెల్ల
నట్లుగాన భూజ ♦ యగుట నిజము. ౩౨౭

క॥ ఏమేమి భూషణంబుల, రాముఁడు వర్ణించె నిపుడు♦రామ యొడలునం
దామెయి నయ్యవి ననిచె, న్దా మును ముడి వైచి యిచ్చిన♦నాణెము లెడగాఁ.

ఆ॥ అబల మేని మేలి ♦ యంశుకం బప్పటి
తునుక దక్కఁ గడమ ♦ దోఁపఁజేయు
నదియుఁ దాను నొక్కఁ ♦ డగుట మాసియుఁ బైఁడి
వన్నె వెలకు మించు ♦ చిన్నె లమర. ౩౨౯

క॥ కాన ధరాసుత యీయమ, గాని యొకం డనఁగరాదు♦కల్యాణగుణ
శ్రీనిత్యయౌవనప్రీతి, భానవరూపర్ధి లిందె♦భాసిలుచుంటఁ. ౩౩౦

తే॥ తరుణి నిశ్శ్వాసబహుళ యై♦యురగివోలెఁ, జకితదృష్టిప్రసక్తి భూ♦జనితవోలె
విరహితసుషిప్తి యై మహా♦స్సరసవోలె, నొప్పెడు నిజానుభావంబు♦లుప్పతిల్ల.

ఆ॥ సిగ్గు వెల్లిగొనఁగఁ ♦ జిన్నవోయిన మోము, తన యవజ్ఞతోడి ♦ దశను నొడువ
నొప్పు దసురకుజుని ♦ యొరయిక రోహిణి; సరణి రమణి రామ ♦ చంద్రుఁ బాసి.

తే॥ శ్రోణితలగత యై నీల ♦ వేణి వేణి, నీలనాగాభ యది మేలి ♦ నెఱిఁ దనర్చు
నీరదాపాయమున తఱిఁ ♦ నెలవుకొనిన, పర్వతప్రాంతమహి వన ♦ పంక్తివోలె.

అలుకనిట్టూర్పుబుస లివి ♦ యభ్యసింపఁ
జపతిఁ డొనరింపఁడే ♦ బానిసంబు
జెఱిఁ గొన్నయది మొద ♦ లింతదనుక
నీయన్నాయింపకున్నదో ♦ యిప్పరంబు. ౩౩౧

సీ॥ దేవతాకృతిఁ బోల్ప♦నెమ్మొగం బొప్ప కే,యొప్పుచున్నది యున్న♦యొప్పిదమునఁ
గీర్తింతు రసమేలి♦తోడవు సత్ప్రభ దెస, ల్పాలించుఁ దిమిరమ్ముఁ♦బాపఁజాలి

కల్యాణదాయిను♦ల్కనుబొమ ల్తల నెత్తి,కనునంత జయలక్ష్మి నఁ♦గవియఁజేయు
భూమిచక్రము పోలు♦పున మించు సుశ్రోణి, కటిభాగమున మేల్మి♦గాదు పొగడ
రామమన్మథు రతి హరి♦రమయుఁ గాక, ముజ్జగంబులఁ గొండొక♦మోహనాంగి
కలదె యిట్టిది దక్క యి క్కలికి కొఱకె, పరితపించుచున్నాఁడు♦భానుకులుఁడు.

తే॥ ఈత్రిభువనైకలక్ష్మితో ♦ నెనసి రాగ
రాజ్య మెడసియుఁ జొరఁబాఱె ♦ రాము డడవి
నిప్పు డిమ్మయి యీయమ ♦ ముప్పు నంద
ముజ్జగమ్ములతోఁ గూడ ♦ మునిఁగె నతఁడు. ౩౮౬

క॥ రాజ్య మొకటం ద్రిలోకీ, పూజ్య నొకట సీతఁ దలఁపఁ ♦ బోలునె యొక్కం
డీ జ్యాపుత్రిక కళకు సు, రేజ్యన కేసియుఁ దరంబె ♦ యేర్పఱుపంగన్. ౩౮౭

తే॥ ఎట్లు జీవించెనో రాముఁ♦డెఱుక పొడమ, దిమ్మహాభాగ నెడఁబాసి♦యింతవట్టు
సారిది నోమిన నోముల♦చొప్పరయఁగ, రామిఁ గీడు మే లిది యన♦రాదు నిజము.

క॥ ఒండొరులపట్లఁ గూర్ముల, ఖండములై యుండ నిట్టి ♦ కడగం డ్లొదవెన్
మొండివడి యాసముడి యొ, క్కం డుసుఱుల నిలువరించెఁ ♦ గా కన్యంబే.

తే॥ బాలపల్లవమిషమునఁ ♦ బడఁతి శోక
వహ్ని నిట్టూర్పు లెగయంగఁ ♦ బ్రజ్వలించి
యియ్యుపవనంబు గాల్చెడు ♦ నేమొ యనఁగఁ
గనకరుచికీల లెల్లెడఁ గవియఁ ♦ బాఱె. ౩౯౦

తే॥ అబల బలువెతలకు నోర్వ ♦ దనుచుఁ గరుణ
సాధ్వి హింసింతు రని యాన్య ♦ శంస్యమునను
బత్తి విడఁగంటి నని శోక ♦ భరమునను మ
నఃప్రియ యటంచుఁ దవులున ♦ నవయు నతఁడు. ౩౯౧

తే॥ రాముఁ డన సర్వజగదభి ♦ రాముఁ డతఁడు
రామ యట్టిద యీయమ ♦ రామణీయ
కమున గొనముల నిలయంబు ♦ కలిమిఁ జెలిమి
వీరిఁ బోలంగ నేర రె ♦ వ్వారు నెందు. ౩౯౨

క॥ ప్రత్యంగసౌష్ఠవంబున, ప్రత్యయ మే తెలుపు వీరి ♦ పతిపత్నీత్వా
న్నత్యము లే దన్యులకు ని, రత్యయసౌభాగ్యసంప ♦ దాఢ్యత ననుచున్. ౩౯౩

సీ॥ సర్వభూతముల కా♦శ్రయ భూత క్షమ తానె, కడుపార నే సాధ్విఁ♦గాంచెఁ దొలుత
సకలజ్ఞుఁ డన నొప్పు♦జనకమహీంద్రుండు, పెనిచె నే సుచరిత్రిఁ♦బ్రేమ మీఱ
గాదిలికోడ లే♦కల్యాణి దశరథా, ధీశున కమరాల♦యేశసఖున
కేసతీతిలక మ♦య్యినవంశమణి రామ, చంద్రుని రాణివా♦సమ్ము బలఁగ
మమ్మహానుభావ♦యద్దేవి యాయమ్మ, యాత్రిలోకపూజ్య♦యకట యసుర
బారిఁబడి కృశింపఁ♦బనిచె ని ట్లీవిధి, యెవరి నెట్లు సేయుఁ♦డిజ్జగమున. ౩౯౪

ఉ॥ పుట్టె నయోనిజాత యయి ♦ భూసుత సీత యనంగ రాముఁ జే
పట్టెఁ బతివ్రతాచరణ ♦ భాసుర యై గొడవ ల్దలంపకే
మెట్టె నరణ్యభూమిఁ బ్రియు ♦ మేలిగొనమ్ములకల్మి కల్మిగా
నెట్టనఁ గాంచెఁ దృప్తిఁ దుది ♦ నీచునిచేఁ గనె నిట్టి యాతనన్. ౩౯౫

సీ॥ కుసుమకోమలగాత్రి♦కోసలేంద్రుని కూర్మి, కోడలు మెకములఁ♦గూడి మెలఁగె
రామచంద్రునిపాలి♦రాణివాసములక్ష్మి, రాక్షసస్త్రీల రా♦రాపుఁ గాంచెఁ
బుట్టుభోగంబులఁ♦బొలుపొందు భూపుత్రి, మొనకొని ఫలమూల♦ములను నమలె
విద్యతో జనకుని♦వెరవుమైఁ బెరిగిన, విదుషి వీనుల వినె♦వేఁడినుడులు
జీవనాళము బంధమ్ము♦చిత్తసుమము, సిరికి సుచరిత్రలకు నెందుఁ♦జెలువుఁ డగుటఁ
జెలువ జీవించె నింతకు♦సిద్ధ మిట్లు, సేయు వ్రతనిష్ఠ విభు చెంతఁ♦జేర్పకున్నె.

ఉ॥ ఒండెడ నుండియేనియు న ♦ నుద్యత యై యుపవాసఖిన్న యై
పండువు వీడి నిద్దురకుఁ ♦ బాసి తలంగక రామనామ మొ
క్కండు మనుప్రకాండ మెఱు ♦ కం జపియించుచు నేకలక్ష్య మా
నిండుమనంబుతోఁ జెనుచు ♦ నిష్ఠ గరిష్ఠకు నీమె కే తగున్. ౩౯౬

ఉ॥ వేవురు చెట్టరక్కసులు ♦ వేడబముల ల్పచరించుచు న్దెస
ల్గావిరి గప్పఁ గ్రిమ్ముకొని ♦ కాపథము ల్పెలకొల్ప వెక్కసం
బౌ వెత పాల్పడ న్విసివి ♦ యామెడ మో మిడ కే క్షమన్ క్షమా
దేవినిఁ బోలి రాముని ర ♦ తి న్భజియించెడు సాధ్వి యొప్పదే. ౩౯౭

మ॥ అలక ల్నెమ్మొగమందు వ్రాలఁ గఠినం ♦ బై వేణి యట్లుండ ని
మ్ములు సొమ్ము ల్స్థితి వీడ మేని రుచుల ♦ న్మొల్లంబుగా మాపుడే
కలఁప జ్వెన్నటి యూరు పే రిది యనం ♦ గా రాక యిట్లున్న నీ
కలికిం బోలఁ గలారె హెచ్చు లటుపోఁ ♦ గా నచ్చర ల్గిచ్చరల్. ౩౯౯

ఉ॥ పువ్వులు లేని తీవె గతిఁ ♦ బోఁడిమి దక్కిన చుక్కపద్ధతి
న్దవ్వుల యూథము న్విడిచి ♦ తార్కొను బొబ్బమెకంబు ధాటికి

న్నివ్వేఱఁ గంది చిక్కువడి ♦ నిల్చు కరేణుకభాతి నిప్పుడీ
జవ్వని యిట్టు లుండెఁ బతి ♦ సంగతి నెట్టి ప్రకాశ మొందునో. ౪౦౦

తే॥ గద్గదిక నేటుకొనకొన్న ♦ గళరవమున, రామ రామాయటంచు వా♦రకజపించుఁ
దుప్పువట్టిన తీఁగెలఁ ♦ దొడును పలుకు, వలుకు పీణియఁ బోలి యి♦ప్పద్మనయన.

తే॥ తరుణి నిరత శోకవాసవ్రి ♦ తమునఁ గుస్సి
యెట్లు జీవించియుండెనో ♦ యెఱుకపడదు
రామనామామృతంబున ♦ రహిఁ దలిర్చు
దాని మహిమాతిశయ మెంత ♦ దనుకఁ గలదొ. ౪౦౨

క॥ సతి శోకసాగరోర్ముల, గతి సెడి యిట్టట్టు దొట్రు ♦ గను నౌకక్రియన్
నత యై దైవసహాయా, త్యతివేలావేక్ష నిట్టు ♦ లడరెడు నకటా. ౪౦౩

తే॥ ఎన్ని యిక్కట్టులం బడె ♦ నినకులీనుఁ, డిమ్మహాదేవి నెఱి మది ♦ నెంచి యెంచి
యతని యనుభావమునకుఁ దో♦డబ్జవదన, శీల మెలయించె నిరువుర♦జీవితముల.

తే॥ ఆఁకపడు రక్కసులఁ దుంచె♦నాకబంధుఁ, గెడపె వాలి దవజ్వాలి♦గీ టడంచెఁ
గీశబలములఁ గూర్చె సు♦గ్రీవుఁ బట్టఁ, భద్రు నొనరించి శ్రీరామ♦భద్రుఁ డలరి.

క॥ ఈతన్వి వెదకఁ గపిబల, మాతఁడు వనుపంగ రాము♦ననుమతి నం దే
నాతతసుకృతశ్రీ, తఱి, సీతలముం జూపఁ గంటి ♦ నెంతలు పడినన్. ౪౦౬

ఆ॥ జంటఁ బాసి యడలు ♦ చక్రవాకినిఁ బోలు, సీయనింద్యచరిత ♦ కినకులీను
మేలి వలను దెలిపి♦జాలి పోకార్చి చో, ప్పడిన రాక ఫలము ♦ వడయువాఁడ.

క॥ వేలుపుల యనుగ్రహమునఁ, జాలితి నిందనుక నింక ♦ జానగు కృతి నే
లీల జయము పాల్పడు నా, కీలున కగు వర్తనమునఁ♦గీలింతు మదిన్. ౪౦౮

క॥ ఆర్తి నెడలించి మే లగు, వార్త విభున కెఱుకసేసి ♦ వారలఁ గొని యి
మ్మార్తుఱఁ గెడపి శుభాయతిఁ, గీర్తిం గని మనుదు రామ ♦ కింకరుఁడనఁగన్.

చ॥ మొలకలు వాఱు నవ్వులకు ♦ మూలపదం బయి మోము చెల్వ మి
మ్ములఁ నలరార రాముఘను ♦ మ్రోలఁ దటిల్లతవోలె స్వీయదృ
ష్టులు శుభవృష్టిఁ గూర్ప నిల ♦ శుద్ధమనస్కతఁ బ్రోఁచు వేడ్క మై
మెలఁగెడు సీయనుం గనెడు ♦ మేలున నా కను లొప్పఁ గావుతన్. ౪౧౦

ఆ॥ అనుచుఁ బొనరుపడిన♦యానంద సాగర, మందు మునిఁగి తేలి♦యనఘుఁ డామె
కెఱఁగి రాముఁ దలఁచి♦యిత్థపుణ్యా మశోక, విత్త మాయశోక♦వృక్షమునను.

క॥ పర్ణనిలీనుం డగుచు సు, పర్ణనిభుం డొదిఁగి యుండె ♦ భావికలన మే
ధార్ణవ మతఁ డారయుచు న, పర్ణా! వింటివె చరిత్ర ♦ బహుళార్థంబుల్.

ఆ॥ అనిన సంతసిల్లి ♦ యభవ నీకృపకల్మి, వింటి నింతవట్టు ♦ వీనులలరఁ
గడమ వినెడు వేడ్కఁ♦దొడరెడు నెమ్మన, మనుచు గౌరి విభుని♦నడుగుటయును.

ఉ॥ యోగవియోగదూరగుణ ♦ యోగినియోగిధృతప్రచార దు
ర్యోగసుయోగహృజ్జన స ♦ యుక్తవసమత్వమతావతార ని
త్యాగమతత్త్వసారమహి ♦ తావ్యయసంపదుదార సర్వసం
త్యాగకృదాఢ్య ధీర భవ ♦ తాపనివారణభారతత్పరా! ౪౧౪

క॥ చిద్యోగవిలసితాత్మాఽవిద్యోత్పాదనవిధాన ♦ విహితనిజాత్మా!
సద్యోముక్తిప్రదసం, విద్యోపాసంవిదితవి ♦ విక్తమహాత్మా! ౪౧౫

ధోధకము॥ పావనతాఽవన ♦ భాసురచిత్తా
భావిహితాంచిత ♦ భవ్యమహత్త్వా
నావధిసంసర ♦ ణాంబుధివిత్తా
నావరణాత్తకృ ♦ తాభయదత్తా. ౪౧౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందు
సుందరకాండంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## సుందర కాండము.

---

### ద్వితీయాశ్వాసము.

---


యుతసాక్షాత్కృతి ల
క్ష్మీయుతమానజనలబ్ధ ♦ చింతితతాచి
ద్భాయస్త్వకలితనిత్య
త్వాయత్తసుఖాత్మతామ ♦ హామహిమాఢ్యా! ౧

ఆ॥ అవధరింపు మగజ♦యమ్మయి వేఁడిన, వేడ్క దనర లోక♦విభుఁడు శివుఁడు
పలుకఁదొడరెఁ బలుకు♦పలుకున నమృతంబు, తొనుక లక్ష్యశుద్ధి♦తొంగలింప.

చ॥ వనితరో! వింటివే భువన ♦ వందిత భూసుత కానరామిఁ బా
వని పురి నట్లు వీడఁగని ♦ వారక యెల్లతలంబుల న్మహా
వనమునఁ గాంచుచు న్నడచి ♦ వచ్చిన యప్పటి కించుకంత యా
మిని పరిశిష్ట యై నిలిచి ♦ మేలిమి సూపె నతండు మెచ్చఁగన్. 3

ఆ॥ కువలయప్రియుండు♦కూర్మి నిర్మలుఁ డయి, తఱినిఁ దోడు సూపి♦తద్దఁ దెరలి
యాకసంబు సెజ్జ♦యవ్వలికడ నట్టు, లొదుఁగఁబాఱె నిదుర♦కొలసె ననఁగ. ౪

క॥ తన చల్లని రశ్ముల హాను, మనికి న్సాహాయ్య మెల్ల♦మనికి మెలఁగు న
య్యనువున నొనర్చె వేఁబో, కనుఁ బవనున కొసఁగె యామి♦కప్రతినిధి యై. ౫

—♦ రావణుఁడు దుస్స్వప్నముఁ గాంచుట. ♦—

తే॥ అయ్యపరాత్రమునను ష ♦ డంగవేద
విదులు విహితాధ్వరులును సం ♦ విష్టబుద్ధు
లగుచు బ్రహ్మరక్షస్సులు ♦ స్వాంకసదుల
కమర బోధించు బ్రహ్మఘో ♦ షములు పొదలె. ౬

క॥ సీతం దెచ్చినయది మొద, లాతపనకులీనుఁ డెన్నఁ♦డరుదెంచునొ యం
చాతతమతిఁ గను రావణుఁ, డాత్రి శయనించి స్వప్న♦మనుగతిఁ గనియెన్. ౭

ఆ॥ శ్రోత్రసుఖము లగుచు♦సారిది మంగళవాద్య, శబ్దములు సెలంగ♦సారబలుఁడు
వాఁడు మేలుకాంచె♦వానరు నొక్కని, రామదూతఁ గని వి♦శాళి మించి. ౮

క॥ తా నిష్టదేవతాను, ధ్యానం బొనరించి సెజ్జఁ♦దలఁగి మనం బా
భూనందన దెసఁ బొదలఁగ, మానితలక్ష్మీవిలాస♦మహితుం డగుచున్. ౯

ఉ॥ ఆతురు నట్టు లాతఁడు మ ♦ దాతను శేషము స్వీయవేషమున్
బాతరలాడుచుం దగిన ♦ పద్ధతిమై సవరించి పొల్పునం
బోతర మొప్ప దివ్యమణి ♦ భూషణలలీలకాలచంచలా
ద్యోతము లావహింపఁ జనె ♦ యుక్త మటంచు నశోకలక్ష్ముఁడై. ౧౦

—♦ రావణుఁడు దుస్స్వప్నముం గని సీత దరియం జేరుట. ♦—

క॥ మణికాంచనగోపురతో, రణవేదులు గడచి వల్గు♦రణనాధ్యవయో
గణసర్వర్తుసుమఫలాం, గణ మయ్యుపవనము త్రోసె♦కనుకనిఁ బెరసెన్. ౧౧

తే॥ నందనవనంబు గనఁబోవు♦నాకలోక, నాథు దేవగంధర్వక♦న్యాచయంబు
పోల్కిఁ బౌలస్త్యు వలగొని♦పొరసె నట్టిఁ, డంగనాశత మంచితా♦హార్యకంబు.

తే॥ ఇందుబింబప్రతీకాశ♦మీశతాంగ, మంచితసువర్ణదండము♦నైన ఛత్ర
మవధరించెను రాజహం♦సాభిజాత్య, మహితయాన యొకర్తుక♦మమత నెగడ.

సీ॥ అమృత పూర్ణఘటంబు♦లంది కుంభస్తను, ల్మేనుల రుచుల యె♦మ్మెల భరింపఁ
గాంచనకరదీపి♦కలఁ గొంచుఁ జంద్రాస్య, లెలనగవుల వెన్నె♦లల సృజింప
వింజామరలఁ బూని♦వికచాబ్జనేత్రలు, తనుపాళులు పరార్థ్య♦తల గణింప
మండలాగ్రము లెత్తి♦మదహస్తియానలు, మగపాడిసిరుల సం♦పదల నింప
ముందు వెనుకయుఁ దోస్తోడ ♦ మొనసి దనుజ
ప్రభుని యమరేంద్రవిభవంబు ♦ వెల్లడింపఁ
జాలి యాతనిదెసఁ గూర్మి ♦ చనవు వెలయ
మగువ లుద్యానభూమికై ♦ మలసి రగజ. ౧౪

తే॥ ఇష్టమధునకు వానికి♦నించుమధువు, నించి ధరియించె నొక్కతె♦యించుఁబోఁడి
రత్నకలశిక నుదితాను♦రాగ లుభయ, పరిమళస్ఫూర్తు లాశలఁ♦బ్రబ్బికొనఁగ.

మ॥ దనుజాధీశ్వరు వెంబడించి యువరో ♦ ధస్త్రీమణు ల్పొల్చి రా
ఘనుని న్ద్రోణాను మించు లట్టు లుదితాం ♦ గశ్రీలు సంభోగచి
హ్నానిరూఢి న్నవికాస లై సుభగతా ♦ ఖ్యానంబున న్మేల్మి నూ
ప నితాంతప్రియతోపలబ్ధగుణాలు ♦ బ్ధత్వంబు చెన్నొందఁగన్. ౧౬

క॥ కామపరాధీనుఁడు వాఁ, డామెయి మహితాంగనాళి ♦ తానుగతుండై
రాముసతిఁ గొలువఁ బ్రమదా, రామస్థలిఁ జేరఁ గనె మ♦రాళీగమనా! ౧౭

శా॥ ప్రాంచ న్నూపురకాంచికానినదము ♦ ల్ప్రఖ్యాతలీలాగతు
ల్మించుంబోఁడులతోడి దా మెలపున ♦ న్మే లెంచ నాలించి యా
పంచాస్యప్రతిమానవిక్రముఁడు సం ♦ ప్రాప్త న్మహావైభవ న్గ్
గాంచె న్ప్రవణు రత్నదీపశతల ♦ త్యుస్ఫారకోద్భాసునిన్. ౧౮

సీ॥ చూచిచూడఁగరాని♦సొబగుఁ డంచు నికామ, కామదర్పంబున♦గతి వచింప
నెంచియెంచఁగరాని ♦ యుత్థతేజుం డని, పౌరుషస్ఫురితము♦ల్ప్రణుతిఁ గూర్పఁ
బోల్చిపోల్పఁగరాని♦పొడవునఁ గలఁ డని, సామ్రాజ్యవిభవంబు ♦ సన్నసేయ
నాడియాడఁగరాని♦యలఘుఁ డీతండని, యాభిజాత్యంబు మే ♦ లనుగణింప.
ద్వారదేశానుగతుఁ డయి ♦ తారసిల్లు
నతనిఁ గని రావణుండె యూఁ ♦ ననుచునొదిఁగి
యుండెఁ గపివీరుఁ డమితబ ♦ లుండొకింత
తలఁకు తలమెత్తఁ గుటిలకుం ♦ తలకలాప! ౧౯

తే॥ హనుమ పత్రవిలీనుఁ డై♦యట్టులుండి, తలఁచె దుర్మదుఁ డీతండు♦దఱియవచ్చె
నిమ్మహారాజ్ఞి నియ్యెడ♦నెల్లవృత్త, మెఱిఁగి యవ్వాలికర్జ మూ♦హింతు ననుచు.

—♦ రావణుని రాక నెఱిఁగి సీత రామధ్యానమునఁ జలింపకుండుట ♦—

క॥ అల్లంతట దొరకొను నా, ప్రల్లదుని దురంత మెగసి ♦ పాటరసి కదుల్
దల్లడిలెఁ బ్రవాతస్థలి, నల్లాడెడుకదళి యట్టు ♦ లాసతి తోడ్తోన్. ౨౧

తే॥ రూపయౌవనసంపన్ని ♦ రూఢి తనరఁ
బూసి త్రాడి కట్టి పొలుపునఁ ♦ బొదలి త్రాడరు
మొఱ కతనిచేతఁ దన కెద్ది ♦ మూఁడునొక్కొ
యనుచు సుచరిత్ర కడు దుఃఖి ♦ తాత్మ యగుచు. ౨౨

ఉ॥ రామునిఁ జిత్తదుర్గమున ♦ రక్తిమెయి న్బలుకాఁపు సేసి యా
రామమహీజము ల్తనదు ♦ గాయిడిఁ బాపఁగఁ దోడునీడలుం
గా మహిళాశిరోమణి ని ♦ కామధృతిశ్రిత యై స్తనోదరో
ద్దామనిధి న్భుజోగ్రస్మృతి ♦ దాఁచి వివేచితతత్త్వసార యై. ౨౩

క॥ రామకథామృతసేవ ని, రామయ యై యేకలక్ష్య ♦ యా వృత్తిమహా
శ్రీమహిత యగుచుఁ దనరఁగ, నామహిసుతఁ జేరఁ బాఱి ♦ యసురయుఁ బ్రీతిన్.

— ♦ రావణుఁడు సీతాదేవిని సందర్శించుట ♦ —

తే॥ పొనరు సంకల్పహయములఁ ♦ బూన్చి యిడిన
ఘనమనోరథముల నను ♦ క్షణము రాజ
సింహు విదితాత్ము రామునిఁ ♦ జేర నరుగు
నప్పతివ్రతఁ గాంచె దై ♦ త్యప్రభుండు. ౨౪

క॥ రూపునఁ బ్రాయంబున నని, రూపిత తేజమున వ్రతని ♦ రూఢి నధృష్య
శ్రీపూరిత యై కవివా, గ్వ్యాపారము నట్టు లామె ♦ వలను దలిర్పన్. ౨౫

సీ॥ రామనామము పంజ♦రము ముద్దుమో మల్ల, తొఁగ సంగడీని సై♦దో డనంగ
ననఘ నిష్ఠారసం♦హత వేణి విరిబోణి, శేషశాయి యురమ్ము♦భూష యనఁగ
సౌవర్ణపద్మాంక♦సత్కాంతిపూరమ్ము, పద్మవాసిని యామె♦భద్ర మనఁగ
లలితసుభ్రూధను♦ర్లగ్నదృగ్భరపంక్తి, స్మరజనయిత్రి యా♦సాధ్వి యనఁగఁ
బరఁగియు నభాగ్య కెలని సం ♦ పదయుఁబోలె
నందరా క్షస్త్రీలు న ♦ ధ్యాత్మశక్తి
యట్టు లేర్పడఁబోక త ♦ న్నలఁతి సేయు
నమ్మహితఁ గాంచి కానని ♦ యట్టిఁ డగుచు. ౨౬

వ॥ మఱియు నక్కోమలాంగి దుష్టరాక్షసీమధ్యగత యగుట బలుశత్రుల కాఁపున మఱుంగుపడియున్న పెన్నిధి పద్య నవిద్యోతమాన యై యెల్లెడల వృకావలి పొదువఁ దెఱంగుమాలిన కురంగియుంబోలె దీనానన యై ప్రబలోర్మి యగు దుఃఖంబుపేరి మహార్ణవంబు నడిమివాఁకం బడి తెరలిన నౌకపోలిక సమాలోల వృత్తి యై నియతియోగంబునకలిమి విచ్ఛిన్న యై పడిన వనస్పతిశాఖవిధంబున నలకశిఖోపలక్షిత యగుచు నసంవృతస్థలాసీన యై నేలం జుట్ట చుట్టుకొని బుస కొట్టుచున్న పన్నగరాజభామిని నెన్నుకొను విన్ననువున నిట్టూర్పు లెడలించుచు మండనార్హ యయ్యు నమండిత యై మలీమసవేషదూషితంబులగు నవయవంబుల విడంబనంబునఁ బంకదిగ్ధ యగు మృణాళికఁ బ్రణాళిక బ్రకాశింపక ప్రకాశించుచుఁ

గొలని కెలను వాసి స్థలాంతరంబున నెండ వేఁడిమిఁ బోఁడిమిఁ దక్కి వాడఁబాఱిన కమలిని తీరునఁ దీరుదప్పి పర్ణకమలంబులు సెదర నళులు వదర నంచలు బెదర హస్తిహస్తాకృష్ట యై యాకులపడు పొందమ్మితీఁగె చందమ్మున నందమ్ముఁ బాసి ప్రతిపత్త్వాళశీలుని విద్యలాగున శుష్కించి రామానువ్రతవృత్తి యై తదేకధ్యాన పరాయణత్వంబున నున్న తనకు ముముక్షునకు నట్టు లేమి కర్మబంధంబుకతంబున దుఃఖాంతంబు పనుపడకుండెనో యని శోకావేశంబున నశ్రుమోక్షణం బొనరిం చుచు సద్ధర్మాచారసంపత్తి గల సత్కులంబునం బుట్టి యుత్తమస్థలంబున మెట్టి వన్నె వాసిఁ గనిన యన్నుమిన్న విధివశంబున దుష్కులంబు తలంబునం బడి గతిసెడి బన్నంబుగన్న తెన్నున మొక్కలం బగు కలలోని యక్కలనకుం బాల్ప డితిం గదా యని విన్నవోవుచు రాహుగ్రస్తసుధాకరబింబ యగు పూర్ణిమా విభావరిభాతి విధ్వస్తకాంతి యై కృష్ణపక్షరాత్రిపోల్కి నవసన్న యై యూథ నాథునిం గడపి యంత్రినియంత్రణానుగృహీత యై నిగళబంధంబున దుఃఖార్త యగు కరేణుక యట్లు దీర్ఘతరనిశ్వాస యగుచు నపవాదోపహత యగు కీర్తి వర్తనంబున నవమానిత యగు శ్రద్ధపద్ధతి పరిక్షీణ యగు పూజయోజనఁ బ్రతి హత యైన యాశడంబునఁ బరిత్యక్త యైన యాజ్ఞకరణి వినష్ట యైన యాయతి భాతిఁ బ్రకాశములేని దిక్కురీతి సేనాని లేని సేనవలెఁ జీఁకటిం బడిన వెలుంగు రంగునఁ బొగక్రమ్మిన దీపికకైవడి నుపక్షీణ యైన స్రోతోవహాభానంబున శాంత యైన యగ్నిజ్వాల లీల ననుమతాగ్ని యైన యజ్ఞవేదికతెఱంగున రత్న భవనస్థలోచిత యయ్యు నరత్నభవనస్థలోచిత యై సుకుమారి యయ్యు నసు కుమారి యగు విప్రలంభవేదనం బడలి సుజాతాంగి యయ్యు నసుజాతాంగీకర ణంబున శ్రద్ధమాని మానిత యయ్యు మానితుల దోషంబున నమానిత యై శోకసంసక్త యయ్యు నశోకసంసక్త యై భయార్తులకభయం బొసంగఁజాలియు భయార్త యై యుపవాసమాత్రంబున నర్థుల సమృద్ధులఁ జేయునది యయ్యు నుపవాసఖిన్న యై మంత్రశక్తినిబద్ధ యగు దేవత యట్టు లొం డొనరింపనేరక దీన యై యుండియు నదీనబంధనంబును వైరివిధ్వంసనంబును నిజమోక్షణంబును రఘువరసమాగమనసంభవంబున సంభావించుచుఁ దపఃప్రభావంబున నిట్టు లుండెం గాక యని మెఱుకగలవారల కెల్ల నెఱుంగ నగుచు రామైకరసప్రవాహ నిర్మగ్న యై యున్న యాగర్భశ్రీమతి రత్నగర్భాగర్భరత్నంబు జనకరాజనందిని రఘురాముని దేవేరిం గాంచి విస్మయాంబుధి మునింగి యమ్మానవాదలోక నాథుండ నాలోకుండయ్యు నాలోకమాత్మక సన్నిధి వడయం గని. ౨౮

—♦ రావణుఁడు సీతాదేవితోఁ బ్రసంగించుట ♦—

ఉ॥ పెన్నిధిఁ గాంచినట్టి నిరు ♦ పేదవిధంబున నాతఁ డర్థి నా
యన్నులమిన్న డాయఁ జని ♦ యానె సుగాత్రి! ధరిత్రిపుత్రి! నీ
యున్న తెఱంగు ల గ్గనఁగ ♦ నొప్పదుపో తఱి వేచి కొల్వఁగా
సన్నిధి వేఁడు నీజనము ♦ సంగతి వీడఁ దలంచు టెంతయున్. ౨౯

తే॥ దేవతలు మానవులు ఘను ♦ ల్దితిజు లెవ్వ
రేని నీమ్రోలఁ దలయెత్త ♦ నెంచఁ గలరె
బాలరో! యిట్లు తలఁకెద ♦ వేల నీదు
బానిసమున కితండు పా ♦ ల్పడి మెలంగ. ౩౦

తే॥ సర్వలోకమనోహర♦చారుమూర్తి, వీవు నిన్నుఁ గాంక్షింపఁడే ♦దేవుఁడేని
యును ననుమతించి సన్నేలి♦కొనఁ గలిగిన, నేలనే యెల్లజగముల♦కేన యగుచు.

క॥ కన్నెరో! త్రిభువనరాజ్యం, బున్నను నీప్రాపు గాన ♦ కొప్పనె యది నీ
మన్నన వడసినయతఁడే, కన్నా కగు సర్వభర్త ♦ కాఁగలఁ డింకన్. ౩౨

తే॥ కామరూపులు రక్కసు♦ల్గడచి చనఁగ, నెట్టు లగు నీకు నెమ్మోయి♦నెగచి పడిన
వారినేనియు ముట్టి కై♦వస మొనర్తు, రేల సిరిబోని నీవు మ♦న్మొరవుసేయ. ౩౩

సీ॥ కలికికన్నుల నీరు ♦ కాల్వలై పాఱంగ, నేల యేడ్చెద విట్టు ♦ లిందువదన!
నీప్రసాదంబున ♦ నెఱిఁ గాంచి కా కొంట, ముట్టుదునే నిన్ను ♦ మోహనాంగి!
కాముఁ డుగ్రుం డైనఁ♦గానిమ్ము సర్వస్వ, మాతఁడే కొను దాని♦కలుక నబల!
నాయెడ విశ్వాస ♦ మే యిసుమిసుమలఁ, బడకు మింకిట నైనఁ ♦ బద్మగంధి!

ధరణి పైఁ బడి ధూళిధూ ♦ సరిత వగుచు
నొక్కప్రొద్దులఁ గృశియించి ♦ యొదుఁగ నగునె
తొడుగఁ గట్టఁగఁ బూయంగ ♦ దొరతనంబు
గొనఁ దలంపు మీతనిఁ గొని ♦ కువలయాక్షి! ౩౪

చ॥ అరసి భవత్కటాక్షమున ♦ కర్హునిఁ జేసితయేనిఁ జాలు సా
రరుచిరభోగ్యవస్తువులు ♦ రత్నగృహంబులు కల్పవృక్షసుం
దరములు కాననంబులును ♦ దైవతకన్యలు నొప్పులంక నీ
కరతరసక్తబాదరమ ♦ కాదె సరోరుహచారులోచనా! ౩౫

తే॥ ఎల్లదివిజులు దితిజులు ♦ నితని భృత్యు, లిట్టి వీని కొల్వొనయంగ ♦ నెంచితేని
సర్వమాతవగుట కేమి♦సందియంబు, మ్రొక్కరే ముజ్జగంబుల♦మొనయు ప్రజలు

ఆ॥ నిన్నుఁ జూడఁ గాంచు ♦ నెన్నఁడు రాముఁడు, కారుమొగిలు గ్రమ్మఁ ♦ గానరాని
జ్యోత్స్న నట్టు లేమి♦చోద్యం బతండు ని, ష్కాముఁ డింత నిజము♦వామనయన!

సీ॥ సంప్రాప్త మగు స్వీయ♦సామ్రాజ్య మన్యుల, కిడి దుర్గమారణ్య♦మెనసినాఁడు
నీజాడ పోడఁగాంచు♦నెతి చాలక నివృత్తిఁ, బడసి యుదాసుఁ డై♦పరఁగినాఁడు
సుకుమారి నినుఁ గూర్మిఁ♦జొక్కింపనేరక, కాఱియవెట్టంగఁ♦గడఁగినాఁడు
మునులతోఁ బొత్తున♦మొనసి దుంపలు కూర, లాహారములుగాఁగ♦నడఁగినాఁడు
కలదె యభిమాన మతనికిఁ♦గలదొ లేదొ, జీవభావంబు నేరిమిఁ♦జింతసేయ
వలెనె యిట్టిఁడు రాముని♦వలనునఁ బడి, యేల రిత్త గృశించెద♦వింక నబల.

క॥ నాచేత నున్న నినుఁ గొన, నోచానరొ మర్త్యుఁ డెట్టు♦లోపును హరి ము
జ్జేచేఁ గాంచిన కీరితి, నాచెనఁటి హిరణ్యకశిపుఁ♦డందంగ ననే. ౩౯

తే॥ పడఁతి! లేఁబ్రాయ మిమ్మెయిఁ ♦ బాడుసేసి
ధర్మసాధన మిమ్మేను ♦ దలఁగ నేల
స్నానపానార్హ్యభోజన ♦ సంస్కృతులకుఁ
దొడరి నను ధన్యుఁ బొనరింపఁ ♦ గడఁగు మింక. ౪౦

తే॥ నినుఁ గనులఁ గాంచినది మొద ♦ ల్నేఁటివఱకు
దెరువు బాసెను నిద్దుర ♦ తెవులుగానిమె
నన్నపానేచ్ఛ నీచిత్త ♦ మందరామి
నితరసుఖముల మాట కిం ♦ కేది బాట. ౪౧

సీ॥ మొలకనవ్వుల గీము♦కలికి! నీనెమ్మోము, వాడఁబాఱఁగ నింత♦వనర నేల
యేలుము న న్నేన♦యేలింతు నీతండ్రి, మర్త్యలోకం బేక♦మండలముగ
నాచెట్టపట్టిన♦నాఁతు లెల్లరు నిన్నె, యచ్చర ల్సిరి నట్టు♦లనుసరింత్రు
మామకీనానుజ్ఞ♦మలసికాక యెటుంగ, రాశాధిపతులేని♦నడు గిడంగ
నిట్టు లొక్కరితవు నీవు♦యింతవట్టు, వీని నలికింపఁ జాలితి♦వేల కొలఁది
బానిసలు గాఁగ నున్నారు♦పద్మవదన, లలఁతి చూడక సర్వసౌ♦ఖ్యములు గనుము.

ఉ॥ ఇచ్చకు వచ్చి నట్లు గను ♦ మెల్లమహాంబులు దెల్వియై గుణా
ఢ్యోచ్చయము స్థలంపుము సు ♦ ఖోర్మిలఁ దోఁగుము ధర్మకృత్యము
ల్వొచ్చెముపో నొనర్పు మతి ♦ పూజ్యతఁ గాంచుము నాదుసత్కృతుల్
మెచ్చెద వాదటం జనవు ♦ మేకొన నీవ త్రిలోకసుందరీ! ౪౩

ఆ॥ అనుచుఁ గదిసి పదరు ♦ నాతనిఁ గని బహు
తృణముగాఁ దలంచి ♦ తృణము నొక్కఁ
డంతరమ్ము సేసి ♦ యంతరంగమ్మున
రాము దిటవుపఱచి ♦ రామ పలికె. ౪౪

—♦ సీతామహాదేవి రావణుని నిందించుట. ♦—

క॥ రావణ! బ్రహ్మకులంబున, నీవు జనించితివి తపము♦నెఱి గంటివి యి
ట్లేవిధి ప్రేరణమునఁ బర, భావినుల వధంబు పట్టు♦పడెనో మొఱఁగా. ౪౫

తే॥ నావలను సూచు చెట్ట మ ♦ నమ్ము దలఁగఁ
జేసి యాత్మీయము జనమ్ముఁ ♦ జేర్చికొనుము
కోరఁబోకుము ననుఁ బాప ♦ కారి సుకృతి
సిద్ధి నట్టులు జీవేచ్ఛఁ ♦ జెందెదేని. ౪౬

క॥ అని పలికి యవ్వలనిమో, మును గొండొక దెసకుఁ ద్రిప్పి♦మొగకొను స్థైర్యం
బున నిట్టు లనె ననాదర, మున నతనిం గూర్చి కలిమి♦ముత్తో నగజా! ౪౭

ఆ॥ పుట్టినది విదేహ ♦ భూపతితలము నా, మెట్టినదియు హాతత ♦ మిసుర్రి కొలము
నే నొనర్తునోటు సీతోడి చెలిమి శ్రీ, రాము పత్ని నేక ♦ రామ నగుచు. ౪౮

మ॥ ధన మైశ్వర్యము వైభవంబు రుచిర ♦ త్వంబు న్యశస్యత్వముల్
నను లౌభ్యంబునఁ గూర్ప నేరవు జగ ♦ న్మాన్యుండు శ్రీరామదే
వున కే నగ్నికి స్వాహ లక్ష్మి శ్రీహరికి ♦ నొప్పలంగఁ బౌలోమి యిం
ద్రునకు న్నిత్య లనన్య లెట్టు లటు లుం ♦ దు న్నేమ మొప్పారఁగన్. ౪౯

తే॥ రవిఁ బ్రభను బాపఁ జూచెదు ♦ రాహు వాగ్రి
హమున ననపాయిని యటంచు ♦ నరయఁబోఁడు
పొంగుదురు కుంగుదురు గాక ♦ పొడవుపడఁగ
నేర్తురే తామసులు తెల్వి ♦ నెఱయఁగలరె. ౫౦

తే॥ లోకనాథుండు రాముఁడు ♦ ప్రాకటమగు
భుజము నుపధానము నొనర్పఁ ♦ బొలుపుఁ గాంచి
యుండి యొండొక్కని భుజమ్ము ♦ నండఁగొనఁగ
వెడఁగునే యేమికతమున ♦ వెట్టి వైతొ. ౫౧

తే॥ నీదు పడఁతి నొకం డిటు ♦ నీతి దప్పి
పలుక మతి సమ్మతింతువో ♦ పశువ! యొద్దు

నట్టు లనఁగొనరాదో న్యా ♦ యంబె లేదో
చదివి తెన్నియొ గ్రంథము ♦ ల్పడుగు లెడల. ౫౨

ఆ॥ అందఁ గాంచు నెట్టు ♦ లంత్యజాతుఁడు వ్రత, స్నాతుఁ డాత్తతత్త్వ ♦ సారుఁడు నగు
నగ్రజన్ము విద్య ♦ నట్టు లీవును నన్నుఁ, గాంక్ష సేయనున్నఁ ♦ గలుగు ఫలము. ౫౩

క॥ పినరాదో కనరాదో, మనరాదో యింకఁ దనకు ♦ మాన్యత లేదో
మనువంశతిలకు దాక్ష్యం, బనితరసులభ మని యెదఁద ♦ నరయఁగరాదో. ౫౪

సీ॥ ఉండిరో లేరో యా ♦ ర్యోత్తము లీయెడ, వారిపొత్తున నీవు ♦ వఱలవొక్కొ
పాడుదు రిట శ్రుతి ♦ పాఠంబు లెవ్వేళ, నర్థయోగము సుంత ♦ యనువుపడదొ
నీదురాక్షసవృత్తి ♦ నెఱి గాంచి తగదంచు, మూదలింపఁగ వారు ♦ మొనయఁబోరొ
తెఱఁ గెఱిఁగించినఁ ♦ దీరొందక మనంబు, మిథ్యాప్రశస్తికై ♦ మేలుకొనెనొ.
చెడుఁగురాజు చెట్టఁ ♦ జేసి నెట్టనఁ జెడుఁ, బురము రాష్ట్రమునుబ్ర ♦ భూతసంప
దాఢ్య యయ్యులంక ♦ యడఁగునింక వినీతి, దొరయకున్న నీదు ♦ దోసమునను.

తే॥ భూతములు నవ్వ దుష్కృతిఁ ♦ బొడవుదక్కి
రాణ సెడఁ గూలఁబోయెడు ♦ రాజుఁ గాంచి
పాపకర్ముండు వ్యసనంబు ♦ పాలు గొనియెఁ
గాలుఁబో యందు ప్రజలుఁ ద ♦ త్కాల మరసి. ౫౬

చ॥ సత మగు స్వీయదారరతిఁ ♦ జంచలవృత్తి నతృప్తుఁ డైన య
మ్మతకరి నన్యభామ లభి ♦ మానము పేర్మి గ్రసింతు రిట్లకున్
వెతలకు వాఁడు పాలుపడి ♦ విహ్వలుఁ డౌఁ దుది నాయు వర్ధమున్
శ్రుతమును బాడు గాఁగఁ బరి ♦ శుద్ధతవోవఁ గొలంబు సేడ్పడన్. ౫౭

శా॥ పున్నెం బంచును బాప మంచు నెద సం ♦ బోధించి శ్రీరాముని
న్నన్నం గూర్చి శరణ్యు నయ్యనఘుని ♦ న్నాతప్పమన్నింపు మో
యన్నా యంచని వేఁడు మల్లయిన ని ♦ న్నాతండు రక్షించు నే
బన్నంబు ల్పడనీక వంగడము గా ♦ పాడంగ నీ కయ్యెడున్. ౫౮

క॥ చండితనము మానక వే, ఱొండు తెఱం గెంచితేని ♦ నుడుగక రఘుమా
ర్తాండాస్త్రమయూఖంబులు, భండనమునఁ గ్రోలు నీదు ♦ ప్రాణాంబువులన్. ౫౯

తే॥ అంతకుఁడు చూచి చూడని ♦ యట్టు లున్న
నింద్రు వజ్రమ్ము ముట్టికో ♦ లెడముపడిన
వరుణపాశంబు పురి విచ్చి ♦ వలను సెడిన
రాము బాణంబు నిను బవ ♦ రమునఁ ద్రుంచు. ౬౦

తే॥ అశనినిర్ఘోష మట్టుల ♦ యగుచుఁ దొడరు
రాము జ్యానిస్స్వనము విందు ♦ నేమ మొప్ప
నిను వనస్పతి వజ్రింబు ♦ నెటిని భంజ
నం బొనర్చు నద్దేవు శ ♦ రంబు కడఁగి. ౧౧

క॥ పర్వము లొప్ప సుపర్వసు, పర్వంబుగ రామబాణ♦పన్నగములు లం
కోర్విం గప్పెడుఁ బూర్వసు, పర్వాలఁ దెరలంగఁ జేయ♦జ్వలితాస్యము లై.

తే॥ రాక్షసేంద్రమహాసర్ప ♦ రాజి నెల్ల
నాగరుడుపోల్కి రాఘవుం ♦ డాహరించు
నిన్ను బలి నట్లడఁగఁ ద్రొక్కి ♦ నన్ను సిరిఁ ద్రి
విక్రముఁడపోలెఁ గొనిపోవు ♦ వెరవు నెరయ. ౧౩

క॥ ఆరాజసింహాయుగ మటు, దూరమ్మున నుండుతటిని♦దోషాచర ! దు
ష్టారంభుఁడ వై జీవము, తో రాఁగంటి వది నాదు♦దోర్బల మనుచున్. ౧౪

క॥ అల్పమృగమునకుఁ బోలె న, నల్పనృపవ్యాఘ్రవ_క్త్ర♦మంది నశింపన్
గల్పింపఁ డెట్లు దైవము, కల్పాంతముఁ బోని యుద్ధ♦కాలము నీకున్. ౧౫

శా॥ కైలాసంబు గుహం జొరంగనిన నా♦కంబెక్కి నై నిక్కినన్
నేలం దూటిన నబ్ధి డాగిన సము ♦ న్నిద్రుండ వై యప్రభున్
గాలోడ్డం బనిపంచి చూచిన హరు ♦ న్బ్రార్థించిన న్గాల్చు ని
న్వాలాయంబు రఘుప్రవీరుని కలం ♦ బం బేకలక్ష్యంబుగన్. ౧౬

క॥ అని బిట్టు దూటి పలికెదు, వనజాయతనేత్రిఁ గని య♦వార్యబలుఁడు వాఁ
డని సక్రోధుం డయ్యెనుఁ, దన వెరవున కలిమి నొందు♦దశ వెలయంగన్. ౧౭

—♦ రావణుఁడు తిరిగి దుర్భాషలాడుట. ♦—

ఆ॥ సాంత్వనమునఁ గొమలు ♦ చాలమి వెట్టి య
వశ్య మీసడింతుప్రి ♦ వశ్యు లనుచు
మగలఁ బ్రియము పలికి ♦ మానినులం దేర్పఁ
దిట్టు లందువారు ♦ దేబెలెందు. ౧౮

క॥ అలుకకుఁ బాల్సేయఁగ నీ, కులికించెడువాఁడు వక్రఁ♦డువిదరో మదనుం
డలఘుస్నేహము నెనరునుఁ, జలమునఁ బ్రబలించు నిష్ట♦జనతతి యెడలన్. ౧౯

ఆ॥ నిన్నుఁ గెడప నైన♦నిగ్రహింపఁగ నైన, నేల జాలిపడఁగ♦నింతవట్టు
మేన నాఁగి నిలువ♦మేకొంటిఁ గోర్కుల, నశ్వముల నియంత♦యట్టుగాఁగ. 20

శా॥ లే రెందు న్నినుఁ బోలువారు మగలా ♦ లే రెందు ని న్గావ న
ల్లేరుందీవియ నైని బండి యని బా ♦ ళిం గూరియు న్నీకు నీ
వే రాగిల్లెద వంచు నెంచ మరు న ♦ ట్టీ వాక్కుట న్వాఁడి వ
ల్లేరుఁబండుల గ్రొచ్చుతే సరసమా ♦ లేమా కుప్రథ న్మానుమా! ౨౧

క॥ నను మార్కొను సామర్థ్యం, బునఁ గలఁడే రాముఁ డెఱుఁగఁ♦బోలదు నీ కే
నెనసిన మిత్రియునేని, న్దనచలమున నిలువలేక♦తలఁగు నటంచున్. ౨౨

ఉ॥ మాటలు పెక్కు లాడితివి ♦ మన్మనఁ దక్కు సురాసురాంగనల్
కూటమి లెంక లై యెపుడుఁ ♦ గూరిమిఁ గోరుచుఁ దన్ను మేలిస
య్యాటలఁ దేర్తు రింతయు న ♦ హంకృతిమైఁ గనలేక మర్త్యునిం
బాటిగఁ జేసి వీని నన ♦ పాయునిఁ దిట్టఁగ నీకుఁ బాడియే. ౨౩

క॥ ఇంతకు సహించితిని నీ, చెంతం జేరి మన మనము♦చెనయుచునుంటన్
మంతనమునఁ దలపోయుము, వంతలపా ల్గాకు మచటి♦వలపునఁ దరుణీ! ౨౪

చ॥ నిను విడనాడ నెమ్మి గని ♦ నీ వలరింతువయేని మేలు గా
కెనయఁగ నేర వొండు పద ♦ మియ్యెడ నుండెడు నీదుచక్కి య
మ్మనుజుని మాట కేమి సుర ♦ మండల మేలెడు వాని కైనఁ జ
క్క నరయరాదు లేయొడలు ♦ గాఱియ వెట్టఁగ నేల బేల వై. ౨౫

ఆ॥ మర్త్యలోకగతము♦మాను మింకిట నభి, మాన మింత యురసి♦మలయ నైతి
వేని నాదు శక్తి♦నెఱిఁగింతు మర్యాద, చెడు నటంచు వేఱె♦చెప్ప నేల. ౨౬

క॥ అని జంకించుచు నఱుమఁగ, వనితామణి కితని కళుక♦వల దని కొలు వ్వూ
నిన యనిమిషగంధర్వాం, గన లొగిఁ గనుసన్న లెలమిఁ♦గావించి రుమా! ౨౭

క॥ ఎందుండె నతని డెందము, మందానందస్వభావ♦మహినందిని ని
ష్పంద యని యెఱిఁగి యెఱిఁగియు, మందోక్తులు పలుక సాధు♦మధురాలాపా!

—♦ సీతామహాదేవి రావణు ధిక్కరించుట. ♦—

క॥ నారీమణి వానిం గని, తీ రేదం బలికె నోరి!♦దిమ్మరి చెడ నై
యూరేగెడు నినుఁ దేర్చెడు, వా రీపాపములమిట్ట♦వలనున లేరే. ౨౯

ఆ॥ హస్తిమశకములకు♦నంతర మెంతగాఁ, గలదొ రామునకును♦గతులు సెడిన
నీకు నంత గలుగు♦నీచ! యిమ్మెయి నాడి, యేమివిధిఁ దరింప♦నెంచెదొక్కొ.

ఆ॥ అమ్మహాత్ము పత్ని♦ననవద్య నిమ్మెయిఁ, జూచి పలుకు నీవు♦సుక్కి నేలఁ
గూలు టెన్నఁడొక్కొ♦క్రూరము లకృష్ణపిం, గళము లైన నీదు♦కన్ను లెడల.

సీ॥ ఎగిచి త న్గొని తేర♦నెత్తిన బాహువు, ల్గూలవే తెగి చెట్టు♦కొమ్మ లట్లు
చులకగా నావంక(♦జూచు నీచూడ్కులు, మిడుకవే యగ్నిలో♦మిడుత లట్లు
లాడ(గూడని మాట♦లాడు నీనాల్కలు, పగులవే పవి( దాకి♦బండ లట్లు
తర మెఱుంగక నన్ను♦ధర్షించు శీర్షము, ల్పడవె పండిన తాటి♦పండు లట్లు

తపము సిరి పోలివోకను ♦ దాశరథి య
నుజ్ఞఘాకను( దల(చుచు ♦ నూలుకొనదు
చిత్త మటు లౌట బ్రిదికి తో ♦ చెనటి! కాని
యెడ నిలువు నీరుగా(గ ని ♦ న్నేర్చి యిడనె. ౮౨

క॥ దొంగతనంబున నన్ను( బ, ఠాంగన( దెచ్చి నవు డెఱు(గ♦నయ్యెను నీలా
వుం గీర్తియు ధైర్యంబును, బొంగ(గ నింకేల యేల♦పొగడికొనంగన్. ౮౩

తే॥ ఆతతాయివి నీవు న ♦ న్నపహరింప(
దల(చి తేనియు నీకు నే ♦ దక్కదాన(
గాను నిను( జంపు మనుచు రా ♦ ఘవుని విధియ
నేర్చి యిటు పంపె నింతకు ♦ నిక్కవలదు. ౮౪

చ॥ అన విని యగ్నికుండముల నట్టులు ♦ గన్నుల విస్ఫులింగముల్
మొనకొని క్రాల సాంధ్యరుచి ♦ మోముల(గ్రమ్మభయంకరాకృతిం
దనరుచు నేమి సేయునొకొ ♦ తాలిమి వీడె నితం డటంచు( ద
న్గను(గొనువార లెల్ల( దల( ♦ కం గడు నల్గి ససంభ్రమోద్ధతిన్. ౮౫

క॥ అనుపదమె దీని( జంపెద, నని పై కుఱుకంగ( దగ ద♦టంచు( దనప్రియాం
గన తోడ్తో వారించెను, దనుజాధిపు చేయి పట్టి♦తద్దయు నేర్మిన్. ౮౬

—♦ రావణుని దుండగమును మందోదరి నివారించుట. ♦—

ఆ॥ పలికె నిట్లు లనుచు( ♦ బ్రాజ్ఞు(డ వగు నీకు(
దగునె స్త్రీ వధింప( ♦ దల(పు లేని
వెడ(గుతోడి రతికి( ♦ దొడరిన సౌఖ్యంబు
గలదె యింత తెలియు ♦ వలను లేదె. ౮౭

ఉ॥ అచ్చర లెందఱో చిలువ ♦ లంద(గ(జేసిన కన్నె లెందఱో
పొచ్చెము లేని దైత్యకుల ♦ భూషణము ల్కామ లెంద ఱెందఱో
మెచ్చి వరించి హత్తికొని ♦ మేకొన( జూచెదువా రికెందఱో
యిచ్చపలాంగ సౌష్ఠవకు ♦ నింతలు ఱంతులె మర్త్యకాంతకున్. ౮౮

తే॥ నిత్యయౌవనసంపత్తి♦నెఱఁ దలిర్చి, యెలమి నీయిచ్చవచ్చిన♦యెల్ల ప్రొద్దు
నోలసి సౌఖ్యాబ్ధి నిన్నేన♦యోలలార్పఁ, జాలి యుండ నొడ్లకుఁ గేలు♦సాప నేల.

క॥ కామవశాకృతులుండ ని, కామాలస మర్త్యభామఁ♦గని యీ విటుగా
నీమహిమ లరసి వలచిన, వామాక్షుల కింతకుఁ దల♦వంపులు గావే. ౯౦

క॥ అని పెనఁగొని ప్రియ బోధిం, చిన వెడనవ్వు మగఁటిమిని♦సిరి నొడువుచు మో
మునఁ దోనుకాడఁగఁ గాపరి, తనమునఁ దగు రక్కసలకుఁ♦దా నిట్లనియెన్.

తే॥ ఆన సేసెద నిట్లు మీ ♦ కందఱకును
రెండు నెలలకుఁ జెలువ నా ♦ యొండఁ జేరి
మనఁ బొనర్పెఁడు చెలిమి మై ♦ మలసియేని
నొండొకఁటనేని మీమీప్రి ♦ యుక్తి మెఱయ. ౯౧

క॥ ఇమ్మానుషి దెస నాదట, నెమ్మి వదలి తఱిగి వండి♦నేమమ్మున నా
సమ్మతిఁ గొన నిమ్మగు భ, త్యమ్ముగ నొనరించి తెందు♦చతురత వెలయన్.

క॥ ఇందులకుఁ దప్పువారల, బొంది నిలువ దనుచుఁ దెలిపి♦పూఁబోఁడులు గొ
ల్వం దనరారి కలఁక వా, యం దిర మగు మనముతోడ♦నతఁ డరిగె సఖీ! ౯౨

— ♦ రాక్షసస్త్రీలు సీతాదేవిని నిర్బంధించుట. ♦ —

తే॥ ఆతఁ డంతిపురికిఁ జేరు ♦ నంతలోన
కదిసి శ్రీరామ దేవుని ♦ కలికిమిన్న
నప్పొలసుదిండిపొలఁతులు ♦ తప్పఁబలుకఁ
దొడరి రేమని చెప్పుదుఁ ♦ దోయజాక్షి ! ౯౩

క॥ చెంగటఁ జేరి యొకతె సా, రంగనయన! యంగలార్తు♦రాముఁ డటంచున్
బొంగారు సౌఖ్యవారిధి, కిం గన్నడసూపి యెంత♦కృపణవొ యెఱుఁగన్. ౯౪

ఆ॥ పుట్టినాడు విధికి♦మూఁడవుతరమునఁ, గొట్టినాడు సురలఁ♦గూర్చి సిరులఁ
బట్టినాడు వారి♦పడఁతులతోఁ గూడ, నిట్టివాఁడు వలచె♦నేల తలఁగ. ౯౫

ఉ॥ నమ్మినవాఁడు నెమ్మది ఘ ♦ నమ్ముగ నీకయి నీవ కూర్మిఁ ద
న్నమ్మతిమైఁ గరంతు వని ♦ చక్కఱబొమ్మరో! జాలమా యయో
క్రమ్మెను గమ్మవిల్తు విశి ♦ ఖమ్ములిఁ కెమ్మెయిఁ దాళువాఁడు పూ
రెమ్మలు కేలు సాచి కిఱ ♦ రింపక ప్రీతిఁ గవుంగిలింపవే. ౯౬

క॥ అజరామరుఁ డగు నీతని, కజరులును వడంకువార♦లని విని యింకన్
గజిబిజిపడ మేలౌదవునె, గజగమనా! మనుజు నొకనిఁ♦గలలోఁ గనుచున్.

క॥ చాలించుము దుర్భ్రమ లిఁక, నేలించుము వీని నెనసి♦యెల్లజగములన్
బోలించుము పురహరుతోఁ, గీలించుము నిచ్చ లిచ్చ♦కేళులఁ బొదలన్. ౧౦౦

తే॥ అంతిపురివార లెల్లరు ♦ ననుఁగుఁజెలుల
యగుచు నీసేవ లరయంగ ♦ నలఁతిగాని
విభవముల కెల్ల వీ వయి ♦ వెలయుపొంటె
విధి నినుఁ బొనర్చె మాటలు ♦ వేయు నేల. ౧౦౧

ఆ॥ అనుచు నేకజట న♦యం బట్లు బోధింప, బాగు బా గటంచుఁ♦బలికె మఱియు
హరిజటాఖ్య యామె♦నలఁతిగాఁ జూచుచుఁ, దనదు పేర్మి వెలయఁ♦దారసిల్లి.

ఉ॥ వింటివకాదె భర్త స్మర ♦ విహ్వలుఁ డై నినుఁ గూర్చి పల్కుట
ల్గంటివకాదె యాతని య ♦ ఖండవిభూతివికాస మంతయున్
మంటికి మింటికొక్కడుగ ♦ మార్కొని తన్నఱుమంగ నొటక
స్గంట దలంట మే లనక ♦ కాఱియ నొందఁగ నేల యింకిటన్. ౧౦౩

క॥ రాఁగలిగెనేని నినుఁ గొని, రాఁ గని తోడ్తోన యిందు ♦ రాఁ గనఁడె యెటో
పోఁ గాంచెను రాగము చెడి, పోఁగా నీమగఁడు వాని ♦ పొందిక తెలిసెన్.

క॥ ఆకర్మభూమిఁ బొడమఁగ, నై కాంచితి వేకపత్ని ♦ యన నగు ధర్మం
బీకడ నెట్లు మెలంగఁగ, నోకాంతా! దగునొ యట్టు ♦ లొలయుము శుభముల్.

క॥ ఇది జన్మాంతర మనియెం, చి దివౌకసులందు వీరు ♦ జేరు వెఱిఁగి నె
మ్మది నూఱటఁ గాంచి యిదియె, పదిలం బని దనుజవిభునిఁ ♦ బడయంగనుమీ.

ఆ॥ అనుచు వదరు దాని♦కనురూపముగ నిట్లు; పలికెఁ బ్రఘస యనెడు♦పడఁతి కదిసి
తరళనయన! నీదు♦తలఁ పొప్పదే మని, పుణ్యజనమహేంద్రు♦పొందు గొనవు.

తే॥ చెలువ సిద్ధాన్నము పరిత్య♦జించి భైక్ష, వృత్తి కాసింతురే యెంత♦వెడఁగు లైన
నింత నీవ యెఱుంగుదు♦ఖింతమనుజుఁ, బట్టి దనుజేశ్వరుఁడు వేఁడఁ♦బాతు ననఁగ.

క॥ వీర్యోత్సిక్తుఁడు శూరుం, డార్యాధిపలబ్ధబహువ ♦ రాఢ్యజయశ్రీ
ధార్యుఁడు లంకేశుఁ డితని, భార్యవు గా కొంట మేలు ♦ పడయంగలవే. ౧౦౯

చ॥ బహుమత లైన యొడ్ల నెడఁ ♦ బాయఁగ నిన్నుఁ బరిగ్రహింపఁగన్
బహుగుణ వంచు నెంచె నది ♦ భాగ్యమ కాదె సురాసురాఢ్యసం
నహనము లీతనిం జెనయు ♦ నాఁ జన దేకవిభుండు లోకధూ
ర్వహనమునం ద్రిమూర్తులును ♦ వావిరి నీతనిఁ బోలఁ గాంతురే. ౧౧౦

వ॥ అనుచుండు నంతలోన. ౧౧౧

క॥ వికట యను నొకతె యిల నొం, దక తాఁ గటకటము లదరఁ♦దద్దయుఁ బలికెన్
ప్రకట మగు నింద్రవిభవం, బకటా రుచియింప దెంత♦యధమవా తలఁపన్.

ఆ॥ దేవయోనిభవులు ♦ తివిరి తన్నాక్రమిం, పంగ నేమి మనుజ ♦ పత్ని చేయఁ
జాలు నింత దనుక ♦ జాలింబడితి విది, చాలు నింక సుఖము ♦ పాలు గొనుము.

ఆ॥ ఎవఁడు దోశె నెన్ని♦యేని మాఱులు దిగీ, శులను సురల దాన♦వులను గెలిచె
నట్టివాఁడు వేఁడు♦నటె నీదు మన్నన, వడయఁగోరి యింకఁ♦గెడయవలెనె. ౧౧౪

క॥ మొఱకుతనంబున నీ వి, ట్లొఱుక సడలి తెఱఁగు గాంచ ♦ వేనియు బుద్ధిన్
మఱలించుఁ గాక ఖడ్గం, బఱిముఱి నీకంఠనాళ♦మం దెడు వేళన్. ౧౧౫

ఆ॥ అనుచుఁ గర్కశోక్తు ♦ లాడుచు నెగచి పై
కుఱికెఁ జంద్రహాస ♦ మొడిచిపట్టి
దాని కంతరమునఁ ♦ దవిలి దుర్ముఖి యామె
మొనసి దుష్టవాక్య ♦ ముఖర యయ్యె. ౧౧౬

చ॥ తపనుఁడు తాపము న్నెఱపఁ ♦ దాఁ దలఁకు న్బవనుండు వీవఁగాఁ
ద్రిపఁ గొనుఁ బావకుండు జడ ♦ తం బడు నిచ్చమెయి జ్వలింప నా
కపతిముఖు ల్హాసా దనుచుఁ ♦ గాంతురు సన్నిధి గోరి యట్టివాఁ
డపరిమితప్రభావుఁ డసు ♦ రాధిపుఁడే నినుఁ గొల్వ నెంచెడున్. ౧౧౭

ఉ॥ రూపునఁ గాక మేల్మి మతి ♦ రూఢి నొకింతయు లేదు నీకు నీ
కాపథముం దలంగ వెటు ♦ గాఱియ వెట్టిన సర్వభర్త లం
కాపురనేత వేఁడఁగ వి ♦ కాసము నొందవు తత్ప్రసక్తికిం
గాపుర మొల్లవోటు విధి ♦ కట్టడి యేమని నిన్సృజించెనో. ౧౧౮

ఉ॥ దుర్గతి కేగు నిన్మొనసి ♦ తోడ్పడునోటు నరుండు రాముఁ డీ
దుర్గమభూమిఁ ద్రొక్కు నెటు ♦ తోయధి దాఁటఁగడంగు నెట్టు లా
నిర్గుణుఁ డయ్యమానుషుఁడు ♦ నిన్ను మఱల్చికొనంగ నేరమిన్
స్వర్గతుఁ డయ్యెఁగాక మనఁ ♦ జాలినఁ జేరఁడె యిన్నినాళ్లకున్. ౧౧౯

ఆ॥ చెట్ట దెచ్చి కొందు♦చేచేత నీ వింక, బిఱుసుతనము వంక♦బెనఁగితేని
నిత్యదైన్యమునను♦నెఱిమాలి బ్రదుకఁగాఁ, దలఁతుకాక యదియుఁ♦దరమె నీకు.

క॥ ఇఁక మనసీ మన నన్యలు, బ్రకటాహంకార లటులె♦పలుకుచు నఱుమన్
సుకృతాఢ్యచిత్తవృత్తులు, కకావికలపాలుగాఁగఁ♦గలికి యొదుఁగుచున్. ౧౨౦

క॥ కనుగొలుకుల నశ్రులు జా, ల్కొన శోభనమూర్తి మేల్మిఁ♦గొనసీని యఘ
మ్మునఁ బవనాహత లత తీ, రునఁ గంపిత యయ్యె వ్రతని♦రూఢిం దిర మై.

—♦ సీతామహాదేవి మనోనిశ్చయము ♦—

ఉ॥ ఇమ్మెయి ని మ్మెఱుంగ కటు ♦ లేవపురక్కస లెల్ల దిక్కులం
గ్రమ్మి యుపద్రవు న్నడులఁ ♦ గాఱియవెట్టుట కార్తమూర్తి యై
బమ్మెరపోకకుం దలఁకి ♦ పావని యిట్లని పల్కె సద్గుణా
ఢ్య మ్మగు నెమ్మనమ్మున మ ♦ హామహు రాముని జేర్చి తద్ధృతిన్. ౧-౨౩

సీ॥ వెడఁగు లై లోకవి♦ద్విష్ట మర్థం బిట్టు, లుపదేశ మొనరింతు♦రోజ దక్కి
హారిణి బెబ్బులికూర్మి♦కలరునే రక్కసు, మానుషి కోరునే♦మమత నెఱయ
దీనుఁ డా రాజ్యవి♦హీనుఁ డౌఁ గా కేమి, నా ప్రాణనాధుండె♦నాకు దేవుఁ
డేకపత్నిత్వాఢ్య♦నై కాంతునే యొడ్లఁ, గలనైన నేమమ్ము♦కలిమి దలఁగఁ
జెడుగు పలుకులు వలికిన ♦ చెట్ట లింత
లనుభవింతుర యైన నే ♦ నాసగొలుప
నుసుఱులకు మది నిఁక మీఱ ♦ లోపి నంత
చేయుదుర కాక మీనుడి ♦ చెవినిఁ జొరదు. ౧-౨౪

తే॥ ప్రాజ్ఞుఁడు కృతజ్ఞుఁడు మహాను ♦ భావుఁడు సద
యుండు రాముఁడు నే నిట్టు ♦ లొడ్ల పాలము
నంది నవయుచునుండ నే ♦ మని యుపేక్ష
సేసెనో యింతవట్టు నా ♦ చెట్టఁ జేసి. ౧-౨౫

తే॥ అమ్మహితుతో వినాకృత ♦ నై ముహూర్త
మేని జీవించి నంతట ♦ నేను పాప
జీవిత యనంగ నైతి ని ♦ చ్చెడుగు మేని
కాస సేయ నింకిట నేమి ♦ యైనఁ గాని. ౧-౨౬

క॥ ఏల సుఖ మేల జీవిత, మేల ప్రసాధనవిధాన♦మింకిట నను నా
యేలిక గనకున్న గుణ, శ్రీలాలితు నతని నేను♦జేరకయున్నన్. ౧-౨౭

క॥ కావునఁ గాలున నైనం, గావరుఁ డీతని స్పృశింప ♦ ఖండించి తినం
గా వలతు రేని నది మే, లీవిధిఁ బ్రిదుకుటయు భరమ ♦ యింకిటఁ దనకున్.

వ॥ నన్ను సామాన్యఁగాఁ దలంప వలవదు. సూర్యునకు సువర్చలయు నింద్రునకు శచీదేవియు, వసిష్ఠునకు నరుంధతియుఁ, జంద్రునకు రోహిణియు, నగస్త్యునకు

లోపాముద్రయుఁ జ్యవనునకు సుకన్యయు, సత్యవంతునకు సావిత్రియుఁ గపిలమునికి శ్రీమతియు సగరునకుం గేశినియు, సౌదాసునకు మదయంతియు, నలునకు దమయంతియు, నెట్టు లట్టు లేనును శ్రీరామభద్రమూర్తి కనన్యయు ననపాయినియు ననువ్రతయు నిత్యానురక్తయు ననం బొగడుగాంచి యుండుదు.

క॥ మీచెడుటఁ దలఁప కిమ్మెయి, నాచెఱుపున కొగ్గినార ♦ నాథులు గా కె
ల్లేచేటు వాటిలక మనఁ, జూచెదరో దైవ మెట్టి ♦ చూపునఁ గలదో. ౧౩౦

వ॥ మీర లెల్లరు జీవన్మృతులరు మీపాపమ్ము పేరిఁట మున్నీటికిఁ బారమ్ము లేదు కాలుదురకాక పోం డని మిన్నకున్న యన్నాఁతిమిన్నం గనుంగొని కనుంగొనల సాంధ్యరాగంబు వెలువడఁ గటతటంబు లదర బిట్టలిగి చంద్రహాసంబు లాడిచి పుచ్చుకొని జడిపించుచు నాక్రించురక్కసిబోఁటు లొండొరుల నెట్టుకొనుచు నెట్టన దట్టంబుగా ముట్టఁగవిసి తెంపుసేసి చంప నుద్యమించిన. ౧౩౧

క॥ హారామా! యని యేడ్చుచు, నారామామణి మహార్తి ♦ నంది యొదుఁగుచుఁ
జేరె నశోకస్కంధమె, యారూఢిం దనకు శరణ ♦ మని గిరితనయా! ౧౩౨

—♦ సీతామహాదేవి శ్రీరాముని రాకనుగోరి తెంపుచేయుట. ♦—

తే॥ మఱియుఁ దలపోసికొనె జగ ♦ న్మాన్యుఁ డైన
భర్తఁ బడసియు నిమ్మెయి ♦ పాట్ల కేన
పాలుగా నింక భువిఁ బుట్టి ♦ పడఁతు లెవ్వ
రింపుమై నేయెడల సుఖ ♦ యించువారు. ౧౩౩

క॥ కావున స్త్రీజన్మము విత, గా వలవదె తలఁప నెంత ♦ కరటిరొ విధి త
మ్మీవిధమునఁ బుట్టించె న, పో వెర వనరాని త్రోవఁ ♦ బోలు నె త్రోవకా.

ఆ॥ బ్రహ్మవేత్త జనకు ♦ పట్టినై యిలఁ బుట్టి, భానువంశ్యు చెట్ట ♦ పట్టి నట్టి
నన్నుఁ జెడుగు వాఁడు ♦ నయమేది యిమ్మెయిఁ, బాఱవైచె జలధి ♦ పారమునను.

సీ॥ నాజీవనాళంబు ♦ నాథాంఘ్రిరాజీవ, మీజన్మమునఁ గొల్చు ♦ టిరవుపడునె
సురశాఖిశాఖిక ♦ ల్సుందరాంగుని దండ, లండగా మనఃనాఁటి ♦ యనువుగలదె
సత్సంగ మని ప్రియు ♦ నుత్సంగ మెనసి మే, ల్చాటూక్తు లాలించు ♦ సమయ మున్నె
యొదుఁగు నెమ్మె నట్టు ♦ లోలయు నెమ్మదినిఁ ద, దైక్యసంపద యింక ♦ నంద నగునె
కూళ లీరక్కసులచేతఁ ♦ గూలి చెట్ట, చావు గననేమి మననేమి ♦ సకలవైభ
వములుగనుభవ మిమ్మెయి ♦ వమ్ముగాఁగ, వేచి యిటు సేసెఁ బ్రాగ్భవీ ♦ యాచరణము.

తే॥ మొలకముద్దులమూట నె ♦ మ్మొగము పిన్న
నగవుతోడివ యగు ప్రాణ ♦ నాథు మేటి

కమ్మని మృదూక్తు లింక నా ♦ దిమ్మరిల్లు
చెనఁటి చెవిదోయి వినఁగల్గు ♦ సిరియుఁ గలదె. ౧౩౭

చ॥ మునుకొని యెన్నినాళ్లు దన ♦ ముచ్చటల న్మనుగంగఁ గాంచె న
మ్మన మటు లయ్యునర్థ సుఖ ♦ మాధురిఁ జొక్కఁగనేర దయ్యెఁ జీ
కున కెటు చూడ్కిదృశ్యవయ ♦ గుప్తరసోదయ మబ్బు నెంత నో
మిన ఫల మంతె కా కొకట ♦ మేలిపదమ్మున కల్మి గల్గునే. ౧౩౮

ఉ॥ డాయఁగవచ్చినా డటు జ ♦ టాయువు సాయ మొనర్ప కూలెఁ బో
కాయముఁ బాయుచో విభుని ♦ కట్టెదుటం బడి నాదువృత్త ముం
బోయెనో తెల్పె యే మనినఁ ♦ బోలదు తా విని యింతవట్టు రా
కేయెడనుండెఁ జూచిన ద ♦ హింపఁడె లంక నిమేషమాత్రిలోన్. ౧౩౯

తే॥ అన్నదమ్ములు కందమూ ♦ లాశను లయి
చిక్కిరో వన్యవృత్తి ని ♦ శ్శ్రీకులగుచు
మునుల సంగతి మెలఁగి ని ♦ ర్మోహు లగుచు
దేవభూయంబుఁ గాంచిరో ♦ దివ్యగతిని. ౧౪౦

తే॥ కాకయున్న నిన్నాళ్లకుఁ ♦ గాంచకుండు
వారె నాగతిఁ దెలిపెడు ♦ వారు లేక
యొదిఁగియున్నారొ తెలిసిన ♦ యొక్కక్షణము
లో నరాక్షస మొనరింత్రు ♦ లోక మెల్ల. ౧౪౧

క॥ వేలుపులేనియు ననుఁ గని, జాలింబడి వార్తఁ దెలుపఁ♦జాలరొ పతి దా
నాలించిన యంతనె యి, న్నాలిగ్రహంబులఁ దెరల్చి♦ననుఁ గొని చనఁడే. ౧౪౨

తే॥ అబ్ధి నింకింపదో యగ్ని♦నార్పలేదొ, యుప్పరంబున కెగయదో♦యుర్వి యెల్లఁ
దానయై నిల్వదో యేమి♦తఱుగు గలదు, రామవిభుని ప్రతాపాభి♦రామరమకు.

క॥ నాపున్నెము క్షీణించెను, బాపము పయిఁబడియె నింకఁ♦బద్ధతి కలదే
యీపలుగాకులచే పడి, రూపఱి పో నున్నదాన♦రూఢి తలంగన్. ౧౪౪

ఆ॥ విషము పడయఁగాంచు ♦ విధము దోఁపదు చిచ్చు
గూర్చువారు లేరు ♦ గూడు నెట్లు
జలధిపొంత కరుగ ♦ జంతలచేఁ జిక్కి
చాకమున్నె నియతి ♦ చంపరాదొ. ౧౪౫

ఆ॥ ఈయశోకశాఖ♦కీవేణి గట్టి యు, ద్బంధనమున నుసుఱు♦బఱపుదాన
నింతకన్నఁ గాన♦నెక్కుడైన యుపాయ, మనువుగానిచోట♦నాఁకపడుట. ౧౪౬

వ॥ అని నిశ్చయించి వెండియు. ౧౪౮

క॥ తన యంగమ్మున, దానొదుఁ, గును దిక్కులు సూచు వడఁకు♦గోడ్పడు వదరున్
గనుఁగొనల నశ్రువులు జా, ల్కొన నాభద్రముఖ చింత♦కూలంకషగాన్.

తే॥ వెడలు నిశ్శ్వాసముల నీల ♦ వేణి వేణి
వ్యాళియో మిత్త్రియో నాఁగ ♦ నడరి యామె
కంపనంబునఁ గంపించు ♦ గతికి వెఱచి
కాక రక్కస లొక్కటఁ ♦ గమిచి యిడరె. ౧౪౯

క॥ అనుపదమె దుఃఖవార్నిధి, మనమున నతివేల మగుడు♦మానిని మఱి యి
ట్లని విలపింపఁదొడరె రా, ముని దెస విరహాగ్ని తీవ్ర♦ముగఁ బెనుపొందన్.

క॥ కట్టెఁడి విధి కైకమదిం, బుట్టించిన యట్టి తలఁపు♦వోలదె ప్రియ! ని
న్నట్టడవి వీడి యాచెడు, గుట్ట నుసుఱు వాయు నాదు♦ఘోరస్థితికిన్. ౧౫౧

సీ॥ జీవితేశ్వర! నీదు♦జీవనం బయ్యు నే, దిక్కులేకీ భంగిఁ♦దెరలుదాన
హా కోసలాత్మజా♦హా సుమిత్రా! మీకు, నాకు నైన ఋణంబు♦నాఁడె తీఱెఁ
దండ్రి! లక్ష్మణ! యింక♦దయ యుంచుమయ్య ని, న్దఱిమి నందుల కిట్టి♦దశ ఘటిల్లె
జనక! నా కాన్పన♦జనవివాదము దక్క, నీ కబ్బు ఫలితంబు♦నెఱయఁ గలదె
జనని! నీపేరు పెంపును ♦ క్షమయ కాక
యున్న నోర్తె యీకష్టమ్ము ♦ లొదిఁగి యొదిఁగి
యఖిలబాంధవులార! మి ♦ మ్మరసి పూజ
సేయు భాగ్యంబు నేఁటికి ♦ జీర్ణ మయ్యె. ౧౫౨

తే॥ పాతకుఁడు దీని సృజియింప ♦ ఱాతిచేవ
యినుపచిట్టెమ్ము వజ్రమ్ము ♦ నెనయఁ జేర్చెఁ
గాకయున్న భవద్వియో ♦ గమున నిట్లు
పగులకున్నె నాహృదయంబు ♦ పదిల మగుచు. ౧౫౩

ఉ॥ ఇంతకుఁ దాళి తాలిమిన ♦ యే నమరత్వముఁ గాంచనుంటి నిం
కెంతకుఁ జాల నెట్లు హృద ♦ యేశ్వర! ని న్నెడఁబాసి పాపపుం
బొంత ధరించి రక్కసల ♦ పోటరిమాటల యాటుపోటులన్
జింతల మున్గి తేలుచును ♦ సిగ్గఱఁ గీడున కోడకుండుటన్ ౧౫౪

ఆ॥ ఏ ననార్య నసతి♦హేయ నమర్యాద, నట్లు గాకయున్న♦నసుర బలిమిఁ
బట్టి తెచ్చి యిచటఁ♦బాఱవైచిన నాఁడె, చావనే భవత్ప్ర♦సక్తి లేమి. ౧౫౫

క॥ పితృవాగ్గతిపరిపాలన, మతినియతి న్నెఱపి నిజమ♦హారాజ్యశ్రీ
మతి నారతి వీడి సుఖం, బతివలు గొలువంగఁ గాంత!♦యటఁగాంతుఁగదే.

సీ॥ తలఁపరే యెద నెప్డు♦తారసిల్లునొ నాఁటి, కలిమికల్మి యటంచుఁ♦గాంతలెల్లఁ
జొక్కరే లోలోనఁ♦జూచి నంతన సుస్మి, తాధరరసధార♦కతివ లోకటఁ
బొంచి కాంచరె దయా♦పూరితేక్షణరమా, వ్యాపార మిదె యంచు♦వనిత లోలిఁ
దమకింపరే మేని♦ధాళధళ్యము వంక, మరుధాటి దులకింప♦మగువ లెలమి
విశ్వమోహనకలనాప్రి♦వీణుఁడ వని, కాక యభిరామపద మెట్టు♦గలిగె నీకు
నాథ! నాపాలి భాగ్యమ్ము♦నన్నుఁ బాసి, యొడ్లఁ జేరెడు నింకేమి♦యూహ గలదు.

క॥ ఏనుఁ ద్రిశుద్ధిగ నిన్నే, ధ్యానించుచు భూనివిష్టనై నేమమ్ముల్
జానుగ నెఱపుచు నిరశన, నై నవయుచుఁ గాన నైతి♦నఘపారమ్మున్. ౧౫౯

సీ॥ నిండుపున్నమఁ జంద్రు♦నీలోత్పలంబులఁ, దనుప కబ్బునె నీదు♦దర్శనంబు
పొలుపారు తమ్మిపు♦వ్వులఁ బద్మఁ బూజించి, కాక నీశుభదృష్టిఁ♦గాంచఁ దరమె
దర్పకునకు సూన♦దామం బిడక నీదు, కౌఁగిటఁ బొదల నో♦కలన గలదె
పంచపల్లవముల♦భవుని నర్చింపక, చాలునే నీమహై♦శ్వర్యమునకు
శౌరి కేకాంతభక్తి ము♦న్జరుపకున్న, నిన్నుఁ దక్కఁగొనెడు కల్మి♦నెగడ నగునె
కొఱఁతఁబడెఁ దన కిన్నిఁటఁ♦గొన్ని యెట్టి, భాగ్యవతి వ్రతసంపూర్తి♦వడసినదియొ.

ఉ॥ ఎల్లజగంబులుం గొలువ ♦ నీవు చెలంగెదు చెల్మికల్మి నీ
యుల్లము ధర్మకామము ప ♦ రోపకృతిం జరియింతువేమొ సం
పల్లసితాత్మరూపుఁడవు ♦ భార్య యనం బని యుండ దట్లు గా
కొల్లమి సూపుదే తలఁచి ♦ యోర్తువె నాపదుపాటు లింతకున్. ౧౬౦

ఆ॥ కనుల యెదుట నున్నఁ ♦ గాక సౌహార్ద మొంటఁ
గలదె కొమలదెసను ♦ గాంతులకును
దప్పఁబలుకుదాన ♦ దయిత! లోకముతోడి
పాడిగాఁగఁ బోల్పఁ ♦ బడదె నీవు. ౧౬౧

ఉ॥ నీదు చరిత్రశుద్ధి స్తవ ♦ నీయగుణోన్నతి దర్శనీయరూ
పోదయ మర్హణీయమహి ♦ మోల్లసితంబు ప్రసన్నభావ మ
త్యాదరవృత్తి శౌర్యము న ♦ యంబుప్రబోధవిశేష మిద్ధరన్
లే దొకఁడేని నొక్కయెడ ♦ లెక్కకు నేనియు జీవితేశ్వరా! ౧౬౨

క॥ ఎందున్నవాఁడవో కద, యిందుప్రతిమాస్య! నీకు♦నీయసురుం డే
చందమునఁ గీడు దలఁచెనొ, ముందే చననైతొ స్వర్గ♦మున కిచ్చమెయిన్.

క॥ నాయెడ దయగల వని ని, న్నోయధిపా! యెఱుఁగనే వి♦యోగాగ్నికిఁ బా
లై యెడలితో యబ్ధికి నై, యేయూహం గొంటివో మ♦తేమైతివో కో. ౧౬౪

సీ॥ కన్నులు చల్లగాఁ♦గమనీయనీలమే, ఘశ్యామలాంగు నీ♦న్గాంతునో కో-
వీనులు దనియఁగా♦విశ్వజనీనము, ల్నీదు పల్కులు విన♦నేర్తునో కో-
యుల్ల ముప్పొంగఁగా♦యుష్మదీయశరాగ్ని, యింత లంత లన నా♦లింతునో కో-
పరవసం బొప్పఁగాఁ♦బఱతెంచి నీయంక, పద మంది పగతురఁ♦బఱతునో కో-
లంక చేడ్పడఁ గోమ లేడ్వ ♦ లాఁతు లెడలఁ
దగిన నేత నిచ్చోటునఁ ♦ దనరఁ జేసి
యచిరకాలంబున నయోధ్య ♦ కరిగి యెల్ల
కోర్కులు భవత్ప్రిసక్తిఁ జే ♦ కొందునో కో. ౧౬౫

క॥ అను నడియాసల నింతకు, మనఁగలిగితిఁ బ్రాణనాథ!♦మార్పడె సుకృతం
బనదవలె నింక బి ట్టిడు, మను బడి యిల నిలువఁజాల♦మన్నింపఁగదే. ౧౬౬

తే॥ ఎన్ని బన్నము ల్వడితివో ♦ నన్నుఁ గూర్చి
యెట్లు కృశియించితో సుఖ ♦ మెడలి యడలి
యిన్నెలవు గన నైతి కా ♦ కేమి సేయు
దాన మనకు ఋణానుబం ♦ ధమ్ము తెగియె. ౧౬౭

సీ॥ ఫాలాక్షువిల్లు చే♦పట్టి చేపట్టవో, నను గీర్తితోడ వి♦న్నాణముగను
నటమున్న తాటకా♦ద్యసురవర్గముఁ ద్రోచి, తపసియాగముఁ గాచి♦దారియిడవొ
యడపఁవో మునిమృగ♦వ్యాధు విరాధు నీ, వడవి సొచ్చిన నాఁటి♦యాత్తణమున
దుర్దాంతు లాఖర♦దూషణాదుల నొక్క, గడియలోఁ ద్రుంచి ప్ర♦ఖ్యాతిఁగొనవొ
మడిసినో లేదొ యెఱుఁగ న ♦ మ్మాయదారి
మెకము నీతోడి పొత్తున ♦ మేలు నాకుఁ
గాక యుండంగఁ జేసె నాఁ ♦ గాక నీప్రి
తాప మెదిరి జీవించు ప్రి ♦ తీపుఁ డున్నె. ౧౬౮

క॥ అంతటి సిరి మననగు తన, కింతలు వంత లొదవంగ♦నేమనఁ జను శో
కింతు నుసు ఱుండువఱకు న, శింతుం దరి యబ్ధిఁ జిక్కి♦చేడ్పడుభంగిన్. ౧౬౯

తే॥ నాకుఁ దృప్తి ఘటింప్రుము♦లోకనాథ!, కడఁగి నీవు విరాగమ్ము♦గనక యసుర
రక్తధారల నేను స్వ♦ర్గమున నుందు, నేని ధర నుందునేని మ♦దిష్ట మిదియ.

వ॥ అని పలువిధంబుల విలపించుచు వేణ్యుద్బంధనమ్మున కుద్యమించి యెల్లవారలం
గలయం గనుంగొని. ౧౭౧

తే॥ అదరిపడఁబోకుఁ డింక నో ♦ యసురులార!
యనదయుఁ జితాగ్నిధూమాభి ♦ హతయు గృధ్ర
సంకులయు నయి యీలంక ♦ సత్వరంబె
పాడువడు రామబాణప్ర ♦ పాతమునను. ౧౭౨

ఉ॥ నావలె నేడ్చువారు తమ ♦ నాథులు వోవఁగ లంక నాండ్రు దు
ష్టావిలభావ మొప్ప నను ♦ నాడిన కీడునఁ జేసి కష్టుఁ డా
కావరుఁ డగ్ని బాణమునఁ ♦ గాలునకావృత మింక రామభూ
దేవు నెదిర్చి చేడ్పడి వి ♦ దీర్ణహృదంతరుఁ డై క్షణంబునన్ ౧౭౩

ఆ॥ అనుచుఁ దెంపుసేసి ♦ యుఱుము నద్దేవి యు
ద్యమ మెఱింగి కొంద ♦ ఱసుర కెఱుక
సేయ నరిగి రన్య ♦ లాయమ ధర్షింపఁ
దొడరి రాక్రమించి ♦ తోయజాక్షి! ౧౭౪

— ♦ త్రిజట రాక్షసాంగనలకు స్వప్నవృత్తాంతమును జెప్పుట. ♦ —

శా॥ ఆలో నిద్దుర మేలుకాంచి కలలో ♦ నాకొన్న యాకూతికం
బాలోలాత్మికఁ జేయఁగాఁ ద్రిజట యై ♦ త్యస్త్రీల యౌద్ధత్య మ
ట్లాలోలేక్షణ సాహసిక్యమును గ ♦ న్నారంగ వీక్షించి ము
న్నాలోడించు మనంబు నేటుకొని నె ♦ య్యం బెన్నఁ దానిట్లనున్. ౧౭౫

ఆ॥ చెడిపలార! మీరు ♦ చెడినది గాకొంటఁ, జెఱుపఁ దలఁప నేల ♦ సీత నలఁతి
చూతురేమొ జనకు ♦ సుత దశరథు కోడ, లిద్ధచరిత రాము ♦ నింతి భూజ. ౧౭౬

తే॥ మిమ్ము మీరలె తినుజాడ ♦ మెయికొనంగ
నొడ్ల గ్రసియింతు మని పల్కు ♦ టుచిత మగునె
కర్కటినిఁ గాను పట్టు లి ♦ క్కాంత లంకఁ
గదిసెఁ జెడఁజూడ నని యింత ♦ గాన రెట్లు. ౧౭౭

క॥ కలరే ముజ్జగముల ని, క్కల రేయుం బవలు భర్తృ ♦ గామితపత్నీ
కలితాస్థ నవయు యువతులు, కలితాపహృదాఖ్య యీపె ♦ గాదె ధరిత్రిన్.

క॥ ఏ నొక కలఁ గంటిఁ దిరం, బౌ నది రక్కసులు సెకుదు ♦ రమలహృదయ యి
మ్మానవతి పతికి జయ మగుఁ, బోనిం డిట్టి తొడుగలఱలు ♦ పాడవుపడుదురే.

క॥ అన నలు కలుకయు నహహ మహా, మని తొడరఁగ నేది యేది ♦ యది మెట్టిదో యం
చని త న్నతిమెదువారల, కనుపద మిట్లనియె నదియు ♦ నందఱు వినఁగన్. ౧౮౦

క॥ పొందుగ గజదంతమయము, నందలమును వేయు నంచ♦లందు వహింపన్
సుందరముఖుఁ డొకఁ డం దా, నందముతోఁ దోడుతోడ♦ననిచె న్నిరులన్.

సీ॥ కల్యాణకారుణ్య♦కలితార్ద్రదృష్టు లి, జ్జగ మెల్లఁ గని ప్రోవఁ♦జాలి నెగడఁ
జివురుపైఁ బువు వెల్ల♦చెట్టు మే ల్సిరి పాదు, చిఱునవ్వ శ్రితకామ్య♦సిద్ధిఁ గూర్ప
రేపుమాపనక సం♦ప్రీతి మేకొను మోము, జాబిల్లి శ్రేయఃప్ర♦సాద మొసఁగ
నీడచూడని జాడ♦నిద్దంపుఁ బలుతేజు, దోసకారుల కల్మి♦దుంగఁ జేయ
నాత్రిభువనైకమోహనుం ♦ డనుజుఁ డన్ని
యంశములఁ దనతోడివాఁ ♦ డగుచుఁ గూడి
రాఁగఁ గనువారి వినువారి ♦ రాగలహరి
ముంపఁ దేల్పంగఁ దాన యై ♦ మొనయు నంత. ౧౮౨

క॥ తెల్లని పువ్వులు గంధము, తెల్లని యంబరము దాల్చి♦దిపజాంగన య
ట్లుల్లసిత యగుచు వారిధి, వెల్లితశుచిశిఖరిశిఖర♦వృత్తిం దిర యై. ౧౮౩

ఆ॥ ఈవిదేహతనయ ♦ యెలమి మై నుండ న
ప్పురుషుఁ డొలసి తివిచి ♦ పూవుఁబోఁడి
వెల్లయేన్గుపైని ♦ వెలయించి సానుజుఁ
డతఁడు నెక్కి తిరిగె ♦ నంబరమున. ౧౮౪

తే॥ భాస్కరునితోడి ప్రభ యట్లు ♦ పద్మనయన
యిందు చెంగటి శచి యట్లు ♦ లెసక మెసఁగె
రాము నెనసి యటం చభి ♦ రామసూక్తు
లాకసంబున విననయ్యె ♦ నంతపట్టు. ౧౮౫

ఆ॥ అవలఁ గొండచివర ♦ నాభద్రగజముపైఁ, బరఁగి యట్లు వెలయు ♦ భాసురాంగి
చెలువు నంకపీఠిఁ♦జెలఁగుచుఁ జంద్రసూ, ర్యులను జేతఁ బుణుకు♦చుండఁ గంటి.

ఆ॥ భద్రముఖులు వారు ♦ భద్రేభ మెక్కి సా, భాగ్యవిలసనమునఁ ♦ బరఁగుచుండ
నదియు లంకపైని♦దై యొప్పె నొండెడ, కరుగ నఱుము కలిమి♦యట్లువోలె.

క॥ ఎద్దులఁ బూంచిన తేరున, ముద్దియయుం దోడుఁ దాను ♦ ముదితహృదయు లై
యుద్ది యనరాని సిరి గల, యద్దశఁ గనుపట్టి రంత ♦ నంబరవీథిన్. ౧౮౮

క॥ అత్తఱి రవిప్రకాశం, బుత్తమ మా పుష్పకమున ♦ నురుతరమహిమా
యత్త మగు విభవ మొప్పఁగ, నుత్తరదిశఁ గనుచు వార♦లొగిఁ జని రెలమిన్.

ఉ॥ రాముఁడు దుష్టరాక్షసవి ♦ రాముఁడు స్వాశ్రితభక్తకల్పకా
రాముఁడు యోగిసంవిదభి ♦ రామసుధాంబుధిసోముఁ డిందిరా

కాముఁ డజయ్యుఁ డంచుఁ గను ♦ గానఁగనీయని దుర్మదంబునన్
బూమెలు సేయువా రతనిఁ ♦ బోలుదురే యెదురందురంబునన్. ౧౯౦

క॥ స్వర్గము పాపుల కట్లు ని, ర్వర్గళభుజసత్త్వ రాము ♦ నలవియె కవియన్
దుర్గతులు వీరి కెమ్మెయి, భర్గాద్భుతుఁ డతఁడు వశము ♦ పడు నలఁతులకున్.

తే॥ బోడి యై కప్పు దాలిచి ♦ పుష్పకమున
నుండి యొక్కర్తు దిగువఁ దా ♦ నుర్విఁ గూలి
రక్తమాల్యానులేపుఁ డై ♦ రభసమున ఖ
రంబుపై నెక్కి కన్పట్టె ♦ రావణుండు. ౧౯౨

తే॥ దక్షిణపుదిక్కుఁ గాంచుచుఁ ♦ దరలి తెరలి
పడియెఁ దలక్రిందుగాఁ గర్ద ♦ భమునుండి
యతఁడు దుర్గంధ మతిఘోర ♦ మంధకార
బంధురము నారకము నేన ♦ పంకమునను. ౧౯౩

ఉ॥ తైలము మేనఁ బూసికొనఁ ♦ ద్రావఁ దలంటుకొనంగ నై ధర
న్వ్రాలుచు లేచుచు న్విగత ♦ వస్త్రుఁడు మత్తుఁ డసత్ప్రలాపుఁడున్
గా లఘువృత్తి నుండఁ గని ♦ కాళి యొకర్తుక కంఠరజ్జువున్
గోల నమర్చి యీడ్వఁ జనెఁ ♦ గో యని యార్చుచు వాఁ డవాగ్దిశన్. ౧౯౪

తే॥ కలఁగి యింద్రజిదతికాయ ♦ కలశకర్ణ
ముఖులు విభుతోడిగతిఁ దారు ♦ మొనయఁగాంచి
రజవరాహోష్ట్రశింశుమా ♦ రాధిరూఢు
లగుచు మలపంకదిగ్ధులై ♦ యాక్షణమున. ౧౯౫

తే॥ రక్కసులు రక్తమాల్యాంబ ♦ రములు దాల్చి
గోమయహ్రదంబులఁ జొచ్చి ♦ కూలి రందు
లంక నిర్దగ్ధ యయ్యెను ♦ లాఁతివారి
దూతచేత నలాతసం ♦ ఘాతచేత. ౧౯౬

తే॥ అలరుచు విభీషణుండు శ్వే ♦ తాతపత్ర
మమర శుచిగంధమాల్యాంబ ♦ రాఢ్యుఁ డగుచు
మేలిచౌదంతి నెక్కి యె ♦ మ్మెలు దలిర్పఁ
దిరిగె సంబరమున నేమి ♦ తెఱఁగుగలదో. ౧౯౭

క॥ నలువురు మంత్రులెలమిఁ ద, న్గొలువఁగ శోభిల్లి యతఁడు ♦ కోమలగీతు
ల్లలితశుభతూర్యనిస్వన, ములు వినుచు మహోల్లసనము ♦ మొనకొనఁ దనరెన్.

క॥ ఈకలఁ గల యర్థం బిది, యేకలననయేనిఁ దప్ప ♦ దింతయు నిజ హాఁ
బ్రాకటయశోవిశాలుఁడు, శ్రీకాముఁడు రాముఁ డాజిఁ ♦ జేకొను జయముల్.

తే॥ అరయఁ జెడుకాల మిది శర ♦ ణార్థుల మని
సాధ్వి యిద్దేవి వేఁడుఁ డా ♦ శంకఁ దక్క
యెలమి నీయమ కరుణింప ♦ నెంచెనేని
బ్రదుకఁ దలఁచినవారికి ♦ బ్రదుకు గలదు. ౨౦౦

ఉ॥ ఈలలి స్వప్న మార్త యగు ♦ నేకొమవంకఁ దొలంకు నాపెకున్
మే లొనఁగూడు నిక్క మిది ♦ మేకొని శోభనము ల్నిమిత్తముల్
జాలుగ నీసతీమణిదె ♦ సం గనుపట్టెడు నింకఁ నేరిమి
న్నాలిమి గోరి చేరి బ్రతి ♦ మాలిన సాధ్వి ప్రసన్న యయ్యెడున్. ౨౦౧

ఆ॥ అనిన వెఱపు గదుర ♦ నల్లంత నిలిచి రా
గ్రహము దొఱఁగి బిఱుసు ♦ కట్టె లంత
పట్టువారు పుడమి ♦ పట్టి తాఁ బట్టిన
పట్టు వీడకుండెఁ ♦ బద్మనయన! ౨౦౨

ఉ॥ ఆడిన చెట్టరక్కసల ♦ యానుడికారము లగ్గిగాడుపు
ల్వాడఁగ జేయు వాడఁబడు ♦ వల్లరికిం దగు పూవుకొమ్మల
న్వాడుకఁ గన్న బాహువుల ♦ వామవిలోక యశోకశాఖికన్
వీడక తార్చి తా బ్రదుకు ♦ వేసరియుండెడు నాక్షణంబునన్. ౨౦౩

—♦ సీతామహాదేవికి శుభశకునములు తోఁచుట. ♦—

సీ॥ వామాక్షి వామాక్షి♦వల్గుపక్ష్మసులక్ష్మ, మదరె మీనాహత♦మబ్జ మనఁగఁ
బొదలెఁ దెమ్మెర రెమ్మఁ♦బూరెమ్మ యిమ్మున, సవ్యమ్ము భుజ మిష్ట♦చందనమ్ము
బంగారురంగారు♦పసుపుదుప్పట మింత, ముడివీడె మగనికై♦మొనసివోలె
స్పందించెఁ గల్యాణ♦కందమ్ము డాతొడ, యందుగు గను హస్తి♦హస్త మట్లు
సంపదలు పెంపెనయు నాఁటి ♦ చంద మంద
మనువుపడ మంగళాంగి క ♦ య్యనుఁగుఁజెలులు
శోభనములు నిమిత్తము ♦ ల్బూచి తెలిపె
రాముఁ డిదె వచ్చె ననుచు మ ♦ రాళగమన! ౨౦౪

ఉ॥ బింబఫలాధరోష్ఠ మర ♦ విందనిభం బలకాళిపాలికా
చుంబిత మంచితభ్రు వధి ♦ శోభననేత్ర మరాళపక్ష్మ మా

స్యం బతిశుభ్రదంత ముప ♦ సంభృతసద్గుణ మై స్ఫురించె ఫా
లంబున రాహుముక్తము క ♦ లానిధిబింబము నాఁ దనర్చుచున్. ౨౦౫

ఉ॥ శోభనపక్షి వృక్షమునఁ ♦ జొక్కపుఁ బక్షసపక్షభావముల్
శ్రీభవనంబు లై తనరఁ ♦ జిల్కెను బల్కెఁ గుల్కు లొల్క దే
వీ! భయ మింక లే దనఁగ ♦ నేయది సాంత్వమొ యద్ది స్వాగతం
బై భువనాధినాథు దెస ♦ నర్థముకై వివరించె నర్థముల్. ౨౦౬

తే॥ అట్లు పొడకట్టు నవియు ము ♦ న్నమరియున్న
యవియు నగు శుభశకునమ్ము ♦ లంది సుప్రి
బోధబోధిత యై పొల్చెఁ ♦ బుడమిపట్టి
వడలియున్న పయిరు వృష్టి ♦ వడసిపోలె. ౨౦౭

ఉ॥ ఆయమ వీతశోకయు న ♦ పాస్తనిరోధయు ముక్తతంద్రియున్
శ్రీయుతమూర్తియు న్మహిత ♦ చిద్బలసత్త్వయుఁ గాఁగ హర్షపుం
దోయధి పొంగఁ బొల్చె గుణ ♦ తోయధి యై తగు నెమ్మొగమ్మునన్
గాయజు మామ నెమ్మిఁ గని ♦ కాంతిఁ వలిర్చెడు రాత్రికై వడిన్. ౨౦౮

క॥ అమ్మెయి శుభసూచనముల, నెమ్మి గనంగాంచి యేమి♦నెఱి గల దని యా
యమ్మ తన నెమ్మన మ్మ, బ్రిమ్మునఁ దనరార నొందు♦పాల్పడకుండన్. ౨౦౯

క॥ అంతయు నారసి యాహను, మంతుఁడు ధీమంతుఁ డలరి♦మనుకులమణి సీ
మంతిని మేలెంచుచుఁ గృ, త్యాంతరచింతావశంవ♦దాత్మతఁ దనలోన్. ౨౧౦

వ॥ ఇట్లని వితర్కించె. ౨౧౧

—♦ హనుమంతుని విచారణ ♦—

క॥ నందనవనదేవత తా, నిం దున్నది యిందువదన♦యే మనువాఁడన్
గొందలపఱిచెదు నీచెదు, పందల కిం కెట్టిపాట్లు♦పాటిల్లునొకో. ౨౧౨

ఉ॥ ఈసతిఁ బోలువారు కల ♦ రే భువనత్రయమందు నేనిఁ బే
రాస వహించె రాముఁ డన ♦ నానుడి పెద్దయె యిన్ని గాంచి నా
కోసరిలంగ నెట్టు లగు ♦ నోరిమి నింతకు నైన కల్మి తా
వీసరపోవదే క్షణము ♦ విహ్వలవృత్తి నుపేక్ష సేసినన్. ౨౧౩

చ॥ కపివరు లీయమ న్వెదకఁ ♦ గాఁ జని రెల్లెడ వేనవేలుగా
నపరిమితాత్మసారు లటు ♦ లందఱు నుండఁగ నాదు భాగ్య మి
ట్లుపచితసత్ఫలం బగుచు ♦ నొప్పెనె పో యది యెట్టులేనియున్
విపరిణతంబు గాకమును ♦ విస్తరిలంగ మెలంగఁ జెల్లదే. ౨౧౪

ఆ॥ శత్రుశక్తి నెఱిఁగి ♦ చాలి గూఢచరుండ, నై చరించి యట్టు ♦ లరయఁగంటి
దనుజబలము పురము ♦ దైత్యాధిపతి ప్రాభ, వంబు జ్ఞేయవస్తు ♦ వాస్తవంబు.

క॥ అంతిక మెనసియుఁ గృత్యం, బంతిమఫల మంద దయ్యె ♦ నకటా యెమ్మైఁ
గాంతునొ దరి గనరా ది, క్కాంతామణిఁ బలుకరింపఁ ♦ గా నెడలేమిన్.

సీ॥ సర్వసత్త్వసముండు♦సాధువర్తనుఁడు రాముఁ, డతనిఁ దేర్పక కర్జ♦మనువు గాంచ
దది సంఘటిల్ల ది♦వ్యాతివ వాచక మంది, కొని తెల్పి యభియుక్తిఁ♦గూర్పకున్నఁ
గన్న మేరకుఁ దెల్పఁ♦గాఁ గాదు శ్రేయంబు, దోసము ల్పెక్కులు♦దోఁచు దాన
నుభయరాగంబు ల♦త్యూర్జితంబులు గాన, నాలస్య మైన న♦త్యాహితంబు
పలుకరింపక పోరాదు ♦ పలికినంతఁ
బాడురాకాసు లేవంకఁ ♦ బరఁగువారొ
యి మ్మురయ కీయమయు నెట్టు ♦ లెంచునొక్కొ
యేగతి మెలంగవలయునో ♦ యెఱుకపడదు. ౨౧౮

క॥ చిత్తము చెడియుండుట నీ, యుత్తమ నమ్ముననఁ బోల ♦ దూరకె చనినన్
మిత్తికిఁ బొల్పడు నిజ మీ, యొత్తిడి గడువంగ నైన ♦ నొండరయ నగున్.

తే॥ ముగుద కీరాత్రి కడచన ♦ మొనయకున్న
యంతలోన నె యూఱట ♦ నందఁజేయ
నైతినేని ఘాతుకుఁడ నే ♦ నౌదు శ్రేయ
మెన్ని తెఱఁగులనేనియు ♦ నెడయఁ గలదు. ౨౧౯

క॥ కావున నీరక్కైన లే, భావంబున నైనఁ దలఁగఁ ♦ బాఱు టరసి యీ
భావిని సంభావించెద, భావికచరితుండు రాము ♦ పావనకథలన్. ౨౨౦

సీ॥ సంస్కారయోగప్రి♦సక్త యౌ వాక్కునఁ, బలికిన నిమ్మాత♦భయము గదుర
సీతండు రావణుం♦డే యగు మాయావి, యెన్నిరూపులు గొనఁ♦డింత కనుచు
నఱచిన నీజంత♦లదరిపాటున నన్ను, ముట్టడింత్రో యనర్థ♦మాలముగను
రక్కసునకుఁ దెల్పి♦రట్టు గావింతురో, యెట్టులైననుఁ జెడు♦నెల్లజతన
మీయమఱునేని నాకేని♦నెగ్గుఁగూర్ప, నబ్ధి గడువంగనీక త♦న్నాఁగ నెంత
లైనఁ జేయంగఁ జాలుదు♦రాన గలదె, పాపకర్ములు తలపెట్టు♦పనుల కెందు.

వ॥ అట్లగుటం జేసి. ౨౨౧

ఆ॥ నేఁటి పడినపాట్లు ♦ పాటఱిపోకుండ, నందఱకును దెలియ ♦ నైన బాస
కీ లెఱింగి రామ ♦ కీర్తనం బొనరింతు, నవసరంబు సుకృత ♦ మందఁజేయ.

క॥ అని పలుదెఱఁగుల తలఁపుల, ననువర్తనమున మెలంగి ♦ యట నిర్ణయ మి
య్యనువున నెఱింగి యొయ్యన, మునుకొనెఁ బలుకంగ దివ్య♦మునిసంస్తుత్యా!

ఉ॥ ఎంతకు లేదు దైవ మతి♦హీనమతు ల్పొలదిండిజంత ల
ట్లంతలు సేసియుం ద్రిజట ♦ యాడిన యానుడికిం దలంకి య
ల్లంత నొడల్లు వైచి తెఱఁ ♦ గారయనీయని చొప్పుఁ గాంచ నొ
నంతకుఁ గూర్పఁ జాలె నుద ♦ యం బెనయండె హరీంద్రుఁ డింకిటన్. ౨౨౬

క॥ తేనియ ద్రాక్షాద్రవమున, మానుగ సమకూర్చి నట్లు♦మలయించె సమా
ఖ్యానము రాముని చరితము, తో నవరసభృతి నతఁడు వ♦ధూజనతిలకా.

—♦ హనుమంతుఁడు రామకథను వినుచుట. ♦—

సీ॥ కలఁడు మహారాజు♦కల్యాణగుణవార్ధి, దశరథుం డుపమిత♦దశరథుండు
రథకుంజరాశ్వవి♦రాజితుం డురుకీర్తి, ఋజుభావసంశ్రితుఁ♦డిద్ధచరితుఁ
డమలశీలుఁడు దేవ♦సముఁడు రాజర్షుల, యందు మేటి పురంద♦రార్చితుండు
చక్రవర్తికులప్ర♦శస్తుం డహింసాప, రుండు సత్యపరాక్ర♦ముండు సదయుఁ
డనఘుఁ డిక్ష్వాకువంశప్రా ♦ వనుఁడు శ్రీస
మృద్ధుఁడు సుఖప్రదుఁడు సుఖి ♦ యేకధన్వి
యతఁడు పొగడొందె ధరణి ధ ♦ రాధినాథ
మహితహారాళినాయక ♦ మణి యనంగ. ౨౨౭

ఉ॥ ఆతని యగ్రపుత్త్రుఁడు మ ♦ హాత్ముఁడు చంద్రనిభాననుండు ప్ర
ద్యోతనతేజుఁ డాత్మవిదుఁ ♦ డూర్జితుఁ డంచితరామనామవి
ఖ్యాతుఁడు ధన్విమూర్ధమణి ♦ కాతరరక్షకుఁ డస్తతంద్రుఁ డు
ర్వీతల మెల్ల సర్వధని ♦ వేఁగన కొక్కఁడె తాల్పఁ బొల్పడున్. ౨౨౮

తే॥ తనదు ధర్మువుఁ గాపాడు♦తరమ కాక, యఖిలధర్మము ల్గాసింప♦నతఁడె చాలు
స్వజనరక్షణ మని కాక♦సకలజీవ, రక్షణము సేయు సర్వవి♦చక్షణుండు. ౨౨౯

ఆ॥ సత్యసంధుఁ డనుచు ♦ స్వగురుం డనుచు వృద్ధుఁ
డనుచు నృపతి పలుకుఁ ♦ గొని వసించె
వనమునందుఁ బత్ని ♦ యనుజుఁడుఁ దనుఁ గొల్వ
సంగరమునఁ బ్రథిత ♦ సంగరుండు. ౨౩౦

క॥ అడవిని దిరుగుచు నుక్కనఁ, గెడపెను రక్కసుల బహువి♦కీర్ణాకృతులన్
మడఁచె జనస్థానంబునఁ, దొడరిన ఖరదూషణాది♦దుష్టాశరులన్. ౨౩౧

క॥ ఆజి జనస్థానం బటు, లాజనవందితునిచే ని♦హత మైన మృగ
వ్యాజమున వారి రావణుఁ, డోజ మొఱఁగి తోడితెచ్చె♦నుర్వీతనూజన్. ౨౩౨

ఉ॥ వా రటఁ బుణ్యశీల జన ♦ వంద్య ననింద్య ధరాజఁ గానమిన్
ఘోరవనమ్ములం దిరిగి ♦ కుంఠితులై కనఁగాంచి రర్కజున్
వీరుని వానరు న్మహిత ♦ వృత్తి నతండును వేఁడ సఖ్యమున్
ధీరుఁడు రాముఁ డందికొనె ♦ దివ్యులు మే లన నగ్నిసాక్షిగాన్. ౨౩౩

క॥ ఆసుగ్రీవున కొసఁగెను, వాసవసుతు వాలిఁ గూల్చి♦వానరరాజ్యం
బాసుకృతి రవిజుఁడును సీ, తాసతి నెమకంగఁ బనిచెఁ♦దద్దయుఁ గపులన్. ౨౩౪

తే॥ వెదకుచున్నారు వా రిప్డు♦విశ్రుతముగ, నాల్గు చెఱఁగుల నేలతో♦ననుచు దెసల
నేను సంపాతి దెలుప ము♦న్నీరు గడచి, కంటి నీమె నిచటఁ బుణ్య♦కలన వెలయ.

ఆ॥ ఎట్టి రూపు కలిమి♦నేచాయ నేసిరి, నింతి జాడ దెలిపె♦నినకులీనుఁ
డిమ్మహానుభావ♦నియ్యెడఁ గనఁగంటి, నట్టి లక్షణంబు♦లనువుపడఁగ. ౨౩౬

క॥ అని పలికి మిన్నకుండెను, వనచరవరుఁడు నిమివంశ♦వర్ధని విని నె
మ్మనమున విస్మయమునఁ దోఁ, గెను శ్రుత మయ్యె నెటో రామ♦కీర్తనమనుచున్.

సీ॥ ముంగురుల్ పెనగొన్న♦మొగ మెత్తి యల్లన, నిగుడించు మ్రానికై♦నేమ మెసఁగ
దెసలవంకకుఁ దార్పఁ♦దివురు చిత్తమ్మున, రమణు నేఁకట మించు♦రమణ దనరఁ
గ్రిందుమీఁ దనరాక♦కీల్కొల్పు నెట్టన, నద నెఱింగిన జాడ♦యనువుపడఁగఁ
గోర్కి పీసరపోక♦గొనకొన్న విన్ననై, నిలువరించు విరక్తి♦నెలవుకొనఁగ
గాలినుడి కిట్లు సతిచూడ్కి♦గాసిపఱిచె, మేలివార్త కిఁ కెమ్మోయి♦మెలఁగునదియొ
ధవుని తవులున నెద్దియుఁ♦దద్ద మఱతు, రంగన లనంగ నగును బ♦ద్మాయతాక్షి.

తే॥ రామచరితామృతమ్ము సా ♦ రస్య మింత
చెవికి సోకినమాత్రన ♦ చివురుఁబోఁడి
చిగురు పుట్టించె జడనొందు ♦ చిత్తమునకు
మోటు లిగురించు నను మాట ♦ మొదలిమాట. ౨౩౯

క॥ అసదృశ మగు నానంద, మ్ము సతీమణి చిత్తసీమ♦మొనసియు బోధో
ల్లసనమునఁ బొసఁగు వలనున, వసంస్తుతం బన్యో నిక్క♦మరయమి నగజా.

ఆ॥ మఱియు వంజులమ్ము ♦ మ్రానికొమ్మను జూడ్కిఁ
జొనిపి కొమ్మ నెఱపు ♦ శోధనమున

నిగురుగముల నడుమ ♦ నిమిడియున్నట్టి యా
పిన్నకోఁతిఁ గాంచెఁ ♦ బృథునితంబ! ౨౮౧

మ॥ ఉదయం బందెడు భానుబింబమున నా ♦ నోజ న్మొగం బొప్ప వి
ద్యుదతికాంతికి మేని కాంతు లెగువ ♦ న్ద్యోతస్ఫుర ల్గన్నులం
బొదల న్వేష్టితనిర్మలాంబరుఁడు నై ♦ పొల్పారు నమ్మేటి న
మ్మొదలా కాన్పునఁ గాంచి విభ్రమదశా ♦ మూర్ఛాసమాక్రాంత యై.

క॥ ఆతతభయకంపంబుల, నాతనిఁ గనలేక కాంచి♦యతిభీమం బీ
ద్యోత మనుచు రామస్మర, ణాతిత్వరితాత్మవృత్తి♦నలమటపడుచున్. ౨౮౩

ఉ॥ అల్లన నేడ్చుచు న్మఱల ♦ నాతనిఁ గాంచి గతాసుకల్ప యై
మెల్లనఁ దెప్పిఱిల్లి నుడి ♦ మేల్మికి నెట్టన నూఁఱడిల్లుచున్
మల్లడిఁ గొంచు వృత్తు లతి ♦ మాత్రముగాఁ దలయెత్తఁ జిత్తమం
దల్లలితాంగి తర్కమున ♦ న త్తమిలందొడరె న్మనస్వినీ! ౨౮౪

సీ॥ ఇట్టికోఁతినిఁ గాన♦మెన్నఁడేనియు నింత, లనరాని స్ఫురణలఁ♦దనరఁ గాంచి
పిన్నపిచ్చుక యంత♦లున్నవాఁ డిమ్మెయిఁ, బలుక నేర్చునె యొండు♦ప్రశ్రయమున
నొప్పారుచున్నాడు♦యుక్తం బయుక్త మం, చేయూహయునుఁ దోఁప♦దింతవట్టు
స్వప్నమో యియ్యది♦జాగరంబో స్వప్న, మెట్లు కల్గును సుప్తి♦హీన నైన
నాకు నద్దియ యైన బ♦న్నంబ కాక, మేలె కలలోనఁ గపిఁ గాంచి♦మేలుగొనిన
రామలక్ష్మణులకు బంధు♦రాజి కెలమి, సురలు మేకొండ్రుగా వ్రత♦శుభము లిడఁగ.

ఆ॥ ఎల్లసౌఖ్యములకు♦నిక్క లై చొక్కవా, రలకె తక్క ముప్పు♦లలముకొనఁగ
మేను మఱచి నిద్ర♦మేకొన నెట్లగు, నన్నుఁబోఁటిజనము♦నకు జగమున. ౨౮౫

ఉ॥ పార్వణశర్వరీశ్వరవి ♦ భాప్రతిభాసిశుభాననంబు నా
సర్వధనంబు వీడఁగని ♦ సంయత నై గతి దక్కి చిక్కి పా
పోర్వి బడల్పడంగ ధృతి ♦ యొప్పునె యొప్పుల కుప్ప లైన య
ప్పూర్వకథ ల్దలంచి మదిఁ ♦ బొక్కఁగ నెక్కొను నేఁటిదుర్దశన్. ౨౮౬

సీ॥ తలఁతు మత్ప్రాణేశు♦తత్త్వంబు చిత్తంబు, తల్లడం బెడలింపఁ♦దవులు వెనిచి
రహి నింతు శ్రీరామ♦రామా యనెడు సోన, జిహ్వ కేదోసమ్ము♦సేరకుండ
వివరింతుఁ దద్యథా♦వృత్తవృత్తంబుల, నఖిలేంద్రియాప్యాయ♦నాంచితముగ
నర్పింతుఁ దన్మయం♦బై పొంగ నెమ్మేను, తత్పదం బని యన్య♦దశ తలంగ
నిరువు రాత్మభవుల చేఁత♦లిట్లు సేయఁ, బరఁగు తద్గతసర్వభా♦వప్రసక్తి
శ్రుతికి దృష్టికి వింతలు♦చూపలేదొ, దూత యన వీని సృజియించి♦తోరముగను.

క॥ కావున మనోరథం బే, యావలనున నిట్టిరూప♦మెనసె నని మదిన్
భావింతు నదియుఁ బనుపడ, దీవిధి నితఁ డెదుట నిక్క♦మెఱిఁగివచింపన్ ౨౪౯

ఆ॥ వందనము లొనర్తు♦వాచస్పతికి వజ్రి, కగ్ని కట్టు లాస్వ♦యంభువునకు
నేమి పలికె నిప్పు♦డీవ నేచరుఁ డింత, యలఁతిఁబోక తథ్య♦మగునుగాత. ౨౫౦

క॥ అని నెమ్మి వెలయ నిమ్మగ, వనజాయతనేత్ర నొడువ♦వారని కుతుకం
బినుమడిగ విద్రుమాభా, ననుఁ డతఁడు ద్రుమంబు డిగ్గి♦నమ్రుం డగుచున్.

ఉ॥ సన్నిధిఁ గాంచి జాలివడి ♦ సాగి కృతాంజలి యై వినీతిమైఁ
బెన్నిధిఁ గన్న పేదవహిఁ ♦ బెం పెదనింపుచు సత్త్వభావసం
పన్నుఁడు మారుతాత్మజుఁడు ♦ భావినితోఁ బలుకందొడంగె న
భ్యున్నతి తెన్ను సూపు మధు♦రోక్తుల కాయమ హర్ష మందఁగన్. ౨౫౨

—♦ హనుమత్సీతాప్రసంగోక్తులు. ♦—

సీ॥ ఇంతి! యేధన్యుని♦యిల్లాలవో తెల్పు, మాపు గట్టితి వేల♦మంగళాంగి!
చెట్టుకొమ్మకుఁ జేయి♦చేర్చి తేమి లతాంగి!, యేకతమ్మునఁ జింత♦లింత లొదవె
నోయనిందిత! కార్శ్య♦మొంది తేనియతిమై, నిట్టూర్పు లేమంచు♦నెఱపె దిట్లు
వేఁడిసీ గొదవెడు♦వెలఁది! కన్నమ్ములఁ, గల్యాణి! నెమ్మేని♦గాసిపఱుతె
నీవరుంధతివో శచి♦వో వృషాంకు, సతివొ రోహిణివో సర♦స్వతివొ సిరివొ
కిన్నరసురాసురాశుగ♦పన్నగాధి, రాజపదముల నెం దభి♦రామ వైతొ. ౨౫౩

క॥ కొడు కెవ్వఁడు మగఁ డెవ్వఁడు, పడఁతిరొ! జనకుం డెవండు♦భ్రాతయు నెవ్వం
డడిగెద నాయెడ నీ నెన, రెడలఁగనీ కెఱుకపఱుచు♦మింతయు నాకున్. ౨౫౪

క॥ దేవాంగన వని తలఁచెద, భావిని! యనుభావ మెడఁద♦భావించి నృప
శ్రీవిలసిత వని యెంచెదఁ, బావనచిహ్నములు కొన్ని♦ప్రకటము లగుటన్.

తే॥ భూమిసంస్పర్శమున నూర్పు ♦ వుచ్చుకతన
బాష్పవారినిమేషము ♦ ల్పరఁగుచుంటఁ
గనుల మేలనమున నూహ ♦ గాంతు మనుజ
వంశమణి నీ వగుదు వంచు ♦ వామనయన! ౨౫౬

ఆ॥ మొఱకు రావణుండు♦మొఱఁగి జనస్థాన, మందు నుండఁ దెచ్చి♦నట్టి సీత
వైన నీకు భద్ర♦మగుఁగాత నాతల్లి!, తెలుపు మింతవట్టుఁ♦దేటపడఁగ. ౨౫౭

క॥ అతిమానుష మగు రూపం, బతిదైన్యస్థితి తపోని♦యతి సద్భావో
న్నతియుఁ దెలుఁ గిట్టి దన నా, మతి నెంచెద నీవు రామ♦మహిషి వటంచున్.

ఆ॥ అని వినీతి దనర ♦ హనుమ పల్కిన పల్కు
లాదరమున విని ప్ర ♦ హర్ష మంది
రామకీర్తనమున ♦ రహిమించు నెమ్మది
తో వచించె నామె ♦ తోయజాస్య ! ౨౪౯

సీ॥ నిమివంశపావనుం♦డమలప్రబోధుండు, జనకుండు జనకాఖ్య♦జనవిభుండు
రాజసింహుండు వి♦రాజమానయశుండు, శ్వశురుం డాధ్యుం డగు♦దశరథుండు
కల్యాణగుణనిధి♦కారుణ్యపాథోధి, ప్రాణేశ్వరుండు రామ♦భద్రదేవుఁ
డవనిపైఁ బుట్టితి♦నవని కన్నియ నాఁగ, సీతాభిధానవి♦ఖ్యాతి దనర

మొనసి పండ్రెండు వత్సర ♦ మ్ములుఁ బ్రసత్తి
నేనుఁ బ్రియుఁడును నెవ్వారి ♦ కేని నంద
రాని సౌఖ్యమ్ము లందితి ♦ మానతారి
కీర్తనీయసమృద్ధి సా ♦ కేతమునను. ౨౫౦

తే॥ ప్రజలు వొగడ గురుం డుప ♦ పత్తి నెఱప
విభునిఁ బ్రభుఁ జేయఁ దలపెట్టె ♦ వృద్ధరాజు
తదభిషేకసన్నహనంబు ♦ తద్దఁ గాంచి
దేవి కైకేయి మదిఁ గడుఁ ♦ దీవరమున. ౨౫౩

క॥ మును నా కొసఁగిన వరయుగ, మున రాముని వనికిఁ బనుపు♦ము ధరిత్రికి మ
త్తనయుని విభు నొనరింపుము, జనవర! గతి గనుము సత్య♦సంధత తనరన్.

తే॥ అన్నపానేచ్ఛ మున్నుగ ♦ నసువు లెడపఁ
జూతుఁ గా కటు ఘటియింపఁ ♦ జూడ వేని
ననిన దత్తవరుం డతఁ ♦ డలికి సత్య
ధర్మముల నొండు వీడంగఁ ♦ దరముగామి. ౨౫౩

క॥ సంతాపమునం బొరలుచు, సంతానజ్యేష్ఠు రాము ♦ సర్వప్రియు న
త్యంతముదావహు వేఁడెను, బంతము చెల్లింపఁ దనదు ♦ ప్రాజ్ఞత వెలయన్.

సీ॥ అమ్మహామహు పట్ట♦యభిషేచనముకన్న, మే లంచు నెమ్మదిఁ♦గీలుకొల్పెఁ
దండ్రి యానతిఁ జతు♦ర్దశవత్సరమ్ములు, వనమునఁ జరియింపఁ♦బ్రతిన నెఱపె
నోర్పుతోఁ బినతల్లి♦యొసఁగిన వల్కల, మ్ములు దీక్ష కైకొలు♦మొనయఁ దాల్చెఁ
దనతల్లి వల దన్నఁ♦దత్త్వంబు నెలకొల్పి, మెప్పించి యాయమ♦మెప్పు వడసె

నొసఁగు నారులకుఁ దా వేఁడఁ ♦ దొడఁగి యొడ్ల
నప్రియమ్ముగఁ బలుకఁబోఁ ♦ డరులతోడ
నైన ధర్మువునకు సాటి ♦ యనఁ ఋసుఋల
రామచంద్రుండు సత్యప ♦ రాక్రముండు. ౨౬౫

ఆ|| తన్ను గురులయొద్ద ♦ దయితుండు నిలు మన్న, నిన్ను విడచి బ్రదుక ♦ నేర నంటి
నతనిఁ బాసినట్టి ♦ యదనున నది స్వర్గ, మేని నెలవుకొనఁగ ♦ నిచ్చ సోరమి.

క|| మిత్రాభినందనుఁడు సౌ, మిత్రి మహాభాగుఁ డెలమి ♦ మేకొనఁ దన సౌ
భ్రాత్రము వెలయఁగ భ్రాత్రను, యాత్రుం డై తరలె వల్క ♦ లాంచితుఁ డగుచున్.

ఆ|| కడఁగి ముప్పూరము ప్ర ♦ కాండమ్ము దండకా, రణ్యమున వసించి ♦ రాణఁ దనరు
చుండఁ జెట్ట పోలసు ♦ దిండి న న్నిటఁ దెచ్చె, నండబాసి వార ♦ లడవి కరుగ.

క|| ఉండును జీవిత మింకిట, రెండు నెలలదనుకఁ దనకు ♦ రేదిప్రమ్మరితేఁ
డొం డరయక వలనునఁ దన, తిండికి వధియింపుఁ డనియెఁ ♦ దెఱువలతోడన్.

క|| మన్నాథు వార్త వడయమి, మన్నన సెడి యునికి ముక్తి ♦ మార్గము లేమిన్
మున్నె తన మేను దొరఁగఁగ, నున్నా నేను దఱి యట్టిఁ ♦ డొదవెడునేనిన్.

ఆ|| అనుచుఁ దనదు వార్త ♦ యార్తయై యద్దేవి
వివర మొప్పఁ దెలుప ♦ విని హరీంద్రుఁ
డామె నూఱడించు ♦ నని యిట్టు లనె నయ
మ్మును వినయము మధుర ♦ ముగ మృగాక్షి! ౨౭౦

—♦ హనుమంతుఁడు సీతాదేవికి శ్రీరామచంద్రుని యుదంత మెఱిఁగించుట ♦—

తే|| అమ్మ! కుశలము రామున ♦ కడిగె నీదు, సేమ మధిపుని యానతి ♦ శిరమునందుఁ
దాల్చి వచ్చితి దూతకృ ♦ త్యమ్ము నెరప, వినుము తద్వాచికార్థము ♦ లీవు లలర.

క|| నీదగు కుశలం బరయఁగ, వేదవిదాంవరుఁడు వేఁడె ♦ విజ్ఞానకలా
శ్రీదయితము లవ్వాక్యము, లాదృతిమెయి వినుచు భాగ్య ♦ మందఁగ నయ్యెన్.

తే|| పుణ్యముల గని గొనముల ♦ పోవు భద్రి
లక్షణుఁడు నీకు నతి సేసె ♦ లక్ష్మణుండు
కేలుదోయి శిరంబునఁ ♦ గీలుకొలిపి
యంతరభితాప మశ్రుపూ ♦ ర్ణాక్షు లనఁగ. ౨౭౪

క|| నీమేలు వడయ నన్నయు, నేమమ్మున నిన్నుఁ గొలుచు ♦ నెఱిగనఁ దమ్ముం
డీమెయి వనరాని తలఁపు, లామెతలుగ నిడిన నుడుల ♦ నందుము పేర్మిన్. ౨౭౫

క|| అని పలుకు నతని పలుకుల, మనుకులసింహముల మేలు ♦ మానుగ విని య
వ్వనితామణి మై పులకలు, పనుపడఁ బ్రీతాత్మ యగుచుఁ ♦ బావని కనియెన్.

తే|| బ్రదికియుండిన హర్షమ్ముఁ ♦ బడయఁ గాంచు
నరుఁడు పెక్కేండ్లు గడువ నే ♦ నాఁటి కైన
ననెడు లోకోక్తి నాయెడ ♦ నర్థవతియ
యయ్యె నే మనవచ్చు భా ♦ గ్యంబు కలిమి. ౨౭౭

క|| అన్నా నీనుడివలన, న్నన్నాథుని సేమ మరసి ♦ మనఁగాంచితి నా
పన్నులకు నింతకన్నను, దిన్నని మే లనుచు నొందు ♦ దెలియఁగ నగునే. ౨౭౮

చ|| అని చన విచ్చి పేర్మి పెను ♦ పారఁగ మన్నన సేసి పల్కు న
య్యనఘ విదేహరాజసుత ♦ నాతఁ డభీప్సితవాచికార్థము
ల్వినిచెడు వేడ్కఁ జేరఁ జన ♦ విహ్వలచిత్తత నెంచె మానవా
శనుఁ డీటు తన్మొఱంగ నొక ♦ చాయఁ గనం జను నంచు నాత్మలోన్. ౨౭౯

ఆ|| అనఘవృత్తిఁ జనునె ♦ యక్కటా మాటాడ, దూతబుద్ధి వీని ♦ తోడ నిట్లు
దుష్టవర్తనమ్ము♦తోఁ జరించెడువాఁ డ, టంచుఁ గొమ్మవదలి ♦ యవని నొదిఁగి.

మ|| తను వీక్షింపక యున్నఁ గాంచి యతఁ డో ♦ తల్లీ! పరభ్రాంతి నం
దనుపై నెక్కొననీక వందనములం ♦ దాత్పర్య మొప్పారఁ గొ
మ్మనవద్యం డితఁ డన్న సాధ్వసము మై ♦ నమ్మానినీరత్న మొ
య్యన నిట్టూర్పులు పుచ్చుచు న్మధురవా ♦ క్యారంభ యై యిట్లనున్. ౨౮౧

—♦ సీతాదేవి హనుమని రావణుని మాయగా దలచుట ♦—

సీ|| మాయదారితనమ్ము ♦ మలసి వర్తించుట, భాగ్యమా యిద్దాన ♦ ఫలిత మేమి
మున్ను జనస్థాన ♦ మునఁ గొన్న యయ్యది. చాలదే యొండు వే ♦ సమ్ముఁ కేల
యేడ్చువారల నిట్టు ♦ లేడ్పింపఁగా నీకు, మూట గట్టుకొనంగ ♦ మొనయు నెద్ది
యున్నదానను నిచ్చ♦లుపవాసముల గ్రుస్సి, నా కీడు దలఁచుట♦నయము గాదు
రావణుఁడ వీవు గాకున్న♦ రాణదనర, రాము కథ లెల్ల నరసి పా♦రాయణంబు
సేయు మోపవ యేని నీ♦చెడుగుబుద్ధి, మాని యొండెడ కేగి స♦మ్మదము గనుము.

ఉ|| నిక్కపుదూత నే ననుచు ♦ నీమది నిశ్చిత మేని మేల పో
చక్కగ రామనామసుధ ♦ చల్లుమ యుల్లము పల్లవింప నేఁ
డొక్కటి నిన్నుఁ గాంచినది ♦ యే మొద లేమొకొ వత్సమంబునన్
దక్కఁగొనంగజాలి తెడఁ ♦ దా నది వేగము కూల మట్లుగన్. ౨౮౩

తే॥ ఇంతయే స్వప్నగతసుఖ ♦ మింతవట్టు
రాముఁ డొకదూత ననిచిన ♦ రాణ గాంచు
చుంటిఁ దమ్ముఁడుఁ దాను ని ♦ ట్లాలయ బ్రిదుకు
తెరువు వట్టెద నదియును ♦ దేటపడదు. ౨౮౪

తే॥ అభ్యుదయమున మేలిమి ♦ నందుచున్న
దాన నిట్లగునే స్వప్న ♦ దశను గోరితిఁ
గాంచువారల కిది మోహ ♦ గతియొ వాత
పైత్యవికృతియొ మృగతృష్ణ ♦ భంగియొక్కొ. ౨౮౫

మ॥ ఎదిరిం దన్ను నెఱుంగు జాడ విశదం ♦ బిట్లౌనె యవ్వాని యం
దెదియేని న్దొరకొన్నఁ గావున శఠుం ♦ డిచ్ఛాచరుం డల్పుఁ డ
మ్మదమానోద్ధతుఁ డైన రావణుఁడె యి ♦ మ్మాడ్కిం జోరంబాఱె నెం
చె దయాహీనులు రాక్షసాధములకీ ♦ చెయ్వు ల్నవీనంబులే. ౨౮౬

క॥ అని మిన్నకున్న నెఱి య, య్యనిలతనూజుం డెఱింగి♦యనుపమరససా
రనిహితరామకథాసుధ, ననిచెం దచ్చిత్తవృత్తి♦నిర్మల గాఁగన్. ౨౮౭

క॥ నాయమ్మా యిటు లెంచఁగ, నాయమ్మా! మగని మే ల్వి♦నంగద వమ్మా
నేయమ్మా విధికృతి ని, న్నే యమ్మానవపలాశి♦యిటఁ దెచ్చె ననన్. ౨౮౮

సీ॥ ఎవఁడు తేజమ్మున♦నీరేడు జగముల, నినుఁడువోలెఁ బ్రకాశ♦మొనయఁజేయుఁ
గువలయమ్మున కెల్లఁ♦గూర్చు యశమ్మున, నెవ్వాఁడు శశికాంతి♦నివ్వటిల్ల
రాజాధిరా జన♦రాజిల్లు నెవ్వాఁడు, సకలసంపత్తి వై♦శ్రవణు నట్టు
లాత్రివిక్రము నట్టఁ♦డై విక్రమంబున, నలఁతి నెవ్వఁడు లోక♦మాక్రమించు
నఖిలవిభవంబుల మహేంద్రుఁ ♦ డై తనర్చు
సత్యమధురోక్తికలన వా ♦ చస్పతి యగు
మోహనాకృతిఁ గందర్పు ♦ మొనయు నెవ్వఁ
డట్టి శ్రీరామవిభున కే ♦ నాశ్రితుండ. ౨౮౯

తే॥ నిచ్చలుఁ బ్రసన్నభావంబు ♦ నెఱిఁ దలిర్చుఁ
దఱిని గోపించు లోకము ♦ ల్తల్లడిలఁగఁ
దనభుజచ్ఛాయ సంశ్రిత ♦ తాప మడఁచు
నట్టివాఁడు సుమీ రాముఁ ♦ డనఘమూర్తి! ౨౯౦

తే॥ పొంచి యొక్కండు మెకముఁ ♦ గల్పించి రాముఁ
డెడ చనిన యంత హీనత ♦ నిల్లు సొచ్చి

యమ్మ! నినుఁ గాని తెచ్చిన ♦ యాతతాయి
తగినఫల మందఁ గన్నులు ♦ తనియఁ గాంతు. ౨౯౧

క॥ కొలఁదితఱిలోనె రావణు, జ్వలదగ్నులువోలె రామ♦సాయకములు వి
చ్చలవిడి దహింపఁదొడఁగెడుఁ, దలఁకొని తత్క్రోధమారు♦తము ప్రేరేపన్.

సీ॥ అమ్మహాత్ముఁడు కోరి♦యనుప నే వచ్చితి, నీసన్నిధికి మేలి♦నియతి దనర
నాయదృష్టము కల్మి♦నాతల్లి! జీవించి, యున్నదానవు దాన♦వోర్వి నొదిఁగి
నీతలంచిన యట్టి♦నెఱవాఁడ నేఁ గాను, నమ్ముమీ నాపల్కు♦నంద్యచరిత!
యచిరకాలమున శ్రీ♦యమ్ముల నందెద వింకఁ, దలఁకఁబోకుము కష్ట♦దశ తలంగె
వార్త లెఱిగించి యిట నీదు ♦ వలను గాంచి
యధిపునకుఁ దెల్పి యాతని ♦ యార్తిఁ గెడపి
నేఁట రేపట వానరా ♦ నీక మెల్ల
కడ విడియింపఁ జూతునీ ♦ యెడఁదవాగడ. ౨౯౩

తే॥ భానుసూనుని సచివుఁడ♦నేను మారు, తాత్మజాతుఁడ హనుమంతుఁ♦డనఁ దనర్తుఁ
దల్లి! త్వచ్చరణము లాన♦దాశరథికిఁ, గింకరుండఁ దదాజ్ఞావ♦శంకరుండ. ౨౯౪

ఆ॥ దాఁటరాని నీదు♦దయితు నానతి నబ్ధి, దాఁటినాఁడ నల్ల♦ద్రావుకొలము
మేటి శిరముఁ ద్రొక్కి♦మీటినాఁడఁ బదంబు, నేఁటిరేయిఁ గలయ♦నెమకినాఁడ.

క॥ నిన్ను స్మరింపని సమయం, బున్నదె రఘువీరులకు గు♦ణోన్నతుఁ డతిసం
పన్నుఁడు సుగ్రీవునకును, ద్వన్నిర్మలచరిత మెవరు♦ప్రణుతింప రటన్. ౨౯౬

తే॥ వార లెల్లరు నీమేలు ♦ వలను గాంచు
చున్నవారలు నీనాథుఁ ♦ డున్నవాఁడు
ప్రాణములు నీయవియ కాఁగఁ ♦ బరఁగుచుంట
నొండు సేయంగ నేరమి ♦ నోజ దక్కె. ౨౯౭

క॥ ననుఁ బంపుమమ్మ యొండెద, నెనయింపకు మమ్మ వారి ♦ కెఱిఁగింపంగన్
వినుపింపుమమ్మ కర్జ, మ్మనువొందఁగ నచటి తెఱఁగు ♦ లరసి గుణాఢ్యా! ౨౯౮

క॥ అని తీరొప్పఁ బలుకు న, య్యనిలతనూభవుని ప్రతిభ ♦ కబ్బురపడి య
మ్మనుకులతిలకుల సేమ, మ్మను వొలయఁగ నరయఁ గలిగె ♦ నని మోదమునన్.

—♦ హనుమపలుకులు నమ్మి సీతాదేవి రామలక్ష్మణుల చిహ్నము లడుగుట ♦—

మ॥ లలనారత్నము వాని భవ్యమధురా ♦ లాపంబులం దేఱి వె
న్నెలతేని న్నగు మోము చెల్వ మొలయ ♦ న్వీక్షించి నాయన్న! యే

కలన న్గంటివి రాము లక్ష్మణుఁ దద్పై ♦ క్యం బెట్లు నీ కబ్బె నే
వల నొప్ప న్నరవానరు ల్చెలిమిమై ♦ వర్తించిరో తెల్పవే. 300

—♦ హనుమ సీతాదేవికి రామ సుగ్రీవ సఖ్యాదుల నెఱిఁగించుట ♦—

ఆ॥ రాములక్షణములు ♦ లక్ష్మణుచిహ్నమ్ము, లెఱిఁగినంతవట్టు ♦ నెడయనీక
మఱల నాకుఁ దెల్పు♦మా వానరోత్తమ !, సందియంబు గష్టద♦శయుఁదలఁగ.

మ॥ అనిన న్హర్ష మెసంగ వాయుతనయుం ♦ డమ్మానినీరత్నముం
గని నీ వెల్ల యెఱింగి తత్త్వ మరయం ♦ గా రామరామానుజా
త్మనివేశంబులు ప్రస్తుతింపు మనుటన్ ♦ ధన్యత్వముం గాంచితిన్
విను మోయమ్మ ! వివేక మెప్ప వినుతు ♦ న్వేడ్కం దదర్థాఘముల్. 302

సీ॥ తమ్మిఱేకులపోల్కిఁ ♦ దనరారు కనులవాఁ, డెల్లప్రాణుల మది ♦ కించువాఁడు
రూపున దాక్షిణ్య ♦ రూఢి ననీదృశుం, డర్కుఁ దేజున నోర్వ ♦ నందుఁ బృథివి
బుద్ధి బృహస్పతిఁ ♦ బోలువాఁడు మహేంద్ర, వైభవుం డఖిలాభి ♦ వంద్యమానుఁ
డెఱుఁగును దనధర్మ ♦ మెదిఁధర్మమ్ముఁ బ్రోచు, నితరుల స్వజనుల ♦ నేకమతిని
నాల్గు కొలములఁ బాలించు ♦ నయము మీఱ
లోకమర్యాదఁ గాపాడు ♦ లోభ మెడలి
జరుపు సత్క్రియాచారప్ర ♦ చారములను
రామచంద్రుఁడు మిథిలాధి ♦ రాజతనయ ! 303

క॥ అర్చితుఁ డర్చిష్మంతుఁడు, వర్చస్వి ప్రశస్తిపరుఁడు ♦ వ్రతనిరతుఁడు సా
ధ్వర్చారతుఁ డతఁ డాగమ, చర్చాసముపేతయోగ ♦ శాలి సుశీలా ! 304

తే॥ బ్రాహ్మణోపాసనంబునఁ♦బ్రథితిఁ గాంచెఁ రాజవిద్యల విద్యల♦రాణఁ దనరు
శీలవృత్తశ్రుతంబులఁ♦జెనయ నేర, రాపరంతపు నెవ్వారు♦నవనితనయ ! 305

క॥ వేదములు యజుర్వేదము, వేదాంగము లట్టు లస్త్ర ♦ వేదమునఁగళ
ల్నీదయితువలని వనఁ దగు, నాదేవమయాత్ముఁ బొగడ ♦ నలవియె సాధ్వీ.

క॥ ఎగుభుజములు గలవాఁ డతి, యుగబాహుఁడు కంబుకంఠుఁ♦డురుహనుఁడుసమా
త్మగసువిభక్తాంగుఁడు నగు, మొగము సిరి న్శశి మురుండు ♦ మోహనలీలన్.

తే॥ తామ్రరేఖలతోడి మే♦ల్తళుకులక్ష్మ, పెడఁదకన్గవఁ గనుపట్టు♦విభునియందు
శ్యామలస్నిగ్ధతనుకాంతి♦జతప్రతాప, మోజ దుందుభిధ్వని తెల్పు♦నుత్పలాక్షి!

తే॥ మూఁడుతావుల దిట వగు ♦ వాఁడు మూఁట
నగుఁ బ్రలంబుండు మూఁడిట ♦ నగు సముండు

నొప్పు మూఁడింట మూఁడింట ♦ నున్నతత్వ
తామ్రతల స్నిగ్ధగంభీర ♦ తల నతండు. ౩౦౯

ఆ॥ వాని కంఠసీమ♦వళులు రేఖాత్రయి, మూఁడు లక్షణముల♦ మొనయు శీర్ష
మవయవమ్ము లకని♦కగు మూఁడు నమ్రమ్ము, లట్లు నాలు గొప్పు♦హ్రస్వములుగ.

క॥ నాలుగు [illegible]వ్రేలి కళలు, ఫాలమ్మునఁ బాదములను♦బాణితలముల
న్నాలుగు నాలుగు రేఖలు, లీలావతి! యతనిభాగ్య♦లీలలఁ దెలుపున్. ౩౧౧

ఆ॥ సర్వసముఁ డటన్నఁ ♦ జాలదే సమత నా
ల్గవయవముల జతల ♦ నమరుచుండు
మొనయు నున్నతత్వ ♦ మునఁ జతుష్కిష్కుత
నున్నతుండు గామి ♦ యొకటఁ గలదె. ౩౧౨

క॥ రమ పదునాలుగు సంస్థా, నముల జతల సమ తసమత♦నాయదె యను నా
ల్గమరును శుభలక్షణములు, రమణీమణి! రాము దంత♦రమ్యపదమునన్. ౩౧౩

సీ॥ నాలుగు శుభగమ♦నము లొప్పు నమ్మేటి, కురుపులు హనునాసి♦కోష్ఠతలము
లవయవస్థానంబు♦లెదు సుస్నిగ్ధంబు, లఖిం గాత్రము సత్క♦లాంచితమ్ము
దీర్ఘమ్ము లెనిమిది♦దేశము ల్పద్మము, ల్పది బృహద్భావాప్తిఁ♦బది తనర్చు
నుభయవంశవిశుద్ధుఁ♦డున్నతుండాఱిటఁ, దొమ్మిదింటను హ్రస్వుఁ♦డమ్మహాతుఁడు
మూఁడిటఁ బ్రసిద్ధుఁ డొనరించు ♦ మూఁడుతఱుల
వెలయు పురుషార్థములు మూఁడు ♦ విశ్రుతముగ
దేవుఁడో దేవకల్పుఁడో ♦ తెలియరాదు
రాముఁ డతిలోకచరితుఁడో ♦ రాజవదన! ౩౧౪

ఆ॥ ప్రభుఁడు సత్యధర్మ ♦ పరుఁడు శ్రీమంతుఁ డా, దానదానసంవి♦ధానరతుఁడు
దేశకాలసద్వి♦ధిజ్ఞుండు సర్వలో, కప్రియంవదుండు♦కలికి! యతఁడు. ౩౧౫

క॥ అనురాగమునను రూపున, ననుగుణగుణలక్ష్మిఁ దద్వి♦ధాంచితుఁ డగు న
య్యనుజుఁడు సౌమిత్రియుఁ దా, ననుగతసావర్ణవర్ణుఁ♦డను భిద వెలయున్. ౩౧౬

తే॥ అమ్మహాత్ములతోడి సౌ ♦ హార్ద మొదవెఁ
గపివరేణ్యుఁ డర్కజుపాలి ♦ కలిమి వెలయ
నమ్మ! నీజాడ లరయ వా ♦ రడపిఁ బట్టి
కడఁగి యేతేర ఋశ్యమూ ♦ కంబు దరిని. ౩౧౭

ఆ॥ ఆచికొనియె వాలి♦యతిబలశాలి య, యుక్త మనక యనుజు♦యువతి బలిమిఁ
గలిమితోడఁ గూడఁ♦గాదర్యమున నింద్రుఁ, డిడిన వరము గరువ♦మెసఁగఁ జేయ.

క॥ ఆస సెడ నతఁడు తఱుమఁగ, నాసుగ్రీవుండు తిరిగె♦నన్నిదెసలఁ జి
ద్భాసితుఁడు మతంగాశ్రమ, వాసమున న్నిలిచెఁ బ్లవగ♦వర్యుఁడు పిదపన్. ౩౧౯

క॥ అమ్మునిశాపవశమ్మున, నమ్మనికిం జొరఁగ నేరఁ♦డైంద్రి యది నిమి
త్తమ్ముగ నేము గొలువఁ దా, సమ్మతిమై నుండు సవితృ♦సంభవుఁ డచటన్.

సీ॥ తపము రూపున మించు♦తాత్పర్య మొలయించు, వల్కలాజినముల♦వలను మిగుల
నల కపర్దికిఁ జుట్టి♦లని చుట్టుకొని జటా, మండల మ్మొకవింత మహిమ♦దెలుప
నీరేడుజగముల♦నేలఁజాలినవారు, వీరంచుఁ దూఁపులు♦విండ్లు నొడువ
బీరమ్ము సారమ్ము♦బిరుదు లిట్టి వటంచు, దెస లాకగొను మేటి♦తేజ మనఁగఁ
దనరి ఋశ్యమూక♦ధరము చేరువ దారిఁ, జేరఁ గవియువారి♦సిరికిఁ దలఁకి
వాలి యనుప వచ్చు♦వార లం చరయంగ, నన్నుఁ బనిచెఁ దపన♦నందనుండు.

క॥ ఏ నరిగి వారి కెఱఁగి త, దానతి సుగ్రీవు చరిత♦మటు వినిచి తదా
ఖ్యాన మరసి తన మూఁపుల, పై నెలకొనఁ జేసి కొండ♦పై నిలుపుటయున్.

ఆ॥ తత్త్వ మెఱిఁగి తరణి ♦ తనయుండు తా రాచ
కొలమువారి కొలువు ♦ గోరికొనియెఁ
జన వొసంగె విభుఁడు ♦ జరిగెఁ బరస్పరా
శ్వాసపూర్వకప్రి ♦ సంగములును. ౩౨౩

క॥ ముడివైచి నీవు విసరిన, ముడియం గల సొమ్ము లెల్ల ♦ మొనయించిన రా
ముఁడు మే నెఱుఁగక సోలెను, తడఁబడి యవి వ్రాల నిడితి♦దయితుని మ్రోలన్.

ఆ॥ ఊఱడింప నాతఁ ♦ డొక్కింత దేఱె నీ, తోడవు లెత్తి తనదు ♦ తోడకుఁ దార్చి
దేవనిభుఁడు విభుఁడు ♦ దేవి! తాఁ బరిదేవ, నం బొనర్చె నేమ ♦ నంగవలయు.

తే॥ భూషణస్థానమారుత ♦ స్ఫూర్తిఁ జేసి, త్వద్వియోగాగ్ని దీపింపఁ ♦ దరణివంశ్యుఁ
డగ్నిపర్వత మట్టిఁడ♦యయ్యె మేన, మితికి మీఱిన తాపంబు ♦ మెయికొనంగ.

క॥ ఒడలున నవి గదియించుచు, బడలుచు భూమిపయిఁ బడుచుఁ ♦ బరికింపుచుఁ దా
నడలె నతఁడు చిరకాలము, బడఁతీ! నీవలని ప్రేమ ♦ భర మల్పంబే. ౩౨౭

ఆ॥ కంప మొందె భూమి ♦ కంపంబున శిలోచ్చ, యంబ పోలె దశర ♦ థాత్మజాతుఁ
డగ్న్యగార మయ్యె♦నతని మే నురుశోక, మగ్గలంబు గాఁగ ♦ నడరుటయును.

ఉ॥ ఇంచుక యేనిఁ దన్మతికి ♦ నింపవ యింపవు భూషణావళిం
గాంచియుఁ గాంచనాంగి నినుఁ ♦ గానఁగఁ గానమి రమ్యకాననా
భ్యంచితభృంగగీతులు శు ♦ కాలపనంబులు కోకిలధ్వనుల్
సంచితకేకిలాస్యములు ♦ సారసశోభినులౌ సరోజినుల్. ౩౨౯

క॥ కన్నుల నీ రొలుకఁగఁ దా, నన్నకు మాఱట ఘటింతు ♦ నని లక్ష్మణుఁ డా
యన్నకు మున్నడి హరిపతి, యు న్నెనుఁ బ్రబోధవాక్ప్ర ♦ యుక్తి మెలంగన్.

తే॥ భూషణమ్ముల మనుకుల♦భూషణుండు, వేఱువేఱుగఁ బొగడి ని♦ర్వేద మెసఁగ
న్యాస మొసరించె సుగ్రీవు♦హస్తమున నను, నిన్నుఁ బాసినకతమున♦నేర మెంచి.

ఉ॥ అంతట భానువంశమణి ♦ కారవిసూనున కయ్యె బాంధవం
బింత యనంగరాని దయి ♦ యేణవిలోచన! వాలిఁ జంప నీ
కాంతుఁడు త్వత్పదం బరయఁ ♦ గాఁ గపివర్యుఁడు వహ్ని సాక్షిగాఁ
బంతము లొప్ప వాకొనిన ♦ బాసలు బాసట లే తలిర్పఁగన్. ౩౩౨

ఆ॥ కీలిఁ బోని యొక్క ♦ వాలమ్ము గీలించి, వాలిఁ గూల్చి తరణి ♦ వంశభవుఁడు
భానుసూను నపుడె ♦ ప్రథితవానరరాజ్య, పట్టభద్రుఁ జేసి ♦ ప్రతిన నెఱపె.

ఉ॥ కొండలఁ బోని వానరులఁ ♦ గూర్చి మహారాజసుఁ డర్కజుండుఁ దా
నిండుమనంబునం బనిచె ♦ నీకలతా వరయంగ వారు ది
ఙ్మండల మెల్లఁ దారె యన ♦ మానిని! త్రిమ్మరుచున్నవార లీ
దండధరాశశోధనకుఁ ♦ దార్కొను మర్కటవీరసంహతిన్. ౩౩౪

క॥ ఏ మంగదు యువరాజు మ, హామహు వాలిసుతుఁ గొలిచి ♦ యరుదెంచితి మా
భూమిగిరిదుర్గకందర, ధామస్థలు లరసి డప్పి ♦ తపలి యలంపన్. ౩౩౫

క॥ వింజము గుహ సొచ్చి మహో, ర్తిం జెనయుచుఁ గంటి మొకట♦శ్రీమతి నోర్తుం
బెంజెడలదాని నాయమ, నంజిలిఁ బాపి దరిసేర♦నెఱయించుటయున్. ౩౩౬

ఉ॥ అందఱు మొక్క గీ మెనసి ♦ యార్తుల మై పడరానిపాట్ల కే
మందితి మింతవట్టు ఫల ♦ మాఱడి పోయెఁ గపీంద్రు నానతిం
జెందిన కాల మందుఁ జనఁ ♦ జేటు దలంచును ఱేఁడు గాన నేఁ
డిందె మొడళ్లు వైచి చను ♦ టే వెర వంచుఁ దలంచుచున్నడన్. ౩౩౭

క॥ అంగదుఁడు సుహృద్భావో, పాంగశ్రీసన్నివేశ♦నాంచితసదయా
పాంగదు డిందఱ కొదవిన, యంగదకుం దెరలి డెంద♦మలమట పడఁగన్. ౩౩౮

క॥ నీచరిత ముగ్గడింపుచు, నీచుని రావణునిఁ దిట్టు♦నెఱిని జటాయు
స్సాచివ్యము తన్మృతియును, వాచారంభణమున న్ప్ర♦వర్తిలఁ జేయన్. ౩౩౯

ఆ॥ కొండలోయనుండి ♦ గొదకొను సంపాతి
యనెడు గృధ్రరాజు ♦ తనయనుజుని
వార్త విన్నయంత ♦ వడిఁ బఱతెంచి శో
కార్తుఁ డగుచు మాప్రయత్న మరసి. ౩౪౦

క॥ ఆరావణు నపకారము, హేరాళముగా నెఱింగి♦యిదె సీతాభా
మారత్నం బతని యశో, కారామంబందు నున్న♦దని తెలిపి చనన్. ౩౮౧

చ॥ అట ముద మందుచుం జని మ ♦ హాంబుధి దాఁట నుపక్రమించి సం
కటపడు చిత్తవృత్తి దరి ♦ గానక దీనతఁ గుందువారి మ
ర్కటభటముఖ్యులం గని తి ♦ రం బయి వారలఁ దేర్చి యోజ నో
త్కట శతయోజనాయతముఁ ♦ గంధిఁ దరించి కడంక మేకొనన్. ౩౮౨

ఆ॥ రేయిఁ బురము సొచ్చి♦రే ద్రిమ్మరిండ్రగే, హమ్ము లెల్లఁ దడవి♦యంతిపురిని
జేరి దేవతారి♦సిరిఁ బరికించి యి, చ్చోట నీయవస్థఁ ♦ జూడఁగంటి. ౩౮౩

మ॥ కలవృత్తం బెఱిఁగించినాఁడ దిరమై ♦ కల్యాణి! నావల్కు ప
ల్కుల మే లారసి భావికార్యగతి సం ♦ కోచమ్ము పోకార్చి ని
ర్మలభావమ్ము దలిర్పఁ గూర్మిమెయి సం ♦ భాషింపు మీ వెంచిన
ట్టులు గా దెల్ల శుభంబు లింక నొనఁగూ ♦ డు న్నీకు నీవారికిన్. ౩౮౪

తే॥ కుశలులై యున్నవారు ర♦ఘుప్రవీరు, లే నరిగి తెల్పినంతన♦యెలమి మీఱ
నీదు నిర్బంధ మెడలించు♦నెఱిన యిటకుఁ, బరుగు దెంతురు వానరు♦ల్బలసి కొలువ

తే॥ శుభము నీ కగు నింకట ♦ శోభనాంగి!
ప్రియసమాగమలక్ష్మిఁ సం ♦ ప్రీతిఁ గాంతు
వసురుల వధించి జయ మంది ♦ యమరు లెల్లఁ
బొగడ నినుఁ గొని రాముండు ♦ పురముఁ బెరయు. ౩౮౬

క॥ నీకు న్నీపతికిని హిత, మేకరణిన యేనిఁ గూర్ప♦నెంచి య సు మ్మీ
శ్లోకకుఁడ నై పడితిఁ బా, ట్లాకలితఫలంబు లయ్యో♦నవి జనయిత్రీ! ౩౮౭

ఆ॥ అబ్ధి దాఁటఁ గనుట♦యంతఃపురాంతర్వి, మర్శనమ్ము చెట్ట♦మలయనీక
నీదు దర్శనంబు♦నెఱిఁ గూర్చె ఫలితమ్ము, యశము గంటి సుకృత♦మంది మంటి.

వ॥ దేవీ! మజ్జనకుండు కేసరిపరాక్రముండు కేసరి యను వానరేంద్రుండు కుంజరుం
డనువాని కొమరిత నంజనాఖ్యం బెండ్లియాడి యాయమయందు సుతోల్లా
సంబుఁ బడయనేరక వ్రతనిష్ఠమై నుండి యద్దేవిని వాయుభట్టారకు నుపాసింపం
బనిచి మునిగణప్రీతుం డై గోకర్ణంబున కరిగి శంబసాదనుఁ డను దేవద్వేషిం
బరిమార్చిన దేవతలు సంతసిల్లి జగత్ప్రాణునిం బుత్తెంచిన నమ్మహానీయుని
ప్రసాదంబు వడసి సద్యోగర్భమ్మున మాయమ్మ నన్నుఁ గనియె నక్కతంబున

నాంజనేయుండనం బరఁగితి నింద్రుండు వజ్రంబు వైవ హనువు భగ్నంబుగా
నుండుట హనుమంతుండనం బ్రసిద్ధుండ నైతిఁ బదంపడి సూర్యునివలన నెల్ల
విద్యలం బరిగ్రహించి సుగ్రీవునకు నమాత్యుండ నై యిప్పట్టున రామకింక
రుఁడు నా నెక్కొనం గాంచితి నియ్యది నాదు వృత్తాంతంబు సముద్రకూలంబున
నారాకకై వేచియున్న యంగదాదివీరులకు సముల్లాసం బొదవించుటకు రామ
లక్ష్మణసుగ్రీవాదులకు నీమే లెఱింగించి యవ్వారి వానరవాహినులతోడం
గూడం గొని వచ్చుటకుం ద్వరపడుచున్నవాఁడ నట్లగుటం జేసి. ౩౪౯

క॥ నీచేర్పఁ దగిన మే లగు, వాచిక మేయదియొ దాని ♦ వలనుపఱుపఁగా
నోచంద్రానన! వేఁడెద, నీచుల కరయంగరాని ♦ నెఱి తెఱఁగుపడన్. ౩౫౦

క॥ నాపలికిన తెఱఁ గారసి, యేపగిది వచింపఁ దలఁతొ ♦ యిది మే లని నే
నీపనిచినయావలనున, నే పోయి హితమ్ము గూర్ప ♦ నెంచెద జననీ! ౩౫౧

మ॥ అనుచుం బావని పల్కఁ బల్కుల తెఱం ♦ గద్దేవి భావించి పా
వనుఁ డౌ నీతఁడు రాము దూత యను స ♦ ద్భావంబు హేతుస్థితిం
దనర న్నెమ్మది హర్షపూరితముగాఁ ♦ దాత్పర్య మొప్ప న్బ్రసా
దనవోల్లాసమునం దలిర్పఁ గని యా ♦ తం డంచితోత్సాహుఁ డై. ౩౫౨

తే॥ రామనామాంకితంబయి ♦ రాణ దనరు, నంగుళీయక మిదె కొను♦మమ్మ! నమ్మి
మెలమి నీభర్త నాచేత♦నిచ్చి పంపె, నీదు గోడవ దొలంప నా♦నెఱి యెఱింగి.

మ॥ అని యర్పించిన నంది పుచ్చికొని నె ♦ య్యం బొయ్యన న్నీఱజ న
వ్వనజాతాయతనేత్ర భర్తృపదభా ♦ వస్ఫూర్తి తద్భూషణం
బునఁ బెంపొంద నిమేష మొల్లని గుణో ♦ ద్భూతిన్ దృగైక్యంబు నె
ట్టన సంధిల్ల రసాలసత్వకలనా ♦ ధ్యత్వమ్ము శోభిల్లఁగన్. ౩౫౪

సీ॥ విప్పఁగన్దమ్ముల ♦ విరితేనె లొలికెడు, కరణి హర్షాశ్రువు ♦ ల్గడలుకొనఁగఁ
దల లెత్తి ప్రియురాక♦తార్కాణకై వేచు, తలఁపుల రహిఁ బుల♦కలుదలిర్ప
సంప్రసాదనలక్ష్మి♦జానొందు నెమ్మోము, గ్రహముక్తశశ్వేందు♦కలనఁ దనర
సింగారపుం గల్మి♦జెల్వొందు చెయ్వులు, సిగ్గుతో నొడికమ్ము♦చెలిమి నొడువఁ

బరవసమ్మునఁ జొక్కన ♦ భావితమున
భావిభావికసూచన ♦ ప్రౌఢి వెలయ
ననిచె నుల్లాసమున నాథుఁ ♦ డనుప మనుప
నైన యడియాల మంది యా ♦ యమ శుభాంగి! ౩౫౫

ఉ॥ అక్కునఁ జిక్కఁబట్టి మొగ ♦ మానఁ గదించి మెఱుంగుఁ జెక్కులన్
జక్కని హత్తికో ల్నెఱపి ♦ చల్లని తీయని పల్కు లెవ్వి యో
గ్రుక్కిడితోడి నెయ్యమునఁ ♦ గూర్చి తనర్చెను గాంత కాంతుపై
మక్కువ యంగుళీయకము ♦ మన్ననఁ జెన్నలరారు చుండఁగన్. ౩౫౬

ఆ॥ పారవశ్య మంత♦పనిజేసెఁ గాకున్న, మాన కెనయు సిగ్గు♦మలఁచి మమ్ము
నాఁడు గూర్చి తల్లు♦నేఁడు నాగోడవలు, దలఁచి తరలి తనునె♦తరళనయన.

తే॥ వ్రేలిపొత్తున ననిచితి♦విభునికడ ని, కేమి గతి నుంటివో యిప్పు♦డెఱుకపడదు
దేశముం బాసి యియ్యుప♦దేశమునకు, వచ్చితే యనె నద్దేవి♦వామనేత్రి! ౩౫౭

క॥ ప్రాశస్త్య మెసఁగఁ బ్రియసం, దేశమ్ము మహార్హ మిడె ప్ర♦దేశ మెనసి యు
ద్దేశము దేశము తఱి గని, యాశంస్యం డీతఁ డని మ♦హాహర్షమునన్. ౩౫౯

క॥ అద్దేవి వత్సలత్వం, బుద్ది యనఁగరాని దగుచు♦నొనరుపడఁగ సం
పద్దశ కాతఁడు నెమ్మదిఁ, దద్దయు నామోద మెనయఁ♦దా నిట్లనియెన్. ౩౬౦

సీ॥ నాయన్న! రావోయి♦నాజీవిత మొసంగి, తలఁతియే యిక్కార్జ♦మనువుపఱుప
నబ్ధి యోజనశత♦మతిలంఘన మొనర్చి, తెవ్వాఁడు నీయోజ♦ నెనయఁగలఁడు
తలఁ ద్రొక్కితివ కాక♦దానవుం డొకఁ డేని, నోరెత్తఁగా నొంట♦నూల్కొనండె
మిత్తి యైనను జంకు♦మేకొంటివో యెట్టు, లాచెట్ట నగరున♦యందు మెలఁగ
నీవు వానరమాత్రుండ♦వే వివేక, నిధివి దేవతాత్ముండవు♦నిర్ణయింపఁ
జాల కిటు లంటిఁగాని నీ♦శీల మసదె, యనుచునే రాముఁ డంతంత♦లైన నిటకు.

తే॥ నినుఁ బరీక్షించియే పంపె♦నేత కాన, వత్స! నీతోడ భాషింప♦వలనుపడియె
నాకుఁ గుశలియె రాముండు♦నాకలోక, వంద్యుఁ డాసుమిత్రానంద♦వర్ధనుండు.

ఉ॥ కూరిమి యిక్క కోసలుని ♦ కూతుగు నోమిన నోముపంట యా
ధారము నాదు జీవితల ♦ తాస్థితి కారఘువీరుఁ డాగుణో
దారుఁడు సత్యసంగరుఁడు ♦ దానెటు రాముఁ డుపేక్ష సేసె ని
వ్వారిధిమేఖలం బ్రిశయ ♦ వహ్నియ నాఁగ దహింప నోపఁడే. ౩౬౩

తే॥ అన్నదమ్ములు సుర లొడ్డ♦నైనఁ బోర, పొడవడంతురకా యల్క♦వోడమెనేని
నాదు దురదృష్టమే కాక♦నాయవస్థ, యెఱుకపడకుండె నెమ్మోయి♦నింతవట్టు.

తే॥ ఏవ్యథకుఁ బాల్పడఁడుగదా ♦ యినకులీనుఁ
డన్న! పరితాప మొందునే ♦ నన్నుఁ గూర్చి
దీనుఁడును భ్రాంతుఁడును గాక ♦ దిట్ట యగుచు
నెట్టి జతనంబులకు నైన ♦ నెనయఁగలఁడె. ౩౬౫

క॥ మోహవశంబునఁ గృత్యము, లూహకుఁ దేకుంటఁ♦జెడుట యొదవదుకద స
త్స్నేహార్ద్రంబున మిత్రి, వ్యూహము సమకూర్చు తలఁపు♦లుండెనె పతికిన్. ౩౬౬

మ॥ త్రివిధోపాయవిమర్శనంబున మహా ♦ తేజంబున న్మిత్రయో
గవిధానంబున దేశకాలఘటనా ♦ కల్పంబున న్నృతుభా
వవిచారంబున దైవపౌరుషకృతి ♦ వ్యాపారలక్ష్యస్థితిన్
బ్రవరుం డవ్విభుశేముషీకలన ప్రా ♦ స్తవ్యంబుఁ జర్చించునే. ౩౬౭

తే॥ తలఁచునే దేవతల నొంటిఁ ♦ దత్ప్రసాద
మొలయునె ప్రవాసగతి నిట్టు ♦ లున్న నన్ను
మఱవఁబోవఁడుకద జగ ♦ న్మాన్యుఁ డాతఁ
డూహ సేయునె తనసాధ్వి ♦ నుద్ధరింప. ౩౬౮

ఉ॥ ఎన్నఁడుఁ గానఁబోఁడుకద ♦ యిమ్మెయి పిమ్మటి తన్నుఁ బాసి యే
నున్నవిధం బెదం దలఁచి ♦ యూఱట గాంచునె నిత్యసౌఖ్యసం
పన్నుఁడు రాముఁ డిట్లనెడు ♦ పాటునఁ గుందెద నయ్య యన్యథా
పన్నము గాదుగా విభుని ♦ భావము నాయెడ వాయునందనా ! ౩౬౯

తే॥ భరతు కుశలంబు దెలియంగఁ ♦ బనునె యతఁడు
పనుచునే తోడుపడ భ్రాతృ ♦ వత్సలుండు
మంత్రిసంభృత మహిత ధీ ♦ మపరిచార
మైన యక్షౌహిణి మదేత ♦ దర్థమునకు. ౩౭౦

సీ॥ అన్న ! వానరనాథుఁ♦డనఘుండు సుగ్రీవుఁ, డేతెంచునే సైన్య♦మెనసి కొలువ
దంతనఖాస్త్రులు ♦ ద్ధతు లగచరవీరు, లుత్సాహమున కల్మి ♦ నున్నవారె
నామఱంది సుమిత్ర♦నోము గన్న ఫలంబు, దైత్యులఁ గూల్చునే♦దర్ప మెసఁగ
విభుని రౌద్రశరంబు♦వేల్చునే రణభూమి, రావణు సబలు సు♦ర ల్నుతింప

మద్వియోగార్తిఁ గృశియించి ♦ మవ్వ మెడలి
యున్న తన్ముఖాబ్జమ్ము ప ♦ యోజగంధిఁ
గాంతునే శుభకాలమ్ము ♦ కలిమి సద్వి
కాసభాసిత మగుచుండఁ ♦ గపివరేణ్య ! ౩౭౧

తే॥ ధర్మ మని రాజ్యలక్ష్మిపైఁ ♦ దవులు విడచి
ననుఁ బదాతిఁగఁ గొని వన ♦ మునఁ జరించు
నప్పుడేనియు శోకభ ♦ యార్తుఁ లైనయఁ
డాఘనుం డట్టు లున్నె యి ♦ య్యెడలునందు. ౩౭౨

తే॥ తల్లిదండ్రులయేని భాంధవులయేని, నెక్కు డనరాదు విభున కీ♦యెడఁ బొసంగు
కూర్మిఁ బరికింపఁ దాన నీ♦క్రూరదశ జి, జీవిషఁ దనర్తుఁ గలదె మొ♦శ్రేయ మనుచు.

ఉ॥ దైవసహాయమే ననుచుఁ ♦ దావకవాక్కులన న్మహోర్వ్యా మా
నావిభుసేమముం దెలిపి ♦ నన్ను శుభాన్వితఁ జేసి నంచు న
ద్దేవి రసోపపన్న మగు ♦ తీరునఁ బల్కి విరామ మొంచెఁ ద
ద్భావికరామనామపద ♦ పఙ్క్త్యభిరామవచస్స్ఫురామతిన్. ౩౨౪

ఉ॥ అంజన గన్న నోము ఫల ♦ మంజలి ముందలఁ జేర్చి పల్కె నీ
నెంజిలి వాయుఁ దల్లి! యిట ♦ నీయునికి న్గణియింపకున్కిఁ దా
నంజయిడండుగా కిఁకఁ ద్వ ♦ దర్థము నే వివరింప లంకపై
నం జరియింపఁ జేయుఁ గపి ♦ నాథుని సేనల నుద్భటాకృతిన్. ౩౨౫

క॥ ఒకమాత్రన రాఘవు ల, మ్మకరాలయ మూఁకగొని య ♦ మానుషశక్తిన్
గకవికలు సేయఁ జొత్తురు, ప్రకటాజను లిప్పదంబు ♦ ప్రదరౌఘములన్. ౩౨౬

ఉ॥ ఆశరు లాశరాగ్ని కిటు ♦ లాహుతు లౌనెడ నాశ మెంచి స్వీ
యాశఁ దొలంగి యాశ కొకఁ ♦ డై హతశేషులు వోవ రావణుం
డీశవరంబుతో రణమ ♦ హిం దెరలం గొమ లేద్వ లంక పా
డై శమనాంధసాలయమ ♦ యై కనుపట్టఁగ నవ్వ దింకిటన్. ౩౨౭

క॥ పూని సురాసురు లంతకుఁ, డేనియు నడ్డంబు సొరఁగ ♦ నెంచి కదిసినన్
దా నొకటి గ్రొచ్చి యెత్తిన, కాని విడువఁ డసుర నెట్టు ♦ గాకుత్స్థుఁ డిఁకన్.

ఆ॥ ఇంద్రు నంకపీఠి ♦ నెలయుఁ బులోమజ, యధివసింతు రాము ♦ నంకమునను
నీవు దుష్టదైత్య ♦ నివహంబు శమనగృ, హాతిథిత్వ మొకట ♦ నధిగమింప. ౩౨౯

ఆ॥ నీదుశోకమునను ♦ నెఱి దప్పి సింగంబు, పోదువ మదగజంబు ♦ పోల్కి రాముఁ
డడలుచుండు సౌఖ్య ♦ మందఁగానఁడు తద, భీప్సితము సతీ! త్వ ♦ దేకరసము. ౩౩౦

సీ॥ ఆమిషం బని మధు ♦ రాసవం బనియేనిఁ, దలఁపఁ డొక్కెడ నైనఁ ♦ దరళనయన!
యైదవవేళ నొ ♦ డ్లనిన వన్యాహార, మారగించు నొకింత ♦ యబ్జగంధి!
మూఁగు దోమలఁ గీట ♦ ముల నీఁగలనుఁ గేలఁ, దోలఁజాలఁడు జాలి ♦ దోఁప సుదతి!
నిదురఁగానఁడు కాంచు ♦ నెఱిఁగాంచి నీపేరు, తీరుగా వాకొంచుఁ ♦ దెలియు సుముఖి!

యించు ఫలపుష్పములు మఱి ♦ యెద్దియేని
వింతవస్తువు గనుపట్ట ♦ వెడఁగుపడుచు
హా ప్రియే యని నిట్టూర్పు ♦ లడర బడలు
రాముఁ డలఁచు విశాలి మ ♦ రాళగమన! ౩౩౧

ఆ॥ మలయవింధ్యమేరు♦మందర దర్దర, మ్ములు మహాపథులు స్వ♦మూలఫలము
లానసేసి శపథ♦మాచరించెద రాము, తలఁపుఁ బాయ వీవు♦తథ్య మనుచు.

క॥ జతనమునఁ గొఱఁత వెట్టఁడు, ధృతవ్రతుం డగుచు శోక♦దీర్ణుం డగుచున్
సతతము త్వన్నామ మను, స్మృతి నేమఱకుండు నతఁడు♦క్షితిపతితనయా! ౩౮౩

తే॥ తీవరం బేల కాంచె దిం♦దీవరాక్షి! యుదితపూర్ణేందుబింబమ్మ♦నోజ వెలయు
రాము నెమ్మోము కుండల♦రాజితమ్ము, సునయనాఢ్యమ్ము బింబోష్ఠ♦సురుచిరమ్ము.

చ॥ అని రఘురాము వృత్తము మ ♦ హాత్మము పావని దెల్ప లోకపా
వని గతశోక యై ప్రియు న ♦ వస్థితి నెంచి సమానశోక యై
ఘనవృతిశేషచంద్ర యయి ♦ కన్పడు శారదరాత్రి వోలె నొ
ప్పెను బ్రతిబోధనిద్ర లవి ♦ భిన్నతఁ దోఁపఁగ మేనకాత్మజా! ౩౮౪

క॥ అమ్మెయిఁ దులకింపుచుఁ దా, నమ్మహిసుత పలికె మారు♦తాత్మజుతోడన్
సమ్మతి పనుపడ ధర్మా, ర్థమ్ముల కనురూప మగు ప♦థమ్మున నగజా! ౩౮౫

—♦ సీతాసందేశము. ♦—

సీ॥ అమృతమ్ము విషపృక్త♦మైన యోజన నీదు, పలుకులఁ గనుపట్టెఁ♦బవనతనయ
నానాథుఁ డన్యమ♦నస్కుండు గాఁ డంటి, పడరాని వెతకుఁ బా♦ల్పడె నటంటి
సంతసం బొదవియు♦జాలిఁ బాపఁగఁజాల, కుంట లోలోఁ గుందు♦చున్నదాన
సిరి పెంపుదల కేనిఁ♦జెట్టవంకకునేనిఁ, గర్షించు విధి త్రాఁడు♦గట్టి నరుల

నేమ యిమ్మెయి వ్యసనమ్ము ♦ లెనయుచుండ
దైవ మొరు లెట్లు గడువంగఁ ♦ దలఁచువార
లేకవీకుండు రాముఁ డిం ♦ కెన్నినాళ్ల
కిమ్ము మైకొన శోకపా ♦ రమ్ముఁ గనునొ. ౩౮౬

క॥ ఓడ సెడ సంద్రమునఁ బడి, పోఁడిమిమై నీఁది యలఁత ♦ పుట్ట వికలుఁ డౌ
జాడ దరిసూపి యీశ్వరుఁ, డోడకు మనకున్న నరున ♦ కొనరునె మనఁగన్.

తే॥ రక్కసులఁ దుంచి రావణు ♦ నుక్కడంచి
లంక నున్మూలిత నొనర్చి ♦ లావు మెఱయ
నన్నుఁ గొనిచను మన్నాథు ♦ నాఁటి కలిమిఁ
గన్నులారంగఁ గాంచు భా ♦ గ్యంబు గలదొ. ౩౮౭

చ॥ త్వరపడు మంచుఁ దెల్పుము ప ♦ దంపడి సేయు ప్రయత్నము ల్వృథా
పరిణతము ల్పనిమి యనుము ♦ పాయని కూర్మి దెస న్వ్యథాపరం

పర కడు దుస్సహం బనుచుఁ ♦ బల్కుము మాసము లింక రెండె వ
త్సరమున జీవితమ్మునను ♦ దక్కె నటంచు వచింపు మాదృతిన్. ౩౯౦

క॥ సమయ మొనర్చె నృశ సుఁడు, సమయించున కాని మంచి ♦ సరణిఁ గనఁడు వాఁ
డమరందు గాసదుఁ డొండన, శమనునకుం బ్రాణికోటి ♦ జాలికి నెలవే. ౩౯౧

మ॥ అనుజన్ముండు విభీషణుం డనఘుఁ డి ♦ య్యర్థంబున న్వేఁడె నా
తనికి న్జాలి జనింప దస్మొయిన విం ♦ ధ్యప్రఖ్యుఁడుం దెల్పెఁ జే
టున కిట్లాగ్గితి వంచు వృద్ధుఁడు గుణా ♦ ఢ్యుం డిష్టుఁ డవ్వాని ప
ల్కనవేనిం గరఁగండు గండుకొని సం ♦ కోచించునే యొక్కటన్. ౩౯౨

తే॥ తనకుఁ దానయి వాఁడు న ♦ న్దఱుమ నిచ్చ
గింపఁ డటుగాన దుష్టాత్ము ♦ కీడు దలఁచి
కాని మేల్కనరాదు మ ♦ త్కథిత మరసి
ర మ్మనుము రాముఁ జలము బీ ♦ రమ్ము నెఱయ. ౩౯౩

సీ॥ నను జయశ్రీతోడ ♦ నాథుండు గొనిచను, బవమానతనయ! నా♦పలుకు తప్ప
దంతరంగము వృత్తి♦యనువాద మొనరించు, నీయర్థమునఁ గాన♦నింత నిజము
మనఁగంటి సుమ్ము నే♦మమ్మున నిన్నాళ్లు, విభు పరాక్రమకలా ♦ విభవ మెఱిఁగి
పౌరుషోత్సాహప్ర ♦ భావసత్త్వకృతజ్ఞ. భావానృశంస్యము ♦ ల్వరఁగు రాము
నం దతం డల్గిన జగత్త్రి ♦ యంబు వడఁకు
సజ్జనులఁ బ్రోచుఁ జెట్టలఁ ♦ జక్కడంచు
వ్యసనముల కోటుపడఁ డమ్మ ♦ హాత్ము మహిమ
మే నెఱుఁగు దింద్రు నెఱి శచి ♦ యెఱిఁగినట్లు. ౩౯౪

క॥ శూరుఁడు శరకిరణమ్ముల, నా రామదివాకరుఁడు సు ♦ రారిపద మ్మౌ
నీరమ్ము హరించు నకూ, పారముపై నెత్తి విడిసి ♦ పవనతనూజా! ౩౯౫

తే॥ ఇంతయుఁ బ్రతిష్ఠ నీయది♦యేతలంప, విభుని ననుఁ గూర్పఁ జాలి తీ♦వెరవు దనర
నింకఁ గాఁగల పనుల ని♦ల్లైలమి మెలఁగి, నాదు దీవన లంది యా♦నంది వగుము.

క॥ అని యశస్వివు లాలుకఁగ రా, ముని వలగొను చిత్తవృత్తి♦మొనకొను పల్కు
ల్వనజాక్షి వలుక విని య, య్యనిలజుఁ డిట్లని సమాద ♦ రాంచితుఁ డగుచున్.

— ♦ హనుమ సీతాదేవి నాదరించుట ♦ —

తే॥ అమ్మ! నానుడి విస్పష్టె ♦ యగచరేంద్రు
వాహినులు దోడుతోడన ♦ బాఱుదేఱ

వచ్చు రాముండు నీ వింక ♦ వనట నొంద
వలవ దదిగాక యొక్కండు ♦ వలను వినుము. ౩౯౮

క॥ నావీఁపునఁ గూర్చుండుము, నీవెతలు దలంగ నంబు ♦ నిధి దాఁటి ధరి
త్రీవిభుని సన్నిధిని ని, న్నేవెరవుననేని మెలఁగ ♦ నిప్పుడ కూర్తున్. ౩౯౯

తే॥ అనలుఁడు హవిస్సు శక్రున ♦ కందఁజేయు
తరబడి నిమేషమాత్ర నీ ♦ దయితుఁ జేర్తుఁ
గొండతో లంక రావణుఁ ♦ గూర్చి యెత్తి
మోచుకొని పోవ నాలావు ♦ మొనయఁగలదు. ౪౦౦

సీ॥ కాంచెదుసహజాత♦కలితు రాముని దైత్య, దళనోద్యతుని రమా♦దయితు నట్లు
ప్రస్రవణాఖ్యాద్రి♦పై సిల్చియున్నవాఁ, డై రావణంబుపై♦హరియ పోలెఁ
ద్వద్యోగసంపత్తి♦తాత్పర్యమున మించు, పాలుపెంచు నాతని♦పూర్ణనిష్ఠ
ఫలియింపఁ జూడు మా♦ప్రభు తపం బనవద్య, మిందు రోహిణి భాతి♦నెలయ జేసి

యొండు దలఁపకు మిదె భాను ♦ మండలమ్ము
నారసి మాటాడు నంతలో ♦ నుదధిఁ గడచి
విభుని చెంగట మెలఁగు న ♦ వ్విధికిఁ గూర్తు
నీదు మానస ముల్లాస ♦ నియతిఁ దనర. ౪౦౧

క॥ ఏవలనున మును వచ్చితి, నావలనున నిన్నుఁ గొని వి♦హాయసవీధిన్
బోవునెడ రక్కసులు ర, క్షోవిభుఁడేని ననుఁ దేఱి ♦ చూడంగలరే. ౪౦౨

ఉ॥ ఆనతిసేయు మంబ యన ♦ నద్భుత మంది ధరిత్రి పుత్రి హా
ర్షానతగాత్రి యై పలికె ♦ నాతనితోఁ దగునయ్య! యి ట్లనం
గా నను మోచి దూరగతిఁ ♦ గాంచఁగ నోపుదె యించుకంత యా
మేనునఁ బొల్చి యాకృతికి ♦ మేకొనెదే కపిచాపలంబునన్. ౪౦౩

క॥ నీచెయ్వులు నీరూపును, వాచారంభమున కనను ♦ వాదు లనుచు న
వ్వాచంయమనుత పలికిన, నా చతురతరుండు తనహృ ♦ దంతరసీమన్. ౪౦౪

క॥ నా కిది నూతనపరిభవ, మీకొలఁది యెఱుంగ కీమె♦యిటు లాడె నటం
చాకిడెడు వింజమున సిరి, మేకొన మెయిఁ బెంచఁదొడరె♦ మెలఁకువతనరన్.

సీ॥ కనకాద్రిద్వైతమ్ము♦గడలుకొల్పెడు మేను, విద్యుత్ప్రశంగము♦ల్వీక్షణమ్ము
లుదితార్కబింబంబు♦నోజ మించు మొగమ్ము, దీప్తానలజ్వాల♦దివియు తేజ
మతివజ్రసారమ్ము♦లగు భీష్మనఖదంష్ట్ర, లరిభీకరము విక్ర♦మాభియోగ
మభియుక్తిసహదుస్స ♦ హానుభావవిశేష, మనుపమజవసత్త్వ♦ఘనవికాస

మమర నొప్పారి దేవారి ♦ యఖిలవిభవ
మొక్కఁడే డక్కఁగొనఁ జాలు ♦ నోహొహోహో యనెడు
దారి యన్నారి మదిఁ దోఁపఁ ♦ దరము మీఱి
పలికె సామీరి గంభీర ♦ భాషణముల. ౮౦౭

తే॥ సగిరికాననషండ ప్రా♦సాదసాల, గోపురాట్టాలకాద్యుప♦గుంభమహిత
లంక నేలికతోఁ గూడ♦లాగి యెత్తి, మోచికొనిపోదు నీయాన♦మొనసెనేని.

క॥ కా దను విమతిఁ దొలంచుము, పాదుకొలుపు మింక సుదృఢ♦భావ మెడఁద సం
మోదమున నోలలాడఁగ, నీదయితు నొనర్పు మిపుడె♦నీరజనేత్రా! ౮౦౮

చ॥ అన విని వీఁడు మారుతుని ♦ యంతలొ యెక్కుడొ కాని యల్పుఁడే
యని స్మయహర్షము ల్మిగుల ♦ నాతని వేఁగగు రూపు చూపునం
గని కనలేక విభ్రమము ♦ క్రిందుకొన న్మనువంశమౌళి యో
జన మది మెచ్చి పల్కె మహి ♦ జాత సుజాతసరోజలోచనా! ౮౦౯

తే॥ సందియము లెల్లఁ దీఱె దొ ♦ సంగు లెడలెఁ
దెలియఁ గాంచితి నీమహా ♦ దివ్యమహిమ
వాయుసత్త్వజవములు పా ♦ వకుని తేజ
మిద్ధతేజ! నీయం దొంట ♦ నిరవుకొనుట. ౮౧౦

క॥ అబ్బురమ కాదె యొండీ, కబ్బురుల జగంబు దొక్కఁ♦గాఁగలఁడె జయం
బబ్బెనపో నీ వంబుధి, నిబ్బరముగ దాఁటిరా న♦నిలదేవసుతా! ౮౧౧

తే॥ కలదు గమనాగమనశక్తి♦కలిమి నన్ను, రాముఁ జేర్పంగ నేర్తు బీ♦రమున సిరికిఁ
గూర్తు వైన విచారించు♦కొనుటలెస్స, కార్యసిద్ధి తెఱంగు మొ♦క్కలము వలనొ.

సీ॥ ఇదియ యయుక్త మం ♦ చే నెంచెద నెడంద, నీతోడి రాక వ ♦ నేచరేంద్ర!
వాయువేగంబున ♦ వఱలుచు నీ వేగ, బమ్మరపడి నేలఁ ♦ బడెదనొక్కొ
యాకసం బొరయంగ♦నగు నీదు మూఁపున, నెడలి ప్రాణంబుల♦విడుతునేమొ
మున్నీటఁ గూలిన♦మొసయు జిఘత్సచే, జలజంతువులు మూఁగి♦చంపఁగలవొ

కాన సందిగ్ధ మీఁగతు ♦ ల్గాకయున్నఁ, జెట్టరాకాసి ప్రేరేపఁ ♦ జెడుగు లొరసి
నిన్ను వేధింప వారల ♦ నీ వడంప, నడర నాకర్మ మె ట్లౌనొ♦యరయరాదు.

ఉ॥ ఆయుధపాణు లయ్యసురు ♦ లందఱు మూఁగ నిరాయుధుండ వై
పాయని కిన్క మార్కొను ట ♦ పాయకరం బని యెంతుఁ గావొకో

యేయెడ నేనియు స్వయజ ♦ యేతర యోగము లస్థిరస్థితు
ల్వాయుజ! నీశ్రమంబు ఫల ♦ వంతము గాక చెడంగఁబోలునే. ౪౧౪

ఆ॥ అట్టి సంకులమున ♦ నడలెడు న న్నొకం, డలఁచె నేనిఁ జంపఁ ♦ దలఁచె నేని
నోడిచికొని తలంగి ♦ యొండొంట దాఁ చెన, యేనిఁ గర్జ మింత ♦ యెడలకున్న.

ఆ॥ రామునకు మనోర్థి ♦ రామున కదనీయు, సోదరులకుఁ గడమ ♦ చుట్టములకు
నీకుఁ గపులకును రు ♦ మాకాంతునకుఁ జెట్ట, పుట్టకుండ నంతవట్టు ♦ గనుము.

క॥ నాయందాయుత్తము లౌ, నీయందఱ జీవితమ్ము ♦ లి ట్లని మున్నే
నీయెఱుక గలదరూఢం, బై యెడసెడు కృత్య మూన ♦ నగునే నీకుఁ. ౪౧౭

తే॥ నీ వఖిలదుష్టరాక్షసా ♦ నీకముల న
డంచి నన్నుఁ జేర్ప జాలుదు ♦ వంచుఁ దలఁతు
నైన రఘువీరుని యశంబు ♦ నందుఁ గొఱఁత
వెట్టుటయ కాఁగ నానో భా ♦ వించుకొనుము. ౪౧౮

ఆ॥ వేయు నేల వత్స! ♦ వినుము రాముని తను, వంటి యొంటిఁ దాఁక ♦ ననుమతింప
భర్తృభక్తికలన ♦ బరఁగుదు నెటులేని, నతనిఁ దె మ్మనమ్మ ♦ నంది మనుము

క॥ మును ద న్నెఱుఁగ కనీశత, ననాథ నై యున్నతఱి న ♦ హంకృతిఁ గొని తె
చ్చె నసుర చావేఁడి యదియు, కొనరా దెఱుక గని యిపుడు ♦ కోవిదవర్యా.

సీ॥ ప్రలయకాలాంబుద ♦ ప్రతిమానమూర్తి యై, చిత్రకార్ముకకలా ♦ శ్రీ రహింప
వాసవప్రకృతస ♦ ద్వైభవం బొప్పారు, ననుజుఁ డగ్గిసి వాయు ♦ వట్లు వెరయ
వైద్యుతోత్తేజఃప్ర ♦ వర్తనం బిరవొంద, విక్రమస్థితి దిశా ♦ చక్ర మొరయఁ
బ్రతిపక్షు లెడ ససం ♦ భ్రమవృత్తి నల్లాడ, శరవర్ష మసురుల ♦ సమయఁ జేయఁ
దివిరి రణరంగదేశమ్ము ♦ దిమ్మరిల్ల
నెగడు రఘురాము నెదిరించి ♦ నిలువ నెంచి
మెయిమెయిఁ జనంగ రుద్రుఁడే ♦ మేకొనంగఁ
జాలఁ డన లాఁతివారి ప్ర ♦ సంగ మేల. ౪౨౧

తే॥ అట్టి పురుషోత్తమున కగు ♦ నసురసమితిఁ
ద్రుంచి రావణు మర్దించి ♦ తోడుతోన
నన్ను సారప్రశంసనో ♦ న్నతులు వేల్పు
కోమల స్తుతిగీతు లెసఁగఁ దో ♦ డ్కొని చనంగ. ౪౨౨

క॥ నాకాంతుఁ బ్రబోధింపుము, నాకౌకశ్శత్రుసమితి ♦ నాశ మొనర్పన్
నాకష్టములం గెడపుము, నాకాధిపనంద్య! కొనుము ♦ నాదీవనలన్.. ౪౨౩

చ॥ అని వనజాయతాక్షి నయ ♦ నాబ్జదళమ్ముల నశ్రుబిందువు
లానుకఁగ దీన యై పలుకఁ ♦ దోడనె యిట్లనె వాయుసూనుఁ డ
డమ్మనుకులమౌళిపత్ని గరి ♦ మంబు నయంబు వినీతి సన్మృదూ
క్తి నెఱి నెఱింగి సంతసము ♦ కీర్తివృత్తిఁ దలిర్చుచుండఁగన్. ౮౨౬

సీ॥ నిజమె పల్కితి తల్లి! ♦ నీబోంట్ల కగు నెట్టు. లొంటితో నతిదూర♦మోజ నడువ
నంబుధిశతయోజ ♦ నాయతం బమ్మొయిఁ, గడవ మెత్తన యాన ♦ కాదె స్త్రైణ
మొండు భాషించితి♦వుజ్జ్వలాంగి! శుభోక్తి, రామేతరు స్పృశింప♦రా దటంచు
నీవిధి నాడువంగ ♦ నేసాధ్వి కేనియుఁ, దరమె యాపత్సము ♦ ద్రమున నుండి
యమ్మహాత్ము పత్ని ♦ వగు నీక తగు నింత, కియ్యుదంత మింత ♦ యేనిఁ దిరుగ
కుండ నీదువిభున♦కోలి నే వివరింతు, నతఁడు హర్షవార్ధి ♦ యందుఁ దేల. ౮౨౭

ఆ॥ లంక దుష్ప్రవేశ ♦ లాతివారల కంచు, యబ్ధి దుస్తరంబ ♦ యనియుఁ గడకు
నిన్ని గడచి కంటి ♦ నే నిన్ననియుఁ బ్రీతి, నిట్లు పలుకవలసె ♦ నిర్మచరిత!

ఉ॥ రాముని చిత్తవృత్తి కను ♦ రంజనముం బొనరింపఁ గోరి గా
రామున నమ్మహాత్ముఁడు క ♦ రమ్మిడు నాచన వెంచి యెంతయు
స్నేమము మీఱ నేఁడె నిను ♦ నీవిభుఁ గూర్చెద నంచు భక్తిమై
నోమహిజాత! పల్కితి న ♦ యుక్తము యుక్తము నే నెఱింగియున్. ౮౨౯

ఆ॥ అట్టు లైన మేల ♦ యదియు మేలగు నభి, జ్ఞాన మొండొసంగి ♦ జనకతనయ!
నన్నుఁ బనుపు మింక ♦ నావంకఁ దమకన్ను, లునిచి యుందురచట ♦ నున్నవారు.

క॥ నా కిటుఁ దడయంజన దన, నాకపడెడు వెతకు గద్గ ♦ దాంచిత యగుచున్
శ్రీకాము రాముఁ గూర్చి శు, భాకృతి కృత మరసి పలికె ♦ హనుమనితోడన్.

—♦ సీతాదేవి శ్రీరామచంద్రుడు విశ్వసింపకాకాసురాది కథల హనుమతోఁ జెప్పుట ♦—

తే॥ అన్న! మన్నాథుఁడు స్మరించు ♦ నట్లు సేయు
మెలమి గండోపలమ్మున ♦ నిడ్డ యమ్మ
నశ్శిలాతిలక మ్మాన ♦ నమునఁ బ్రితిఫ
లన మొనర్చి హసించు లీ ♦ లాయితంబు. ౮౩౦

క॥ నా పలుకులఁ బలుకగ నగు, నోపవనతనూజ! యిదియు ♦ నోపు విభు నెడం
బ్రాపయి నాపయి దయతో, శ్రీపద్య ననుస్మృతి దలిర్పఁ ♦ జేయుకలిమికిన్.

సీ॥ మందాకినికిఁ బొంత♦మహిఁ జిత్రకూటంబు, పూర్వోత్తరంబునఁ♦ బొలుపుగాంచుఁ
బాదంబు ప్రత్యంత♦భాగంబునకుఁ గూర్చి, తాపసాశ్రమ మొండు♦దనరుచుండు

నది పుష్పఫలజలా ♦ ద్య భ్యర్చితం బవు, నందుండి యొక్క నాఁ ♦ డంతికోప
వనవిహారంబున ♦ బడలి రసక్లిన్న, నై యున్నతఱిని నీ ♦ యంకపాళిఁ
జేరి శ్రాంతిఁ దొలంచుచోఁ ♦ జెడు గొకండు
కాకి మాంసార్థి యై నన్నుఁ ♦ గదిసి పొడువ
దాని నేఁ దోల నదియు వి ♦ దారణంబు
సేయ నెంచి తలంగకే ♦ చెనయుచుండ. ౪౩౨

తే॥ వసన మొక్కింత వీడంగ♦వఱలు రశన, వ్రేలఁ గైకొని సవరించు♦వేడబమున
కీవు నవ్వితి ననుఁ గాంచి♦యేను సిగ్గు, పడితి నలిగితి జెట్ట యాఁపక్షిపైని. ౪౩౩

క॥ చలపాది దాని కృతి న, ట్లలమటపడి బాష్పపూరి♦తాక్షి నగుచు నీ
వల నెనసి నిలువఁ జల్లని, పలుకులు పలికితివి సాంత్వ♦పద్ధతి తనరన్. ౪౩౪

ఆ॥ అలసి సొలసి నిదుర♦నందితి నీతోడ, నైఁ బరుండి కొంత♦భయము దొఱఁగి
యేను మేలుకాంచ♦నెడ గాంచి నాయంక, మునను నీవు సుప్తి♦మొనయఁగంటి.

ఆ॥ పాడు వాయసంబు♦వీడక క్రిమ్మఱఁ, జేరవచ్చి బిట్టు♦చీల్చె నట్టు
లద నెఱంగి మత్కు♦చాంతరసీమ భోర్, రనఁగ రక్తధార♦లాక్రమింప ౪౩౬

క॥ నెత్తురు బొట్లొలుకుచు నీ, మెత్తనిమై దడుప నేను♦మేల్కొలుపఁగ నీ
వొత్తిగిలి సుఖసుషుప్తికి, హత్తికొనెడు నెఱికిఁ బోక♦యారాటమునన్. ౪౩౭

ఉ॥ నాయెడ రెల్ల నెట్టనఁ గ ♦ నం గని క్రుద్ధమహాహివృత్తి త
న్వాయని చాయ మేకొన న ♦ పాత్రిఁ డెవం డిటు నిన్నలంచె వాఁ
డేయెడ కేగి యెట్లు మన ♦ నెంచెడునో చెడు గంచు రక్తసి
క్తాయతతుండశాతనఖ ♦ మాయధమాండజ మప్డెదుర్పడన్. ౪౩౮

ఆ॥ అద్రు లంది మెలఁగు ♦ నైంద్రి మపత్య మి
క్కరట మనిలుఁ బోలు ♦ గతిని బలువు
గలదు దీని నింకఁ ♦ గాఱింతుఁ జూడు మం
చరసి పలికి మద్భ ♦ యంబు గెడపి. ౪౩౯

తే॥ ఆడెదవు లెమ్ము పంచ ♦ వక్త్రిహితోడ
ననుచు సంస్తరమునుండి ♦ యలఁతి నొక యి
షీక మెత్తి బ్రహ్మాస్త్రమ్ము ♦ సేర్చి విడువ
నదియుగాంతాగ్ని యై దాని ♦ నంటఁగదిసి. ౪౪౦

క॥ వేఁపఁ దొడర నది పరువిడి, కాపాడెడువార లెందుఁ♦గలరో యని జే
జేపట్టు లెల్ల రోయుచుఁ, దాపాతికయమ్ము దొనుకఁ♦దలఁకెడు మదితోన్. ౪౪౧

చ॥ జనకుని వేఁడి తిట్టువడి ♦ సాటి దిగీశులు కాదన న్వారిం
చనముఖు లాత్మదోషమునఁ ♦ జావ్రము పొ మ్మన నిమ్ము గాన కి
మ్మనికికి వచ్చి నొచ్చితి వి ♦ మానన చాలు దయాబ్ధి! మన్ను మీా
చెనఁటి పొనర్చి నట్టి బలు ♦ చెట్టఁ దలంపకు మంచు రొప్పుచున్. ౪౪౨

క॥ తెరలుచు రామా నీవే, శరణము లోకైకవంద్య♦చరణా! యనుచున్
సరభసముగ వేఁడిన వి, ష్కరముపయి న్నెనరు మదిని♦గీలుకొనంగన్. ౪౪౩

తే॥ ఈశ్వర మమోఘ మింక నీ ♦ వెద్దియేని
నొక్కయవయవ మిద్దాని ♦ కొసఁగి యెఱుక
గలిగి జీవింపు మన వల ♦ కన్ను నూపి
బ్రదికి నీకీర్తిఁ గీర్తించి ♦ పదము సేరె. ౪౪౪

క॥ నా కపకార మొనర్చిన, కాకముపై నంతసేయఁ♦గడఁగిన నీ వి
వేకతమున నిల్పించితొ, నాకేశస్తుత! దొసంగు♦నాదెసఁ గలదో. ౪౪౫

తే॥ పురుషసింహామ వీవు నీ♦పొరుగు సేరి, వంచక మొకండు నను భవ♦ద్వైభవమ్ము
నట్లు గొనితేర నరయంగ♦నైనయంత, వాఁడు బ్రదికెకు నే మన♦వలయు నింక. ౪౪౬

ఆ॥ నాథవతిని నే న♦నాథ యట్టులు గాఁగ, నాథ! యూరకుంట♦నయమె నీకు
ధర్మ మెఱుకగలవు♦తాత్పర్యమున నింత, యరసి యైనఁ బ్రోవ♦నగున కాదె.

వ॥ ఆనృశంస్యంబ యుత్తమం బగు ధర్మం బని నీవలనన వినియుంటిం గావున నావలని
యక్కటికం గాకున్ననుఁ గారుణ్యంబు భావించి యైన న న్నుద్ధరింపుము. ౪౪౭

తే॥ అనుచు విస్పష్టముగఁ దెల్పు ♦ మనిలతనయ!
యన్మహామహు మాహాత్మ్య ♦ మాదరమ్ము
నే నెఱుంగుదు నెదిరించి ♦ నేఁటివఱకు
మయిమయి చనంగ నొకఁడు ని ♦ మ్మహినిలేఁడు. ౪౪౮

సీ॥ ఆడితప్పనివాఁడ♦వని నీదు సత్యమ్ము, మాలిమి నింతకు♦మంటె ననుము
గడె లోనఁ బలువేలు♦గఱకురక్కసిగండ్ల, మడఁచిన నీలీల♦మఱవ ననుము
నీమహాగాంభీర్య♦నిగ్రహంబున కెంత, యూసాగరం బని♦యెంతు ననుము
పొలివోక ముల్లోక♦ముల నేర్పఁజాలు నీ, యస్త్రశక్తికి లంక♦యలఁతి యనుము
నావలనికూర్మి నెమ్మది♦నాటియున్న, నింతకాల ముపేక్షింప♦నేల యనుము
నెనరుమైనేనిఁ బగతుర♦నిగ్రహింప, నేనియుఁ బ్రతిష్ఠ కేనియుఁ♦బూను మనుము.

క॥ తనయానతిఁ గొని లక్ష్మణు, డనితరదుర్ధర్షుఁ డొకరుఁ♦డనలాయత్తం
బొనరింపఁడె యీలంకను, గనికర మెడలంగ నంత♦కాని జనమనే. ౪౫౧

ఉ॥ నాదురదృష్ట మింత కిది ♦ నాఁ దగు నోపవమానపుత్త్ర! యె
ట్లేది పొసర్పఁ దోఁప కిటు ♦ లేకత మేపటియున్నదాన నోం
డేదియొ కాలకర్మగతి ♦ యెంచఁగనోప మదీశు నెమ్మదిం
బాదుకొనంగఁ దెల్పు మట ♦ బాట విధాత విధింపకుండునే. ౧౫౨

క॥ అని కనుల నశ్రుజలములు, దొనుకఁగ నద్దేవి వలుకఁ♦దోడిబడి యపా
వని యాయమ దీనత్వము, గని యూఱట నందఁ జేయఁ♦గా నిట్లనియెన్. ౧౫౩

సీ॥ నీదెస విముఖుఁ డౌ♦నెటి లేదు మాతల్లి!, చాటి చెప్పెద మేలి♦శపథ మొప్పఁ
దనజాడ గనరాని♦దనఁగ నేరమి గాక, నేర మెద్దియు గాదు♦నీరజాక్షి!
త్వచ్ఛోకమున గొగ్గు♦దయితుతోడిద లోక, మాతని తమ్ముఁ డ♦య్యనఘునకును
దరిగాంతు రిఁక మీఁదఁ♦దావకీనచరిత్ర, మే నెఱిఁగించిన♦యింతమాత్ర
లంక భస్మీకరింతురు♦లాఁతివార, నంగ నెంతలు వారికి♦నయముఁ గాంచి
యూఱడిల్లుము మేలిమి♦నోలి యువేళఁ, బడిన పాట్లెంచి చేడ్పడఁ♦బాల్పడకుము.

క॥ చెడు గీరావణు సబలుం, దోడరి వధించును విభుండు♦తోడ్తో నిను నీ
యెడ రెడలఁ దోడికొని చను, నెడఁద వితర్కముల కిడఁగ♦నెంచకు మింకన్.

తే॥ నెమ్మి నీదయితునకు వి♦నీతుఁ డైన, నీమఱంది సౌమిత్రికి♦నీదు కొలువుఁ
గాంచ వేఁడెడు కపులకుఁ♦గపివరునకుఁ, దెలుపుమీ వార్త లవి యేనిఁ♦దేటపడఁగ.

క॥ ఒసఁగు మభిజ్ఞానంబొం, డసదృశ మెది యేని దాని ♦ నధిపుఁడు గని యి
య్యసమదశ నింత నిజ మని, ప్రసాదమున వెలయు రీత ♦ భావించి మదిన్.

చ॥ అన విని మేలి యుచ్ఛ్వసిత ♦ మంది హరిం దర! మదర్పితంబు లా
వినతులు దెల్పుమీ తొలుత ♦ విశ్వజనీనచరిత్ర కోసలే
శుని సుత కన్నుకాన్పు నవ ♦ శోభనమూర్తి సమస్తజీవజీ
వనకళ రామనామకము ♦ ప్రాణము భావరసాఢ్య మై తగన్. ౧౫౪

క॥ కుశలం బడిగితి ననుమీ, కుశలిని నై యుండఁ జూడఁ♦ గోరితి రాకా
శశినిభ మాస్యం బనుమీ, విశదము త్వద్దాస్య మెడలె ♦ విధికృతి ననుమీ.

సీ॥ మెఱసె సుప్రజ యై సు♦మిత్ర యెవ్వనిఁ గని, తల్లిదండ్రుల వీడి♦తనదు మదిని
దల్లిదండ్రులటంచుఁ♦దలఁచు మమ్మెవ్వాఁడు, దక్షుండు శుచి మృదు♦త్వమునఁ దనరు
వాఁ డెల్లసుఖముల♦వదలి మాతోడి దా, దశకుఁ బాల్పడి వనాం♦తరము సొచ్చెఁ
గంటికి ఱెప్ప యై♦కాపాడె నెవ్వేళ, మితభాషి జనకస♦మ్మితుఁడు హితుఁడు
నామఱంది యతని సేమం♦బరయఁ గోరి, యుంటి ననుము తలఁకి♦యొఱవమాట
లంటిఁ దత్ఫలమ్ముఁ♦గంటి నిట్లని తెల్పు, మంటి ననుము సుకృత♦మంది మనుము.

క॥ మానరనాయకు సచివుని, వానరనాయకుని సుకృత ♦ వంతుని కుశలం
బే నరలే కడిగితి నను, మీ నరకం బెడలఁజేయు ♦ మీ ఘన మనుమీ. ౪౬౧

— ♦ సీతాదేవి హనుమకు శిరోమణి నొసఁగుట ♦ —

తే॥ కపివరేణ్యుల తేఁకువ ♦ గంటి నను
మేలుగోరెద నెడఁద నె ♦ మ్మోయిన యేని
నిమ్మహాకృత్యమునఁ బార ♦ మెనయఁ గాంచి
యందఱను నాదు దీవన ♦ లందు మనుము. ౪౬౨

క॥ అని తన చేలాంచలమున, మునుకొను ముడి విప్పి ఘన మ♦మూల్యము మహితం
బనఘము చూడారత్నము, దనపతి కర్పించు మని య ♦ తని కపు డొసఁగెన్.

ఆ॥ అయ్యనర్ఘ్యరత్న♦మంది మిన్నంది యం, గుళిని దొడిగి రాముఁ♦గూర్చెఁ జిత్త
మునను హనుమ వాని♦ముద మెంచి యద్దేవి, పలుకఁదొడరె నొండు♦భంగి తనర.

సీ॥ ఇది జీవమణి దీని♦నెనసి నేత స్మరించు, జనకుని నన్ను నా ♦ జనని నొకట
నబ్ధిసంభవము మ♦హార్హ మియ్యడియాల, మంది యానందించు♦నాజితనుఁజుఁ
డదసీయసంబంధ ♦ మంది జీవించితి, నెడలించు నశుభమ్ము ♦ లిది ప్రసక్తి
నింక శోకము పార♦మెనయించ నీయదె, భార మం చినున కే♦ర్పడఁ బలుకుము
అడుగుబట్టిన కౌశికి ♦ నల్ల లక్ష్మి
నుద్ధరించిన హరి నీవు ♦ నొక్కఁ డనుము
త్వద్వియోగార్తనై మేలు ♦ దలఁచి తాల్చి
దయ్యములు ఘోర మంటి నిం ♦ దాక నను. ౪౬౫

తే॥ లేదు పునరుక్తిదోష మీ ♦ లేమిలోన
గానఁ బలికిన యదె పల్కు ♦ దాన నెట్టు
లైన నానాథు నెమ్మది ♦ కానఁ బలికి
యతని ననుఁ గూర్ప మధిధర్మ ♦ మంద గనుము. ౪౬౬

ఆ॥ శోకకర్శితములు♦సుకుమారములు నైన, గాత్రముల మదీశు♦గారవింప
నెంచుదాన నాదు♦నేఁకట దీర్ప నీ, వెరవ దొరను గూర్చు♦తెరు వరయుము.

ఉ॥ నీవును వైనతేయుఁడును ♦ నీజనకుండును నేర్తు రబ్ధిపైఁ
బోవఁ దరింప నెట్లు హరి ♦ పుంగవులం గొని తెత్తొ రాఘవు
ల్తావకమంత్రియుక్తి నెటు ♦ తారొకఁనఁ జూతువొ యొం డనంగ రా
దీవిషమార్థ మెల్ల భవ ♦ దేకవిధేయము వాయునందనా! ౪౬౮

శా॥ మత్సందేశవిశేషజృంభితము నీ ♦ మంత్రిప్రభావమ్మునన్
గోత్రోత్సాహం బెనఁగ న్దవానలము వా♦యుప్రేరితం బెట్టు లా
దిత్స న్వన్య దహించు లంక నటు భూ ♦ దేవుండు బి ట్టేర్చి దీ
వ్యత్సౌభాగ్యము నాదెస న్నెఱపు దా ♦ క్ష్యం బొప్పదే మారుతీ! ౪౬౯

ఉ॥ పున్నెము గట్టికొమ్ము పరి ♦ పూర్ణయశోర్థి విగమ్ము తుల్యులం
దెన్నికఁ గాంచు మిట్టికృతి ♦ యెద్దియుఁ గా దని యెంచు మాదటన్
సన్నుతి కెక్కు మాత్మధృతి ♦ సంపదఁ జొక్కము నాదు దీవనల్
గ్రన్నన నంది వర్ధిలు మ ♦ ఖండసమృద్ధులతోడఁ బావనీ! ౪౭౦

క॥ అని దీనత దోఁపఁగ న, వ్వనితామణి పలుకఁ బ్లవగ♦వరుఁ డిట్లనె మూ
ర్ధనివిష్టాంజలిబంధత, తనరారఁగ నమ్రుఁ డగుచుఁ♦దలఁపు దలిర్పన్. ౪౭౧

—♦ హనుమంతుఁడు సీతాదేవి నూఱడించుట. ♦—

మ॥ అనుమానింపకు మమ్మ మానిని! త్వదే ♦ కాంత త్రిమై నున్న రా
ముని కీరేడుజగంబు లొక్కఁ డయి స ♦ మ్మోదమ్ముఁ గల్పింప ని
మ్మనరా దెద్దియుఁ ద్వన్నిమిత్త మని కా ♦ కాశాస్యమా కాదు పూ
నినఁ ద్రైలోక్యజయర్ధి చేకొనదు వా ♦ ని న్మాని యుండొక్కనిన్. ౪౭౨

క॥ ఇదె నిను వేఁచెదు పగతుర, మద మణఁగింపఁగ లోక♦మాన్యచరిత్రుం
డద నెఱిఁగి వచ్చు రాముఁడు, మది సందేహమ్ము లింక♦మానుము తల్లీ! ౪౭౩

ఆ॥ అతని నెదిరి నిలువ♦నవని లేఁ డెవ్వాఁడుఁ, దేటి చూడ లేరు♦దితిజులేని
రక్కసులకు మిత్తి♦రామనామ మొకండె, యేల తలఁకు మది మ♦హీతనూజ!

క॥ పిడుగునకుఁ దోడు దా నై, యుడ రెడు బడబాగ్ని గాక♦యులఁతివడు నె త
మ్ముడు నన్నకు నాసుగ్రీ, వుఁడు చాలఁడె కొఱవి ద్రిప్పఁ♦బోరికలనిలోన్.

తే॥ నేటఁ రేపట వానరా♦నీక మెల్ల, దెసల నొక్కటఁ గ్రమ్మి మూ♦కసము ద్రోఁచి
నేల యీనిన చందాన♦నెలకొనంగ, నీవ కాంచెదు సుమ్ము నా♦నీతి తెఱఁగు.

సీ॥ కామరూపులు వాయు♦గతులు పాతాళంబుఁ, జొచ్చి వత్తురు మిన్ను♦గచ్చివైతు
రెందునేనిఁ బ్రసక్తి♦యెడలనీ రమితతే, జస్కులు బలసత్త్వ♦సారకలితు
లొండొరులను మెచ్చ♦రున్మనస్కులు మదు, త్కృష్టులు మత్సము♦ల్కీర్తనీయు
లటుగాక నాకన్న♦నవరుఁడొక్కరుఁడు లేఁ, డిందఱు రవిసూను♦నెలమిఁ గొలుతు
రిట్టి కపు లెల్ల బలి యాజ్ఞ♦నేకమతిని, రాము సేవించుచున్నారు♦రామ! నీదు
చరిత మెఱిఁగించినంతన♦చదలు ద్రొక్కి, వత్తు రీలంక కలిమి ను♦గ్గొత్తు గొనఁగ.

క॥ ఆమాన్యు లట్టులుండఁగ, సామాన్యుఁడ నేనె యిందుఁ ♦ జనుదెంచితిఁ జు
మ్మామానిని! యెందేనియుఁ, బ్రాముఖ్యము గలుగు జనునిఁ♦బంపఁ దలఁతురే.

తే॥ నాదు మూఁపుల నిడి నీదు ♦ నాథు ననుజు
నేన కొనివత్తు నింగిపై ♦ నెలకొనంగఁ
జంద్రసూర్యు లనంగఁ బ్ర ♦ శస్తి వెలయ
నుదయ మొనయంగఁ గలరు నీ ♦ వుత్సహింప. ౪౭౯

తే॥ లంక వేల్తురు బాణాగ్ని♦లాఁతివారిఁ, దునిమి రావణు వధియించి♦తోడుతోన
రాముఁ జంద్రుని రోహిణి♦రాణ దనర, నీవు గూడి ప్రకాశింతు♦వెడ రెడయుము.

తే॥ అమ్మ! పోయివత్తు ♦ నడరు మానుము పతి, దేవ తేశ నిన్నుఁ ♦ దేఱిచూడ
నెవ్వఁడోపుఁ జిచ్చు♦నిడికొనె నొడి నెవం, డతఁడె కాంచుఁ దత్ఫ♦లానుభవము.

క॥ అని సత్యము ప్రియముగఁ బలి, కినఁ దలఁపున శంకఁ దక్కి♦కీశవరేణ్యుం
డనితరసదృశుం డని యిటు, లనె నిండుమది న్ధరాజ♦యచలతనూజా! ౪౮౨

క॥ స్మరశరపాతమ్మున కు, ద్ధరశోకోత్పాతమున క ♦ ధోగతు లియ్యా
శరహతకు లెంచ కాఁడెడు, పరాభవోక్తులకు నిచ్చ ♦ బడలితి వత్సా! ౪౮౩

ఆ॥ నిన్నుఁ గాంచి నీదు♦నెఱి యెంచి నీమృదూ, క్తులు దలంచి యెడఁద♦కొందలమ్మ
గెడపఁగఁటి నీవు♦కేవలుండవె నాదు, కుట్టువాప నవనిఁ ♦ బుట్టి తనఘ! ౪౮౪

తే॥ నీవరుగకున్నఁ గర్జంబు ♦ నెలఁకొనంగఁ
బోదు నీవొనరించు ప్ర ♦ బోధనమునఁ
దేఱి యుచ్ఛ్వాస మొందితిఁ ♦ దెలియరాదు
నీచను లెఱింగి విధి గూర్చు ♦ నిగ్రహంబు. ౪౮౫

వ॥ అతిదూరప్రయాణంబునం బరిశ్రాంతిం గన్నవాఁడ వట్లగుటం జేసి. ౪౮౬

క॥ అన్న! యొకనాఁ డిచట నీ, వున్నను శోకోర్మ్మి లెడయు♦నో యని యెదలో
నెన్నెదఁ జెట్టల కగపడ, కిన్నెలవున నుండి కడఁగి♦యేఁగఁ దలఁపవే. ౪౮౭

క॥ అన విని బడలిక యనరా, దనిశము శ్రీరామసత్క ♦ థాఽమృత మెదలోఁ
దని వోలయఁ జేయుచుండఁగ, ననుఁ బనుపుము నాథుకడకు♦నయ మొప్పారన్.

ఆ॥ తడయ నేల తల్లి ♦ దాశరథిని గొని, వత్తు నెల్లి నీదు ♦ వ్యథ తలంగ
నతని తాప మెడప ♦నగుఁ గాదె సమరసు, లగుట నొంటఁ గర్జ♦ మనువుపడునె.

ఆ॥ అనినఁ బోయిరమ్ము♦హరివర! నావార్త, మఱవఁబోకు మెఱుక♦మఱవు లనఁగ
బ్రకృతికృతులు నీవు♦పతిఁగాంచి మే లెంచు, మఖిలశుభము లొందవు♦నయ్య! నీకు.

క॥ అని సెల వొసఁగిన హనుముఁడు, మనమున నుప్పొంగి లోక♦మాన్యు రఘుపతిఁ
గనఁ గౌతూహలమున ధృతి, మొనసె జ్జన నుత్తరాభి♦ముఖుఁ డై గిరిజా! ౪౯౧

వ॥ అని యిట్లు చంద్రశేఖరుం డెఱిఁగించిన నాచంద్రవదన యవ్వలికథాక్రమం
బెట్లు ప్రవర్తిల్లునో వినవలతుం జెప్పవే యని వల్లభుం బ్రార్థించుటయు. ౪౯౨

మ॥ కలితానర్థనివారణక్రమలస ♦ త్కల్యాణలీలాగుణో
జ్జ్వలనామాకృతిలక్ష్యమాణజగదా ♦ శ్చర్యప్రభావోదయా!
విలయాన్ముఖ్యగతప్రచార! గురుసం ♦ విద్ధర్మసంరక్షణో
త్కలికాఢ్యోత్కలికామధీమదధిక్ర ♦ త్ప్రోథిప్రియంభావుకా! ౪౯౩

క॥ ముద్రితహృదయవికాసా, న్నిద్రత్వవిధానచణసు♦నిష్ఠితజనచి
న్ముద్రాప్రాపణకరణ స, ముద్రాయితయోగవిఘ్న♦మోక్షణనిపుణా! ౪౯౪

మత్తమయూరము.

శ్రీమన్నామా♦సిద్ధిసమగ్ర ♦ శ్రితకామా
ధామస్థేమా♦తాపసవృత్తా ♦ దరభూమా
సోమార్కాది♦స్తోమసిషక్త ♦ స్తుతభామా
భామాయోగో♦ద్భావితభావా ♦ న్వయసీమా! ౪౯౫

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందు
సుందరకాండంబునం ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—.♦.—

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## సుందర కాండము.

———o———

### తృతీయాశ్వాసము.

———o———



యోగిసామముఖ్యో
పాయావశదుష్టహృత్ప్రి ♦ భంజనకరణ
స్ఫాయత్ప్రియత్నసాహా
య్యాయత్తదయావలోక ♦ నాంచితచిత్తా! ౧

ఆ॥ అవధరింపు మగజ ♦ యమ్మోయి వేఁడినఁ
జెప్పదొడఁగెఁ జంద్ర ♦ శేఖరుండు
వింటె సాధ్వి రామ ♦ విభు కథాసుధ యుడ
రామరత్వ మొసఁగు ♦ నన్నమాట. ౨

ఉ॥ కొంచెము శేష మున్నది ర ♦ ఘుప్రవరుం గని మ్రొక్కుటంచు లో
నెంచుధృతిం గృతార్థుఁ డయి ♦ యమ్మెయి నచ్చటువాసి కర్జ మూ
హించెను కొండొకండు హరి ♦ యేలిక దెల్పినయంతవట్టు గా
వించితినేనియుం గడమ ♦ వృత్త మెటోకద యన్న యోజనన్. 3

క॥ ఆలోకాప్తుఁడు చకితమ్ము, గాలోకా! నేర్మి మిగుల♦నాలోచించెన్
గాల మని దేశ మని మదిఁ, గాల మసురపురికిఁ దీఱఁ♦గానయియుంటన్. ౪

ఆ॥ మున్నె తెలిపె లంక ♦ మోసమ్ము లేదింక, నెట్టులైన నాఁగ ♦ నేల యాఁగఁ
దలఁచెనేని వాని ♦ దక్షత కదియెంత, చెట్టలెందుఁ జెడుట ♦ చెట్ట గాదు. ౫

క॥ తలపోసికొనియె నిట్లిదఁ, దలఁపున కందంగరాని ♦ తలఁపులవాఁ డీ
పొలపమునఁ దలము గని యు, ప్పొలదిండుల మద మడంపఁ ♦ బోక మఱలునే. ౬

—♦ హనుమంతుని కార్యాలోచననైపుణ్యము. ♦—

తే॥ దేవిఁ గనుఁగొంటి నరసి సం ♦ దిష్ట మందఁ
గంటిఁ బతి కెఱిఁగింతు దు ♦ ష్కరము గాదు
రావణునిఁ గాంచి వాని బీ ♦ రము చలమ్ము
బలముఁ బరికింప కెగువ లా ♦ భమ్ము లేదు. ౭

క॥ అరిబలశక్తు లరయకే, యరిగిన ఫల మేమి కార్య ♦ మనువు సెడిన దు
ష్కర మనవలయున కాదే, త్వరపడి పరసేన లొరయు ♦ దశ తారసిలన్. ౮

తే॥ సామమున రక్కసులఁ గాదు ♦ చక్కఁ బఱుప
నర్థపూర్ణు లగుట దాన ♦ మనుపయుక్త
మెందు బలదర్పితుల భేద ♦ మేమి సేయుఁ
గావునఁ బరాక్రమించుటే ♦ కర్జ మరయ ౯

క॥ కొందఱఁ గెడపిన మదిలోఁ, గొందలపడి యొండు సేఁత ♦ గొనకొనకున్నన్
మందు లయి యుడుగుదురకా, కెందును రాకాసులొంట ♦ నిమ్మరయుదురే.

సీ॥ ఒకపనికై చని ♦ యొండొక్కఁడును గూర్చు, యోజన మొనయువాఁ ♦ డుత్తముండు
తనయొప్పుకొనినది ♦ తార్కాణఁగాఁ జేసి, మఱలివచ్చునతండు ♦ మధ్యముండు
తోఁచినంత లొనర్చి ♦ త్రోవఁబట్టునయేనిఁ, దలఁపఁగా నధముఁడా ♦ తాంత్రికుండు
చెప్పినకార్యంబు ♦ సెడఁగ రిత్తకు రిత్త, యరుదెంచువాఁ డధ ♦ మాధముండు
మొదలి కర్జ మ్మొడలకుండ ♦ మూఁడు దారు
లొరసి చూచియుఁ గాకున్న ♦ నుక్కు మిగిలి
స్వామియానతిఁ దలమోచి ♦ చక్కఁ బఱచి
యొలయ నేర్చినవాఁ డుత్త ♦ మోత్తముండు. ౧౧

ఉ॥ కారణ మొండు చాల దొక ♦ కార్యము స్వల్పమ పూనెనేనియున్
భారము పైఁబడుం దుదిన ♦ పారభరం బగు కృత్య మూని తా
నేరభసమ్మునం దిరిగె ♦ నేనియు హేతుబహుత్వ మొల్లకే
తీరు ఘటిల్ల దట్లగుటఁ ♦ దేఁకువమై మెలఁగంగ మే లగున్. ౧౨

ఆ॥ భర్తృశాసనమ్ము ♦ పాలించువాఁడ నే, నౌదుఁ దారతమ్య ♦ మరసి చనిన
నెదిరిబలము స్వకము ♦ నెఱుఁగకే పోయిన, నింత సేసి చెడుదు ♦ నింత నిజము.

తే॥ దైవబలమున కలిమిమైఁ ♦ దలఁపు మిగులఁ
బోరు నా కసురులతోడఁ ♦ బొసఁగనేనిఁ
దనదు నెఱిఁ గాంచి నాదు ప్రి ♦ తాప మెంచి
యతఁడు మది మెచ్చుకున్న ద ♦ శాననుండు. ౧౪

క॥ కడఁగి యతఁ డేగు దెంచినఁ, దొడరి తదీయ మగు బలము ♦ తో నాశయముల్
దొడిఁబడ కారసి యరిగెద, నొడయని సన్నిధికిఁ దెలుఁగు ♦ నొందిన మదితోన్.

క॥ అని యూహింప మనమునన్, గొనకొను తలఁపులను ద్రోఁచి ♦ కొనుచు నుపాయం
బనితరసులభ మొకఁడు నె, ట్టనఁ దోఁపఁగ దిటవుపడి క ♦ డంక దలిర్పన్. ౧౬

చ॥ ఇదె మదమానసంహతుని ♦ దీయమరారిది నందనస్థితిన్
ముద మొదవింపఁ జాలునది ♦ ముంగిటఁ జారులతాతిరూల్లస
చ్ఛదఫలపుష్పగుచ్ఛగుణ ♦ సంభృత మీప్రమదావనమ్ము ని
య్యదనున శుష్కకాననము ♦ నగ్నియ పోలె నశింపఁ జేసెదన్. ౧౭

సీ॥ దానికిఁ గోపించి ♦ దానవాధీశుండు, గదలించు ననుచు ర ♦ క్కసుల గముల
నవ్వార లేతెంతు ♦ రాయుధపాణులై. ద్వారదాదికములతో ♦ దిట్ట లగుచు
నామీఁద భీషణం ♦ బౌ సాంపరాయిక, మగు సురాసురజన్య ♦ మనఁ బొసంగ
జండవిక్రములతో ♦ సరిపోలఁ బెనఁగుదుఁ, గాలరుద్రుని లీల ♦ గ్రాలఁ దనరి
కడఁగి యక్కసుకుట్ల నె ♦ క్కటి వధించి
గడుసురాకాసితేని యా ♦ గడ మెఱింగి
సురలు పొగడంగ నటువోయి ♦ చూచువాఁడ
హరివిభుని మోము రామపా ♦ దాబ్జయుగము. ౧౮

క॥ అని పూని మారుతాత్మజుఁ, డనితరసామాన్యవిక్రి ♦ మాటోపమునన్
వన మెల్లఁ బెల్లగింపఁగఁ, గొనకొనెఁ దలకొన్న యోజ ♦ గోత్రితనూజా. ౧౯

—♦ హనుమంతుఁ డశోకవనమును బెఱుకుట ♦—

సీ॥ ఊరువేగమ్మున ♦ నొకకొన్ని విదలించి, వీఁపుత్రోఁపునఁ గొన్ని ♦ విఱుగఁ ద్రోఁచి
ఱొమ్ముతాఁకునఁ గొన్ని ♦ యిమ్మొడలఁగఁ జేసి, పెనఁకువఁ గొన్నిఁటి ♦ బెఱికివైచి
భుజములఁ గొన్నిఁటిఁ ♦ బొడవడంచి వెలార్చి, పాదఘట్టనఁ గొన్ని ♦ పాడొనర్చి
చేతుల మఱికొన్ని ♦ చీలిచి చెండాడి, గోళ్లఁ గొన్నిఁటిని జ ♦ ర్కుగ విదిర్చి

తరులతాకుంజపుంజము ♦ ల్తారుమాఱు
గా నిటు దెరల్చి కొలఁకులు ♦ గలఁచి కేళి
శైలము లగల్చి సెలయేళ్ల ♦ జాళ్లు త్రెంచి
యొక్కత్రుటి రూపు మాపె న ♦ య్యుపవనమ్ము. ౨౦

ఆ॥ పులుఁగు లెగసి యఱవఁ ♦ బూడి కొలంకులు, వట్టిపోవ లతలు ♦ వాడ లేఁజి
గుళ్లు గమలి తరుల ♦ కొనల వ్రేల దవాగ్ని, గాల్పఁ జెడిన భంగిఁ ♦ గానవయ్యె.

క॥ పెళపెళమను చప్పుళ్లకుఁ, గలఁగి మహానాగములు మృ♦గమ్ములుఁ బెఱుత్రో
వలఁ బోవ గూం డ్లెడలి ప, క్షులుఁ జన నవ్వనము సర్వ♦శూన్యం బయ్యెన్.

తే॥ కొలని పులుఁగుల నులివులు ♦ గలయఁ బెరయ
వివశ లయి నెఱిసెడి గతి ♦ వృతియుఁ దలఁగఁ
దలలు విడివడ నడలెడు ♦ పొలఁతు లనఁగ
లతలు కనఁబడె కనుల క ♦ లఁతలు గదుర. ౨౩

ఆ॥ ఆలతాగృహమ్ము ♦ లాశిలాగృహము లా, చిత్రగృహము లెన్ని♦సిరులఁ దనరె
నలవిలాసనదన♦మదె యన్న నద్దాని, నలవి గాని ప్రళయ♦మలముకొనియె. ౨౪

క॥ తా ము న్నశోకలతికా, రామతఁ బ్రమదావనాభి♦రామం బయ్యెన్
దా మున్న శోకలతికా, రామతఁ బ్రమదావనాభి♦రామం బయ్యెన్. ౨౫

ఆ॥ సీత పొరువు నొంది♦సిరిఁ గాంచె నేయది, దాని దానితోడి♦తరువు లొండు
రెండు విడచెఁ గపి ప్ర♦చండుఁ డోలలితాంగి!, వాని నెనయువాఁడు♦వసుధ లేఁడు.

శా॥ లంకానాథున కప్రియం బటు సలీ ♦ లక్రాంతిఁ గల్పించి ని
శ్శంకాతంకుఁడు వాఁడు తోరణ రణా ♦ స్థం జేరి రక్షోబలం
బింక న్రాకెటులుండు నంచుఁ బురతో ♦ వీక్ష న్నిరీక్షించుచున్
సాంకాశ్యాతిగమూర్తి శోభితె నప ♦ శ్రాంతత్వ మొప్పారఁగన్. ౨౬

తే॥ పులుఁగులు మొకమ్ము లఱచుచుఁ ♦ బోవఁ జెట్లు
విఱిగి కూలెడు చప్పుడు ♦ ల్విస్తరిల్ల
నత్తఱిని భయసంభ్రాంతు ♦ లైరి నగర
నున్నవారును బెఱచోట్ల ♦ నున్నవారు. ౨౭

ఉ॥ నక్కలు గూయ భీషణని ♦ నాదములం గొని కాకఘూకముల్
పెక్కులు దిక్కులం బెరయఁ ♦ బెల్లుగ నుల్కలు రాల వీధులం
దెక్కడఁ గన్న నగ్నము ల ♦ నేకము లా పెనుగాము లార్వఁగన్
రక్కసు లొల్లఁబోవుచుఁ ది ♦ రంబులు గాని మనంబు లేర్పడన్. ౨౮

ఆ॥ సంభ్రమించుచుండ ♦ జానకీదేవిని, జుట్టియున్న తెఱవ ♦ లట్టె లేచి
వికృతరూప లగుచు ♦ వీక్షించి రుద్భగ్న, మవ్వనంబు నమ్మ ♦ హాహరించు. ౩౦

ఉ॥ ఆతఁడు వారిఁ గాంచి వికృ ♦ తాకృతి నక్కొనఁ గాలరుద్రుఁడో
యీతఁ డటంచు నాచెడిప ♦ లెంచి ధరాత్మజఁ జేరి యెట్టి దీ
క్రోతి తెఱం గెవం డనిచెఁ ♦ గొమ్మరొ! యేపని కేగుదెంచెవాఁ
డేతలఁ బొప్పు నిన్నుఁ గన ♦ నేమని పల్కె వచింపు మంతయున్. ౩౧

ఆ॥ నీకు భయము లేదు ♦ నీరజాక్షిరొ తెల్పు, మెఱిఁగినంతవట్టు ♦ నితని చరిత
మనిన వారి కపట ♦ మారసి యిట్లనె, సీత ప్రోడతనము ♦ చెలువు మిగుల. ౩౨

ఉ॥ ఏ నెటు దెల్పుదాన నెవఁ ♦ డేయెడ నేతెఱఁ గెంచి యేపనిం
బూని చరించునో యెవరి ♦ బుద్ధులు వారె యెఱుంగువార లో
ల్లేనెఱఁ బాము కాళ్ల యిర ♦ వెన్నఁగఁజాలుదు రీతనిం గనం
గా నయి భీతి రక్కసుఁడె ♦ కా నగు నన్న తలంపు నొందితిన్. ౩౩

తే॥ గడుసరులు కామరూపు ల ♦ గాధసత్త్వ, లదయు లెంతలు సేయంగ ♦ నైన నేర్తు
రేమి తనమదిఁ బెట్టి యి ♦ ప్డీతఁ డిట్టి, బూమెలు ఘటించుచుండెనో ♦ పోలనెఱుఁగ.

మ॥ అని యద్దేవి వచించినంతటనె క్రి ♦ వ్యాదాంగన ల్వాఱి రొం
టినెఱి న్గానని దొండుగా భయగతుల్ ♦ డెందమ్ములం దోఁప నె
ట్టన ని ల్వొందిరి కొంద ఱం దచటిజా ♦ డ ల్వామికిం దెల్పఁ దె
ప్పునఁ బోవంగని రింకఁగొంద ఱఘువి ♦ స్ఫూర్తి న్విలోలాత్మలై. ౩౫

ఆ॥ పెదవు లెండఁ బేర్మి ♦ పెంపు వోనుండఁ బె, న్నెఱులు వీడఁ జేల ♦ లుఱికి యాడ
ఘోరరూప లగుచుఁ ♦ గొనకొని తేని తో, నిట్టు లనిరి వార ♦ లిందువదన. ౩౬

—♦ రాక్షసాంగనలు రావణునకు హనుమంతు చర్య లెఱిఁగించుట ♦—

సీ॥ అవధా రశోకవ ♦ నాంతరంబునఁ దోఁచె, దేవ! యెక్కటి భీమ ♦ దేహుఁ డైన
వాఁడు వానరుఁ డేమి ♦ వలనునఁ జేరెనో, యమితవిక్రముఁడు ప ♦ రార్థ్య బలుఁడు
సీతతో భాషించి ♦ చెలఁగుచునున్నాఁడు, తేఱిచూడఁగ రాక ♦ దిటవుపడుచు
నెన్నివిధంబుల ♦ నేనిఁ బ్రార్థించినం, దెలుప దాయమ వాని ♦ తెఱఁ గెఱింగి
యింద్రు దూతయొ ధనదుని ♦ హితుఁడొ మహిజ
నరయ రాముఁడు పనిచిన ♦ యతఁడొ కాన
మే మనఁగ నీదు మందిరా ♦ రామ మెల్లఁ
బెఱికివైచినవాఁడు ని ♦ ర్భీకుఁ డగుచు. ౩౭

తే॥ వానిచే నాశితము గాని ♦ వలను లేదు
నీమనోహర మైన య ♦ న్నెలవునందు
మహిజ కూర్చుండి యున్న య ♦ మ్మనికి సొరఁడు
శ్రమమొ యాయమఁ గాపాడు ♦ సన్నియమమొ. ౩౮

క॥ కిసలయసుమశోభాఢ్యం, బసదృశమును నైన శింశు ♦ పాగము గలయ
ద్దెసకుం బోవమి యద్దెస, మసలుట ననఁ జనునె యాపె ♦ మనుపన కాదే. ౩౯

తే॥ దండము విధింపుమయ్య ! న ♦ క్తంచరేంద్ర !
రెండు నేరము లొనరించె ♦ గండఁ డతఁడు
నీమనమ్మున నిడియున్న ♦ నెలఁతతో వ
చించు టొక్కటి వనిఁ బెల్ల ♦ గించు టొకటి. ౪౦

ఆ॥ మాట లాడ వశమె ♦ మలసి యొక్కనికి నీ, పొరువు సేరియున్న ♦పొలఁతితోడ
వాని జీవితాశ ♦ వలగొనునే చావఁ, దలఁచెఁగాక మేలి ♦ దారి లేక. ౪౧

మ॥ అనినం గ్రోధహుతాశనుం డెగువఁగా ♦ నాతండు సంవృత్తలో
చనుఁడై చూచిన నశ్రుబిందువులు పె ♦ ల్చన్ జాత దీపాగ్నికీ
లను గొంచుం బడు తైలబిందువుల లీ ♦ లం దోనె యాజ్ఞాపనం
బొనరించె న్గొనిరండు క్రోఁతి నని య ♦ త్యుత్సాహియై సేనకున్. ౪౨

క॥ తనతో నెనవచ్చెడువా, రెనుబదివే లినుపతునుక ♦ లిలఁ గింకరసం
జ్ఞను దనరువార లాతని, యనుజ్ఞఁ గొని వెడలి రాహ ♦ వాదృతు లగుచున్.

—♦ హనుమంతుఁడు రావణప్రేరితరాక్షసుల సంహరింపఁగడంగుట ♦—

మ॥ మిడిగుడ్లుం బెనుకోఱ లుద్భటము లా ♦ మేను ల్కడుం బెద్దలా
కడుపు ల్నాయుధముల్ కరమ్ములఁ దగం ♦ గారాడు రాకాసు ల
య్యెడ నవ్వానరవర్యు డీకొనిరి వ, హ్ని న్నెట్టనం దాఁకు న
మ్మిడుత ల్పోలె ఫలాభికాంక్ష యెదల ♦ న్నెట్టంగ దట్టింపుచున్. ౪౪

శా॥ శూలాద్యాయుధము ల్మహాస్త్రములు నా ♦ శూరు ల్ప్రయోగింప లాం
గూలం బెత్తి ధరాతలం బవిసి యు ♦ ద్ఘోషింపఁగా మోది యా
లీలావానరుఁ డోలి బాహుయుగి స్ఫా ♦ లించెం దదీయార్భటిన్
గూలెం బక్షులు శైలము ల్మారసె సం ♦ క్షోభించి రాఖేచరుల్. ౪౫

తే॥ రాముఁడు జయించు లక్ష్మణ ♦ స్వామి విజయ
మందు సుగ్రీవుఁడును జయ ♦ మొందు నే న

రాతి సైన్యనిహంతను ♦ రాముదూత
నినతనూజుని సచివుఁడ ♦ ననిలసుతుఁడ. ౮౬

క॥ రావణకీటసహస్రం, బే వెరవున నేని నిలుచు ♦ నే నా యెదురన్
గ్రావములు సాలములు గొని, కావర మడఁగింతు నాజి ♦ గదిసిన వేళన్. ౮౭

ఉ॥ ఇందఱుఁ జూచుచుండఁగనె ♦ యీపురి యే పడఁగించి మేదినీ
నందనఁ గాంచి మ్రొక్కఁగని ♦ నావగు కీర్తి దిశావకాశము
ల్పొంది ప్రకాశిలంగ రఘు ♦ పుంగవుఁ జేరి నమస్కరింతు నా
యందె కటాక్షవీక్షణము ♦ లైక్యనిరూఢిఁ జెలంగుచుండఁగన్. ౮౮

మ॥ అని నిర్ఘాతముఁబోని కంఠరవ మొ ♦ య్యన్ మీఱ సంధ్యాఘనం
బను మోదించెడి మేని మేలి పొడవ ♦ ట్లభ్రంకషంబై యనన్
దనరం బల్కిన పల్కుతోడనె నవా ♦ తంకంబు గ్రమ్మంగ నా
దనుజు ల్స్వామిహితార్థులా కతన ను ♦ త్సాహంబు పాటించుచున్. ౮౯

ఉ॥ అందఱు నొక్కఁడై కడఁగి ♦ యాహరిపుంగవు మేను శూలసం
క్రందనసాధనాసివిశి ♦ ఖప్రకరంబుల నొంపఁ దోరణం
బం దత డుండి యార్చుచుఁ ద ♦ దాశ్రయ మౌపరిఘమ్ము గొంచుమి
న్నందిఖగాధినాథుఁడు మ ♦ హాహి వహించు వహిం దనర్చుచున్. ౯౦

క॥ దిమ్ముగొనఁ ద్రిప్పి కూలఁగ, నమ్మొఱకుల మోది చంపి ♦ యనికి బలిగా
నిమ్ము ఘటియించి తోరణ, నన్మహితుఁడు సేరె జయక ♦ లాంచితుఁ డగుచున్.

తే॥ కదనమున నోహటించి వి ♦ కావిక లయి
చనినవా రందుఁ గొందఱు ♦ చాటి చెప్ప
హనుమని ప్రతాపమును విని ♦ యదరిపడి ప్ర
హస్తపుత్రునిఁ గాంచి దై ♦ త్యప్రభుండు ౯౧

క॥ అమితబలౌఘంబులతో, నమితారీ! నీవు చని య ♦ నమ్రి నల ప్లవం
గమునిఁ గొని తెమ్ము వానికిఁ, గ్రమముగఁ దగుశాస్తి సేయఁ ♦ గావలయుఁజుమీ.

మ॥ అని శాసించిన నుత్సహించి ప్రబలుం ♦ డవ్వాఁ డనుజ్ఞాప్రజం
బున శీర్షంబు నలంకరించుకొనిప్రా ♦ బుద్ధ్యంబున న్మించెఁ బా
వని ధ్యానించె వనంబు భగ్న మయి పో ♦ వం జాలదే కూల నీ
ఘన మౌ చైత్యవిమాన మియ్యది యుఁ ద్రి ♦ క్కం గూడ దంచు న్మదిన్, ౯౨

ఆ॥ అటు దలఁచి హనుమ ♦ యమ్మేడపై ప్రాలి
మేరుశిఖర మెక్కి ♦ మెఱయు హరియ

పోలె మేల్మి జూపి ♦ పొడవొంది యాస్ఫోట
నం బొనర్చె నవ్వు ♦ లంబు దెరల. ౫౮

—♦ చైత్యప్రాసాదనాశనము. ♦—

ఆ॥ దాని కుద్భటించి ♦ దైత్యులు పెక్కురు, చైత్యపాలు రక ♦ సంబు వగుల
నార్చుచును గడంక ♦ నాతనిఁ జుట్టిరి, శస్త్రాస్త్రముల నిగిడ్చి ♦ యడరుటయును.

శా॥ ప్రాసాదంబున నొక్కఁ డాయసము స్తం ♦ భం బొప్ప నద్దాని ను
ల్లాసం బెక్కఁ బెకల్చి వజ్రధరు లీ ♦ లం బొల్చుచుం ద్రిప్పి సం
త్రాసంబు న్మొనయించి యయ్యది మహీ ♦ ధ్రం బట్లు కూలంగ ను
ద్భాసుం డాతఁడు వైవ నగ్గి వడి యా ♦ వాసంబుఁ గాల్చె న్వడిన్. ౫౯

ఆ॥ అస్త్రవేత్త రాముఁ ♦ డందు జయ మ్మిట్లు, టంచు మున్ను బలికి ♦ నట్లు పలికి
యంతరిక్షమున మ ♦ హాత్ముండు శ్రీమంతుఁ, డతఁడు నిలిచి మఱల ♦ ననియె నిట్లు.

ఆ॥ లేదు లంక యింక ♦ లేఁడు మీ రేఁడు మీ, రందఱును యమాల ♦ యమున కతిథు
లగుదు రరుగుదెంచె ♦ నదె మిత్త్రి సుగ్రీవుఁ, డెందుఁ బోదు రెవ్వఁ ♦ డేదుగడయు.

ఉ॥ కోటి బలౌఘము ల్గొనుచుఁ ♦ గోయని యార్చుచు నెల్లి వచ్చు బ
ల్లాటి హరీంద్రుఁడే మనుచు ♦ దాశరథిం బగ సేసికొంటి రి
ప్పాటి కుపద్రవం బొదవె ♦ వేడబము ల్పచరింప నేల పొం
డాటవికత్వ మేర్పడఁగ ♦ నట్టుల యేనియుఁ జావకుందు రే. ౬౦

తే॥ ఎందుఁ జూచిన మావారె ♦ మొనక మొనఁగఁ
దిరుగుచున్నారు మీతల ♦ దిమ్మడంగఁ
జేయ నెంచి వనాటులు ♦ శితనఖాస్త్రు
లమితసత్త్వులు నాగాయు ♦ తౌఘబలులు. ౬౧

క॥ అని పలుకుచు నాటోపం, బున వారల నెల్ల జముని ♦ పోలి కనిచి మె
ట్టిన తోరణస్థలంబున, కనుపముఁ డతఁ డరిగి తోర ♦ ణాస్థ న్నిలిచెన్. ౬౨

— ♦ జంబుమాలియుద్ధము. ♦ —

ఉ॥ అచ్చట దైత్యనాయకుని ♦ యానతిఁ బూని యనీకభూమికి
న్వచ్చెఁ బ్రహస్తపుత్త్రుఁ డతి ♦ బాహుబలాఢ్యుఁడు జంబుమాలి వై
యచ్చరవం జ్జి బెగ్గడిల ♦ హారకిరీటమణిప్రభావళు
ల్పొచ్చెము లేక శోభిలఁ బ్ర ♦ భుప్రథ మీఱ మహారణార్థి యై. ౬౩

క॥ అనిరుంతబహుగణసైన్యము, దనతో నేతేర దీర్ఘ♦దంష్ట్రి లమరఁ గ్రో
ధనుఁ డతఁడు దిశాచక్రము, దనుకఁ గపిగ్రహణకలిత♦తాత్పర్యమునన్. ౬౪

ఆ॥ రమ్యకుండలుండు♦రక్తమాల్యాంబరుం, డరుణమూర్తి లోహి♦తాక్షుఁడు నయి
యైంద్రచాప మట్టి♦డగు నాయుధముఁ బూని, జ్యానినాదపూరి♦తాశుఁ డగుచు.

మ॥ ఖరసంఘాతముఁ బూన్చినట్టి రథ మా ♦ గర్వోన్నతుం డెక్కి వా
నరుఁ డెవ్వం డెటవోయె నే మని యనూ ♦ నప్రౌఢి వాక్రుచ్చుచున్
శరవర్షం బనువారఁ జేర నరుగ ♦ న్స్వామిారి శ్రీ మిాఱి యా
శరు వీక్షించి ప్రహర్షయుక్తి మెయి ను ♦ చ్చైర్మూర్తి యై యార్చినన్. ౬౬

తే॥ అర్ధచంద్రాస్త్ర మాస్యము ♦ నందుఁ గర్ణ
శరము శిరమునఁ బడి నార ♦ సములు భుజము
లందు వక్షస్థలంబున ♦ యందుఁ బడియు
నతఁడు నాటు సక్రోధత ♦ నవశుఁ డగుచు. ౬౭

క॥ అమ్ములికిచేత హనుమని, నెమ్మొగము ప్రకాశ మొందు♦నెఱి శరదిను ద్యో
త మ్మెనసి భాసమానం, బమ్మెయి నగుశోణపద్మ♦మనువాదించెన్. ౬౮

తే॥ శోణితపృషత్క సంతతి♦జొబ్బిలంగ, నగచరేంద్రుని నెమ్మొగ♦మనువుసూపె
రక్తచందనబిందువు♦ల్రాణ నెఱయ, మెఱయు కెందమ్మి యందమ్ము♦మేళమించి.

ఆ॥ మొల్లముగను బూచి♦మోదుగ దులకించు, తెఱఁగు బెరసి వాయు♦దేవసూనుఁ
డవయముల నాటు♦లందు సన్నెఱఁ దోఁచి, నెఱయు రక్తమునను♦నీరజాక్షి. ౭౦

క॥ కోపమున హనుమ శిలఁ గొన, నాపగతుఁడు దానిఁ జూర్ణ♦మై పోనేసెన్
వే ఘనరు సాల మెత్తిన, నాపగిదిన కూలఁ ద్రోఁచె♦నతఁ డుద్యతుఁడై. ౭౧

క॥ త్రోడనె యెడఁగాంచి భుజా, క్రోడమ్మున నెదను జనుల♦గుఱుతుల నడుమన్
వాఁడిములుకు లప్పాలఁదిను, వాఁ డటు గ్రువ్వంగ సార♦వత్క్రోధుండై. ౭౨

ఆ॥ కనులు గెంపువాఱఁ♦గాలదండముపూని, యల్ల పరిఘ మెత్తి♦హనుమఁ డుగ్ర
మూర్తి యగుచుఁద్రిప్పి♦మొగకొని వాని వక్షమున బిట్టు మోఁదె♦సంభ్రమమున.

ఉ॥ లేదు శిరమ్ము దైత్యునకు ♦ లేవు భుజమ్ములు జానుయుగ్మమా
లేదు విభూషణమ్ములును ♦ లేవు శరమ్ము శరాసన మ్మనన్
లేదు రథాశ్వసూతముఖ ♦ లీలయు మారుతపుత్రుఁ డమ్మెయిన్
బా దిడు కిన్క నాగుదియ ♦ వైచినయంత నిమేషమాత్రలోన్. ౭౪

తే॥ వాఁడు పడిన సురాళించి ♦ వరుస మడఁచెఁ
గింక రౌఘమ్ము నారామ ♦ కింకరుండు

చాలదే పరిఘము వాని ♦ శక్తి కెల్ల
లోక మెదిరించె నేనియు ♦ లోలనయన! ౭౫

—♦ రావణుఁడు సప్తమంత్రిసుతుల హనుమపై ననుచుట.♦—

క॥ విని జంబుమాలి వినిహతు, విని కింకరమృతియుఁ గోప♦వివశుం డగుచున్
దనుజవిభుఁడు ప్రాభవమున, ననిచె న్నిజమంత్రిసుతుల♦నతిబలయుతులన్. ౭౬
క॥ వా రిల్లు వెడలి రేడ్వురు, వారింపఁగ లేక యేడు♦వం దొరఁగొని ర
వ్వారి జననీప్రభృతు ల, వ్వారిగ యోధతతిహతియు♦వారి నలంపన్. ౭౭
ఉ॥ వారని కౌతుక మ్మెసఁగ ♦ వా రతివీరులు బోరనం బరి
వార మపార మై నెఱయ ♦ వాజిమదేభరథధ్వజాదు లొ
ప్పారఁగ దుర్నిరీక్షు లయి ♦ యంచితకార్ముకవారివాహము
లోఁబరుకొనంగ నప్పవన ♦ భూవసతిం జొరఁబాఱి రుగ్రతన్. ౭౮
తే॥ ఒండొరుల మెచ్చకయ వారు ♦ గండు మిగిలి
తొడరి రనిలు నపత్యమ్ము ♦ తోరణస్థ
మాక్రమింపంగ శరవృష్టు ♦ లమరుచుండ
నంబుదంబులు శైలరా ♦ జంబుఁ బోలె. ౭౯
తే॥ ఆశుచరుఁ డాశుగాత్మజుం♦డంబరమునఁ, దిరిగె సాయుధ్ధై త్యాంబు♦ధరవితాన
మెడలఁ దచ్ఛరవర్గంబు♦నడలఁదంౘ్రి, కన్న మిన్నయటంచుదో్య♦గతులు వాగడ.
చ॥ తలహతిఁ గొందఱ న్నిశిత ♦ దంష్ట్రలఁ గొందఱఁ బార్ష్ణిఘట్టన
ల్బలితపు ముష్టిఘాతములు ♦ పాలిడి కొందఱఁ గొందఱ న్నఖ
మ్ముల మఱికొందఱ న్బరచ ♦ మూనివహమ్మున నేఱి యమ్మహా
బలతనయుండు చంపి యని ♦ వార్యబలోద్ధతి నార్చి పేర్చినన్. ౮౧
మ॥ హతనాగాశ్వపదాతియోధనివహ ♦ వ్యాకీర్ణ మై దీర్ణవి
స్తృతసచ్ఛత్రపతాకికామణిగణో ♦ త్సేకంబు నై తత్తలం
బతిఘోరం బననయ్యు నంబరచరా ♦ ధ్యాహారము ల్మెఱ భూ
నతికుచ్ఛాభ్యాసముఁ గూర్చి మెచ్చువడయుం ♦ జాలె న్గుణోద్రిక్త మై. ౮౨
క॥ హతశేషులు పఱచిరి శో, ణితనదులుం బాఱెఁ గపి గ♦ణింప కెగచి యు
మ్మతకరులు గూలి రని త, త్పతి వినెఁ దోరణము నెనసెఁ♦బవనసుతుండున్.
క॥ కోపము సంభ్రమమును సం, తాపంబును గదుర సంవృ♦తవికారుం డై
యే పుడిగి యుడుగ కత్యా, టోపంబునఁ గృత్యవిధిఁ గ♦డుం ద్వరితుండై. ౮౪

—♦ మంత్రిసుతసప్తకము హతివిని రావణుఁడు సేనాధిపతుల నేవురఁ బంచుట. ♦—

ఆ॥ పథ మొకం డెఱింగి♦పంచసేనాధినా, యకులఁ బిలిచి మీర♦లరిగి వేగఁ
గ్రోఁతిఁ బట్టి తెండు♦గానకొని వాని నే, మఱక మీపరాక్ర♦మంబు మెఱయ.

ఉ॥ కోరినయంతవట్టు రణ ♦ కోవిదసైనికకోటికోటులన్
గూరుచుకొంచు నేఁగి బలు ♦ కూళ వనేచరుఁ డున్నయట్టి యా
తీరును జిత్తవృత్తియు మ ♦ దిం దలపోయుచు నేల పొద్దు న
ట్లారసి కర్జము ల్నడుప ♦ నోఁ జుమి మీజయ ముల్లసిల్లఁగన్. ౮౬

తే॥ అతనిఁ గపిఁగాఁగఁ దర్కింప ♦ నప్రతర్క్య
బల మొకఁడు భూత మనియెదఁ ♦ బాయరాని
కినుక నింద్రుఁడొ శుచియొ ప ♦ వనుఁడొ యముఁడొ
ధనదుఁడో వీని సృజియించి ♦ యనుపనోపు. ౮౭

తే॥ సురలు మును లసురులు నరు ♦ లున్నాడు దలఁచి
యుందు రెప్డుఁ బరాభవ ♦ యుక్తిఁ జేసి
కాన నలఁతిఁగాఁ జూచినఁ ♦ గాదు వీని
నొంటి నెదిరింప రాదు ము ♦ క్కంటికైన. ౮౮

క॥ ఏ నెఱుఁగుదు నెల్లెడఁ గల, వానరయోధులను వీని♦వలనున బలతే
జోనయమతిధృతిశక్తు ల, నూనంబులు తెలిసి మేలి♦యుక్తి మెలఁగుఁడీ. ౮౯

ఉ॥ సారవిచారణు ల్నయవి ♦ శారదు లాహవశూరు లబ్ధిగం
భీరులు మీర లెల్లెడలఁ ♦ బెంపు ఘటింపఁగ నేర్తు రంచు ము
న్నారసికత్వ మేర్పడఁగ ♦ నారసి యుండుటఁ జేసి యిమ్మహో
దారరణప్రసక్తి కిటు ♦ తత్పరతం బనుపం దలంచితిన్. ౯౦

తే॥ ఆత్మ రక్ష్యంబ యెవనికి♦నవనిలోనఁ, జేకురదు యత్న మెడసిన♦సిద్ధి యెపుడు
లక్ష్మి చంచల కావున♦లా వెఱింగి, కర్జ మొనగూర్చుకొనుటకుఁ♦గడఁగవలయు.

క॥ మి మ్మెదిరి గెలువరాదు జ, గమ్ముల నొండొకని కట్లు♦గావున నే నా
నమ్మికఁ గని యనిచెద విజ, యమ్ము ఘటింపంగ మీన♦యమ చనుఁ డింకన్.

మ॥ అనిన న్వల్లె యటంచు నానఁ గొని తో ♦ నమ్మానవాదు ల్రణం
బున కుత్సాహముతోఁ జతుర్విధమహా ♦ వ్యూహమ్ము దోఁతేర వా
రని కౌతూహల మొప్ప భూషితులు నై ♦ ప్రస్థానభేర్యాది ని
స్వనము ల్దిక్కులఁ బిక్కటిల్లఁ గవియ ♦ న్సామీరి శ్రీ మీఱఁగన్. ౯౩

ఆ॥ తోరణమున నుండి ♦ తొంగలించెడు చూడ్కు-
లలరఁ గాఱుమొగిళు ♦ లట్లు గదియ
వచ్చువారి తెగల ♦ వాలిన యుత్సాహ
కలనఁ గాంచుచుండెఁ ♦ గమలనయన! ౯౪

ఉ॥ కాంచిరి వారు వానరునిఁ ♦ గాన్పులకు న్భర మైన మూర్తి చే
మించెడువాని రశ్మితతి ♦ మేళన మొప్పఁగ రశ్మిమాలి తే
జెంచెడువాని విక్రమ మ ♦ నీదృశ మై నెగడంగ నొడ్ల స్రు
క్కించెడువాని వేగబల ♦ కీర్తుల కి మ్మగువాని నమ్మొయిన్. ౯౫

ఉ॥ చూచిన యంతలోనె బల ♦ సూదను పాభవ మెల్లఁగొల్లగా
నాచికొనంగఁజాలు నితఁ ♦ డంచుఁ దలంచుచు నేత యాన లో
నేచి చలింపఁజేయఁ గపి ♦ నెక్కటి చక్కటిఁ జుట్టి ముట్టి నా
రాచశతంబులం గలఁచి ♦ రక్కసు లొక్కటఁ బేర్చి యార్చినన్. ౯౬

క॥ ఆకపి రూక్షేక్షణముల, నాకర్బురవితతిఁ గాంచి♦యరికాలపరీ
పాకోచిత లగు గర్జల, నాకంపింగఁ జేసె♦నౌద్ధత్యమునన్. ౯౭

క॥ దుర్ధరుఁడు హరి నెదిర్చి ధ, నుర్ధరుఁ డై యతనిశిరము♦నొవ్వ జయకలా
ధూర్ధరశరపంచకము స, మర్థత వెలయంగఁ గ్రొచ్చి♦యార్చెం బెలుచన్. ౯౮

తే॥ ఆతఁ డట్లు శరావిద్ధుఁ♦డై యదల్చి, యుప్పరమునకు గరుడుని♦యోజ నెగసె
రక్కసుఁడు బాణవర్షంబు♦రాణ నెఱపఁ, గేలిమెయి దాని వారించె♦గాలికొడుకు.

—♦ హనుమ దుర్ధరుఁజంపుట. ♦—

ఉ॥ తోడనె మారుతస్ఫురణ ♦ దోఁపఁగ మారుతి స్కంధసత్తకం
బాడుచు గూడముట్టి బలు ♦ వై బలువైఖరి వ్రాలి దుర్ధరుం
దోడుగ యంత నుద్దవిడి ♦ ద్రొక్కి రథాద్యము నుగ్గునూచమై
పాడువడం దెరల్చి వరి ♦ పార్శ్వగులం బడఁద్రోఁచి కూల్చినన్. ౧౦౦

క॥ యూపాక్షవిరూపాక్షులు, ప్రాపగు దుర్ధరుని పడిన♦పా టరసి కృత
వ్యాపాదు లగుచు మొగకొని, యాపవనజు ముద్గరముల♦నడఁచిరి పెలుచన్.

—♦ హనుమ యూపాక్షవిరూపాక్షప్రఘనభాసకర్ణులఁజంపి సేనఁజక్కాడుట. ♦—

ఆ॥ వ్రేటు లోర్చి తప్పి♦వేగం బెడల్చి యు, వ్వేగవంతుఁ డొంపు♦వెరవు దోఁపఁ
గొండఁ బోని మ్రాను♦గొని తెచ్చి యద్దాన, నొక్క మొగిన వారి♦నుక్కడంచె.

చ॥ ప్రఘనుఁడు భాసకర్ణుఁడును ♦ బట్టిసశూలము లోలిఁ గొంచు నా
రఘువరు కింకరుం బొదువ ♦ రక్తనిషిక్తతనుండు వాఁడు సాం
ధ్యఘనుఁడొ యుద్యదర్కుఁడొ య ♦ నం గడునొప్పి మహీధరాహతిన్
మఘవవిరోధు లిర్వురను ♦ మారిమసంగిన యట్లు చంపినన్. ౧౦౩

క॥ సేనలు పైకొనఁ జొచ్చిన, సేనానీనిభుఁ డతండు ♦ చెచ్చెర రథము
ఖ్యానూనబలవితానముఁ, దా నొంటి నొకంటఁ గొట్టె♦తరమిడి చమురేన్. ౧౦౪

ఆ॥ అవని రుద్ధమార్గ♦మయ్యె నయ్యెడ సేన, భగ్నరథగజాశ్వ♦పత్తి గాఁగ
నెత్తుటేఱు లెడల♦నిహతాతపత్రచా, మరపతాక లొంట♦మలసియుంట. ౧౦౫

తే॥ వారి నెల్లఁ దెరల్చి దు♦ర్వారబలుఁడు, తోరణము సేరి నిలిచె వా♦తూలసుతుఁడు
పంచసేనాధినాథుల♦పంచభావ, వార్తయును విని నిర్జర♦వైరివిభుఁడు. ౧౦౬

ఉ॥ చిత్తము బన్నురిల్ల నెటు ♦ సేయఁగఁ దోఁపమి ఱిచ్చవాటు పే
రుత్తలపాటు మేకొనఁగ ♦ యుక్త మటం చొకఁ డూహ నుంచియున్
బిత్తరపోవుచు న్దన య ♦ భీకత యేకతనం దలంగెనో
యిత్తఱి నంచు దైత్యవిభుఁ ♦ డేకత పుం దలపోత నున్నచోన్. ౧౦౭

క॥ అక్షుఁడు దానవకులహ, ర్యక్షుఁడు తనతండ్రి చిత్త ♦ మారసి వలనై
యాక్షణమ చేరవచ్చెను, దక్షత మైకొన విచార ♦ దక్షత వెలయన్. ౧౦౮

క॥ వచ్చి నమస్కారం బిడ, నచ్చెఱుతనిఁ గౌగిలించి ♦ యద నెఱుఁగుటకున్
మెచ్చికొని ముచ్చటింపఁగ, హెచ్చి జనకునకుఁ గుమారుఁ ♦ డిట్లనెఁ దోడ్తోన్.

—♦ అక్షకుమారుఁడు తండ్రియాజ్ఞగొని హనుమపై కేగుట ♦—

తే॥ తండ్రి! నే నేఁగి యాక్రోతిఁ ♦ దక్కఁగొని య
వత్తు నసమానులఁ దెరల్తు ♦ వల నిఁకేల
యాన యిడు మన్నఁ గనుసన్న ♦ నాతఁ డెడఁద
హొంగ దీవన లిడి యను ♦ పంగఁ దరలి. ౧౧౦

ఉ॥ బాలదివాకరప్రభము ♦ భాసురకాంచనజాలకింకిణీ
జాలవితానశోభితము ♦ సన్మణిపుంజవిభానురంజన
శ్రీలలితప్రవాళసుమ ♦ చిత్రలతారచనోపచిత్రప
ద్యాలలనాభిరామమును ♦ నై నలువొందెడు స్యందనం బొగిన్. ౧౧౧

మ॥ మయమహాద్వైద్యతపఃప్రభావకలనా ♦ మాన్యం బసామాన్యవ
ద్ధయరత్నాష్టకయోజితం బనుపధి ♦ వ్యాహార మక్షయ్యా మ

వ్యయసంచార మమేయసాయకచయం ♦ బానద్ధసల్లక్షణం
బయి నల్వొందఁగ దాని నెక్కి జయయో ♦ గాయత్తచిత్తంబునన్. ౧౧౨

ఉ॥ బంగరుపూలు చెక్కిన ♦ య భంగురకార్ముక మొందుపూని స
ర్వాంగము లుల్లసిల్ల హవి ♦ రర్పణ సంజ్వలితాగ్నివోలె నా
ప్పం గడు దైత్యరాట్సుతుఁడు ♦ పేర్మిఁ దనన్గనువార లెల్ల నీ
తొంగలికాఁడు తండ్రినెటి ♦ తో సరిపోలు నటంచు నెన్నఁగన్. ౧౧౩

తే॥ మిన్ను మ న్నొక్కఁడుగ నాక్రి ♦ మింపఁజాలు
యోధవరకోటి దనుఁగొల్చి ♦ యుచితరీతి
రాఁగఁ జతురంగయుత సైన్య ♦ రాజి నడువ
నక్షుఁ డరుదెంచె నాపింగ ♦ శాక్షుఁ బొదువ. ౧౧౪

—♦ అక్షుఁడు హనుమంతునితో యుద్ధ మొనర్చుట ♦—

క॥ సస్త్రయుఁ డయ్యు హరి నతని, విస్మితబహుమానదృష్టి ♦ వీక్షించుచు మై
విస్మృతి నెనయఁగ సకటా, క్షస్మేరవిలాసమహిత ♦ కలనం దనలోన్. ౧౧౫

మ॥ లయకాలమ్మున నగ్గిఁ బోలి తలమె ♦ ల్లన్ జ్వాలలం గ్రమ్మఁ జా
లి యమేయద్యుతి మించుఁదోలి దెస లో ♦ లి న్వెల్గుగావించు న
వ్యయు హేలిం బురుడించు వాలి యన నౌ ♦ నా వీని నీతండు వా
లి యుగాంతాంతకు గేలిసేయఁడె తదు ♦ ల్లీల న్మారు న్డాయఁడే. ౧౧౬

క॥ గర్వితుఁ డశ్రముఁడు పరా, ఖర్వపరాజయవిధాన ♦ కలితుఁ డజితుఁడున్
దుర్వారవిక్రముఁడు నగు, నర్వాచీనుం డనంగ ♦ నగునే వీనిన్. ౧౧౭

మ॥ అని భావించుచు స్వీయశక్తిపరశ ♦ క్త్యర్థంబు యోజించి యె
య్యన నబ్బాలనిశాటుఁ డూర్జితసహ ♦ స్రాంశు న్వడ బించుచున్
ధనువు న్సజ్యము సేసి యాశుగముల ♦ న్దాకొల్పి మాణిక్యమం
డనశోభాపరిమండలాంచితుఁడు నై ♦ డాసెం బ్లవంగేశునిన్. ౧౧౮

క॥ పంచాననవిక్రములును, బాంచితతనులు నగు వారి ♦ ప్రధన మరయ న
భ్యంచితు లమరులు నభమున, మించిన కుతుకమున నిలువ ♦ మేకొని రంతన్.

ఆ॥ భోరుకొనఁ గడంగెఁ ♦ బుడమి యాకసమును, గడలి క్షోభ మొందె ♦ నడలె గిరులు
నడిఁకెఁ దపను తాప ♦ నక్రియ కరువలి, వీవఁ డయ్యె వారు ♦ వీఁకఁ దొడరఁ. ౧౨౦

ఆ॥ లక్షశుద్ధి సంధి ♦ మోక్షజ్ఞుఁ డక్షుండు
వానితలను గ్రుచ్చెఁ ♦ బైఁడిపుంఖ

ములును గఱులు గలిగి ♦ చిలువ లట్లు విసంపుఁ
గొలుకు లయిన మూఁడు ♦ ములుకు లపుడు. ౧౨౧

క॥ ఆశుగములు శిరమునఁ గల, యాశుగసుతుఁ డంశుమాలి♦యన నొప్పెఁ గడుఁ
దా శోణితౌఘసారుణి, మాశంసితబాల్యవిలస♦నాంచితుఁ డగుచున్. ౧౨౨

ఉ॥ కోపమువంకఁ బోక నెఱి ♦ కోల్తలఁ జేయక ఘూనవన్మహా
కూపముభంగి నున్న కపి ♦ కుంజరుఁ గుంజర మట్లు గూల నై
యేపున మీఁటి పై కెగసి ♦ యేసి కలంచుచు నున్నవాఁడు తా
నేపగిదిం దలంచెనొకొ ♦ యీఁదఁగఁ దన్మహితప్రభావమున్. ౧౨౩

ఆ॥ అతని తెలివితేట♦లరసి వానరరాజ, సచివుఁ డపుడు సంత♦సంబు నొందెఁ
జిదుగు లెనసి వృద్ధి♦జెందుఁ బో యగ్ని యం, చాగ్రహమున దృష్టి♦నావరించె.

తోటకవృ॥ సెలకోల్తల కోల్తల ♦ సింగము నా
నలవోక హరీంద్రుఁ డ ♦ జాండము త్వే
శల ఘూర్ణిలఁజేయుచు ♦ లాఁతులు బె
గ్గిల మిన్ను గ్రమించెను ♦ గేళిమెయిన్. ౧౨౫

ఆ॥ అచలుఁ డనక కురిసె ♦ నపుడు త్రోఁ జని దైత్య
సూనుజలద మనిల ♦ సుతుని పైని
బాణవర్ష మశని ♦ పాతఘోరమ్ముగాఁ
దనదు చాప మింద్ర ♦ ధనువు గాఁగ. ౧౨౬

క॥ శరవృష్టి యశ్మవర్షము, గిరిపై నెటు లటులె వ్యర్థ♦కీర్తన మయ్యెన్
హరి వజ్రశరీరుఁడై కా, నొరు లాతనిఁ జెనయఁగలరె♦యోటుపడరే. ౧౨౭

తే॥ అసుర యంబకసంపాత ♦ మలఁతిసేసి
యంబరమున సదాగతి ♦ యట్లు దిరుగు
చుండె హనుమఁడు తదిషుప్ర ♦ యోగచతుర
తావిశేషం బరయువేడ్క ♦ దవులు వెనుప. ౧౨౮

క॥ ఎడఁగని వాఁడు భుజాంతర, మెడలె నన న్నాటె సునిశి♦తేషుశతకమున్
నడికించె ఘననినాదం, బడరంగాఁ జేసి వాని♦హనుమయుఁ బెలుచన్. ౧౨౯

మ॥ బహుమానమ్ము విచారముం గదుర నా ♦ పద్మాప్తభూమంత్రి తా
సహనం బందఁగ వాఁడు పైకొన మదిం ♦ జర్చించి దివ్యు ల్సుదు
స్సహు నీరక్కసు నేలొకో యిటు లుపే ♦ క్షం దేల్చుచున్నా డటం
చు హనూమంతుఁ దలంచుచుండ నతఁడుం ♦ జూపోపక ప్డాతనిన్. ౧౩౦

క॥ చుఱచుఱఁజూచుచు నొండెడఁ, జుఱుకరి పీఁ డనుచు నెడఁదఁ♦జొక్కుచు నెప్డే
నెఱికిం జొచ్చునొకో యి, న్నెఱపోఁడ యటంచుఁ దలఁపు♦నెక్కొనఁ దనలోన్.

సీ॥ బాలభాస్కరు లీలఁ♦బ్రిబలుచునున్నాఁడు, బాలుఁ డంచుఁ దలంచు♦పాటి గాక
యనిచేఁతలం దెల్ల♦ననువు మేకొని యుంటఁ, జేసి మెచ్చొదవించెఁ♦జిత్తమునకుఁ
గాన నుపేక్షింపఁ♦గానయ్యె నెఱికల్మిఁ బొసఁగువాఁ డెందును♦బూజ్యుఁ డరయ
వీఁ డెదిర్చిన యంత♦వెఱచి సురాసురు, ల్పఱతురకాక యే♦ర్పడి నిలుతురె
యూరకుంట యింక♦నొప్పదు లాఘవం, బెదుగుచుండె నెట్టి♦యెడరు దొడరఁ
జేసెనేని నను సెడి♦పోవుఁ గర్జంబు, మారిమసఁగు టొండె♦మత మటంచు.

వ॥ తనదు నెమ్మనమ్మున నాలోచించి. ౧౩౩

క॥ కరతలనిహతుల నాతని, యరదము రథ్యముల యంత♦నఱవఱలుగ న
క్కరువలికొడు కెడలించిన, నరాదపతిసుతుఁడు కన్నిన్న♦న స్మెలఁకువతోన్.

ఆ॥ ఖడ్గకార్ముకములు♦గైకొంచు నమ్మహా, రథుఁడు రథము విడచి♦రాణ నెఱయ
నాకసమున కెగసె♦నాకలోకము సేర, నరుగు యోగసిద్ధు♦నట్లువోలె. ౧౩౫

ఆ॥ చండమార్గణముల♦సామీరి నొప్పించి, యతఁడు తిరుగుచుండె♦నంబరమున
నొడుపుఁ గాంచి యొడిసి♦యుక్కడీఁ డాగాలి, పట్టి వానిఁ బట్టెఁ♦బదములందు.

తే॥ చిలువఁ గొనిపోవు గరుడుని ♦ చెలువు దోఁప
వానిఁ గొని చని వేమారు ♦ వరుసఁ దిరుగఁ
ద్రిప్పి యగ్గాలికొమరుఁ డు ♦ దీప్తుఁ డగుచు
నేలపై మోఁదె బలుధాటి ♦ నివ్వటిల్ల. ౧౩౭

ఉ॥ బాహువు లూరువు ల్కటియుఁ ♦ బాడ్వడఁగాఁ దల మోము ముక్కు నా
దేహమునందు నేర్పడక ♦ తీర్పు సెడం జ్యుతసంధిబంధుఁ డై
ప్లీహము మాంస మాంత్రములుఁ ♦ జెంపఱి పోగువడంగ నుద్ధతుం
డా హరిచేతఁ జంపఁబడె ♦ నాశరనాథసుతుండు చండికా! ౧౩౮

తే॥ కాల నిడి నేల ఱాచెన ♦ కపివరుండు
మొనసి వచ్చిన సేనలు ♦ ముమ్మరింపఁ
గాల మగునాఁ డెదిరి మిత్తి ♦ గదియఁబాఱి
యొక్కమొగి శూన్య మొనరించు ♦ యుక్తి దోఁప. ౧౩౯

క॥ వీరుఁడు వానరుఁ డటు సుర, వైరిసుతుం గూల్చి వాని♦వారికి సోద దై
త్యారులకు సంతసము నిడి, తోరణముం జేరె ముదము♦తోఁ దిరమగుచున్.

క॥ బలయుతుఁ డాత్మజుఁ డక్షుఁడు, బలయుతుఁడై కెడసె ననెడు ♦ పలుకు విన్బడెన్
బలవైరివైరి తోడిఁబడె, బలమఱి యిది యేమి కాల ♦ బలమో యనుచున్.

——♦ అక్షమరణదుఃఖితుఁడైన రావణునూఱడించి యింద్రజిత్తనికి వెడలుట. ♦——

తే॥ ధీరుఁ డాతండు గతిసెడ ♦ దేబెఁ బోలె
నడలెఁబో యంతమాత్రన ♦ యైన దెద్ది
శీర్ణమై పోవ దవ్వాని ♦ చేదుగుండె
వజ్రమో వజ్రిసుతు నట్టి ♦ వాఁడు మఱియు. ౧౪౩

ఆ॥ కొంతవడికిఁ దెలిసి ♦ కొని చిత్తమును నిల్పి, కొని మహారణైక ♦ కోవిదుని వి
కుంఠు నింద్రజిత్తుఁ ♦ గొడుకుఁ గనుంగొని, యిట్టు లనియె రాక్ష ♦ సేశ్వరుండు.

ఉ॥ శస్త్రవిదాంవరిష్ఠుఁ డన ♦ సన్నుతి కెక్కితి వన్నిచోటులన్
శాస్త్రవిచారదక్షుఁ డనఁ ♦ జాలితి మేలియశంబుఁ గూర్ప ది
వ్యాస్త్రవరప్రభావముల ♦ నందరు ని న్నొకకొందఱేని నీ
పూస్త్రయియందుఁ బోల నిను ♦ బూజ్యునిఁ గంటి కొలంబు మేల్మికిన్. ౧౪౪

తే॥ తేఱిచూడలేరు ♦ దివిజు లెల్లరు నిన్ను, యుద్ధ మనిన నింక ♦ నోడ రెట్లు
దేశకాలయుక్తి ♦ దెలిసి మెలంగుదు, ధీబలంబె చాలు ♦ దిటవుపఱుప. ౧౪౫

ఉ॥ చేయఁగలేని కర్జ మని ♦ చెల్లమి యుంచని నీదు ధాటికిన్
బాయక నిల్చు నట్టి దని ♦ పట్టి విన న్గన నట్టి జెట్టి వా
నీయసమానశక్తిఁ గని ♦ నేఁ డిటు పంచుచునున్న వాఁడ సు
శ్రీయుతమూర్తివై తొడరి ♦ సిద్ధిరమం గొని రమ్ము చెచ్చెరన్. ౧౪౬

క॥ అనిఁ గలుగు సంకటంబున, నినుఁ దలఁచిన నాకు శ్రమము ♦ నెక్కొనఁగాఁ బో
దనిమిషు లనఁగా నెంతలు, ననుఁబోలెదు మేలితపము ♦ న న్దైజమునన్. ౧౪౭

ఉ॥ కింకరు లెల్లఁ గూలిరి ప్ర ♦ కృష్టజవుం డల జంబుమాలియున్
బింకముపో నడంగె నరి ♦ భీమబలాఢ్యులు మంత్రిపుత్రు లా
వంకనె పోయి రేపు రటు ♦ వ్రాలిరి సైన్యపతు ల్గడంగి ని
శ్శంకితుఁ డక్షుఁడుం బడె స ♦ సారుఁడు నీయనుజుండునై యనిన్. ౧౪౮

తే॥ నీదెసం గల బలసార ♦ నియతి నెఱియు
వారియెడఁ గాననైనన ♦ పారసత్త్వ
మైన యది కొఱంతి తద్విక్ర ♦ మాక్రమప్ర
భావము లెఱింగి పడయుము ♦ పట్టి! జయము. ౧౪౯

తే॥ మొన లితనిఁ దాఁకి కూలెడు ♦ మొత్తములుగ
జాలదు ససారుఁ దొడర వ ♦ జ్రింబయేని
నీపగిది వడి రూపింప ♦ నోపఁ జనిలుఁ
డగ్నికల్పుండు సాధనా ♦ హతియు నోర్చు. ౧౫౦

చ॥ బలమటి పోవకుండఁ దన ♦ పట్టున మోసము పుట్టకుండ ని
ర్మలమతి సర్థముం దొరసి ♦ మార్తుర కేడ్తెఅ సూపి యస్త్రశ
స్త్రల వలను ల్స్మరించుచు న ♦ కుంఠితయుక్తి మెలంగుమన్న య
వ్వలఁతియుఁ దక్కు నీ కనిఁ బ ♦ రాక్రమవంతుని మెచ్చరే పరుల్. ౧౫౧

తే॥ ని న్ననిచి యే నిచట నున్కి ♦ నెమ్మి గాదు
నేన మునుమున్న దొరఁకొంట ♦ నీతి గాదు
రాచకార్యమ్ము లిట్టివ ♦ రాణ నెఱయ
మెఱసి యుక్తిమై గెల్చు ♦ తెఱఁగుఁ గనుము. ౧౫౨

క॥ అని దీవన లొసఁగిన నా, ఘననాదుఁడు పొంగి పోరి♦కలని కరుగఁ దా
మొనకొని ప్రదక్షిణక్రమ, మునఁ దండ్రికి మ్రొక్కి సంప్ర♦మోదభరితుఁ డై

మ॥ తనవా రెల్లను గారవించి జయవా ♦ క్యప్రస్తుతు ల్సేయ శా
స్త్రనిదేశజ్ఞుఁడు యుద్ధపండితుఁడు నా ♦ జానొందు నాయిందర్జి
త్తనుమోదించి జయార్థి యై కదలె దై ♦ త్యారు ల్కడుం దల్లడి
ల్ల నయోత్సాహరసాకరం బన మహా ♦ ల్లాసమ్మునం బొంగుచున్. ౧౫౪

తే॥ తార్క్ష్యజవములు సితతీక్ష్ణ ♦ దంష్ట్రిలు నగు
నాల్గు వ్యాళంబుల న్పూన్చి ♦ నయుది నేల
నిలువకయ మింటి కెగయంగ ♦ నేర్చునదియు
నైన రథ మెక్కె నాదివి ♦ జాంతకుండు. ౧౫౫

తే॥ తలఁక నని యస్త్రవేత్తల ♦ తలను నిలుచు
వాఁడు విల్గొని రక్కసు ♦ ల్బలసి కొలువ
నింద్రవిభవమ్మునఁ గొఱంత ♦ లెంచి నగుచు
వచ్చెఁ జెచ్చెర హనుమాను ♦ వలను గదియ. ౧౫౬

ఉ॥ కావురు గ్రమ్మె దిక్కుల మృ ♦ గంబులు ఘూర్ణిలసాగె మింటియం
దావిహగంబు లుగ్రముగ ♦ నారవము ల్సెలకొల్పె సిద్ధులున్
దేవతలు న్మునీంద్రులునుఁ ♦ దీర్చిరి కన్గొన వ్యోమవీధి నీ
కావరుఁ డిట్టు లేగుతఱిఁ ♦ గల్ప మనల్ప మటంచు నెంచుచున్. ౧౫౭

—♦ హనుమన్మేఘనాదుల ద్వంద్వయుద్ధము ♦—

తే॥ అతని రథనేమినిస్వన ♦ జ్యాస్వనములు, భేరికాధ్వనిఁ బోని గ ♦ ళారవంబు
నేక మయి వీరవర్యుని ♦ రాక దెలిపె, వెరవు మేకొన హరివీరు ♦ వీనులకును.

ఆ॥ పెద్ద విల్లు పూని ♦ పెనుపారు శరములు
పట్టి యసుర గాడ్పు ♦ పట్టిఁ బెరసెఁ
బెరిగె నపుడె హనుమ ♦ పెనుమేను రవ ముత్స
హనము నొక్కఁ డొంటి ♦ నతిశయింప. ౧౫౯

క॥ ఇరువు రతిజవను లతిబలు, లురుతేజులు నిర్విశంకు ♦ లుదితోత్సాహుల్
మరుదమరారితనూజులు, సురాసురేంద్రు లన ననికిఁ ♦ జొచ్చిరి కడఁకన్. ౧౬౦

ఆ॥ ఎగసె నంబరమున ♦ కీర్తితేజుఁడు గాడ్పు, కొమరుఁ డతఁ డొనర్చు ♦ గుణరవమ్ము
తో రథస్వనమ్ము ♦ భేరీముఖధ్వను, లొక్కఁ డగుచు నఱుమ ♦ నుక్కుమిగిలి.

ఉ॥ తెక్కలు పుంఖము ల్మెఱయ ♦ టెంగు లెసంగెడు వాఁడితూఁపులన్
రక్కసితేనిపట్టి పవి రావము ♦ దోఁకొను క్ష్వేళ లొక్కటన్
దిక్కులఁ బిక్కటిల్లఁ బలు ♦ శేఁకువ గ్రువ్వఁగఁ దండిద్రారి న
య్యుక్కలుఁ డక్కజం బొదవ ♦ నూరక రాలఁగఁ జేసె నన్నిటిన్. ౧౬౨

తే॥ సర్వభూతమనోగ్రాహి ♦ చారుగతుల
నట్లు విహరింపఁదొడరె నా ♦ హరివరుండు
సునిశితాస్త్రంబు లొండొండఁ ♦ జొనిపి వాని
కడరుపుట్టింపఁజూచె న ♦ య్యసురవరుఁడు. ౧౬౩

క॥ సందులఁ దిరుగుచు మఱల, న్ముందు నిలువఁబడుచు నయ్య ♦ మోఘశరములన్
గ్రిందుకొని యొడియఁజూచుచు, మందప్రజ్ఞునిఁగఁ జేసె ♦ మారుతి యతనిన్.

క॥ ఆతని యంతర మసురుని, చేతోగతి కందదయ్యెఁ ♦ జిరకాలం బ
వ్వాతాత్మజున కతని నెఱి, పాఁ తెఱుఁగంబడని దయ్యెఁ ♦ బర్వతతనయా!

ఆ॥ లక్ష్యభేదగతి చ♦లన మొంద నమ్ములు, వమ్ము లగుచుఁ బోవ♦వాఁడు దలఁచె
వీఁ డవధ్యుఁ డనుచు♦వెఱపు నెమ్మదిలోన, మొలకవాఱి తన్ను♦ముంపఁ గలఁగి.

క॥ ఆలోచించె నసుర కపి, లాలోకునిఁ బట్టికొనఁగ ♦ నగు నెట్లని తా
నాలో మది నరయం గనె, నాలోకేశాస్త్రమునన ♦ యను వగు ననుచున్.

శా॥ తాత న్ధాతఁ దలంచి రాక్షసుఁడు సం ♦ ధానించె బ్రహ్మాస్త్ర ము
ద్ద్యోతంబు ల్దెస లెల్లఁ గ్రమ్మఁగ మనూ ♦ ద్ద్యోగమ్ము యోగమ్ము వి

ద్యాతంత్రమ్మున నిమ్మ సూపఁ దిరమై ♦ దానిం బ్రయోగించి య
వ్యాత్మోద్భవుఁ గట్టివైచె నమర ♦ వ్రాతంబు చింతింపఁగన్. ౧౬౮

ఆ॥ అసుర కజుఁ డొసంగి ♦ నట్టి యవ్వరమునఁ
బట్టువడియెఁ బడియెఁ ♦ బ్లవగవరుఁడు
తనకుఁ గూర్మి నిడిన ♦ తద్వరశక్తిచే
మఱలఁ దెలివి నొందె ♦ మాన్యుఁ డతఁడు. ౧౬౯

క॥ తెలివిసెడఁ బట్టువడి దాఁ, బ్రలయస్థితిఁ గనుట నెఱిఁగె♦బ్రహ్మాస్త్ర మటం
చలఁతిఁ దన మేలుకొనుటను, దలఁచెను విభువరము మహిమ♦తార్కొనె ననుచున్.

ఉ॥ బంధము మోక్షముం గనఁగఁ ♦ బాల్పడ దొంటికిఁ గాన నింక గ
ర్వాంధత యేల లోకవిభు ♦ నానతికల్మి మెలంగువాఁడ ని
ర్గంధుఁడ నై యటంచు మదిఁ ♦ గంజజు నస్త్రముఁ గూర్చి చిత్కళా
బంధురుఁ డాత్మనిష్ఠ మెయి ♦ భావనసేయుచునుండె నత్తఱిన్. ౧౭౧

శా॥ చేష్టల్ దక్కెను జిక్కెనిక్కె ననుచుం ♦ జింతించి క్రవ్యాదు లా
కృష్టుం జేయఁ గడంగి పగ్గములు మైఁ ♦ గీల్కొల్పి బంధించి రా
భ్రష్టుల్ వాని తలం బెఱుంగ రొకఁట ♦ న్భావించుచున్నాఁ డెద
న్గష్టు న్రావణుఁ గాంచి వాక్చరములం ♦ గాఱింప విద్యాలతా! ౧౭౨

ఆ॥ ఎట్టివానికైన♦నెడయు బంధము లెల్ల, నెవనిఁ దలఁపులోన♦నిడినయంత
నట్టి రామవిభుని♦యనుఁగుఁ గింకరుఁ డఁట, యతని కితరబంధ♦మలఁతిగాదె.

శా॥ వాణీనాథుఁడె పట్టుగొమ్మ యయి న ♦ న్బాలించుచున్నాఁడు గీ
ర్వాణాధీశుఁడు నట్టిఁడే కద జగ ♦ త్ప్రాణుండు నాతండ్రి ని
ద్రాణత్వేతరవృత్తి రాముపదము ♦ ల్ధ్యానించుచుంటె న్దరి
ద్రాణత్వంబుఁ దరించితి న్మద మపా ♦ రం బయ్యెడు న్నాకిఁకన్. ౧౭౪

ఆ॥ వీరు కట్టి దైత్య♦విభుని చెంగట నన్నుఁ, బెట్టిరేని నదియుఁ♦బెను పొసంగుఁ
గాత వానితోడఁ♦గలసి మాటాడంగ, వచ్చు దాన మేలి♦వలను గలదు. ౧౭౫

మ॥ అని లో నెంచి యుదారభావముమెయి ♦ న్నానందుఁ డై యుండఁ గా
ననివా రాజగదేకశూరు మహిక ♦ న్యానాయకైకాంతభ
క్తుని సామీరినిఁ గట్టి యీడ్చునెఱిఁ దో ♦ డ్తోఁ బోవుచుండె న్స్వతా
శను ముంగొంగునఁ జుట్టికొంచుఁ జను ర ♦ క్షఃపాలి మే లెట్టిదో. ౧౭౬

కం॥ తిట్టుదురు దుష్టుఁ డనుచు, న్గట్టుదు రేమఱక త్రాళ్ల♦గమిఁ గట్టియులం
గొట్టుదు రటఁ బిడికిళ్ల, న్మొట్టుదు రాహారిని వారి♦మోహా మలఁతియే. ౧౭౭

ఆ॥ ఎఱుక లేని మొఱకు ♦ లిట్లట్లు నగుచుండ
నెఱుక గలఁడు దాన ♦ వేంద్ర సుతుఁడు
దలఁచె లోనఁ దలఁకు ♦ దలకొన నగ్గాడ్పు
పట్టి యోజ యెడఁదఁ ♦ జుట్టికొనఁగ. ౧౭౮

సీ॥ అస్త్ర మీతనిఁ గట్టి♦యులఁతిమై వీడెఁగా, యిట్టి దుష్కాలమ్ము♦నే మనఁ దగు
నద్దాని కట్టున్న♦నలవియే యొండొండఁ, గాల్సేయి గదలింపఁ♦గాఁ దలంప
నొండు కట్టులు గట్ట♦నుండ దయ్యది తన, పెనుపు దక్క పడంగఁ♦బొనరుపడమి
నింకఁ గొండొక యస్త్ర♦మీతనిఁ బెరయఁబో, దేమి సేయం గల♦దింతవట్టు

గాంచిన దృఢప్రయత్నమ్ము ♦ గలఁగె మొఱకు
లరయకున్నారు తమచేటు ♦ యాతుధాను
లందఱకు మూఁడె వీనిచే ♦ ననుచు మదికిఁ
గానఁబడె మీఁద నిది యేమి ♦ గాఁగ నగునో. ౧౭౯

ఆ॥ ఏది యెట్టు లున్న ♦ నీతండు బద్ధుండ, పోలె నున్నవాఁడు ♦ పొలుపు దక్కి
పోవనిత్త మిట్టి ♦ పొందుపాటున విభు, నెలవు సేర్ప విధియ ♦ నేర్పుఁ బిదప.

కం॥ అని యాతఁ డూరకుండఁగ, దనుజులు పవనజునిఁ గొనుచుఁ♦దరము మిగులు ను
క్కన నఱుముచు నార్చుచు నెడ, గొనిగ్రుద్దుచు నీడ్చుచుం బ్ర♦కుపితులునగుచున్.

కం॥ రాజద్వారముఁ గడచి వి, రాజితుఁడై తనరు దనుజ ♦ రాజున కతనిన్
దేజస్వి నప్పగించి ప్రి, యోజన మరయఁజను ననెడు ♦ యోజనఁ జనుచోన్.

ఉ॥ వీఁ డెవఁ డొక్కొ వచ్చె నిట ♦ వేడబము ల్పచరింప నేల యె
వ్వాఁ డిటు పంపె నేమి పని ♦ పాల్కొనె నేయది ప్రాపా యంచు బి
ట్టాడిరి దుష్టుఁ డెందఱు ల ♦ యం బొనరించె నటంచుఁ దిట్టి ర
వ్వీఁకఁ జెలయించువా రెనయ ♦ వచ్చినవారును గ్రిచ్చనెంచుచున్. ౧౮౩

కం॥ చంపుఁడు కాల్పుఁడు పేల్పుఁడు, పొంపెసఁగ న్మెసఁవు డనుచుఁ ♦బోరన నతనిన్
బెంపఱఁ బైకొని రమ్మెయిఁ, జంపుదురో తమకు మూఁడు ♦ చా వరయుదురో.

కం॥ అంతట నాహంతలు హను, మంతుని గొనిపోయి నిరృతి ♦ మండలపతి స
భ్యాంతరుఁడుగా నెదురఁ దమ, పంతమ్ములు నెఱయ నిలిపి ♦ ప్రక్కల నిలువన్.

తే॥ దనుజు లదలింప నమ్మెయిఁ ♦ దమకమున్న
యాకపి మదేభముం గాంచె ♦ నసురవిభుఁడు
ముజ్జగమ్ము లొకఁడ యేల ♦ మొనయఁజాలు
నతనిఁ బొడగాంచె నమ్మరు ♦ దాత్మజుండు. ౧౮౭

—♦ హనుమ పట్టుబడి వచ్చి రావణునిఁ దిలకించుట ♦—

క॥ చిద్భామవిగ్రహుం డతఁ, డద్భుతదర్శనుని రాక్ష ♦ సాధిపుఁ గని తా
నద్భుతపడియె నమర్షల, సద్భంగిఁ దనర్చియునుఁ బ్ర ♦ సన్నముఖాబ్జా! ౧౮౮

సీ॥ మెఱుఁగులాశలఁ గ్రమ్మ♦మిఱుమిట్లు గొలిపెడు, మణిమౌక్తికోజ్జ్వల♦మకుటమొప్ప
నెడనెడ మగఱాలఁ♦దొడరు బెడంగుల, రత్నభూషణములు♦రాణఁ బొనర
జిలుగులు నెఱయంగ♦రంగారు బంగారు, వలువ విద్యుత్కాంతి♦వలను సూప
నాణిముత్తెపుఁ బేర్లు♦రాణించు మై జిగి, సబలాకఘనలీల♦సంతరింప

జీవరత్నోర్మికాంగద ♦ శ్రీనివాస
పంచశీర్షమహోన్నత ♦ పన్నగములు
బాహువులు బాహుబల విజృం ♦ భణముఁ దెలుప
నమ్మనికి తేని హాయ లట్టు ♦ లతిశయిల్ల. ౧౮౯

వ॥ వెండియుం బ్రచండప్రతాపమండితుం డగు నప్పౌలస్త్యకుండలీంద్రుండు పిచండిలం బగు నిజతేజోమండలంబున నాసభామండపంబు మార్తాండబింబమండంబునం బ్రకాశింపఁ జేయుచు ఘనసారగోరోచనకస్తూరీహరిచందనకుంకుమాగురుప్రముఖపరిమళద్రవ్యపరిమిళితం బై మహావీరపురుషోచితం బగు నయ్యనులేపనంబున గైరికాదిధాతురాగపుంజానురంజితం బగు నంజనాచలం బనం జారుతరత్వంబున నొప్పారుచు నారక్తరేఖాంచితనేత్రాంచలంబులును భీమపరాక్రమక్రమసంభావితంబులును సుతీక్ష్ణోజ్జ్వలమహాదంష్ట్రంబులును లంబమానదంతచ్ఛదంబులును వివృతంబులు నయి దర్శనీయభయంకరంబు లగు పదిశీర్షంబుల యుత్కర్షంబున వ్యాళసమాకీర్ణంబులునువివిధతరులతాపుష్పగుళుచ్ఛశోభితంబులు నగు మహాకూటంబుల కూటమి ఘనసముద్ఘాటనోద్ఘాటం బగు మందరధరాధరంబు నిరాకరింపుచుఁ దారహారవిలాసోపచితబహుపూర్ణచంద్రవికాసంబునకుఁ దోడునీడ లగు నట్టహాససంరంభవిజృంభణంబుల సాంద్రతరంబు లగు ప్రౌఢచంద్రాతపంబుల నెల్లెడల నుల్లసిల్ల వెల్లిగొల్పుచు దివ్యస్ఫటికఫలకప్రముఖసకలకలాశోభితంబును విచిత్రనానారత్నప్రభాప్రభావదుర్నిరీక్షంబును నత్యుత్తమాస్తరణసమాస్తీర్ణంబును మాణిక్యమణిమయపాదపీఠతలంబును మహార్హంబును నగు

వరాసనంబున సుఖోపవిష్టుం డగుచు సుమేరుశిఖరాధిష్ఠితం బగు ధారాధరంబు ననుకరించుచు దుర్ధరప్రహస్తమహాపార్శ్వనికుంభసంజ్ఞికమహామాత్యచతుష్టయ పరివృతుండు నై చతుస్సముద్రపరివేష్టితం బగు భూలోకంబు వడువున నాలోక నీయుం డగుచు రంభాదులం దుల నచిరంభాదులం బొనరింపనోపు ప్రమదారత్నం బులు నుత్నప్రసాధనంబులు శోభిల్ల వాలవ్యజనంబులం దాల్చి యల్లనల్లన వీవ నలు వైవ వందిమాగధులు పొగడ వేత్రహస్తులు పరాకులం దెలుప యోధులు సాయుధు లై సేవింప సుధర్మసమానధర్మ యనం జాలు కొలువు కూటంబునం బేరోలగం బుండి యింద్రసామ్రాజ్యవైభవంబు బహుతృణంబుఁ గావించుచుండ సమ్ముఖమ్ము వడసి యమ్మహామహుని లోకవిద్రావణుని రావణునిఁగా నెఱింగి యనం గోల్లసితం బగు తన యుల్లంబున. ౧౯౦

తే॥ అరరె రూప మహో హా ధైర్య ♦ మార సత్వ
మబ్బురం బీమహాద్యుతి ♦ యతివిచిత్ర
మాన కా మానవాదేంద్రుఁ ♦ డైన వీని
యఖిలలక్షణలక్షిత ♦ త్వాతిశయము. ౧౯౧

క॥ వీఁడె యనీతిపథమునం, బోఁ డన నగు నేని సకల♦పూజ్యుం డగుచుఁ
నేఁడే సురలోకేశుఁడ, కాఁడో యాతని భరింపఁ♦గలఁ డనఁ దగఁడో. ౧౯౨

తే॥ ధూర్తుఁ డీతని కర్మము♦ల్లూషితములు, ఘాతుకమ్ము లతికూర♦గతులు కాన
వడఁకుచున్నారు మూఁడుభు♦వనములందు, నున్నవారుఁ బాలించుచు♦నున్నవారు.

తే॥ చేయఁడె యితండు కుద్ధుఁ డై ♦ చెనయు నేని
నఖిలలోకమ్ము లిపుడ యే ♦ కార్ణవమ్ము
వీని నమితౌజసు జయించి ♦ విభుఁడు రాముఁ
డవనిజను గొనిపోవ నె ♦ ట్లనువుపడునొ? ౧౯౪

క॥ అని యిట్లు తనమనంబున, హనుమానుఁడు తలఁచుచుండ♦నభిమానఘనుం
డ నితరసామాన్యుం డగు, దనుజేంద్రుఁడు వానిఁ జూచి♦దర్పోద్ధతుఁ డై. ౧౯౫

—♦ రావణుఁడు హనుమంతునిం జూచి యాశ్చర్యపడుట. ♦—

ఆ॥ తొడర నెంచి శిక్షి♦తునిఁ జేయ మఱియునుఁ, దలఁచె నెడఁదఁ జింత♦దారసిల్ల
నిమ్మహాత్ముఁ డజితుఁ♦డిద్ధ తేజుఁడు వీనిఁ, గోరి యనెడు బుద్ధి♦కొఱఁత పడదె.

మ॥ మును కైలాసము నేఁ గనంజనిన మా ♦ ర్మకఁ గంటి నందీశ్వరుం
డనఘుం డేలొకొ వానరాకృతిగఁ దా ♦ నై యుండ లక్ష్యోదరం

బున వీక్షింపక నవ్వు నన్గని శమం ♦ బుం దొఱఁచి యీరీతివా
రె నినుం గెల్తు రటంచుఁ దిట్టె నతఁడే ♦ యిబ్బంగి రానెంచెనో. ౧౯౬

తే॥ లేక బాణుండు నాచే ని ♦ రాకరింపఁ
బడుట నీయుక్తిఁ దొడరి రాఁ ♦ బడసెనొక్కొ
యింద్రముఖు లజు వేఁడిరో ♦ యిట్టి సృష్టి
వానరులు లేరె వారి కీ ♦ వలను గలదె. ౧౯౭

క॥ అని చింతించి యతఁడు నె, మ్మన మొకగతి గట్టిసేసి♦మార్గముగము మహా
భినివేశం బెఱిఁగింపఁగఁ, దనసచివుఁ బ్రహస్తుఁ గాంచి♦తద్దయుఁ బలికెన్. ౧౯౮

తే॥ ఈతఁ డెవ్వనివాఁ డెవ్వఁ ♦ డేకతమున, నప్రధృష్య యా నాపురి ♦ నడుగువెట్టె
నేల పెఱికెను వన మిట్టు ♦ లేమిపనికి, రాక్షసస్త్రీల బెదరించె ♦ రణము సేసె.

ఆ॥ ఈమరాత్ము నడుగు♦మింతవట్టు నటంచుఁ, బ్రౌఢభావ మొప్పఁ♦బలుకుటయును
నతని మంత్రి వాన♦రాధీశు మంత్రితో, నిట్టు లనియె నేర్మి♦యేర్పడంగ. ౨౦౦

—♦ ప్రహస్తుఁడు హనుమంతునితోఁ బ్రసంగించుట. ♦—

ఉ॥ నీకు భయంబు లే దొకఁట ♦ నిక్కము నమ్ముము భద్రమయ్యెడుఁన్
దేఁకువఁ గొంచు నూఱడిలి ♦ తిన్నఁగఁ బల్కుము దేని నెంచి నీ
రాకయె యెవ్వఁ డంపెనొ ని ♦ రాకరణంబున కెద్ది హేతువో
యోకపివర్య! తెల్పు మట ♦ యుక్త మెఱింగి విముక్తుఁ జేసెదన్. ౨౦౧

తే॥ ఇంద్రుఁ డనిచెనొ యముఁ డిట్టు ♦ లెఱిఁగి పనిచె
నేమొ వరుణుండు దోలెనో ♦ యెద్ది దలఁచి
యేని ధనదుఁడు పురికొల్పె ♦ నేమొ దనుజ
వైరి పుత్తెంచెనో పల్కు ♦ వాస్తవముగ. ౨౦౨

క॥ కనఁ గపిరూపుఁడ వని కా, కనఁదగునే నిన్నుఁ గొఱఁతి♦యని తెల్వియుఁ దే
జును గాంచి నిజము పలికిన, ఘనత్వమా కాంతు మోక్ష♦కలనయుఁ గలుగున్.

ఆ॥ నిజమె కొఱఁతి వైన♦నీ కిటరా నేమి, పనియొ యది పలుకుము♦పలుక వేని
నిపుడె నిన్నుఁ జంపి♦యెల్లభూతములకు, బలి యొనర్తు మింత♦దలఁచికొనుము.

—♦ హనుమంతుఁడు ప్రహస్తుని వాక్యములకు సమాధానముఁ జెప్పుట. ♦—

చ॥ అనుచుఁ బ్రహస్తుఁ డేర్పడఁగ ♦ నాడినఁ బల్కెఁ బ్లవంగచంద్రుఁ డా
దనుజపతి న్గనుంగొనుచు ♦ ధాత సృజించిన సృష్టిలోన నే
నును నొకవానరుండ సుమ ♦ నోవిభుఁ డేనియు నన్యుఁ డేనియున్
బనుపఁగ మాఱురూప మిటు ♦ పన్నఁగలే దెదిరి న్గ్రమింగఁగన్. ౨౦౪

ఉ॥ దానవనాథు దర్శనము ♦ తద్దయు దుర్లభమం చెఱింగి యే
నే నెఱిఁ గాంచువాఁడ నని ♦ యే పెకలించితి నవ్వనం బటు
ల్గా ననరాదు క్రోఁతి ననఁ ♦ గా నయి యెవ్వఁడయేని నేవగం
బూనియు స్వీయజాతికృతి ♦ బుద్ధులఁ ద్రోఁచి మెలంగ నేర్చునే. ౨౦౬

ఉ॥ మీ రనుపంగ వచ్చి నను ♦ మీఱి బలంబు లలంపఁ జొచ్చినన్
గారణ మున్న లేకునికి ♦ గల్గిన నూరకె యుంట దోఁప క
వ్వారి వధించి జీవిత మ ♦ వారణఁ గాచికొనంగ నైతిఁబో
యేరికి నేనిఁ బ్రాణభయ ♦ మింతలు సేయక రిత్తవోవునే. ౨౦౭

శా॥ మీచే బద్ధుఁడ నైతి నంచుఁ దలఁప ♦ న్మే లెంత యుట్లేల యా
లోచింప న్ననుఁ గట్టువార లని ము ♦ ల్లోకంబుల న్నేరు నా
రాచంబు ల్కాఱగావు తత్వరమున ♦ న్బ్రహ్మాస్త్ర మొం డ్రొల్లకే
యాచాయం జన నేను మిమ్ముఁ గనఁగా ♦ నర్థించి యే తెంచితిన్; ౨౦౮

ఆ॥ దాఁప నేల చెప్పఁ ♦ దలఁచి యో రావణ !, యేను రాము దూత ♦ నినజుఁ డనుప
వచ్చినాడ సీత ♦ వల నెఱింగి నయ మ్మొ, కింత నీకుఁ దెలుప ♦ నెంచినాడ. ౨౦౯

చ॥ విశదముగా సెఱుంగు మిల ♦ విశ్రుతుఁ డాఢ్యుఁడు పుణ్యమూర్తి యా
దశరథదేవుఁ డాతనికి ♦ ధన్యులు పుత్రులు నల్వు రందు రా
మశిశిరధాముఁ డార్యజన ♦ మాన్యుఁడు తా జనకానుశాసితిన్
శశిముఖి తమ్ముడుం గొలువఁ ♦ జాలి వసించెను దండకాటవిన్. ౨౧౦

ఆ॥ వారు వనికిఁ బోయి ♦ వచ్చిన యంతలో, మోస మెద్ది యెట్లు ♦ మూఁడెనో క్రొ
యవనిజాత సీత ♦ యాతనిసతి లేమిఁ, బాడుపడియె నచటి ♦ పర్ణశాల. ౨౧౧

ఉ॥ వా రెదఁ జింత నొందుచు ను ♦ దారులు వా రట ఋశ్యమూకమున్
జేరిరి సీతజాడ యెటు ♦ చేకురు నన్న విచార మొప్పఁగా
వారని సఖ్య మేర్పడియె ♦ వారికి భానుకుమారుతోడ నా
తీరున వాలిఁ ద్రుంచి కపి ♦ దేవు నొనర్చెను రాముఁ డాతనిన్. ౨౧౨

తే॥ ఈ వెఱుంగుదుకద వాలి ♦ నింద్రతనయు, ననుజు నినజుని సుగ్రీవు ♦ నతిబలాఢ్య
వానరర్క్ష బలంబుల ♦ వలను లెల్ల, నింతగా నేను వివరించు ♦ నంత యేల. ౨౧౩

క॥ ఆకపినాయకు నాజ్ఞ న, నేకు లనేకపసదృశులు ♦ లెల్లెడఁ దారై
భూకన్య నరయుచున్నా, రేకాహుతిఁ గొండ్రు చెట్ట ♦ లెదురై రేనిన్. ౨౧౪

ఆ॥ వినతతనయుఁ బోల ♦ ననిలదేవునిఁ బోలఁ, బరగునందు కలిమిఁ ♦ బరఁగువార
లేకశూరు లటుల ♦ నేకనాగాయుత, కోటిబలులు లెక్క ♦ గొనరు పరుల.

అ॥ వారిలో నొకండ♦వాయుదేవసుతుండ, నొడయుఁ డనుప వచ్చి♦యుదధి దాఁటి
నెలయు నెలవు లెల్ల♦నెమకి నేఁ గనఁగంటి, దేవదేవుఁ డతని♦దేవి నిచట. ౨౧౯

మ॥ నినుఁ బోల న్మనువాని కిట్లుతగునే ♦ నీతిం దలంగంగ నొ
క్కని దార న్గొని తేరఁ గోరుటె యయుక్తం ♦ బౌనకాదే విరిం
చను వంశంబునఁ బుట్టి విద్దెలు తప ♦ శ్శ్రీద్ధాదులుం గల్గి యే
మని యిన్నీచపుఁ గృత్య మెంచితి గరా ♦ సంచు న్ప్రిజ ద్రిట్టరే. ౨౨౦

సీ॥ లోకమ్ము గతిని వీ ♦ లోకించి యెఱిఁగిన, నిట్టిరాక్షసి మతి ♦ యెడముపడదె
దైవి బుద్ధియు లేక ♦ తలఁగునే సంస్కృతి, ముక్తి కల్గునె యెంత ♦ మోసపడితి
దేహ మాత్మ యటన్న♦తెర గ్రిమ్మ దేహమ్ము, భూతధాతువికార♦పూరి తమ్ము
స్వాత్మ చిన్మాత్రి మ ♦ న్వయ మజ మక్షర, మాకాశవన్నిఖి ♦ లాంతరమ్ము
కానఁ బ్రికృతివికారసం ♦ కలిత మైన
లాఁతి దేహాది కాత్మ పిల ♦ క్షణంబ
యని యెఱసి తన్నుఁ దాఁ గను ♦ నతఁడె ముక్తుఁ
డాతఁ డిమ్మెయి బంధా ప్తి ♦ నలఁతిపడునె.

తే॥ నీకు హిత మొనరించెద♦నమ్మి గనుము, కరుణమెయి నే విధేయతఁ♦గంటిఁగాన ౨౨౧
విష్ణుభక్తియు కాక యే♦వెరపు లేదు, దేహధారికి మోహమ్ము ♦ దెరలఁజేయ.

ఆ॥ అట్లు గాన రాము ♦ హరి రమానాధునిఁ, గా నెఱుంగు మతఁడు ♦ కలుషహారి
శత్రుభావ మెడలి ♦ శరణార్థి వై లక్ష్మి, సీత నొసఁగు మాత్మ ♦ సిద్ధిఁ గనుము.

క॥ ఆచిదూర్పుఁ డధీశుఁడు, నీచేసిన తప్పు దొ్రఁచి♦నిర్మలబుద్ధిన్
బ్రోచుఁ దలఁకకు మొకం డా, లోచించినఁ జెడుదు వీవు♦లుబ్ధుఁడ వగుచున్.

క॥ అని యమృతోపమముగఁ బలి, కిన తెఱఁ గరయక యె వాఁడు♦గినిసి మిగుల నె
త్తని గుడ్లు సేసి మండుచు, న నెఁ బవనాత్మజునిఁ గాంచి♦యతిదర్పమునన్.

ఉ॥ నా యెదురం బ్రిలాపము ల ♦ నం జనునే భయ మింత లేక యే
మాయెను నిన్ను నీయధిపు ♦ నన్నరుల న్వధియింతు వానరా
పాయ మొనర్తు నాయలుక ♦ పాలొనరింతు నపేత సీత ని
ట్లీయహితప్రిసంగముల ♦ నెంచెదవోటు ప్లవంగమాధమా!

క॥ అని తూలనాడిన న్విని, యనిలతనూజుండు కలఁగి♦యనలాకృతి యై ౨౨౩
మనుజాశనుతో నిటు లనెఁ, దనదు ప్రిభావంబు నెఱియుఁ♦దలకొని మెఱయన్.

క॥ నీకుం గాలము మూఁడినఁ, గా కిటు లాడుదువె నీచ!♦గదహతుఁ డెపుడున్
జేకొనునె పథ్య మగునది, లోకము తరబడియుఁ గావు♦లోలత్వమునన్. ౨౨౪

ఆ॥ కావు లెక్క నాకు♦రావణకీటక, హరిబ్రహ్ములును నైన♦నలుకమెయిని
నేఁ దలంతునేని♦నిన్ను నీవారి నీ, లంకతోడఁ గూల్తు♦లావు నెఱయ. ౨౨౯

క॥ రాముఁడు నేసెఁ బ్రతిన నెవఁ, డీమహిజకు నెడరు గూర్చె♦నే వాని బల
స్తోమయుతుఁ ద్రుంతు నని యా, నేమ మెఱిఁగి యూరకుంటి♦నీ విటు లనఁగన్.

ఆ॥ సీతఁ దెచ్చి నాఁడు♦చిఱుతలఁ జంపించి, నేఁడు దొంగ వైతి♦నీమగఁటిమి
నన్నుఁ జంపు నోటు♦నవ్వుదు రొరు లుట్టి, కెక్క నమ్మ స్వర్గ♦మెక్క నొక్క.

తే॥ వాలిసందిఁట నొక్కింత♦వగరుదక్కెఁ, గార్తవీర్యుని కొట్టునఁ♦గందువాఱె
నమ్మగఁటిమికిఁ దెలిదీవి♦యున్న లిడ్డ, పుండుపై నేఁడు పోలేరు♦బొబ్బ వొడమె.

క॥ దొంగతనము మాయలు నీ, కుం గుడిపెం దల్లి యుగ్గు♦గుఱిఁ జము రిడి తే
ర్చెం గొఱవిని విధి లేకు, న్నం గెలుతువె యెదిరి నాక♦నాయకు నసురా!

క॥ రాముని సామాన్యునిఁగా, నేమెలఁకువఁ గంటి వోరి♦హీనమతీ! నీ
కాముహితుని సేవింపఁగఁ, గామహతుని కబ్బునే య♦కామ్యమ కాదే. ౨౩౦

సీ॥ కదలింపఁగాఁ జాల♦వదె కాదె ముక్కంటి, వి ల్లెక్కువెట్టుచో♦విఱిచివైచె
నెన్నక నినుఁ జెఱఁ♦గొన్న హైహయుఁ ద్రుంచి, నట్టి భార్గవుఁ బట్టు♦పట్టి విడిచె
సందిఁట నిడి చతు♦స్సాగరంబుల నిన్ను, ముంచిమెత్తిన వాలి♦మురు వడంచె
మునులపాలిఁటి మిత్తి♦యనఁ జను ఖరదూష, ణాది నంతకు నింటి♦కతిథిఁ జేసె

మఱచితే నీకు మఱచిన♦మఱపురాని, వెన్నియో కల వాతని♦సన్న లింక
సిగ్గు మాలిన నీచెవిఁ♦జేర్చ దైన, జెప్పవలె నన్న నాకేని♦సిగ్గు లేదె. ౨౩౨

తే॥ కాలపాశమ్ము నినుఁ జుట్టె ♦ కాక యేల
సీతఁ దెచ్చితి నినుఁ ద్రుంప ♦ సిద్ధపడిన
మిత్తి యాఁ జుమి యాయమ ♦ మేల్మి యెఱుఁగఁ
జాలవైతి విం కేమిట ♦ మేలు గలదు. ౨౩౩

ఆ॥ ఆమె జనకదుహిత♦యనఘ యయోనిజ, దేవయజనభూతఁ♦దెచ్చితేని
నీకుఁ దక్క ననెడు♦నెఱియున్నె విషపృక్త, మన్న మెట్లు జీర్ణ మగు♦ననంగ.

మ॥ వరము ల్గాంటి నటంచుఁ బొంగెదవు నీ ♦ వ్యామోహమే యందున
న్నరుల న్వానరుల న్గణింపకునికి ♦ న్నాథుండు నిన్ గూల్ప భా
స్కరువంశంబునఁ దోఁచె మీమద మడం ♦ గం జేయఁగాఁ గ్రోఁతు లై
సురలే తెంచిరి కాన వింత నెఱయన్ ♦ శోధించితి న్దుర్మతీ! ౨౩౪

తే॥ కర్మవశమునఁ గాదె యే ♦ గతియుఁ గలుగు
నెవ్వరికి నేని నేతల ♦ నెనయు నేనిఁ
గంటి విందాకఁ బున్నెంపుఁ ♦ గలిమి ఫలముఁ
గానఁబోయెద విఁకఁ బాప ♦ కర్మఫలము. ౨౩౬

ఆ॥ రాముకోపమునను ♦ రామావతంసంబు, సీత తేజమునను ♦ జెలువుదక్క
నీవు గూలు దింక ♦ నీలంక కాలు నీ, బలఁగ మెనయుఁ గాలు ♦ పట్టణంబు. ౨౩౭

క॥ నామాట తప్ప నేర్చు నె, రాముని కింకరుఁడఁ జుమి తి♦ర మ్మగు మిఁక సం
గ్రామమున కతఁడె చాలఁడె, యీముల్లోకములుఁ గెడప ♦ నేర్పఁడఁ జేయన్.

ఆ॥ ముజ్జగమ్ములందు ♦ మొనయు శూరులలోన
నమ్మహాత్ము నెదిరి ♦ యభయుఁ డగుచు
నిలుచువాఁడు లేఁడు ♦ నీ వెఱుంగుదుగాక
చెప్పనేల రాము ♦ శితశరముల. ౨౩౯

ఉ॥ నాలుగువేదము ల్గనిన ♦ నాలుగు మోముల ప్రోఁడ యేని ము
క్కాలువు మాఁడుపీఁడులును ♦ గాల్చినకన్నులదంట యేని ది
క్పాలుర నేలఁజాలి నినుఁ ♦ బట్టిన గా మల యింద్రుఁడేనియున్
బోలరు రామవధ్యుఁ డగు ♦ పోటరిఁ బ్రోవఁగ నెట్టులేనియున్. ౨౪౦

క॥ అని యున్న నిజము పలికినఁ, దన కప్రియ మగుటఁ గనలి ♦ దశవదనుం డ
య్యనఘుని దూషింపుచు జం, పన యాజ్ఞాపించె దనుజ ♦ పాళికిఁ బెలుచన్.

శా॥ అక్కార్యంబున కీ లెఱింగి విదితుం ♦ డై యుంటఁ గర్జంబునన్
నిక్కంబే వచియించె దూత కదియు ♦ న్నేమంబపో యాతనిన్
జక్కాడంగఁ దలంప నొండు ఫలమా ♦ సందర్భమా లేదు తా
నిక్కాలం బిటు లెంచ నేల యని లో ♦ నెంతేనిఁ జింతింపుచున్. ౨౪౨

—♦ హనుమంతుని వధింపఁజూచు రావణునకు విభీషణుఁడు నీతి చెప్పుట. ♦—

తే॥ అసురయనుజన్ముఁ డనఘుండు ♦ నరివిభీష
ణుండు నైన విభీషణుఁ ♦ డొండు దలఁచి
యగ్రజుని నీతిమెయిఁ గాంచి ♦ యతనితోడఁ
బలికె నర్థంబు ధర్మంబు ♦ దలఁగకుండ. ౨౪౩

ఆ॥ అన్న! నీవు నీప్రి ♦ ♦ సన్నభావమ్మున, కలిమి నన్నుఁ జూచి ♦ గారవించి
నాదు పలుకు వినుము ♦ నయ మెఱింగిన నీకుఁ, గోపనిహతిఁ దగదు ♦ కొఱఁతపడఁగ.

ఉ॥ మంచియుఁ జెడ్డయుం దెలుపు ♦ మాన్యులు త్వాదృశు లిట్టి కర్జ మూ
హించియ చేయఁజూచెదరు ♦ హేయతఁ గన్గొని దూతఁ జంపఁగా
నెంచరు న్యాయశాస్త్రమున ♦ నెన్నికఁ గాంచిన తారె యిట్లు వ
ర్తించినఁ దత్పరిశ్రమము ♦ తేఁకువ వ్యర్థము నాఁగఁ బోలదే. ౨౮౭

ఆ॥ రాజధర్మమునకు ♦ రమణీయమగు లోక, వృత్తమునకు నింత ♦ వెగటు పుట్ట
కుండ నెదియుఁ జేయ♦నొప్పఁ గావున దూత, దండ మాచరించి♦తగును బనుప.

క॥ అనిన విభీషణ! యిట్లనఁ, జనునే పాపాత్ములను బో ♦ నఁగదే కెడపన్
దన తెలివు దలఁప కితఁ డే, మనె నెట్టులు నేసె నొక్కఁ ♦ డనఁ దగ దింకన్.

వ॥ అవశ్యముగ నిప్పాపజాతిం గ్రోఁతి వధియించి కాని మాన నని యవిమృష్టం
బుగాఁ బలికిన. ౨౮౮

ఆ॥ హేయ మత్యధర్మ♦మీర్ష్యాప్రియుక్తం బ, నార్యజుష్ట మయిన♦యతని పలుకు
విని విశిష్టతత్త్వ ♦ వేత్త విభీషణుం డనియెఁ దనదు నేర్మి ♦ యనువుపడఁగ.

సీ॥ అన్న! యీతఁడు తన♦యర్థంబునకుఁ గాఁగ, దొడరవచ్చెనె మన♦తోడి యలుక
నొడ్లు పంపఁగ వారి♦యుత్సాహమున భంగి, ననియె నీ దెస తెలిం♦గచట నొడువుఁ
గాక దౌత్యంబున♦కర్మ మింతియ కాదె, యటిముటిఁ జంపెఁబో♦యటిమి పొడువ
నందు మర్యాదవో♦నాడిన పలుకుల, నేరమ్ము లేకుండు♦నెఱియుఁ దోఁప

దట్లు గానఁ గశాభిఘా ♦ తాంగవికృతి
మౌండ్యముద్రాకృతులలోన ♦ మలయు నొక్క
దండ మొనరించి యనుపంగఁ ♦ దగును గాని
వధ్యుఁ జేయు టెవెంటను ♦ వలను పడదు. ౨౯౦

క॥ దూత యయి వచ్చి♦తా నవి, నీతస్థితిఁ బలికి నట్టి ♦ నెఱి గల యఘుసం
పాతమున నితని పతి విని, పాతమ్మున కర్హుఁ జేయు ♦ పని యర్హ్మ మగున్. ౨౯౧

ఉ॥ కోపము నల్ల వైరిపయిఁ ♦ గోవిదవర్య! ప్రవర్తిలంగ నీ
వేపగిదిం బొనర్చినను ♦ నిట్టుల మైన యశంబు గల్గు ని
ట్లీపనికిం దొడంగిన స ♦ మేధితతేజుని నిన్ను దూఱఁగా
నోపరె యొల్లు యుద్ధకృతి ♦ కొయ్యన నాయతి లోప మొందదే. ౨౯౨

క॥ లావున జవమున నిట్టిఁడు, భూవలయమునందు లేమిఁ ♦ బొసఁగదు పోరి
ట్లీవార్త యెఱుఁగఁబోలమిఁ, నావేశం బుడిగి పగతు ♦ రట్టిటు గాఁగన్. ౨౯౩

ఉ॥ ఎల్లజగంబులం గెలువ ♦ నేలఁగ నేర్చితి వేకవీరుఁడు
బల్లిదుఁడుం బులస్త్యవిధి ♦ బాంధవుఁడే యనుచు న్సురాసురు

త్తల్లడిలంగఁ జేసితివి ♦ తత్పరత న్నృపనీతిశాస్త్రవేత్త నా
నల్లసిలంగఁ జాలి తిది ♦ యొప్పని శౌర్యముఁ జాటొనర్పఁగన్. ౨౫౪

ఉ॥ వైరులఁ బిల్వఁ బంచి యని ♦ వార్యబలోద్ధతి నాక్రమించి యు
ర్వ్యారి నడంచి యెల్లెడల ♦ వాలుమగంటిమి పిక్కటిల్ల ని
ల్గేరికిఁ దేటిచూడ నగు ♦ నింకిట నాఁ దగు కీర్తిఁ గొన్న మే
లీరభసంబుఁ గన్న గణి ♦ యింపవు త్వద్విజితారివర్గముల్. ౨౫౫

క॥ యుద్ధప్రియుఁడవు నీ వి, య్యాద్ధత్యము రిపులదెసకె♦యా ననెదు మదిన్
బద్ధుఁ డగు దూత శాస్త్రని, బద్ధము దండమునఁ గూర్చి♦పనుపుము నేర్మిన్.

ఆ॥ అనుచు మహితధిషణుఁ♦డవ్విభీషణుఁ డన్న, మది గరంగు తెఱఁగు♦మలయ నన్న
యన్నడులకు మెచ్చి♦యాతఁ డాతనితోడఁ, బలికె నివ్విధమున♦భద్రమూర్తి!

క॥ మే లెఱిఁగించితి దేశము, కాలము సమకూర్చి దూత♦గర్హితుఁ డైనం
బోలదు వధింపఁ గావునఁ, గీ లరసి యొకొండు శాస్తి♦గీలింపనగున్. ౨౫౮

వ॥ అని కొండొకతడవు విచారించి. ౨౫౯

ఉ॥ మేకొనుచుండుఁ గోతులకు ♦ మే లగు ప్రీతి విభూతి నెట్టనం
దోఁకలయందె కాన నతి ♦ ధూర్తుఁ డనం జను వీని వాలమున్
వీఁక వొసంగఁ గాల్చి పుర ♦ వీధుల నెల్లెడఁ ద్రిప్పి తోలుఁడీ
యాకృతి నెంచి యెన్నఁటికి ♦ నీదృశు లిట్టు లొనర్పకుండఁగన్. ౨౬౦

—♦ హనుమంతుని తోఁకను రావణాజ్ఞచే రక్కసులు కాల్చుట. ♦—

ఆ॥ అనుచు నాన సేయ♦నాహనూమంతుఁడు, దోఁకపీటపైని♦దొరను బోలఁ
గూరుచుండి తలఁపు♦గూర్చి నెమ్మె నింత, పనిచెఁ దనదు పనుపు♦పేర్మి వెంయు.

తే॥ కోపకర్శిత మగుచు ర ♦ క్షోగణంబు
వెరసి యాతనితోఁకఁ బె ♦ న్వేఁకఁ జుట్టె
నప్పురమ్మున జీర్ణాంబ ♦ రౌఘ మరసి
తెచ్చి చలమున నపుడు స ♦ తీవతంస! ౨౬౧

॥ వారలు చీరలు చుట్టఁగ, వారక వాయుజుని మేలి♦వాల మెదిగె న
వ్వారిగ వని శుష్కము లవు, దారువులం బెరుఁగు చిచ్చు♦తరబడి నబలా.

॥ వా రటు లింటింటం గల, చీరలు నారలును విసువ♦కెంద కరయు న
వ్వారి తెఱఁ గెఱిఁగి కర్జము, తీరున కొడఁబడియె వాఁడు♦దివిజస్తుత్యా! ౨౬౪

తే॥ ఆప్లవన మొనరించి ర ♦ య్యసురసుభటు
లాప్లవంగోత్తముని వాల ♦ మపుడు స్నేహ
పాతమునఁ బాతకుల కెట్లు ♦ పాలుపడెనొ
యదియు నతివేల మగు నట్టు ♦ లబ్జవదన! ౨౬౫

క॥ చిచ్చు దరికొలిపి రది యొక, ముచ్చట యని పొలసుఁదిండి♦ముచ్చులు దానం
గ్రిచ్చరయర తమకొలమునఁ, జిచ్చిడ నటు లేగుదెంచు♦సిలుగున నగజా!

ఆ॥ రోషకీల లట్లు♦రోమధిజ్వాలలు, మిన్నుఁ బ్రాఁక బాల♦మిహిరముఖుఁడు
పేలఁగింజ లనఁగఁ♦బేర్చిలించెఁ గొందఱఁ, దోఁక తాఁకు సూపి♦తోయజాక్షి!

తే॥ వీటిజన మప్పు డాబాల ♦ వృద్ధముగను
వానిఁ గనుఁగొనఁ దరలి ర ♦ వ్వారిగాఁగఁ
దోఁకచిచ్చే కదా వాఁడు ♦ తొడరు నింకఁ
జోద్యమగునోటు తమ కట్లు ♦ చూడ బాల. ౨౬౮

మ॥ తనలోన న్జపియించుచుండె నతఁ డో ♦ దాక్షాయణీ! వీరు నా
కెనయే బద్ధుఁడపోలె నుంటి నిఁక దా ♦ రి వ్వీటఁ ద్రిప్పంగ నా
దనుక న్దొన్కకయుందు రేఁ గనిన య ♦ త్తావు ల్పరీక్షించి కాం
చి నయం బెంచి పరాక్రమించెద విభు ♦ శ్రీ మీఱ నంచు న్రిహిన్. ౨౬౯

ఆ॥ మొఱకు లతనివీఁక♦మొనయంగ నేరరు, గూఢవృత్తివాఁడు♦కోవిదుండు
సత్త్వయుతుఁడుఁగాన♦సంభ్రంబుఁబెరవాఁక, లట్లు సొచ్చి యడఁగు♦నరుల నెఱులు.

ఉ॥ ఆకపికుంజరమ్ము నటు ♦ లాలము సేయుచుఁ గొంచు రక్క సు
ల్మూఁకలు గట్టి వాద్యములు ♦ మోఁయ ఘనార్భటులుం జెలంగఁ బె
న్వీఁక నదల్చుచున్ దొరకె ♦ నెట్టన మున్ చ్చితఁ డంచుఁ దెల్పుచున్
నాకవిరోధిపట్టణము ♦ న న్నలువీధులఁ ద్రిప్పుచుండఁగన్. ౨౭౧

ఉ॥ సందులు గొందులుం బెరసి ♦ చాటగు చోటులు బాహిరంబులున్
గ్రిందుగ నందు నం దొనరు ♦ కందువలు న్పరికించి జంత్రముల్
ముందుగ యుద్ధసాధనస ♦ మూహములుం గల తావులు న్రమా
సుందరమందిరౌఘములుఁ ♦ జూచె నతం డమృతప్రణాళికా. ౨౭౨

క॥ పాతాళమందిరము లు, ద్ద్యోతవిమానములు సత్స ♦ దోగృహములు ర
థ్యాతతశృంగాటకములు, లోఁతుం బాఁతుఁ గని యెడఁద ♦ లో నతఁ డునిచెన్.

ఆ॥ ఎఱుక లేని మొఱకు♦లిల్లిల్లుఁ ద్రిప్పఁగా, నింటివారు నగుచు♦నెదురుకొనఁగ
నెఱిఁగి యెఱిఁగి తిరిగె♦నిద్ధతేజుఁ డతండు, దీప్తవాలుఁ డగుచు♦దివిజవంద్య!.

శా॥ లాంగూలాగ్రము కీల లల్లెగువ గో ♦ లాంగూలు వార్త న్వెరా
పాంగు ల్డోల్లిటికాఁపురక్కసలు వి ♦ ద్యామూర్తి కద్దేవికిన్
బొంగారం జని తెల్పి రిట్లు వినుమో ♦ భూపుత్రి! మీకోర్కితోఁ
కం గాల్పించి పురమ్ము నద్దెసల వీఁ ♦ కం ద్రిప్పువా రం చొగిన్. ౨౪౬

క॥ అవ్వార్త వినినయంతన, యవ్వసుధాసుత సుతార్తి ♦ కడలు జననియై
నెవ్వగమై నెమ్మనమున, నవ్వాయుసఖుం దలంచి ♦ యనె నిట్లనుచున్. ౨౪౭

—♦ సీత యగ్నిదేవునిఁ బ్రార్థించుట ♦—

సీ॥ ఔదుగా దైవతం♦బగు నీవు హవ్యవా, హన! యుపాస్యుఁడవుమా♦కనవరతము
మన్నాథు దూత యి♦మ్మహితుండు నీప్రియ, హితునకు సుతుఁడు నా♦యెడరు వాప
నేతెంచి చిక్కె ని♦ట్లీరక్కసులచేత, నింత యెఱింగి నీ♦వితనితోఁకఁ
గాల్పకుండుము నన్నుఁ♦గా వీనిఁ గాపాడ, నెంచుము మత్తపో♦హేతువృత్త
మెలయ నిరతముఁ బతిఁ గొల్తు♦నేని సాధ్వి, నేని నే నేకపత్నిన♦యేని రాముఁ
డేకపత్నీవ్రతస్థుడయేని♦నింకఁ, జందనద్రవశిశిరతా♦శ్రియుఁడ వగుచు. ౨౪౮

తే॥ నెనరుగలవాఁడు ధీమంతుఁ♦డినకులుండు, కులము శీలము గల దిది♦గూర్చుఁ దనక
టంచు ననుఁ బ్రోవ నెంచు న♦త్లైన వీని, పాలిఁటికి నీవు చల్లని♦వాఁడ వగుము.

తే॥ ఎల్లవానరవీరులు ♦ నినసుతుండు,
బలసి కొలువంగఁ బరిపంథి ♦ పంక్తి నడఁప
రాముఁ డరుదెంచుకృతి యెల్ల ♦ రకును హితమ
యేనిఁ జంద్రుఁడ వగుము నీ ♦ వితని కిపుడు. ౨౪౯

క॥ అని యాయమ ప్రార్థింపఁగ, ననలుఁడు తోడనె ప్రదక్షి ♦ ణార్చులతో న
వ్వనితామణి కెఱుకపడన్, హనుమ జయము చాటి చెప్పె♦ నన వెలుగొందెన్.

తే॥ ఆజ్వలను జ్వాలలం గొంచు ♦ నరుగుదెంచి
పవనుఁ డాసాధ్వి కెఱిఁగించె ♦ భద్ర మనుచు
సాంద్రతరచంద్రచంద్రికా ♦ సంప్రసాద
కలితమలయోత్థనిజశైత్య ♦ కలన లోలయ. ౨౫౧

క॥ తనపుచ్ఛమునందున య, గ్ని నవోల్లాసమున దెసల♦ నెఱయఁ గను విధం
బున కుత్సహించి హనుమయు, మనమున నిట్లనుచుఁ దలఁచె♦మహిలామణిరో.

ఆ॥ ఇటు ప్రదీప్తుఁ డయ్యు♦నేలొకో దహనుండు, గాల్పకున్నవాఁడు♦కరుణ వెలయఁ
దండ్రి మైత్రి యెడఁదఁ♦దలఁచెనో కాకున్న, నివము లోలయఁ జేయు♦శేలగలుగు.

మ॥ అనలుం డిమ్మెయిఁ జల్లనయ్యె ననిలుం ♦ డానాఁటికి న్నేఁటికిన్
దనసాహాయ్యం బెఱిఁగించుచుండె నడిసం ♦ ద్రిమ్మందు శైలేంద్రి పు
త్రి నెదుర్కొ లటు లొప్పె నింత దలఁపం ♦ దోఁచెన్ జగత్త్రాత రా
ముని మాహాత్మ్యము సీత సచ్చరితము ♦ న్మన్నాడి న న్నోమిటల్. ౨౮౫

మ॥ అని యెక్కించుక సేపు దైవబల మ ♦ ట్లవ్వాఁడు చర్చించి యిం
క నొనర్పందగు కర్జ మియ్యదియ యాఁ ♦ గా యంచు యోజించి తె
ప్పున సైకం బయి యెల్లబంధనములం ♦ బోఁద్రోఁచి శైలాకృతిన్
గని గజ్జల్లి పురమ్ము గోపురముపైఁ ♦ గాలూది యామోది యై. ౨౮౬

ఆ॥ అల్ల పరిఘ మపుడె♦యందిపుచ్చుకొని ము, న్నాడి తన్ను వేఁపఁ♦గూడియున్న
వారి మఱియుఁ దొడరు♦వారి నంతకు మహా, నసముఁ జేర్చి యున్న♦నస్తఁ బేర్చి.

శా॥ లంకం జూచుచుఁ జండవిక్రముఁడు వా♦లం బున్నతం బై నభో
లంకారం బగుచుండ నద్దెసల జ్వా ♦ ల ల్గ్రిమ్మ లాఁతు ల్మహా
శంకం ద స్గని చిత్రిభానుయుగ మో ♦ జం బొల్చె నొక్కండుగా
నిం కేమంచుఁ జలింప నత్తఱి నతం ♦ డిట్లంచు నెంచె న్మదిన్. ౨౮౭

ఆ॥ మేలి రక్కసులను ♦ మెదిపి బలైకదే
శమ్ము చదిపి యుపవ ♦ నమ్ము మున్నె
పాడుసేసి పురము ♦ పట్టు లమ్మెయి సేయు
కూర కరుగు టరయ ♦ నుచిత మగునె. ౨౮౮

శా॥ మేలా దుర్గవినాశనమ్మున కృతి ♦ న్మెకొంచు నాపాలఁ దా
నై లాలించెడు హవ్యవాహనుఁడు బా ♦ గయ్యె న్బలీ యంచుఁ దా
లోలో నెంచఁగఁ బాలు చక్కఁజలుఁ బం ♦ డ్లుం బెట్టి న ట్లమ్మహా
శాల ల్బ్యాపి పొనర్తు నవ్విభునకున్ ♦ సంతర్పణం బొప్పఁగన్. ౨౮౯

క॥ ఇది సుకరము ఫల మధికం, బిది యిమ్మెయిఁగాక యెంట♦నెనఁగదు కృతి య
ట్లొదవిన పరిశ్రమమ్మున, కద నెఱిఁగి చికిత్స సేయు♦నొ లె మ్మనుచున్. ౨౯౦

—♦ హనుమ లంకాదహన మొనరించుట. ♦—

ఆ॥ మెఱసె నంబరమున♦మిహిరకులోత్తంసు, తేజ మనఁగఁ గపి ప్ర♦దీప్తవాలుఁ
డగుచు నల్లకాల♦మందుఁ గడ ల్గ్రిమ్మి, యడరు వైద్యుతాగ్ని ♦ యట్లుపోలె.

క॥ ఇమ్ములు గనికని దొరఁకొని, యమ్మహితుఁడు దొలుత♦వేల్చు నాహుతిగ మహా
సమ్మతిఁ బ్రహస్తు శస్తగృ, హ మ్మర్పణసేసె వహ్ని♦కాతఁడు పొంగన్. ౨౯౧

వ॥ వెండియు నమ్మహోద్యముండు మహాపార్శ్వుని సదనంబునను వజ్రదంష్ట్రుని మందిరంబునను శుకసారణుల మహాశరణంబులను మేఘనాదుని యసమానవిమానంబునను జంబుమాలి సుమాలిగృహమాలికలను రశ్మికేతుని నికేతనంబునను సూర్యశత్రుని నిశాంతమ్మునను హ్రస్వకర్ణుని వేశ్మంబునను దంష్ట్రుని ధిష్ణ్యంబునను రోమశుని సుధామధామంబునను యుద్ధోన్మత్తమత్తుల యుదవసితరత్నంబులను ధ్వజగ్రీవుని గేహంబునను విద్యుజ్జిహ్వుని స్థానవిశేషంబునను ఘోరుని యగారంబునను హస్తిముఖుని వాస్తుముఖంబునను కరాళపిశాచుల వాసకూటంబులను శోణితాక్షమకరాక్షుల యసదృశనిలయంబులను గుంభకర్ణుని యుదీర్ణనివేశగుంభనంబునను గుంభనికుంభుల విశాలశాలలను నరాంతకుని సద్మాంతరంబునను నతికాయుని నికాయ్యంబునను యజ్ఞశత్రుబ్రహ్మశత్రుల చిత్రావసథంబులను బురగోపురద్వారముఖ్యప్రదేశంబులను నగ్ని దరికొల్పి ప్రజ్వలితంబు గావించి మహాభీషణుం డై యెవ్వారిని సరకుగొనక తిరుగుచు నవ్విభీషణుని సంస్థానప్రకాండంబున కెట్టి కడగండ్లను బుట్టనీక పాడిమెయింగాపాడి చిరకాలార్జితసర్వసమృద్ధులతోడ లంకాపురమ్ము గాఁపురమ్మున నున్న మాడువుల పైని సూడు గొనినట్టు లవ్వాని నెల్ల దహనజ్వాలాధీనంబులుగా నొనరించి సమంచితవీర్యుం డగు నవ్వానరవర్యుండు మితిమీఱిన లక్ష్మీవికాసంబునం బోలుపారి యారితేఱిన తేజోవిశేషంబున దురాసదుండగుచు మేరుమందరసంకాశంబును వివిధచిత్రమణీరత్నవిభూషితంబును నిఖిలమంగళార్థసంశోభితంబును నగు నారాక్షసేంద్రుని మహాభవనమ్ము వనమ్ము నలుదెసల రెమ్మి ముమ్మరించు కార్చిచ్చు పోలికం గ్రమ్మి యేలికయది యనక తేలికసేసి పావకునిపాలం బడవైచి యుగాంతపర్జన్యుని వడువున గర్జిల్లుచుండె నంత. ౨౯౩

ఆ॥ గుములు గట్టి గట్టి ♦ కూళలు గొంద ఱ
య్యగ్ని నెదురఁబోక ♦ హనుమ వీఁక
కెగచి యస్త్రవృష్టి ♦ నెడలింపఁ జూచి వి
ధ్వస్తులైరి పరిఘ ♦ దండహతిని. ౨౯౪

క॥ శ్వసనుని యోగమ్మున నటు, గసిమసఁగిన జ్వలనుఁ డెగచి♦కాల్పఁ దొడఁగె న
ల్దెసలఁ గలతావు లరసి ర, భసమున నవ్వాఁడు తన్నుఁ♦బట్టి నిగుడ్పన్. ౨౯౫

తే॥ పూఁచియున్నట్టి మోదుగు ♦ ల్బూరుగులును
గుంకుమపుఁబూలగుములు నై ♦ లంకమీఁద
మెఱసె నిర్ధూమధాముఁ డై ♦ మేలుకొనిన
యామహానలు జ్వాల లు ♦ ద్దామ లగజ. ౨౯౬

సీ॥ కరఁగి తోరంగె సిం♦గారంపు మేలిబం, గారుమేడల శిల్ప♦కారి కళలు
చూర్ణమై రాలెమె♦చ్చులగొప్పసుప్పాణి, ముత్తియమ్ములజాల♦ముల మురువుఁ
మసిబొగ్గు లయ్యె ని♦ర్మలమహామాణిక్య, గుంభశుంభత్కాంతి♦జృంభణములు
బూదియై పాలివోయెఁ♦బోలుపారు వెలతీరు, మీఱు మేల్కట్టుల♦మించు తళ్కు
లమరెఁ దొల్లింటిరంగున ♦ యందయుండఁ
గాలి పవడంపుదూలము ♦ ల్కంబములును
నప్పురి సమృద్ధు లన్నియు ♦ నడరి తొడరి
యమ్మహాభూతము హరింప ♦ నలముకొనఁగ. ౨౯౭

తే॥ మున్నె తృణములు కాష్ఠము ♦ లెన్నియైనఁ
దనివి నొందనివాఁ డగ్ని ♦ తనియఁ డయ్యె
నప్పురం బప్పళించి యొ ♦ య్యనఁ దొఱంగు
నసురశవరాసుల నతృప్త ♦ యయ్యె ధరయు. ౨౯౮

ఆ॥ పుణ్యసంక్షయమునఁ♦బోలుపేదు సిద్ధుల, యట్లు రక్కసుల మ♦హావిమాన
పంక్తు లోలిఁ గాలి♦పడె ధరాతలమున, నంబరముననుండి♦యబ్జవదన. ౨౯౯

ఆ॥ గాలివిందు గ్రిమ్మఁ♦గా నిల్వఁజాలక, జాలమార్గకముల♦జాఱువారు
మేడలెక్కి యొండు♦మెలఁకువ దుముకంగఁ, జూచువారు నైర♦సురులు సాధ్వి!

—♦ లంకావాసు లయిన రాక్షసులు తల్లడిలుట. ♦—

సీ॥ కపిరూపు గొనివచ్చెఁ♦గాని యగ్గియ యీతఁ, డనుచు నిట్టలముగ♦నఱచువారు
తోఁకచిచ్చఁట వీని♦తోఁకఁ జిచ్చిడి వీడు, టిది యేమి వెరవంచు♦నేడ్చువారు
సీతఁ దెచ్చిననాఁడె♦చెడె లంక గాకేమి, శోకింప ఫల మంచు♦సొగియువారు
ఖరదూషణాదుల♦గడెలో నగల్చునా, తని దూత కిది యెంత♦యనెడువారు
నగుచుఁ జంటిబిడ్డ ♦ లక్కున గదియంగఁ
జిక్కఁ బట్టికొనుచుఁ ♦ జెలువ మెడల
నెఱులు జీరుకాడ ♦ నేలఁ గూలిరి కాక
కోర్వ కసురయువతు ♦ లువిద! వింటె. 30౧

౩॥ మొగిళులట్లు కురులు♦మొనసి వ్రేలఁగ నభ్ర, తలమునందునుండి♦తరళ లగుచు
మెఱుఁగుఁదీఁగెలట్లు♦మేదినిపై వార, లట్లు వ్రాలి నబ్రి♦మయ్యె బాల! 30౨

॥ ఒకని తప్పు మనికి♦నున్నవారలఁ గాల్చు, ననిన నుసుఱుఁగొనఁగ♦నందు నున్న
యంద ఱట్టివారె♦యందరే యగచాట్లు, నాథుతోడఁగూడ♦నళిననేత్ర! 303

క॥ అటునిటుఁ బరువు లిడుచుఁ జ, క్కటిఁ గపిఁ గని యులికిపడుచుఁ♦గాఁబెడునగర
చ్చటులులు గావంజాలక, యటుకులు దిను కుట్టుగంటు♦లన నై రగజా. ౩౦౪

క॥ త్రిపురాసురుల న్వేల్చిన, యపు డమ్మేయి నాదువార్త♦యనఁ దగె నిపు డీ
నిపుణుఁ డఖిలజుఁడు దశముఖు, ని పురిం గడతేర్చ కడఁక♦నెగడఁ బురంధ్రీ!

ఉ॥ పర్వతమందు ధూమమునఁ ♦ బట్టిన పక్షత యెట్లు లుండెనో
సర్వముఁ దాన నై పవను ♦ సంగడికాఁడు పురంబుఁ గాల్చ న
ప్పర్వమునందు రక్కసుల ♦ బాష్పతతు ల్గనవయ్యె జ్వాలల
న్నిర్వపయత్వ మొందెఁ బొగ ♦ నేఁ డిదె చోద్యము నీలకుంతలా! ౩౦౫

శా॥ చూడామండల మెత్తి నద్దెసలు సం ♦ శోధించుచు న్రాత్రి నా
నాఁ డాహాయుసఖుండు కౌ్రతి యజమా ♦ నత్వంబు గైకొన్న యా
జాడ న్వేల్చిన తత్పుకేంధనపలా ♦ శక్రవ్యహవ్యాజ్యముల్
గూడ న్వీడఁగరాని యుల్లసనముం♦గాంచు న్మహోల్లాసినీ! ౩౦౬

క॥ ము న్నెగసిన పొగ క్రమ్మిన, నన్నీలోత్పలవనమ్ము♦లయ్యె న్ఘనముల్
వెన్నారసిన కీలలచే, సన్నుతసాంధ్యారుణప్రి♦చారము లయ్యెన్. ౩౦౭

క॥ కాలోపహతయకా కట్టు, లాలంకానగరి కూలు♦నది యటె యనల
జ్వాలావృత నై తనగతిఁ, బాలించెడువాఁడు లేని♦పద్ధతి దోఁపన్. ౩౦౮

క॥ వేయుంగోటులు సూర్యుల, చాయం దాయ యయి లంకఁ♦జమరె ననలుఁడ
వ్వాయుజుని పేర వజ్రి, స్ఫాయద్ధ్వానము లజాండ♦భాండ మగల్పన్. ౩౦౯

సీ॥ త్రిభువనాధీశుండు♦త్రిదశేంద్రుఁ డిమ్మెయి, సాధింపవచ్చునో♦జతన మరసి
దిక్పాలు రెల్లరుఁ♦దెలివిమైఁ దమ వైర, నిర్యాతన మొనర్ప♦నేర్చి రేమొ
సర్వలోకవిధాత♦చతురాననుఁడు తాత, తనకోప మనిచెనో♦తప్పు లెంచి
కాలపరీపాక♦గతిఁ గాంచి తనకుఁ దాఁ, గాలుండె యీరీతిఁ♦గదిసెనొక్కొ

యజిత మవిచింత్య మవ్యక్త ♦ మజ మనంత
మద్వితీయంబు నగు నైష్ణ ♦ వాఖ్యధామ
మొనసెనో మాయఁగొని లంక ♦ నెడలఁజేయ
ననిరి నైరృతముఖ్యు లో ♦ యనఘమూర్తి! ౩౧౦

శా॥ అయ్యో నాథ! కుమార! తండ్రీ యనుచు ♦ న్హాహారవంబు ల్పురిన్
వెయ్యార్లై వినవయ్యె నెల్లెడల నే ♦ వెంటం జనంగాంచిరో

దయ్యా లందఱు నుక్కడక్కి కనరో ♦ ధాత్రీజ ము న్నార్వఁగాఁ
గుయ్యాలింపని దోష మిట్టిఁ డనుచుం ♦ గూళ ల్కశశ్యాలిసీ! 30౨

మ॥ హతవీరాళి నిరస్తసద్భట విద ♦ గ్ధానేకవస్యందనా
శ్వతతాస్త్రాయుధభర్మహర్మ్యచయ న ♦ ష్టప్రాజ్యయాత్రౌఘ ని
రతనానారసమృద్ధి యయ్యెఁ బురి యాఁ ♦ గాఢుండు నె ట్లారుమా
పతిసుంతీంద్రుని మంత్రిజృంభణము దై ♦ వం బొక్కఁ డై క్రాలఁగన్. 303

॥ ఆ సందరించిరి వేల్పు లాహనుమ కా ♦ ర్యాసక్తిఁ దా రెంచి యు
ద్యనందీశ్వరుఁ డన్నమాట కిటుగా ♦ నా నంచుఁ జింతించె లో
లోనన్ దానవనాథుఁ డట్లు కృతి యై ♦ లోకేశ శ్రీరామునిన్
ధ్యానించె న్గపిసత్తముండు మతి వి ♦ ద్యాయోగచింతామణీ! 30౪

— ♦ బ్రహ్మాదిదేవతలు హనుమంతుని శక్తిని మెచ్చుట. ♦ —

ఆ॥ చిత్రి మా త్రికూట♦శృంగాగ్రతలమున, నున్నవాని వాని♦నుత్తమాధి
కారిఁ గాంచి దేవ♦గణములు బ్రహ్మర్షు, లెలమి నిట్టు లెంచి♦ రేణనయన! 30౫

ఉ॥ ఎక్కటి లంకఁ జొచ్చి నిశి ♦ నేమఱపా టని లేక నద్రిస
ల్చక్కఁగఁ గాంచి సీతఁ గని ♦ సాంత్వనము ల్పచరించి తేర్చి పే
రుక్కున నవ్వనిం బెఱికి ♦ యోధులు నాథు లనాథు లై చన
న్నొక్కను శత్రుపాళి మిటు ♦ నేలకుఁ జెచ్చెఁ బ్లవంగమాత్రుఁడే. 30౬

క॥ ఈజనము పున్నె మిట్టిఁడు, నాఁజన దీయోజఁ బదియు♦నాలుగు జగముల్
పో జీవ మొందె నిమ్మెయి, తేజు దురానదము కాక♦తిరుగుడుపడునే. 30౭

క॥ ఈతఁడు పెనుపొందెడు నిఁక, నాతత మగు భూతి యాయు♦వసమును గన నై
మాతలఁపు లలరఁజేసెను, చేఁత కితని జనని వాయు♦సిద్ధిం గాంచెన్. 30౮

క॥ అని కీర్తించిరి పరు లా, తనిఁ గని భయ మంది రంతఁ♦దపనద్యోతుం
డనితరసామాన్యం బగు ప్పని దీర్చెను దోఁక ముంచెఁ♦బాథోనిధిలోన్. 30౯

క॥ కృతకృత్యుఁ డైన యాతని, కతివిహ్వలభావ మప్పు♦డాసన్నం బై
మతిఁ జంచలగాఁ జేసెను, వితత కదా కార్యగతి వి♦వేకనిధానా. 3౨౦

—♦ హనుమంతుని విచారము. ♦—

ఆ॥ మండుచున్న పురము ♦ మలఁగి యనాథు లై
తిరుగుచున్న పరుల ♦ తీరు గాంచి
కాలకున్నచోటు ♦ కనరామి కలికి తాఁ
దలఁచె వాఁడు మదిని ♦ దత్త్వవేత్త్రి! 3౨౧

క॥ కార్యాకార్యము లరయక, నార్యుండై యార్యమార్గ♦మందితి నని దు
ష్కార్యమునఁ గాలునట్టి క, దర్యుఁడు తా నుత్తమప్ర♦థం గనఁగలఁడే. ౩౨౨

సీ॥ ఇద్ధ మగ్నినిఁ బోలె♦నేవాఁడు క్రోధమ్ము, బుద్ధితో యోక్షితిఁ♦బోలియుఁ జేయుఁ
గోపనిర్మోకంబు♦రూపింపఁ గని యెవ్వఁ, డురగరాజం బట్టు♦లురక విడుచు
నెవఁ డమర్షమునకీ♦డెఱఁగి తా గరళాన్న, మని విసర్జించు మే♦లెనయఁ గోరి
యెవ్వాఁడు విషవృక్ష♦మిది యంచు రోషమ్ము, నిర్మూల మొనరింప♦నేర్చుచుండు
వాఁడె ధన్యుఁ డట్టి♦వాఁడె మహాత్ముండు, వాఁడె యోగివరుఁడు♦వాఁడె తపసి
వాఁడె పురుషుఁ డనఁగ♦వానిఁ జేరదు భవ, బంధ మతఁడె కాంచుఁ♦బరమపదము.

క॥ క్రుద్ధుఁ డొరుల నిందింపఁడె, క్రుద్ధుఁడు పాపముల కెల్ల ♦ గుఱి యగుఁ గాదే
క్రుద్ధుఁడు గురువులఁ జంపఁడె, క్రుద్ధునకు నకార్య మున్నె ♦ కుంభినిలోనన్.

ఆ॥ పాపజాతి నేను ♦ పరమమూర్ఖుండ న, త్రపుఁడ నిర్దయుండఁ ♦ గృపణవృత్తి
నేమిసేసినాఁడ ♦ నీలంకఁ గాల్చి న, న్నాల్పరాదె యగ్ని ♦ గడియలోన. ౩౨౫

క॥ స్వామిద్రోహ మొనర్చిన, నా మే నతఁ డేర్పకుంట ♦ నాయముకాదే
నేమ మెడలి కాకాదులు, నే మని తుండములు సాచు ♦ నీమెయి పొలకున్.

తే॥ దేనికై యట్లు చేడ్పడి♦తెఱఁగు గంటి, నదియు చేచేతఁ బాడుసే♦యంగనైతి
మేలికర్జమ్మున మెలంగ♦మెయికొనంగ, గ్రోఁతిజాతికి చిత్తమ్ము♦కుదురుపడునె.

ఉ॥ ముందర వెన్క గన్గొనక ♦ మున్కొన నైపొరిగింటిచిచ్చు నా
కిందఱు చేటు గోరి దహి ♦ యించితి నివ్వఁరమెల్ల సంబరం
బందితి భూతనూజ గతి ♦ యారయ నైతి నిఁకే మనంగ నా
నిం దొక కీడు మూఁడిన మ ♦ హిం దలయెత్తి మనంగఁ గల్గునే. ౩౨౮

ఆ॥ తివిరి నాపొనర్చు ♦ దిమ్మరితనమున, దిటవుపడిన యగ్ని ♦ దెసలు గ్రమ్మి
తా దహించుచుండెఁ ♦ దావులు వీడక, సీత కేమి గొడవ ♦ సేసెనొక్కొ.

క॥ ఇంచుక మే లెంచితి న, భ్యంచిత మగు కృత్య మెల్ల ♦ నడపొడ సెడఁ గా
వించితి నిటు గ్రోఁతికిఁ దగు, నంచుఁ బరులు నవ్వఁగాఁ జ్యా ♦ తార్థుడనఁగుచున్.

ఆ॥ దేవి రక్షణంబు ♦ భావింపఁబోని నా, చేతఁ బుణ్యశీల ♦ చిచ్చుపాలఁ
బడియె నమ్మహీజ ♦ పాపమ్ముపాలి కే, నైతిఁ జింతసేయ ♦ నగునె ఫలము,

క॥ కావునఁ బ్రాణత్యాగం, బే వెరవునఁ గలదొ దేహ ♦ మీయగ్నిఁ బడం
గా వైతునో తోయధిఁ బడి, జీవనసత్త్వములపాలు ♦ సేయఁ దలఁతునో. ౩౩౨

ఆ॥ ఇంక నేనుఁ జూతు ♦ నే హరీశ్వరు మోము, నాథు పాదసేవ ♦ నంబుగలదె
పాడు రాజసమునఁ♦బడి యోపియును దేవిఁ, గూల్చి చేవిదిర్చు ♦ కొనుచుఁ జేరి.

ఉ॥ చెల్లరె యిట్టివార్త విని ♦ చేటునఁ గుందుచు రామలక్ష్మణుల్
చెల్లినయంతఁ దా మడఁగు ♦ సిద్ధము భానుజుఁ డట్లు సత్కపుల్
దెల్లుదు రాయయోధ్యకడ ♦ తేఱదె బంధులు భ్రాతృవత్సలం
బల్లయుగంబు దల్లులును ♦ హాయని వ్రాలి నిమేషమాత్రలోన్ ౩౩౮

ఆ॥ ఇట్లు పుణ్యశీల ♦ మీరాజవంశమ్ము, గూల ధర్మ మేదఁ♦గుజను లగుచు
మానవులు చరింప ♦ మంచివా రడలుదు, రింత పాప మెనసి ♦ యే నశింతు.

ఆ॥ కూలె నిట్టిసేతఁ ♦ గూడిన కర్జమ్మె, ధర్మ మర్థ మొకటఁ ♦ దలఁగఁద్రోచి
నాయదృష్ట మెగిచి♦ననుఁ గాల్ప నొండెద్ది, సేయువాఁడ నెందుఁ ♦ జేరువాఁడ.

క॥ అని చింతిల్లుచుఁ దాప, మ్మునఁ బొరలెడు నతని కొదవె ♦ మునుపటిచంద
మ్మున మంచి నిమిత్తమ్ములు, విను మని మే లెఱుకసేయు ♦ విధమున నవలా!.

క॥ ఆబుద్ధిబృహస్పతి మే, లౌ బోధముఁ గాంచి యిట్టు ♦ లాలోచించెన్
వే బాధ లెల్లఁ దీఱఁగ, శ్రీబహుళవిలాస మగుచుఁ♦జిత్తము దనరన్, ౩౩౯

సీ॥ అగ్ని యగ్ని దహించు♦ననరాదు కల్యాణి, తేజ మ్మొడియఁజాలు♦దెసల నెల్ల
నన్నుతాంగి స్పృశింప♦సాహసించునె వహ్ని, ధర్మదేవత రాము♦దయిత సాధ్వి
భరతాదులకుఁ దల్లి♦పరికింప నేరాజ్ఞిఁ, దేటీచూడఁగ లేరు♦దివిజు లైన
నాయమ్మ నశియింప♦దమ్మహాత్ముల యను, భావమ్ము లన కాదె♦పరిఢవిల్లఁ
గంటిఁ జిచ్చు తోఁకఁ♦గాల్పకుండుట గిరి, రాజసుతుఁడు సింధు♦రాజు చెలిమిఁ
గోరి యెఱుకసేయఁ♦గొనకొంట రక్కసు, లనమయుటయు నిదర్శ♦నముల కాదె.

క॥ తనసత్యమహిమఁ బతిదెస, ననన్యభక్తి యయి యుంట ♦ నాయమ నుడిచే
ననలునిఁ గాల్పం గల దని, యనఁబోలదె సంశయింప ♦ నగునే యింకన్. ౩౪౦

క॥ అని దేవి మహిమ నెమ్మది, ననుమఁడు భావించుచుండ ♦ నంబర వీథిం
జను చారణు లత్తఱి నను, కొను పలుకులు వినఁగనయ్యెఁ ♦ గువలయనయనా.

ఆ॥ తోఁకవాఁ డొనర్చె♦దుష్కర మ్మగు కర్మ, మింత సేయ జగతి♦నెవ్వఁ డోపు
నితఁడె సుకృతి ధీరుఁ♦డీవీరు నెఱి నేము, బ్రిదుకఁగంటి మరుల♦బలిమి తలఁగ.

ఉ॥ పట్టొకయింత లే దనుచు ♦ బాలురు వృద్ధులు మొత్తవెట్టఁగా
సాట్టవిమానతోరణచ ♦ యంబుగ నిప్పర మెల్ల వేల్చు నా

గొట్టున సీత కేనిఁ దన ♦ కు న్మతియేనియు నెట్టిమోసమున్
బుట్టఁగనీఁడు విస్మయము ♦ పో తలపోయఁగ వీని చెయ్దముల్. ౩౮౩

క॥ అని నొడువువారి నుడువులు, మన మలరఁగఁ జేయ దృష్ట ♦ మహిమోదితశో
భనలక్షణముల జానకి, మనియుండు నెఱింగి లోక ♦ మాన్యుఁడు ప్రీతిన్.

ఉ॥ కన్నులు చల్లగా జననిఁ ♦ గన్గొని కష్టము లెల్లఁ దీఱఁగా
సన్నుతిసేసి మ్రొక్కి జన ♦ సన్నుత పీఠ్కాని రాము సన్నిధిం
దిన్నఁగఁ జేరఁ గందు నని ♦ ధీరుఁడు వాఁడు కృతార్థుఁడై సుసం
పన్నత మీఱ నాభువన ♦ పావనిఁ గాంచి నమస్కరించినన్. ౩౮౫

క॥ భావిని వత్సల యగుచున్, దీవన లతిముదముతోడఁ ♦ దేఁకువ నిడి సం
భావించిన వాఁ డలరుచుఁ, బావనవాక్కులన నిట్లు ♦ పలికెం దోడ్తోన్. ౩౮౬

ఆ॥ నాయదృష్టమునను ♦ నాతల్లి! నినుఁ జూడఁ
గంటి వనట లేక ♦ యుంటివమ్మ
క్రోఁతి చెయిద మేమి ♦ గొడవ తెచ్చెనొ యంచు
దిగులు గొంటినిపుడు ♦ దిటవుపడితి. ౩౮౭

తే॥ పోయి వచ్చెద నమ్మరో ♦ పూర్వదుఃఖ
మెన్నఁబోకుము సుఖ మెంచి ♦ యెలమినుండు
మే నచటి కేగునంతన ♦ యిచట నున్న
వార మిట్లనుకొను మిదె ♦ వాస్తవంబు. ౩౮౮

—♦ సీతామహాదేవి హనుమంతుని మెచ్చుట ♦—

ఆ॥ అనిన నుల్లసిల్లి ♦ యాతని పయనమ్ము
గర్జమునను దెఱఁగు ♦ గలుగుటయును
నెనసి ద్వంద్వ మగుచు ♦ నెడరు సంతసమును
బొడమఁ జేయఁ బూవుఁ ♦ బోఁడి పలికె. ౩౮౯

చ॥ తన వ్రతనిష్ఠ సత్త్వము ♦ ధర్మము నమ్మయి ధారవోసి యుం
జన జనవంద్యు నిన్గని ప్ర ♦ శస్త మొనర్చెఁ గొలమ్ము నాఁటి కి
య్యనరున నాయఘం బడఁప ♦ నై యరుదెంచితి వాగుణాఢ్య కా
న్పన ఫల మెల్ల నాయదిగఁ ♦ బోలఁ దలంపఁగఁ జేయఁ బుత్రికా! ౩౯౦

క॥ ఈకార్యము సాధింపఁగ, నీక తగుంగాక యొర్లు♦నేర్తురె కీర్తిం
గైకొనుము నామనోహరు, శ్రీకరుఁ దొడితెచ్చి విజయ♦సిద్ధి నిడఁగ నై. ౩౫౧

ఆ॥ నాదుబన్నములును♦నానాథు చందంబుఁ, బగఱ ప్రల్లదంబుఁ♦బట్టి! నీక
యెఱుకపడినయవియ♦యే నింకఁ దెలుపంగ, నేర నేర్మి యెల్ల♦నీదె సుమ్ము.

ఆ॥ మఱవఁబోకుమన్న♦మాపాల నీవ యై, యునికిఁ జేసి యెడఁద♦నూఱడిల్లు
దాన నేను జీవ♦దశతోడ నుండ నా, యధిపుతోడఁ గూర్పు♦మన్నమాట. ౩౫౩

క॥ అన్నియు మున్నే తెలిపితి, నన్నిఁట నీసాయ మొలయు♦టర్థించితి నీ
వన్నెఱిఁ దొలి జయ మందితి,సన్నుతుఁడవు కమ్ము కడమ♦జతనమునందున్.౩౫౪

క॥ అభయము ప్రతిష్ఠ నీ కగు, శుభములు గాంచెదవు పుణ్య♦సూతి! యరిగి ర
మ్మిభవైరివిక్రముని రా, మభద్రుఁ గొనితెమ్ము సకల♦మాన్యుఁడ వగుమీ.

ఆ॥ అనిన నుత్సహించి♦యట్లచేయుదుఁ దల్లి!, దైవ మేడుగడయుఁ♦దలఁపఁ దనకు
రాముఁడే యటన్న♦నేమమ్ముగా కొండు, గలదె యాత్మదృష్టి♦గానఁబడదె.

క॥ క్రియయే యుత్తర మగు నిఁక, దయయుంచుము జనని! యనుచుఁ♦దద్దయు నతుల
న్మొయి నిడి తరలి యరిష్టా, హ్వయధరశృంగమున కెగసె♦నతిరభసమునన్.

—♦ హనుమానుఁడు లంకనుండి మరలి పర్వతమున కెగయుట. ♦—

సీ॥ పద్మకంబులతోడి♦బహునీలవనరాజి, కట్టుపుట్టంబున♦కలనఁ దనర
కంధరస్థలి జీరు♦కాడు మొగిల్మించు, లుత్తరీయంబున♦యొఱపు నెఱప
వైదూర్యకణికల♦వల నొప్పు తావులు, దీపకాంతుల మేల్మిఁ♦జూపుచుండఁ
గాంచనరత్నాఢ్య♦కటకస్థలంబులు, ప్రాసాదమున కల్మిఁ♦బ్రస్తుతింపఁ
బొరి దివాకరకరములు♦బోధసేయఁ, గలితధాతురాగశ్రీలఁ♦గనులు తెఱచి
శిఖరగతమేఘగర్జిత♦జృంభణంబు, లొప్ప నొప్పెడు నగ్గిరి♦నొరసె నతఁడు.

క॥ సెలయేళ్ల ప్రవాహంబుల, యులివులు స్వాధ్యాయగోష్ఠి♦నొలయింపఁగ మం
చులు గప్పఁ గందరమ్ముల, నెలకొను నిలుకడనె యోగ♦నిష్ఠ తలిర్పన్. ౩౫౯

*క॥ స్వద మొప్ప మింట టెక్కెలు, ప్రదీర్ఘములు సేసి చుట్టి♦వచ్చెడి పులుఁగుల్
విదితాతపవారణసం, పదకు న్మొదల యగు మేల్మి♦పదిల మొనర్పన్. ౩౬౦

తే॥ తరులతాకుంజపుంజవి♦స్తారకుసుమ, గుచ్ఛశోభితమై తన♦కొమరు మిగుల
వల్గు శుకపికశారికా♦వాగ్విశేష, భృంగగీతిప్రసంగ ము♦ల్పెనుపు దెలుప. ౩౬౧

ఆ॥ బాహువుల నిగిడ్చి♦పరికించి దివిఁ గ్రమ్ము, తీరునొడువు దేవ♦దారుతరువు
లట్లు గాలిపాట♦నన్యుల నులికించు, తెఱఁగు గీచకములు ♦ తేటపఱుప. ౩౬౨

తే॥ వెల్లజల్లి మెకమ్ముల ♦ వీవనలును, సింహశరభాది సైనిక ♦ క్ష్వేళలునుఁ బొ
సంగ నిష్యందవనశిలా ♦ స్థలసుదుర్గ, మార్గ మటు మయిఁకొను గరి ♦ మంబు దనర.

క॥ వలనగు తావుల తపసు ల, బలలం గొని సిద్ధసాధ్య ♦ పన్నగయక్షా
దులుఁ గలుముల నెల విదె యని, నిలువ న్నలువకృతికలన ♦ నేరిమి వెలయన్.

క॥ అతిరాజసమున మను ప, ర్వత మాతం డాఁగి యఱచు ♦ వలనున నఱచెన్
బ్రతినిస్వనములఁ ద న్నొక, యతులితవిక్రముఁడు కదిసి ♦ యఱిమెడు ననుచున్.

ఆ॥ అదిమె మెట్టు హనుమ ♦ యధిరామపాదాబ్జ, చిత్తవర్తనంబు ♦ చెలువు మీఱ
నదియు వడఁకె మ్రోసె ♦ ననిలకంపితశర, ద్వనభృగుస్థలాంబు ♦ వల్గనముల.

మ॥ తనపాదంబుల మేఘపాదముల మో ♦ దం బేద నెందేనిఁ బొ
వ నుపక్రాంతికిఁ గూర్చి పన్నగరుషా ♦ చ్ఛ్వాసంబుల న్మ్రోఁగుచున్
ఘనసత్త్వౌఘవిరావ మెల్లెడలఁ బ్రాఁ ♦ క స్ఘూర్ణమానత్వము
న్గనె నాశైలము నాశనోన్ముఖశిలా ♦ ఖండద్రుఖండస్థితిన్. ౩౬౭

తే॥ వానిచేఁ బీడితమ్మై ప ♦ ర్వతము వీడి
యుప్పరంబున కెగయఁగ ♦ నుత్సహించు
భూతముల ఘోషణలకు నీ ♦ భూతధాత్రి
నిలుచునో పోవునో యన్న ♦ నెరియ తోఁచె. ౩౬౮

క॥ ఉత్తరపుదిక్కునయ వా, ర్ధ్యుత్తరణం బెంచి సద్గు ♦ ణోత్తరుఁ డెదిరెన్
ముత్తలము లొక్కమొగిఁ బె, న్నుత్తలపాటున మునుంగ ♦ నుత్సుకుఁ డగుచున్.

ఆ॥ అతఁడు నిక్కి చూచె ♦ నందుండి యంబుధి, డంబరంబు దాని ♦ సంబరంబుఁ
ద్రొక్కి ధరము క్రుంగఁ ♦ దోడ్తోడ నెగయించి, యెగసె నంబరమున ♦ కేణనయన.

క॥ పదియామడలు నెరవు ము, ప్పదియామడ లట్లు పొడవు ♦ పర్వతమున క
య్యది నేలకు సరియగు టకుఁ, దిద్రిదశులు విస్మయము నొంది ♦ తెరలిరి తరుణీ!.

ఆ॥ తలలు గదలె వజ్ర ♦ తాడితంబుల పోలెఁ
జెట్లు గూలె గండ ♦ శిలలు చూర్ణి
తంబు లయ్యె భూమి ♦ ధరము క్రిందును మీఁదు
నగుచుఁ బాడుకొనెడు ♦ నపుడు నగజ. ౩౭౧

క॥ అంబరచరు లట్లయి కా, నంబడి రన్నగము వీడి ♦ నగలంబరముల్
డంబరపుగతిని జాఱఁ గ, దంబవనస్థలవిహార ♦ తత్పరహృదయా! ౩౭౩

ఆ॥ ఆకసంబు వగులు ♦ ననన య్యెఁ గందరాం, తరగకేసరిప్రి ♦ ధానస త్త్వ
సంభ్రమార్భటీప్ర ♦ సంగజృంభణముల, నమరయావతార్చి ♦ తాంఘ్రియుగళ!

క॥ తెక్కలుగల కొండయొ నా, రిక్కలతెరు వారసికొనుచు ♦ శ్రీమంతుఁ డుద
గ్రక్షునకుఁ గవిసె సంద్రము, చక్కటిఁ గనుఁగొనుచు నుదిత♦సంభ్రముఁ డగుచున్.

తే॥ అదియుఁ గల్లోలముల వేల ♦ నలముకొనుచు
నుత్సవంబున నొప్పారు ♦ నోజ మెఱసె
నతఁడు దాని మహానౌక ♦ యట్లుపోలె
దాఁటుచుండె శ్రితాభయ ♦ దాననిపుణ. ౩౭౬

సీ॥ కలువలవిందు చ ♦ క్కటికుముదాళిగా, సవిత కారండవ ♦ సంశ్రయముగ
నలగురుహారిభము ♦ ల్కలహంసతతులుగా, జలదము లైన్యవాల ♦ శాద్వలములు
గాఁ బునర్వసుతార♦ఘునర్షుషంబుగ లోహి, తాంగగ్రహంబు గ్రా♦హంబుగాఁగ
దివిషద్ద్వీపము మహా ♦ ద్వీపంబుగాఁ బవ, నర్క్షంబు రాజహం ♦ సర్ధిగాఁగ
మారుతస్కంధజుషచంద్ర ♦ మఃకరౌఘ
ముచ్ఛ్రితోర్మిహిమాంబుపూ ♦ రోత్కరముగ
నొప్పు నాకస మటు సంద్ర ♦ మోజఁ గనుచు
వాఁడు నడితోవ్రతల మించె ♦ వారిజాక్షి!. ౩౭౭

చ॥ అలసత లేదు శ్రాంతి యను ♦ టంతకుమున్నె యొకింతయేనియుం
గల దనరాదు ద్యోపథము ♦ గ్రాస మొనర్చెడునో సుధాంశుమం
డలము సముల్లిఖించెడునొ ♦ డంబున సోడుపదార్కబింబ మా
వలను హరించునో యన న ♦ వార్యత వాఁ డిటవచ్చు నయ్యెడన్. ౩౭౮

తే॥ మహితపాండరారుణసీల ♦ మంజిమములు
చిత్రమాంజిష్ఠములు ఘన ♦ శ్రేణు లతని
తోడఁ బఱతెంచుచుండెను ♦ దొడుగఱ లయి
వాని జవనత వర్ణింప ♦ వలనుపడునె. ౩౭౯

క॥ త్వరితుఁ డయి యభ్రజాలాం, తరమునఁ జొరబాఱు వెడలుఁ♦దలకొను నాద
స్ఫురణల దెసలు దెరల్చును, గరుడాయితుఁ డై యతండు♦ఘనసీలకచా. ౩౮౦

తే॥ తనరవము వజ్రనిర్ఘోష ♦ మనుకరింప
మలయు మొయిళులలోఁ జొచ్చి ♦ మఱుఁగుపడుచు
దృశ్యత నిరమ్మదస్ఫూర్తి ♦ తెఱఁగు పఱిచి
యాతఁ డభ్రాయితుం డయ్యె ♦ నభ్రకేశి!

ఆ॥ అంబరమున నంబు♦దంబులం బఱతెంచు, కలన ఛన్నుఁడునుఁ బ్ర♦కాశుఁడు నయి
నిర్మలాంబరుండు♦నెరసెఁ జంద్రాయితుం, డగుచుఁ జంద్రదర్ప♦హారివదన. ౩౮౧

మ॥ తనపేరుం బ్రకటించి రక్కసుల యూ ♦ ధ్యంబు పోకార్చి లం
క నలంకారవియుక్తఁ జేసి బలవ ♦ ర్గం బెల్లఁ జక్కాడి య
ద్దనుజాధీశుని చిత్త ముత్తలపడ ♦ న్ధర్షించి జ్యాపుత్రి దీ
వెనల న్గైకొని యబ్ధి దాఁటు నతని ♦ న్వీక్షించి రిందాద్రిదులున్. ౩౮౩

ఆ॥ నీదు సోదరుఁడు♦నెఱి దోఁప మఱలఁ దాఁ, దోఁచి వేఁడవేడ్క♦తో స్పృశించి
వీఁడుకొలిపి వచ్చె♦వేవేఁగ జ్యాముక్త, మైన శరమపోలె♦హనుమ నగజ. ౩౮౪

చ॥ తనకు మహేంద్రశైల మటు ♦ దాఁపుపడ న్హరిపుంగవుండు నె
ట్టన గగనంబు సార్కము వ ♦ డంకఁగ డాంకృతు లొప్ప నార్చు ని
స్వనములు దిక్కులం దఱుమ ♦ సాగె మహాత్ముఁడు వచ్చుచున్నవాఁ
డనిలజుఁ డంచు స్నిగ్ధతతి ♦ యద్దెసఁ జూడ్కు లిడం బ్రహర్షిణీ. ౩౮౫

—♦ హనుమంతుని రాకఁగని కపులుప్పొంగుట. ♦—

ఆ॥ తోఁక చాలనంబు♦తోడ వాఁ డరుదెంచు, తీరు గర్జ లెలమి♦తెలివితేట
లనిలరయము నెంచి♦యూలెమ్మటంచు నూ, హించి రతని రాక♦హితులు సుదతి!

తే॥ దీనమానసులై యొండు♦తెఱఁగు గాన, కున్న కపుల ముఖమ్ములు♦కొప్పెఁ దెలివి
యతని రాకఁ జర్జన్యుని♦యాగమమున, వాఁడుపైరుల కట్టు♦లో వనదవేణి! ౩౮౬

ఉ॥ ఆకలనంబుఁ దా నరసి ♦ యామతిమంతుఁడు జాంబవంతుఁ డో
హోహో కపులార! వీని తెఱఁ ♦ గొప్పెడుఁ గంటిరె కృత్యవేత్త తా
నీకృతి కల్మి మీఱ ఘటి ♦ యింపనిచో నిటు రాఁదలంపఁ డీ
ప్రకటకీర్తిచే మనకుఁ ♦ బొల్పడె గౌరవ మెల్లభంగులన్. ౩౮౭

ఆ॥ అనిన సంతసించి♦యవ్వారు వాలమ్ము, లెగయ మ్రానికొమ్మ♦లెక్కి యొడ్ల
రెమ్మ కొనుచుఁ జిన్న♦రెమ్మ లాడించిరి, సరగ రమ్మటన్న♦సన్న వెలయ. ౩౮౮

క॥ కొందఱు చెట్లకుఁ బ్రాఁకిరి, కొందఱు నగశృంగములకుఁ♦గొనకొని రెగయన్
గ్రిందుకొను వేడ్క వారల, చందము వింత యన నయ్యెఁ♦జందనగంధీ! ౩౮౯

ఉ॥ అంతట సంద్రముం గడచి ♦ యాతఁడు మింటను సన్నికృష్టుఁడై
మంతనమందు సంతసము ♦ మాటఁగఁ బోలనిదై బయల్పడన్
గంతులు వైచువారిఁ గని ♦ గర్జనముం బొనరించెఁ బర్వతం
బంతకు మిన్నగా మొరసె ♦ నాత్మగుహాస్యముల న్యశస్వినీ! ౩౯౦

ఆ॥ హర్షపూరితుండు ♦ హనుమ మహేంద్రాద్రి, శిఖరనిర్ఝరమ్ము ♦ చెట్లపొంత
వ్రాలె మాఱుకొండ ♦ వైఖరి మీఱంగ, మేను పొంగఁ జెలిమి ♦ మేకొనంగ.

ఉ॥ ప్రీతమనస్కభావమునఁ ♦ బెంచిన చెయ్దము లంచితాంజలి
వ్రాతముతోడి పాత్తునఁ బ్రి ♦ పన్నతఁ బేరిమి నొంటఁ దెల్ప నా
కోతులు వాని మే నొరయఁ ♦ గూడిరి పాడిరి పాట లీక్షణ
ద్యోతము లావరింప విజ ♦ యోక్తము లాడిరి పాటలాధరీ! 393

ఆ॥ ఎగ్గొకింత గాన ♦ కేతెంచె నని తృప్తిఁ, బొరయు లేమిఁ గనుల ♦ పోలుపు దెలుప
నతనిఁ గాంచి వార ♦ లర్పించి రర్చించి, కందమూలఫలము ♦ లిందువదన!. 394

వ॥ అట్టి సుహృత్సమాగమ మహోత్సవంబున మతిమంతుం డగు నాహను
మంతుండు. 395

— ♦ హనుమంతుం డుత్సాహముతో జాంబవదాదులకు సీతావృత్తాంత మెఱిఁగించుట ♦ —

క॥ గురు లగు జాంబవదాదుల, కురుభక్తి న్మ్రొక్కి రాజ ♦ యోగోచితి వా
నరపతిసుతున కెరఁగె న, క్కరణిం దక్కఁగలకపులఁ ♦ గౌఁగిటఁ జేర్చెన్.

క॥ వారలచేఁ బూజితుఁ డై, వారని కుతుకమునఁ బ్లవగ ♦ వరు లర్థింపన్
ధీరుఁడు "దృష్టాసీతే" త్యారంభోక్తము సుధామ ♦ యం బొనఁగూర్చెన్. 396

ఆ॥ వాలిసుతుని కేలుఁ ♦ గేలఁ గీలించి వాఁ, డరుస మెసఁగ రమ్య ♦ మౌతలమునఁ
గూరుచుండి కపులు ♦ గొలువ నెల్లరు విన, నిట్టు లనియె యామి ♦ నీంద్రవదన!.

ఉ॥ ఆమహిపుత్రి యాశరవ ♦ నాంతరశోకము పొంత శోకవే
గామయపీడ్యమానయుఁ గృ ♦ శాంగియు ఖిన్నయు నేకవేణియుం
గా మహితాత్ము రాము పద ♦ కంజముల న్స్మరియించుచు న్గుణో
ద్దామ యనింద్య యాగడుసు ♦ దయ్యము లెల్లెడ మూఁగ దీనయై. 399

ఆ॥ ఉన్న యదియ నాఁటి ♦ యొంటిచేలయ నేఁటి, కొప్పి యొప్పకుండి ♦ కప్పుపఱుప
మబ్బుపింజె నడుమ ♦ మాటువడ్డ సుధాంశు, రేఖవోలెఁ దనదు ♦ రీతి మలఁగ.

ఆ॥ అనుచుఁ బల్కు నమ్మ ♦ హాత్ము వాక్సుధాంబు లౌ పల్కు, లమృత మాని నట్టు ♦ లంతరంగ
మలరఁ జేయ వార ♦ లట్టిట్టు లనరాని, తృప్తిఁ గనిరి దివిజ ♦ దేవవంద్య!.

ఉ॥ కొందఱు సింహనాదములఁ ♦ గొందఱు గర్జలఁ గొంద ఱంచితా
మందతరారవంబులఁ బ్రి ♦ మాణితకోటికి మీఱి యెట్టులే
నిం దలపెట్టి రార్భటె క ♦ నిందృ్యలు వార లు స్వామికార్య ని
ష్పందితవృత్తిమైఁ బరవ ♦ శత్వము నొందుట యబ్రిమే సఖీ!. 402

క॥ కిలకిలలు వెలయఁ బ్రితిగ, ర్జలు నెఱయ ససంభ్రమములు ♦ సరభసములు నా
తలఁపులఁ దోఁకల ధరణీ, తల మదురిఁవఁగ మోదుదురు వి ♦ ధాతృసతీడ్యా!

క॥ కొనియాడుదు రాతనిఁ గనుఁ, గొని యాడుదు రెనసి త్రోఁక ♦ గొని ముద్దాడం
గని యానందముసంద్రం, బని యాదృతి నీఁదులాడ ♦ నా దురు తరుణీ!. ౪౦౪

ఉ॥ అంగదశస్త్రబాహుఁ డగు ♦ నంగదుఁ డత్తఱి జాంబవంతునిన్
సంగడికాని నాహనుమ ♦ సంగతిమైఁ గదియంగఁ దార్చి యు
ప్పొంగుచు నమ్మహేంద్రగిరి ♦ పొంగున మీఱ మహేంద్రలీల సా
రంగనిభ లక్షపు ల్సరల ♦ రం గలరం గొలువంగఁ గొల్వనన్. ౪౦౫

ఆ॥ ఆసుధర్మ నట్లు లమరి ♦ యమ్మొయినుండి
హనుమఁ గాంచి యిట్టు ♦ లనిరొఁ బ్రీతి
నింత స్వామిభక్తి ♦ యీసత్త్వ మీధృతి
యిట్టివీర్యశక్తి ♦ నెందుఁ గలదు. ౪౦౬

ఆ॥ ఎవఁడు దాఁటు సంద్ర♦మెవఁడు రక్కసుల పీ, డబ్ధి నట్లు ద్రచ్చి♦యమృత మట్టు
లరయు భూజ యున్న♦యచ్చోటు నెవ్వఁ డా, సాధ్వి దీపనలఁ బ్ర♦శస్తిఁ గాంచు.

ఉ॥ మెచ్చొనగూడెనయ్య! యిఁక ♦ మేలిమి గాంచుఁగదయ్య రాఘవుం
డచ్చపలాక్షి యామహిజ ♦ యాపతిచేవత మేలివార్తకుం
బొచ్చెములేని నిన్నుతిని ♦ బోల రొకొం డ్లలవేల్పుటాండ్రు నీ
సచ్చరితంబు గీతితతి ♦ సంగ్రహము నొనరింపకుందురే. ౪౦౮

క॥ నీవెకద ప్రాణదాతవు, నీవే సచివుఁడవు మార్గ♦నిర్ణేతవు మా
కీ వెరవున నేశుభముల, నీ వీ వన నంతమాత్ర♦మే పవనసుతా! ౪౦౯

వ॥ అని కొనియాడు నవసరంబున. ౪౧౦

క॥ అందఱ యాశయ మెఱిఁగి యు, మందానందమునఁ దోఁగి♦మహితునిఁ గని సం
క్రందనమంత్రిప్రతిభుఁ డ, నెం దా భల్లూకవాహి♦నీపతి పేర్మిన్. ౪౧౧

ఉ॥ ఎమ్మెయిఁ గంటివో జనని ♦ యేవిధి నయ్యెడ నుండెనో శతుం
డమ్మనుజాశనుండు సుగు ♦ ణాఢ్య విదేహజ నేమి బూమెలం
గ్రమ్మఁదలంచునో తెలియఁ ♦ గా వివరింపుము తెల్ప నేది యా
నెమ్మది డాఁప నేది యగు ♦ నిర్ణయముం బొనరింత మాదటన్. ౪౧౨

— ♦ హనుమంతుఁడు జాంబవదాదులకు లంకావృత్తాంతమును జెప్పుట ♦ —

ఆ॥ కార్యనిశ్చయంబు♦గడకొని చేయంగ, వలయు ననినఁ బొంగి♦వల నెఱింగి
తెలుపఁ దొడరె వాఁడు♦దేవికి సాష్టాంగ, వినతిఁ గూర్చి భక్తి♦వివశుఁ డగుచు.

క॥ ఏ నిచట మిమ్ము వీడ్కొని, యానాకపథమ్ముఁ గదిసి♦యబ్ధిఁ గడచుచోఁ
గానఁబడెఁ బెక్కువిఘ్నము, లే నెఱికిం దవులుకొనక♦యొయిదితిఁ బెలుచన్.

సీ॥ తెరువుగ గ్రమ్మి తెరల్పఁ♦దెలిగట్టుపట్టి వా, ర్నిధి పంపె నని ప్రీతి♦నలపి చనియె
నట సురసయు వేల్పు♦లనుప ఘోరాకృతి, యై పరీక్షించి నె♦య్యమున నరిగె
నాచాయ గ్రసియించి♦నను బ్రమింగి యే నొంప, సింహిక పరలోక♦సిద్ధిఁ గాంచెఁ
బార మ్మనసి లంక♦పైఁ బోవఁగఁ దదాఖ్య, యాదొడ్డరక్కసి♦యడ్డుపడియె
దాని రజనీముఖమ్మున ♦ మేను వైచి
పోనడఁచి పీటఁ బెరయంగ ♦ రాని చోటు
లేనిఁ జొరఁబాటి చూచి య ♦ మ్మానవాదు
లోనగరుఁ గాంచితిని సీతఁ ♦ గాననైతి. ౪౧౫

క॥ చింతాసాగరమునఁ బర, మంతముఁ గానక మునింగి♦యట వేల్పుల మ
త్స్వాంతమున వేఁడి ప్రాకా, రాంతస్థ న్నశోకవనిక♦నందంగంటిన్. ౪౧౬

తే॥ కడఁగి నామేను మఱియు సూ ♦ క్ష్మ మ్మొనర్చి
కాంచనాశోక మొకఁ డెక్కి ♦ గాంచఁగంటి
రామనామామృతస్రుతి ♦ రజ్యమాన
మానసాంభోజ నొకపూజ్య ♦ మాన నచట. ౪౧౭

క॥ ఆశోభనాంగి సుందర, తాశేష మశేషయావ♦తంబున కిది మీ
దేశము కా దని ద్యుతిసం, దేశముఁ బనుచుటయుఁ గనులఁ♦దెలిసి యలరితిన్.

సీ॥ ఉపవాసములఁ గ్రుస్సి♦యునుఁ బూర్ణచంద్రుని, ధిక్కరించెడు మోము♦తెలివి వెలయ
నగ్నిశిఖాకృతి ♦ కనురూపముగ రజ, స్కీర్ణ మై మేలి కై ♦ శికము నెఱయ
భర్తృ తేజం బెంచి♦భయ మేఁదఁ దద్దర్శ, నాకాంక్ష యగు స్వాంత♦మదనునరయఁ
జెడుగురాకాసుల♦చేఁ జిక్కి యిటు లుండ, వలసెఁగా యను వృత్తి♦జళుకుపడయ
మిగులమాసిన యాచేల♦మేను డాఁప, నైనఁ గాంతిస్ఫురణలచే♦నన్ని దెసలుఁ
గప్పు నద్దేవతామూర్తిఁ♦గాంచి యీమె, సీత యని తెల్పినాడ నా♦చిత్తమునకు.

ఆ॥ ఆఁకుపులుల నడిమి♦హరిణియ పోలె న, ప్పాలసుదిండిపోలఁతు♦లలుకఁ గదిసి
గదుమఁ జిక్కి దిక్కు♦గాంక్షించి కంట నీ, రొలుకఁ గాంచు నామె♦యోర్పుఁ గంటి.

మ॥ అలఁతింబోక నిశాటుఁ డాఁకపడునో ♦ హా యంచుఁ బ్రాణంబులన్
దలఁగింపం దలకొందుఁగా కనుచు నా ♦ తన్వంగి పెన్వేణికన్
గళము న్జుట్టి మహీరుహమ్మునను శా ♦ ఖం గట్టి ప్రాణేశు చా
య లసద్దృష్టులఁ బంచు నమ్మహిత యో ♦ గ్యత్వమ్ముఁ గీర్తించితిన్. ౪౨౧

ఆ॥ మంచు పొదువ బిట్టు ♦ మాసిన పొందమ్మి, తీఁగవోలెఁ దెరలి ♦ దీన యగుచు
నక్కరాక కొదిఁగి ♦ యానేమమున నున్న, దేవిఁ గాంచి యెడఁద ♦ దిటవుపడితి.

క॥ ఆనియమమ్ములు తేజ, మ్మానెఱియుం గాంచి నిశ్చ ♦ య మ్మనుకొని య
మ్మానిని నూఱార్పంగా, లో నెంచుచు నుండునంత ♦ లో నం బెలుచన్. ౪౨౪

ఆ॥ ఆరవంబు వినఁగ ♦ నైన నే నొదుగంగ, నైతి మ్రాని రెమ్మ ♦ లందుఁ జేరి
యమ్మకన్న మున్న ♦ యాయమ భూగర్భ, మొలయురీతి నడఁగి ♦ యుండె నంత.

క॥ కష్టుఁడు పౌలస్త్యుఁడు తన, యిష్టసఖీజనము గొలువ ♦ నెల్ల విభవముల్
తుష్టికిఁ దగున ట్లైనయఁగ, శిష్టవినుత భూజ దరిని ♦ జేరి వినతుఁడై. ౪౨౫

క॥ యాచించెను వాఁ డెడ సం, కోచింపక రాముపత్నిఁ ♦ గోవిదనుత న
ర్వాచీనుం డేచతురత, నాచతురాస్యుని కొలంబు ♦ నందుఁ బొడమెనో. ౪౨౬

ఆ॥ తిట్టె నామె యోరి ♦ దేబె! నాపతి చెంత, లేనితఱినిఁ దెచ్చి ♦ తేని బ్రిదుక
రాదు నీకు ధాత ♦ రామబాణాగ్నిలో, మిడుతగాఁగ వ్రాసె ♦ మేలి వ్రాఁత. ౪౨౭

వ॥ అనియు మఱియుం బెక్కు తెఱంగుల నయుక్తిని ధిక్కరింపుచు. ౪౨౮

ఆ॥ తృణము నడ్డుసేసి ♦ తృణముగాఁ జూచియు, సారిది సాధ్వి పలుకు ♦ చుఱు కెఱింగి
వలసపోవఁ డెట్లు ♦ వాచస్పతియయేని, మోటువాని తలకు ♦ ముదల గలదె ౪౨౯

ఉ॥ అమ్మయిఁ దూలనాడిన న ♦ య మ్మొకయింతయు లేక క్రుద్ధుఁడై
యమ్మనుజాశి నిష్ఠురము ♦ లాడుచు లేచి కటారి దూసి యా
యమ్మ వధింపఁ బైకొనఁగ ♦ నాతని పత్ని మయాత్మజాత రా
రమ్మని బోధసేయఁగఁ ది ♦ ర మ్మయి పోవుచు నిర్దయాత్ముఁడై. ౪౩౦

క॥ రెండునెలలలోఁ జన విడ, కుండిన దీని వధియించి ♦ యొడికముగాఁగన్
వండుకొని తెండు ప్రొద్దున, తిండికి నని చనియె వాఁడు ♦ దీప్తాగ్నిక్రియన్. ౪౩౧

శా॥ ఆధృష్టుం డటు లేఁగ రక్కసలు మ ♦ ర్యాదం దిగంద్రోచి సం
బోధింప న్నమకట్టి వేవిధములన్ ♦ భూషించి దూషించియున్
బాధ ల్తర్జనభర్జన ల్మఱపఁగా ♦ భావించియు న్గాన రై
రాధీమూర్తి మఱల్పఁ దెల్పఁగని ర ♦ య్యర్థంబు దేవారికిన్. ౪౩౨

క॥ కొందఱు పన్నుండిరి మఱి, కొందఱు కొందలపడంగఁ ♦ గొనకొని రటు లా
సుందరి పడిపడి తనమే, నుం దొఱఁగఁ దలంచి మఱల ♦ నూల్కొనునంతన్. ౪౩౩

చ॥ త్రిజట యనంగ నొక్క సతి ♦ తీ రగు స్వప్నముఁ గాంచి మేలుకాం
చి జయము రాముఁ డొందు నవ ♦ శీర్ణముఁ గాఁగల దింక లంక యా
యజుఁ డిటు వ్రాసె నంచు విది ♦ తాత్మ ధరాసుతఁ జేరి నెయ్య మొ
ప్ప జరుపు నాప్రసంగమున ♦ భంగిఁ గలంగి తలంగి పొంగఱన్. ౪౩౪

క॥ అందఱు విసివి పరుండఁగఁ, గెందలిరుంబోఁడి లతకుఁ♦గే ల్సాఁచి విభుఁ
డెందమునం దిడుకొని పలు, కం దీఱని కొందలమ్ముఁ♦గను నవ్వేళన్. ౪౩౫

ఆ॥ ఇఁక నుపేక్ష సేయ♦నింతయు వ్యర్థ మం, చరసి యేను రాము♦నన్వయంబు
గీర్తి గొనము సొబగుఁ♦గీర్తింప నద్దేవి, విస్మయంబు గదుర♦వేడ్కఁబడుచు. ౪౩౬

క॥ అన్నా! రాముని( బొగడితి, వెన్నంగానేర నీవు♦హెచ్చ్రత నిట కే
సన్నం జనుదెంచితి వని, కన్నీ రొలుకంగఁ బలుకఁ♦గా నమ్రుఁడనై. ౪౩౭

ఆ॥ తల్లి! రాము దూత ♦ దయితుఁ డి ట్లనుపంగ
వచ్చినాడ నేను ♦ వాయుజుండ
నినసుతుండు కపుల ♦ కినుఁడు సుగ్రీవుండుఁ
దాను మైత్రికలిమిఁ ♦ దనరుచుండ్రి. ౪౩౮

క॥ అని తెలుప నెల్లవృత్తం, బనుపమ యద్దేవి యడుగ♦నంతయు వివరం
బొనరించితిఁ గుశలం బడి, గెను గూరిమి మిగుల రామ♦కీర్తనపర యై. ౪౩౯

ఆ॥ ఒనరు గుఱుతు గాఁగ♦నొసఁగిన యంగుళీ, యకము సేర్ప నింత♦యునఁగ రాని
మమతఁ బెనఁగె నామె♦మై వ్రాంగ రాము మే, ల్దలఁచుకొనుచుఁ గష్ట♦దశ తలంగ.

క॥ అమ్మా! యిప్డు డానతి యిడు, మమ్మానవ్య న్నిన్నుఁ జేర్తు♦నన మత్స్వామ
ర్థ్య మ్మరసియుఁ దగ దనె నే, మమ్మునఁ గొనిరమ్ము రాకొ♦మారుల ననియెన్.

తే॥ ఆజనని సాధుభావ మ ♦ ప్డాదరించి
యే నభిజ్ఞాన మడిగిన ♦ నిదె కొను మని
దివ్యమణి రత్న మొసఁగి తాఁ ♦ దెలిపెఁ గొన్ని
మంతనంబున నిడుకొన్న ♦ మాట లపుడు. ౪౪౧

క॥ ఏనుఁ బ్రియాణ మొనర్ప, న్మానందన మఱల దుఃఖ♦పూరిత యగుచున్
దా నెన్నఁడు శ్రీరాముని(, గానన్గల నని విభిన్న♦కంఠస్వర యై. ౪౪౩

క॥ అన్నా! యీవె ప్రమాణం, బన్నాళీకాస్త్రకులజు♦సభయతఁ గొని తే
ర న్నాధుడు మే లగు నని, యన్నారీమణికి మ్రొక్కి♦యటఁ జని మదిలోన్.

ఆ॥ అమ్మకష్టదశల♦నరసియు నే రిత్త, యరుగనేల యనుచు♦నలుక [illegible]డమ
నెదిరి యవ్వనంబు♦నెల్ల నొక్కఁడు మోఁక, (దిక్కుఁ)కుండఁ జెఱికి♦(త్రెంపి యిడఁగ.

చ॥ చెడిపలు రక్కసు ల్సని య ♦ శేషముగా వివరింప రాక్షసేం
ద్రుఁడు దొనుకాడు నయ్యుడుకు ♦ తోఁ గను లెఱ్ఱఁగఁ జేసి పేర్చు తుం
దుడుకుఁదనంబున న్బనిచె ♦ దుష్టులఁ గింకరసంజ్ఞుల న్భరం
పడి పలువేవు ర ట్లడరి ♦ బంటుదనంబునఁ జేరఁ బాఱఁగన్. ౪౪౬

సీ॥ తోడ్తోనె పరిఘమ్ముఁ ♦ దోరణస్థంబంది, కొని వారిఁ గెడపితిఁ ♦ గ్రోధ మడర
దాని స్తంభంబూడ్చి ♦ దైత్యులతోఁగూడఁ, జైత్యవిమానంబుఁ ♦ జక్కడచితి
శౌర్యధుర్యుఁ డతండు♦జంబుమాలి ససైన్యుఁ, ననుపఁ బంచితి నంత♦కాలయమున
కట నేడుగురు సచి ♦ వాత్మజు లట్లు రా, వారిఁ గూర్చితిఁ దోడి ♦ వారి గతికిఁ
బంచసైన్యపతులు ♦ పంచత్వ మందిరి, మడిసె నక్షుఁ డను కు ♦ మారవరుఁడు
ప్రబలబలచయంబు♦పాడ్వడె నెడనెడఁ, జొచ్చి చుఱుకుఁదనముఁ♦జూపి తెరలి.

క॥ తనపెద్దకొడుకుతోఁ దా, ఘనమంత్ర మొనర్చి శౌర్య ♦ ఘను నింద్రజిదా
ఖ్యు నతనిఁ గపిఁ గొనితెమ్మని, దను జాధిపుఁ డనుప వాఁడు ♦ తత్పరమతి యై.

వ॥ దురుద్ధరబలపరికరంబులతో సన్నద్ధుండై వెడలివచ్చి నాపైఁ గవిసి గవిసెన లెడలించిన మహానాగంబులం బోని సునిశితాస్త్రంబులు గురిసిన వివిధచిత్రగతుల నయ్యవి యవిసిపోవం జేసి సైనికుల నుఱుమాడుచుఁ దనదు సన్నాహంబునకు లోబడకుండుటం గని యసాధారణత్వం బూహించి బ్రహ్మాస్త్రంబు సమంత్రకంబుగా నరివోసి యేసిన. ౨౨౯

క॥ అమ్మహనీయాస్త్రము దే, హ మ్మొనసినయంత మూర్ఛ ♦ నందితి వరయో
గమ్మున ముహూర్తమాత్రం, బమ్మెయిఁ జనఁ దెలివిఁ గాంచి ♦ యలరంగంటిన్.

ఉ॥ తోడనె రక్కసు ల్మదము ♦ తో ననుఁ గట్టిరి త్రాళ్ల నుల్లసం
బాడిరి తిట్టి రీడ్చుకొని ♦ యప్పరికిం జనుచుండి రప్పు డ
వ్వాఁ డొకఁ డెంచె వీఁ డని న ♦ వధ్యుఁ డటం చటు లేఁ దలంచితిన్
బోఁడిమిమించు తేనిఁ గనఁ ♦ బోవుట లెస్స యటంచు నెమ్మదిన్. ౨౩౧

ఆ॥ ఉన్నతాసనమున ♦ నుచితభంగిఁ దనర్చు, రాక్షసాధినాథు ♦ రాణఁ గంటి
నతఁడు నాదు రాక ♦ నడిగినఁ దెలిపితిఁ, గొసరకుండఁ బూస ♦ గ్రుచ్చినట్లు.

క॥ నీయట్టివాని కిది తగు, నా యని న్యాయవిధిఁ దెలుప ♦ నను విదె యని వాఁ
డాయతమదుఁ డాలింపమి, కాయదనునఁ గనలి తిట్ట ♦ నడరితిఁ బెలుచన్. ౨౩౩

ఆ॥ పౌరుషమున రాముఁ ♦ బాటించి తనహైన్య, ముగ్గడింప నగ్గి ♦ యోజ నడరి
నన్నుఁ జంపఁజూడ♦న్యాయంబు గా దనె, నతని తమ్ముఁ డనఘుఁ♦డాత్మవిదుఁడు.

ఆ॥ అవ్విభీషణాఖ్యుఁ ♦ డరిదూత వధసేత
కర్హుఁ డగునె యనుచు ♦ నానఁ దెలుపఁ
దోఁకఁ గాల్పు మనియెఁ ♦ దోడ్తోన యవ్వాని
యాన రక్కసులు మ ♦ దాంధు లగుచు. ౨౩౪

చ॥ పురిఁ గల దుష్టదుష్టులు ♦ బొంపిరివోవఁగ నేర్చి తెచ్చి చు
ట్టిరి కసిదీఱఁ వాలము వ ♦ డింగొన కేతగఁ బెంచుచుంటిన
ప్పురుసున నాఁగ నూనియు ల ♦ పారముగా నెలకొల్పి ముంచి తే
ర్చిరి వెలిగించి రుద్దవిడిఁ ♦ ద్రిప్పిరి నల్దెసల న్గ్రిమమ్మునన్. ౨౫౬

చ॥ పిడికిఁటిపోటులం బడితె ♦ వ్రేటుల నట్లు సహించి వీటి సొం
పెడలఁగఁ జేయ నెల్లెడల ♦ నీక్షితము ల్నిగుడించి కొంచె మూ
నొడలున సర్వబంధముల ♦ నూడ్చి నిశాటుల సంహరించి య
వ్వడువునఁ జిచ్చువెట్టి గృహ ♦ వర్గము వేల్చితి వహ్ని మెచ్చఁగన్. ౨౫౭

ఉ॥ అమ్మెయిఁ గాలి కూలెఁ బురి ♦ యమ్మ తెఱంగు మదిం దలంచుచోఁ
గ్రిమ్మఱఁ గంటిఁ జింత నెటు ♦ గాంచిన దగ్ధము గానిచోటు లే
దిమ్మున స్వామిపక్షమున ♦ కే నపకారి ననంగ నైతి నీ
వమ్మున కింక నిష్కృతియు ♦ వారక గల్గునె యెన్నఁ జేనియున్. ౨౫౮

ఆ॥ మేను బాయు టింక ♦ మే లంచు నూహించు, చుండ మంగళాక్ష ♦ రోచితమ్ము
సిద్ధభాషితమ్ము ♦ "సీతా న దగ్ధేతి", విస్మయోదితమ్ము ♦ వింటి నపుడు. ౨౫౯

శా॥ లాంగూలం బొకయింత గాల్పఁ డిటు లే ♦ లా చల్ల నై యగ్ని వ్యా
సంగం బొప్ప హిమాంబుబిందుసురభి ♦ స్యందిత్వముం గాంచె గా
ఢ్వంగాంగిత్వమె యేతదీయము శుభ ♦ వ్యాహారిగాఁ దోడుతో
డం గాన్పించె మహీసుతారఘువరా ♦ ధ్యవాభివోన్మేషముల్. ౨౬౦

క॥ అని సంతసించి వాలం, బును మున్నీట నిడి కడిగి ♦ పూజిత సీతం
గని సెలవు వేఁడుకొని కొని, ఘనమార్గం బొరసికొనుచుఁ ♦ గడచితి నబ్ధిన్.

—♦ హనుమంతుని రామకార్యాలోచనము. ♦—

ఆ॥ కానఁబడితి మిమ్ముఁ ♦ గంటిఁ గృతార్థుండ, నైతి నింకఁ గొఱఁత ♦ యనఁగ రాదు
రాము మహిమఁ బ్లవగ ♦ రాజుతేజున భవ, త్సఖ్యముననొకొండు ♦ చాయ నెఱయ.

క॥ ఇఁకఁ జేయఁదగిన దెద్దియొ, ప్రకటింపుఁడు మీరు యోగ ♦ పరు లాయమ దా
సకరుణముగ నటుపలుకు ప, లుకులకు నుత్తరవిచార ♦ లుబ్ధుఁడ నైతిన్. ౨౬౩

సీ॥ సర్వసంపన్నుండు ♦ సత్త్వపక్షీలుండు, శుద్ధుఁ డై లోకము ♦ ల్గూల్పఁ జాలు
రావణుం డటుగాక ♦ రామపత్నినిఁ గొని, పోవునే తొల్లివనే ♦ పాలియకున్నె
యగ్నిశిఖాత్మిక ♦ యద్దేవి తాఁ గాల్చు, నట్టులు గాల్పలేఁ ♦ డనలుఁ డైనఁ
గొమ్మ కోపమ్ము సం ♦ కోచింపఁగాఁ జేసి, యడలుచున్నది రాము ♦ నందు భక్తి

నాత్మ సర్పణ సేసి య ♦ య్యనఘమూర్తిఁ
బొగడఁ దర మౌనె యమ్మేలి ♦ పూవుఁబోఁడి
యెంత గృశియించె నెట్లుండె ♦ నేమి పలికె
నంతయుఁ దలంచి కర్జమ్ము ♦ నరయవలయు. ౪౬౪

ఉ॥ రాముసకుం బ్రతిష్ఠ నిడ ♦ రాను తలంచు టొకండు రాక్షసా
రామమున స్పృశించుచు వి ♦ రక్తత నాయమ యుండు టొక్కఁడు
ద్దామబలుండు దైత్యపతి ♦ తా నడికింపఁగఁ బూని యుంట యొం
డీమలక ల్స్మరించి తగ ♦ వెంచి వచింపుఁడు మీర లిత్తఱిన్. ౪౬౫

ఆ॥ ఒంటిఁ బోయి చంప♦నోల్లమి నిట్లు రాఁ, గంటిఁ గాని మీరు♦గవిసి రేని
రావణునకె బ్రదుక♦రాదు న న్నదిరించి, యేమిగానివారి♦నెన్న నేల. ౪౬౬

తే॥ అమ్మ కష్టము ల్నా మెదఁ ♦ గ్రమ్మ నలుక
విడువఁబడిన తులాచల ♦ వృష్టి తెఱపి
లేని దై సురలకునేని ♦ లేమిఁ దెచ్చు
నసురు లెంతటివార ల ♦ య్యదనునందు. ౪౬౭

తే॥ ఐంద్రముఖ్యాస్త్రవేత్త య ♦ య్యింద్రజిత్తు
లావుగలఁ డాతని నెదిర్చి ♦ లాఁతి బ్రదుకఁ
డైన వరలాభశక్తిచే ♦ వాని గెల్తు
నానరాదేంద్రుఁ డట తెక్క ♦ లేని పులుఁగు ౪౬౮

తే॥ జాంబవంతుఁ డరులపాలి♦శమనుఁ డనఁగఁ, బాశదండంబు లనరాదె♦పనసనీలు
లలఁతి మైందద్వివిదుల పే♦ళ్లన సుధాశు, లదరుచున్నారు నేఁటి క♦య్యనిఁ దలంచి.

క॥ యువరా జింతటివాఁ డన, నెవరి కగుం దనకుఁ దానె ♦ యెన యగు బలిమిన్
సవరించుఁ దండ్రి మగఁటిమి, గవిసినచోఁ జాలు నింద్రుఁ ♦ గద్దియ నెక్కన్.

ఉ॥ ఏనును మీరు నైనఁ బగ ♦ తెందఱయేనియు రాఁగడంగినన్
బూనిక నుక్కడంచి పొలి ♦ వోయిన యప్పురి రూపుమాపి స
న్మానిత సీతఁ దోడుకొని ♦ నాథునిఁ జేర్చి నమస్కరింప నా
సీనెటఁ బోవు టల్ప మని ♦ యెంచెద మీమది కెట్లు దోఁచునో. ౪౭౧

ఆ॥ అనిన వాలికొమరుఁ డట్ల చేయుద మనె, నెల్లకపులు లెస్స ♦ యిదియ యనిరి
వారి సంభ్రమంబు♦వారించి ధీమంతుఁ, డనియె జాంబవంతుఁ♦డను వెలింగి. ౪౭౨

తే॥ చూచి ర మ్మన్న పని కందుఁ♦జొచ్చి లంక, పాడువడఁ జేసియే వచ్చెఁ♦బవనజుండు
చెట్టగా దది యిపు డేమి♦చెడియె నాథు, నానఁ గైకొని కడమ సే♦యంగరాదె

క॥ ఇమ్మేలివార్త యొడయుం, డిమ్ముగ విని సంతసిల్లి ♦ యిది కర్జ మనన్
సమ్మతిమైఁ బొనరింపఁగ, సమ్మద మగు రండు రాము ♦ సందర్శింపన్. ౪౭౪

ఆ॥ అనిన లెస్స యనుచు ♦ నందఱు హర్షించి, యెగసి రొక్క మొగిన ♦ గగనమునకుఁ
గొండ లెగచినట్లు ♦ గొనకొని మిన్నను, మాట లేక ప్లవగ ♦ మయమకాఁగ.

క॥ మొగిళు లన నాకసంబున, నగపడి రగచరులు హనుమ ♦ నందలమున న
ల్లైగయించిరి దృగ్జ్మండలి, సగర్జితోల్లాస మమర ♦ శైలేంద్రసుతా! ౪౭౬

చ॥ అదనున రాముఁ జేరి ముద ♦ మారఁగ మ్రొక్కద మందు రమ్మ వా
ర్త దయితుఁ డింత విన్న మధు ♦ రం బగు చూడ్కినిఁ జూచు నందు స
మ్మదమున మన్నన ల్నెఱయ ♦ మా నగు నానతిఁ గొంచుఁ దక్క న
య్యదియును దీర్తు మందు దివి ♦ నమ్మెయిఁ బోవుచు వానరోత్తముల్. ౪౭౭

—♦ వానరులు మధువనమును స్వేచ్ఛగా ననుభవించుట ♦—

క॥ అధిపతి మధువన మను నది, యధిగతనందనవిలాస ♦ మయ్యెడ నెదురై
మధురముగఁ దోఁప నాకపు, లధ్షితము దానిఁ జేరి ♦ రమరీసేవ్యా! ౪౭౮

క॥ సుగ్రీవాజ్ఞకు వెఱచి వ, నాగ్రతలం బేనిఁ గానఁ ♦ డన్యుఁడు మును పా
దాగ్రములం బడి కపు లపు, డగ్రసరుం జేసి వేఁడి ♦ రధిపతి సుతునిన్. ౪౭౯

ఆ॥ అతఁడు జాంబవంతు ♦ హనుమంతు లోఁగొని, వారు సమ్మతింప ♦ వనము చూఱ
విడుచుటయును దక్కె ♦ వేవేలు మా కంచు, నుబ్బి గంతు లిడుచు ♦ నుఱికి రబల.

ఉ॥ అవ్వనపాలకు ల్దొడర ♦ నాలము సేసి యదల్చి తోలి దా
దవ్వులనుండి వా రఱవ ♦ ధార్ష్ట్యము సూపుచు వెక్కిఱింపుచున్
గ్రొవ్వునఁ బుట్టతేనియలు ♦ గ్రోలిరి పండులు నారగించి రా
మవ్వము చంచలస్థితికి ♦ మార్పడి యేరడ్పఁ గ్రోఁతు లంగనా! ౪౮౧

క॥ ఆటలఁ బాటలఁ బలుస, య్యాటల మైమఱచి సుంత ♦ యలమట యన నౌ
మాటయు లేక వనాటులు, పాటిల్లరి వనవిహార ♦ పద్ధతి యువతీ! ౪౮౨

సీ॥ మధువులు గ్రోలుచు ♦ మ్రాఁకు లల్లార్చుచుఁ, గుప్పిగంతులు వైచి ♦ కూలఁబడుచు
నొండొరులను గెంట ♦ నుత్సహించుచు నొక్కఁ, డెక్కటిపై నెక్క ♦ నెగసిపడుచుఁ
బలువు రొక్కనిఁ గొంచుఁ ♦ బరువెత్తఁ జూచుచు, నేలపై దొల్లుచు ♦ నింగిఁ గనుచుఁ
దోఁక లాడించుచు ♦ దోఁగాటలాడుచుఁ, బందెము ల్సఱచుచుఁ ♦ బట్టుకొనుచు
బింకమున గిబ్బల మటంచు ♦ ఱంకె లిడుచు, రామగీతులు పాడుచు ♦ రక్తి గనుచు
వారటులు మత్తు లగుచు న ♦ వ్వనముఁ గేళి, లోలత నొనర్చి రల్లక ♦ ల్లోలముగను.

తే॥ వెడఁగునవ్వులు నవ్వుచు ♦ వెఱ్ఱిమాట
లాడఁబోవుచుఁ దొడిఁబడి ♦ యలఁతిపడుచు
నొండొరులఁదప్పు వట్టుచు ♦ నొక్క రొకరి
జాలిఁబడి వేఁడుచు మెలంగఁ ♦ జాలి రార్య! ౪౮౪

మ॥ ఒకచో ట్టెక్కి ద్రుమాంతరమ్ము మొనయన్ ♦ హుమ్మంచు లంఘింతుర్ క్రిం
దికి నమ్మైద్రుమకంగఁ బై కెగయఁగాఁ ♦ దీ రంచు లే కెన్నిమా
ర్లకు నట్లే పొనరింతు రమ్మహమద ♦ ప్రాప్తిష్ఠను ల్గారె జా
తికి మం దున్న నతిప్రసక్తికినిఁ గ ♦ ద్దే నాఁటికి న్నేఁటికిన్. ౪౮౫

ఆ॥ ఒకఁడు పాడుచుండ ♦ నొండొకఁడు హసించు
నొకఁడు నవ్వుచుండ ♦ నొకఁడు డేన్చు
నతనిఁ ద్రోయు నొకఁ ♦ డాతనిపైఁ బడి
యఱచు నొకఁ డిట్టు ♦ లైరి కపులు. ౪౮౬

క॥ ఈరీతి వా రొనర్పఁగ, నారవిజుని మేనమామ♦యగు దధిముఖుఁడున్
సారబలులు వనపాలుర, తో రా నెదిరించి రతని♦దోర్బల మొప్పన్. ౪౮౭

ఆ॥ వారుఁ దొడరి శిలలు♦వర్షింప ధర్షించి, హనుమ యేను గలుగ♦నలఁతిఁ బోకుఁ
డనుచుఁ గీశయోధు♦లందఱఁ బురికొల్పి, యంగదునకుఁ దెలుప♦నాతఁ డడరి.

క॥ తాతం దొడిఁబడఁ గొట్టఁగ, వాతోద్ధతి నభ్ర మట్లు♦వాఁడు విరియఁగా
నాతఁడె వనపాలుర నా, క్రోఁతుల గుమి గిట్టి తఱిమి♦గొనకొని మఱలన్. ౪౮౯

—♦ దధిముఖుఁడు సుగ్రీవునిఁజేరి మధువనభంగము నెఱింగించుట. ♦—

ఆ॥ వనము పా డొనర్ప♦వా రేగి గిచ్చిరి, కఱచి రింక నేమి♦గతి యటంచుఁ
దెలుప దధిముఖుండు♦దెలిసి యమ్మాఁకతో, నధిపుఁ డున్న యచటు♦నరసి కదిసి.

క॥ పాదములం బడి యడలఁగఁ, గా దిటు సేయంగ నేమి♦గతి గలిగె నటం
చాదయితుం డూరార్పఁగ, నాదధిముఖుఁ డనియె నిట్టు♦లల్లునితోడన్. ౪౯౧

ఆ॥ తండ్రినాఁడ యేనిఁ♦దాతలనాఁడేని, నన్న వాలి ప్రోచు♦నప్పుడేని
మధువనంబుజోలి♦మాలిరి కపు లింత, ఘాత సేయఁ గనిరి♦నీతరమున. ౪౯౨

చ॥ వన మటు పాడుసేయఁ జని ♦ వల్దన నమ్మొయి మానరైర ప్రో
ఘను లయి మమ్ముఁ గిట్టి కడి ♦ కండలుగా నొనరింప నంత చు
ల్కన యగు రేల కల్గె నిది ♦ గా దని యీ వదలింపకున్న న
వ్వన మని ప్రోచువార లని ♦ వాకొన లే దిఁక వానరేశ్వరా! ౪౯౩

ఆ॥ వారలేని దొడ్డ ♦ వార నీకొడు కంగ, దుండు పిన్నరాజు ♦ దండిమంత్రి
హనుమ వృద్ధుఁ డరయ♦నాజాంబవంతుండు, గడమవార లైనఁ♦గానివారె.

క॥ దొంగలఁ బురికొల్పి కడు, న్వెంగలు లని యింటివారి ♦ వే మేల్కొనఁ జే
యం గలదె కార్య మే మని, నం గా దనుజీవి కెపుడు ♦ నాథుని మ్రోలన్.

—♦ సుగ్రీవుఁడు మధువనభంగమునకు సంతసిల్లుట ♦—

ఆ॥ అడవి చెడుట యొక్క♦డొడలు న జ్జగు టొండు, మదిఁ గలంప నెదిరి♦మాటలాడ
నేర్చినాడ నాదు♦నేర మెంచక వారిఁ, బిలిచి తగిన యానఁ♦బెట్టు మనిన. ౧౯౬

ఉ॥ ఆకపినాయకుండు మది ♦ నంతయు నారసి యిట్లు సేయువా
రే కృతకృత్యు లౌ కతన ♦ నింత లొనర్చిరకాక శ్రీకరుల్
ప్రాకటసత్త్వ లంచితులు ♦ ప్రాజ్ఞులు వాయుజముఖ్యు లింక నా
యేఁకట దీర వారిఁ గని ♦ యిమ్మెయికర్జ మెఱుంగ మే లగున్. ౧౯౭

క॥ అను నెడ సౌమిత్రియు నే, మని యెద పీ వనుచుఁ జేర ♦ ననఘా! దేవిం
గనివచ్చిరి మనవారలు, హనుమానుఁడె యందు మేటి ♦ యనఁ దగు నింకన్.

ఆ॥ దక్షిణాశ కరిగి ♦ తద్దయు నెలమిమై, నరుగుదెంచినారు ♦ హనుమదాదు
లైన వార లిప్డు ♦ డస్మదీయవనమ్ము, బాడుసేసి రనుచుఁ♦బలికె నితఁడు. ౧౯౯

క॥ కిర్జమున మేలు గని కా, కూర్జితు లక్కపివరేణ్యు ♦ లొంట మధువనం
బార్జవ మెడలఁగఁ జొత్తురె, తర్జింతురె యధికృతుల న ♦ ధర్మం బనరే. ౨౦౦

ఆ॥ అంగదుండు హనుమ♦యలజాంబవంతుండు, నున్నచోట ధర్మ♦వొకఁడు దప్పి
నడువనేరఁ డనఁగ♦న్యాయకోవిదులు వా, రసదుపనుల కొంట♦నఱుమఁగలరె.

ఆ॥ అట్లు గాన వార ♦ లవనిజ నారసి, కాంచి మేలివార్త ♦ కలన నలరి
యంతరమున నిట్టి ♦ సంతర్పణము సేఁత. కాసపడుటకాని ♦ యలఁతిగాదు. ౨౦౨

క॥ ధన్యుల మైతిమి రాము వ, దాన్యుని సేవింపఁగలిగెఁ♦దన్మహిమను సా
మాన్యముగా దియ్యది యను, మాన్యం బనఁ జనదు గ్రుక్కిగ♦మం బగు నింకన్.

మ॥ అనుచు న్రిమునిఁ జేరి మ్రొక్కి ధృతిమై ♦ నయ్యర్థముం దెల్పి య
య్యనఘుం డప్పలు కెంచి చిక్కులనతో ♦ నానందసాంద్రుండు గా
ననిమె న్నామను గాంచి నీ వరిగి నె ♦ య్యం బొప్పఁ బ్రార్థించి చ
య్యన మా యొద్దకు వారిఁ బంప నగు ని ♦ య్యర్థంబుఁ బాటింపుమీ. ౨౦౪

శా॥ సంతోషించితి వారిరాక కటు త ♦ త్సంతృప్తికి న్మెచ్చితిన్
బంతం బొప్పదు నేఁటికర్జమున స ♦ ర్వస్వంబుఁ దారే కొనన్

జింతింపంజుమి దీని కేమనవలె ♦ న్నీఘుప్రింబె పొమ్మింక మ
త్స్వాంతం బుల్లసిలె న్నదర్పితలస ♦ ద్వాక్యోపహారంబునన్. ౫౦౫

మ॥ అనిన న్మే లని తోడివారెనసిరా ♦ నవ్వాఁడు దోఁతెంచి యా
ఘనులం గన్గొని దోసిలొగ్గి కడఁక ♦ న్గన్గాన కే మి మ్మెది
ర్చిన నేరమ్ము సహింపుఁడా విభుఁడు మీ ♦ స్నేహమ్మె పాటించి యొ
య్యనఁ బుత్తేరఁగఁ బంచె ధన్యతములా ♦ రా! యేగుఁ డచ్చోటికిన్. ౫౦౬

ఆ॥ అంగదుండ కాఁడె ♦ యంతకు నధికారి, యతని యాన కేనె ♦ యడ్డడంగ
ముదిమి గదిసినంత ♦ మూఁడు దార్లనుభంగి, జెనకినాడ సిగ్గు ♦ జెందినాడ. ౫౦౭

క॥ సన్మార్గము గొని వేగమె, సన్మాన్యులు మీర లింకఁ ♦ జనుఁ డవ్వారల్
తన్మయత మిమ్ముఁ గనుఁగొన, నుస్మిషితవిలోకనముల ♦ నుండెద రనినన్. ౫౦౮

ఆ॥ అంద ఱొక్క రొకరి ♦ నలరుచుఁ గనుఁగొని, రంగదుండు వారి ♦ ననుమతింపఁ
జేసి తోడుకొనుచుఁ ♦ జెచ్చెర లంఘించె, గగనతలము చిత్రి ♦ కలనఁ దనర. ౫౦౯

చ॥ కిలకిల లొప్ప రామపద ♦ కీర్తనము ల్పొనరించుచు న్మహో
జ్జ్వలతను లై ప్రహర్షమునఁ ♦ జయ్యన వచ్చు ప్లవంగవర్యులన్
గలయఁగఁ బర్వు వేడ్కమెయిఁ ♦ గన్నులు చల్లఁగఁ గాంచి యర్కజుం
డలరుచు రాముఁ జేరఁ జని ♦ యాఘనుఁ డూఱడిలంగ నిట్లనున్. ౫౧౦

ఆ॥ నిన్నుఁ గన్న తల్లి ♦ నియతి సుప్రజ రామ, జయముఁ గాంచి తింక ♦ సంశయింప
నేల కపివరేణ్యు ♦ లేతెంచుచున్నారు, కార్యసిద్ధి తమ వి ♦ కాసముగను. ౫౧౧

ఆ॥ చూడఁబడియె దేవి ♦ చూచివచ్చినవాఁడు, హనుమ గాని యన్యుఁ ♦ డనఁగఁ బోల
దతని తలఁపు పెద్ద ♦ యలఁతిబోకవ్వాని, పౌరుషంబు పగలుఁ ♦ బరిభవించు. ౫౧౨

క॥ అంగదుఁ డురుతేజస్స్ఫురి, తాంగదుఁ డానందసాంద్రుఁ ♦ డై యటు లేతే
రం గాంచు చూడ్కుల న్మన, యంగద గడచె నని నొడువ ♦ ననుమానంబే.

క॥ కాననచరవరు లవనిజఁ, గానంగని కానినాఁడు ♦ కాఁపునఁ గల మ
త్కాననము సొరరు ప్రీతులు, గా నిటరా రవధి గడువఁ ♦ గా మన రనఘా!

క॥ అని సుగ్రీవుఁడు దెలుపఁగ, ననుపమహర్షమునఁ బొదలి ♦ రన్నయు దమ్ముం
డును హరివీరు లనిలగతిఁ, జనుదెంచిరి సవిధమునకు ♦ సరసగుణాఢ్యా! ౫౧౫

ఆ॥ కార్యకర్త హనుమఁ ♦ గదిసియుయ్యువరాజు, మున్ను గాఁగఁ గపులు ♦ మొనయరాఁగఁ
దోఁక సాఁచి మొగిచి ♦ తొంగలిచూడ్కులఁ, జూచెఁ గీశవిభుఁడు ♦ శుద్ధచరిత.

క॥ సన్నిధికి డిగ్గి పర్వత, సన్నిభు లమ్మువ్వురకును♦సరగ నెఱిఁగి తా
రున్నయది కుశలముగ భువి, కన్నియ నియతిమెయి ననిరి♦కపు లణుమధ్యా.

ఆ॥ సంతసమున వారు♦సహాయుక్తిఁ దెలిపిన, హనుమ దెసకె ప్రాఁకె♦నధిపు దృష్టు
లంతరాత్మ తా ని♦యంత గాఁ దన నెట్టు, లమరయావతస్తు♦తాత్మచరిత! ౪౧౮

క॥ ఉప్పొంగెడు ప్రేమదాంబుధి, యుప్పరమున నదికి నెగయు♦నో యనఁ దలఁపు
ల్కుప్పిరిగొన రాముఁడు తెఱఁ, గొప్పఁ బలికె బోధ్యమాన♦యోగవిలాసా.

ఉ॥ ఏయెడ నెట్టు లున్నయది ♦ యేవిధి నే మని పల్కె సీత త
న్నాయక చుట్టుకొన్న వెత ♦ పా లయి యెమ్మెయిఁ గాననయ్యె న
న్నేయనువృత్తి నెంచెఁ దెఱఁ ♦ గెయ్యది యింతయు నానఁ దెల్పి నా
యీయెడ నాముకొన్న వ్యథ ♦ లెల్లఁ దలంగఁగఁ జేయుఁ డిత్తఱిన్. ౪౨౦

—♦ శ్రీరామచంద్రునకు హనుమంతుఁడు సీతామహాదేవి వృత్తాంతముఁ దెలుపుట. ♦—

ఆ॥ అని వచించునంత♦నంతయు నెఱిఁగిన, వాని హనుమ నెల్ల♦వానరులునుఁ
బ్రేరణం బొనర్పఁ♦బృథివీతనూజ క, ద్దెసకు మ్రొక్కి పలికె♦ధీరుఁ డగుచు.

సీ॥ నేఁ దోడివారితో♦నీయానఁ గొని యేఁగి, దక్షిణదిశఁ బెద్ద♦తడవు దిరిగి
యందఱ వీడ్కొని♦యబ్ధి దాఁటి సువేల, నగ మెక్కి లంక నా♦నాఁడె కంటి
నది త్రికూటాద్రిపై♦నమరి రావణుపాలి, సిరి నాఁగఁ జూపట్టఁ♦జెలువ మెంచి
తొడరి రాత్రిముఖమ్ము♦తోఁ జొచ్చి రే యెల్ల, కందువ ల్శోధించి♦కానలేక
కలఁగి త్వత్పదధ్యానంబె ♦ కలఁకఁ దేర్ప
నచటువాసి యశోకవ ♦ నాంతరమున
మనము వాక్కర్థమును భవ ♦ న్మయము కాఁగ
నున్న యొక్క సుశీల సం ♦ పన్నఁ గాంచి. ౪౨౨

క॥ లక్షణముల భూజగ నుప, లక్షించితిఁ బిదప వాక్కు♦లన నరసితిఁ ద్వ
ద్దీక్షిత యున్నది మృగి వలె, రక్షస్స్త్రీవ్యాఘ్రి లొంట♦రక్షింపంగన్. ౪౨౩

క॥ వా రనిశము ధర్షింపఁగ, వారని శోకమున మునిఁగి♦వలనఱఁ గృశ యై
పేరునకుఁ గలదు మును దన, తీ రెఱిఁగియు నెఱుఁగరాదు♦తేజునఁదక్కన్.

తే॥ మంచు గ్రమ్మిన నెఱి సెడి ♦ మలిన యైన
పద్మినియ యయ్యె నిప్పు డ ♦ ప్పద్మవదన
యెన్నఁడు నిశాటపీడనం ♦ బెడయఁగాంచి
యినుఁడ! త్వత్కరలాలనం ♦ బెనయఁగలదొ. ౪౨౪

తే॥ ఆమె భవదేకచింతాప ♦ రాయణ యయి
నెఱులు జడఁగట్టి ముంగురు ♦ ల్మెఱసి నెమ్మొ
గమ్ముఁ బీడింప దీన యై ♦ కడకుఁ ద్రోఁచి
వగచుచున్నది యిలఁ బడి ♦ వాసి సెడఁగ. ౧౨౬

క॥ ఆనాఁటికట్టుపుట్టమె, యీనాఁటికిఁగాఁగ నింక♦నేమనవలె న
మ్మానిని యవస్థ యాయమ, నీనెఱిఁ గని కాక నిలుచు♦నే యొంటొంటన్.

తే॥ రక్కసు లొనర్చు రాయిడి ♦ రామ యోర్చు
బహుతృణంబుగ రావణై ♦ శ్వర్య మెంచుఁ
ద్వద్వియోగభరమ్మునఁ ♦ దాళలేక
మేను దొఱఁగంగ నున్నది ♦ మిహిరకులుఁడ! ౧౨౭

క॥ పతిసక్తియు నీదెస సం, తతభక్తియు నొక్కఁడై స్వ♦ధర్మంబున జీ
వితసుమము వ్రాలనీయని, తతబంధము కాఁగ నుండె♦దశరథతనయా! ౧౨౮

క॥ మును దపము ఫలమె తా న, య్యును నీవిరహమున వ్యథకు♦నోడి జనకనం
దిని తప ముగ్ర మొనర్చెను, దనభాగ్యమునందుఁ గొఱఁత♦దలఁగఁగ రామా.

తే॥ నిన్నుఁ గాంచిన కనుల న ♦ న్నలఁతఁ గాంచి
రామరామాయనెడు నుడి ♦ రాణ నెంచి
విరహదశ నేకగతి నిడ్డ ♦ విధిఁ దలంచి
నీదు పరభాగ మామెగా ♦ నిర్ణయించి. ౧౩౦

క॥ కడఁగి భవద్వంశంబునఁ, బొడమిన ముత్తెముల మేలి ♦ పొలుపుఁ దెలుపఁగాఁ
దొడరితిఁ దావకగుణమణు, లెడనెడఁ గూర్చితి సుహార♦మిది యని యిడితిన్.

క॥ ఆయమ్మ నమ్మి యాదట, నీయర్థము లెల్ల నడుగ♦నే విసచితి నా
పాయమున మొలసితలిర్చెను, న్యాయమన రె యమృతమున గొ♦నం బిది యనఁగన్.

తే॥ నీదు రూపు నిరూపించి ♦ నీమహత్త్వ, ముగ్గడించి హరిపు సఖ్య ♦ మోజ నెంచి
యూర్మిక నొసంగ నద్దేవి ♦ యుల్లసిల్లి, కలికికన్నుల నద్దానిఁ ♦ గప్పకొనియె.

క॥ గద్గదిక వొడమ రోమాం, చోద్గమ మొప్పార నామె ♦ యొకవిధమున నై
హృద్గతుఁడ వైన నీదు ల, సద్గుణయోగమున పరవ ♦ సంబున నొప్పెన్.

తే॥ అంగుళీయక మని వ్రేళ్ల♦నమర నేర, దనిన ముంజేతి కంకణం♦బనఁగ నయ్యొ
నేమిచెప్పుదు నయ్యయో♦యినకులీన, తలిరుఁబోఁడి యవస్థ త♦ద్దైవ మెఱుఁగు.

వ॥ పదంపడి భవదీయంబు లగు మేలిప్రసంగంబులవలన నమ్మహనీయ ప్రకృతి
భావం బంది యొక్కింత విలసిల్లం గాంచి యమ్మా! నేఁ బోయివచ్చెద నెద్దియేని

యొక్కం డభిజ్ఞానం బొసంగు మనిన దెసలకుం జూడ్కులు నియోగించి యాలో
చించి యోజన నెఱింగి తనదు కొంగుముడిన యిమిడియున్న శిరోరత్నంబు
నన్నారీరత్నంబు నాదోయిఁట నిడి మత్ప్రాణనాథునకు సమర్పింపు మని కనుగొల
కుల నీరు నించి యిద్దాని యనుభావంబునం జేసి యెట్టియనర్థంబులవలనను బడ
ల్పడకుంటి నియ్యదియు నడియాలం బై నాయకుని యోలంబున కాసపడి యరి
గెడు మీఁదట నాదగు నవస్థాంతరం బెట్లు సెల్లెడునో యెఱుంగఁజాల జాల్మం
డా రక్కసుం డిడిన గడువు గడువఁ గడమపడినయది యొక్క మాసంబ యా
సమయంబె మజ్జీవితాంతసమయం బగు నని నిర్ణయించినయదియే కద జీవితేశు
నకు నాయాస కలదేని నాయాస మనక యాలోనన యడ్డుపడి కాపాడుకొమ్మని
సమ్మతిపడ నొడివి పున్నంబు గట్టుకొమ్మని యమ్మానినీతిలకంబు పలువిధంబు
లగు దీనాలాపంబులు వలికిన. ౫౩౭

ఆ॥ ఆమె యాఱడిల్ల ♦ నాయావిశేషము, దెలిపి వచ్చినాడ ♦ దీనిఁ గొమ్మ
టంచు మణి నొసంగె♦హరివరేణ్యుఁడు దాని, నందుకొనియె రాముఁ♦డాదరమున.

క॥ అద్దాని నెదకుఁ దారిచి. ముద్దియ వెత లెంచి మనసు ♦ మునుఁగ మునిఁగె సం
పద్దయితుఁ డతఁ డతనిఁ గని, తద్దయు ఘూర్ణిల్లె నతని ♦ తమ్ముఁడుఁ దరుణీ !

క॥ లోకానుసరణ మమ్మెయి, లోకము నట్టు లొనరింప ♦ లోలాత్ముల కిం
కేకరణిఁ గలదు గతి య, స్తోకప్రీతిభానుభావ్య ♦ సుఖచిద్రూపా !. ౫౪౦

—♦ శ్రీరామచంద్రుని వివశత్వము ♦—

ఆ॥ శోకవివశుఁ డగుటఁ ♦ జూచెనో చూడనేఁ లేదొ తత్ప్రసక్తి ♦ లేమఁ దలఁచి
కనుల నశ్రువితతి ♦ గ్రమ్మఁగా సుగ్రీవుఁ, గాంచి రాముఁ డనెని ♦ కామసామ్య!.

ఆ॥ వత్స వత్సిమమున ♦ వఱలు గో వట్టు లి, మ్మణిని గాంచినంత ♦ మతి కరంగి
యవశతను ఘటించె ♦ సద్దేవి విడి యిట, వచ్చె దీని కింక ♦ వాసి గలదె.

ఆ॥ పెండ్లివేళఁ బ్రీతి♦పెనుపొందఁగా నిచ్చె, జనకుఁ డాత్మజకు వి♦శాలదృష్టి
దానిఁ దాల్చి సీత♦తద్దయు శోభిల్లె, మాఱు లేని దిదియొ♦మణియొ యనఁగ.

క॥ తనపుట్టువు వార్ధిని స, జ్జనపూజిత మిదియు దీని♦జనపతి కింద్రుం
డనితరసులభం బని యొసఁ, గెను దత్కృతమఖవిశేష♦కీర్తనపరుఁ డై. ౫౪౪

క॥ ఆతఱి మజ్జనకుఁడు ఘనుఁ, డాతతమతి సంతసిల్లె♦నటు లౌటను మ
చ్చేతోగతి కయ్యిరువురు, సీతయుఁ గనుపట్టి రిట్టి♦సిలుగునయందున్. ౫౪౫

క॥ ఎన్నఁడుఁ బాయక యయ్యెడ, నున్నది యున్నట్లె రాఁగ♦నుర్వీజఁ గనుం
గొన్నట్టు లయ్యె నయ్యది, యెన్నఁటి కగునో ప్లవంగ♦మేశ్వర యింకన్. ౫౪౬

ఆ॥ తృష్ణఁ గొనినవానిఁ♦దేర్పఁ జల్లని నీరు, చిలికి నట్టు లేమి♦పలికెఁ దెలుపు
మయ్య! హనుమ! మఱియు♦నద్దానఁ బునరుక్తి, లేద యెదిరి తృప్తి♦లేమిఁ జేసి.

ఆ॥ ఇంతకన్నఁ గష్ట♦మేది లక్ష్మణ! సీత, రాక మఱియ యొంటి♦రాఁగ దీనిఁ
గాంచుచున్నవాఁడఁ♦గలుషాత్ములకు సుఖ, మెట్లు దక్కుఁ బున్నె♦మేమి గలుగు.

క॥ నెలమాత్రము జీవించిన, గలకాల మ్మొందు ననుచుఁ♦గలికి పలికెఁబో
నెలగా దొక కలయేనియుఁ, గలదే నా కింక నబలఁ♦గానకయున్నన్. ౫౪౯

తే॥ భీరుభీరువు సతి యెట్లు ♦ పెనుపు దక్కి
రక్కసుల రాయిడిం బడి ♦ రాణ పెడఁగ
నుండెనో వార్త వినినంత ♦ నొదవదు ధృతి
నన్నుఁ గొనిపొమ్ము తమ్ముఁడా ♦ నాతికడకు. ౫౫౦

తే॥ తమము వారింప నేర్చు న♦త్తరుణి మోము, శారదసుధాంశుమండల♦సహజననము
నేఁటిగతి రాక్షసీజన ♦ నీరదాళి, పొదువ నెమ్మోయి నమ్మోటి♦పొలుపు పెడెనో.

తే॥ నన్నుఁ బాసి కృశించు న♦య్యన్నుమిన్న, మధురమధురాలపనము ల♦మర నొసంగి
నట్టి సందేశ మందింపు♦మయ్య రోగి, కౌషధం బట్టు దాన నా♦యార్తి గెడయు.

క॥ అని రఘురాముఁడు నొడివిన, విని వాయుతనూజుఁ డనియె♦విదితాఖిలభా
వన! తనపలుకులుగా నా, జనని వచించె నవి నీకుఁ♦జను నరయంగన్. ౫౫౩

— ♦ హనుమంతుఁడు శ్రీరామచంద్రునితో సీతాసందేశ మెఱిఁగించుట ♦ —

ఉ॥ ముం దొకనాఁడు ముంగురులు ♦ మోముల నాడఁగ స్వేదబిందువు
ల్చిందఁ గరంగి చుక్క పెడఁ ♦ జేరఁగఁ గన్గొని సూటి యా నెడన్
బొందిన బొమ్మరాతిపయిఁ ♦ బోలఁగ బొట్టిడి నాదు నెమ్మొగం
బం దది దోఁప నవ్వి నను ♦ నట్లు నగించితి ప్రాణనాయకా! ౫౫౪

సీ॥ మును జిత్రకూటంబు♦నను నీవు నేనును, వనవిహారము పేర్మి♦మొనయఁ గాంచి
విశ్రమించితి మొక్క♦విరిపూవుపొద పొంత, సుఖసుప్తిఁ గంటిమి♦చొక్కియుంట
ముందు నే మేల్కొన♦మొనకొనునంతలోఁ, జెట్ట కాక మొకండు♦సేరి మాంస
కాంక్ష నక్కునఁ జీఱఁ♦గా రక్తబిందువు, ల్చిందిన నెమ్మేను♦చెమ్మగిల్ల
నీవు నిద్దుర చాలించి ♦ నియతిమై ని
షీకమునను బ్రహ్మాస్త్రమ్ము ♦ సేర్చి పనుపఁ
దిరిగి ముల్లోకములఁ గాచు ♦ తెఱఁగు గాన
కభయ మి మ్మంచు వ్రాలెఁ ద్వ ♦ దంఘ్రులందు. ౫౫౫

క॥ అది శక్రాపత్య మ్మని, మదమున నిటులయ్యె ననియు ♦ మానితగుణ! త్వ
త్ప్రదరమునకుఁ గన్నిడు మన, బ్రదికితి నని యట్లొనర్చి ♦ ప్రణుతించి చనెన్.

ఆ॥ నాఁటిదానఁ గానొ ♦ నాకాల మిది కాదొ, యేల యిప్పు డింత ♦ యెరవు సేయ
నీవు దలఁచి నంత ♦ నిఖిలలోకమ్ములు, వడఁక వొక్క నాయ ♦ వస్థ చనదొ. ౫౫౭

క॥ తమ్ముఁడు నీవు నిలిచి విం, డ్లమ్ములుఁ గొన నెదిరి బ్రదుకు ♦ నట్టిఁడు సృష్టి
న్బమ్మ పొసరించెనే యెద, డిమ్మరపొ వ్రాలఁబోరె ♦ దివిజులయేనిన్. ౫౫౮

క॥ నాకలుషము ఫల మిది యని, నాకనిన దె కాక నాక ♦ నాయకనుత! యెం
డేకొఱఁత గలదు నీయెడఁ, జేకొని మోక్షంబు నొందఁ ♦ జేయుము కరుణన్.

ఆ॥ అనుచు నశ్రుపూరి ♦ తాస్యయు బాష్పసం
దిగ్ధభాషిణియును ♦ దీనయు నయి
నాదు ప్రాణనాథు ♦ నకుఁ దెల్పు మన నేను
నిట్టులంటినయ్య ♦ యినకులేంద్ర!. ౫౬౦

ఆ॥ అమ్మ రాముఁడేని ♦ ననఘుఁడు లక్ష్మణుం
డేని నొండు భావ ♦ మెనయఁబోరు
తా వెఱింగి నంతఁ ♦ దడయక దహియింతు
రిప్పురమ్ము రాక్ష ♦ సేంద్రు బలము. ౫౬౧

తే॥ వారి పరితాప మి ట్లని ♦ వలనుపడదు
తెలుపఁగఁ బ్రమాణ యుక్తి నేఁ ♦ దెలుపువాఁడ
రావణు వధించి వే నిన్ను ♦ రాముఁ డెలమిఁ
గీర్తితోఁ గొనిపోవు సా ♦ కేతమునకు. ౫౬౨

క॥ తప్పదు నాపలు కని నే, నప్పతిదేవతకుఁ దెలిపి ♦ యంబరొ యిఁక నా
కొప్ప దిచట నిలువఁగ నని, యప్పగిదిఁ బ్రయాణ మైన ♦ నార్తి నెలకొనన్.

ఆ॥ పలికె నామె దూర ♦ బంధువు నగు నాకు
నీదు పలుకు లమృత ♦ నిర్ణయంబు
సేయఁ జాలె నిట్లు ♦ శ్రీరాము కథలచే
నొక్కప్రొద్దు గడపు ♦ మోపి వత్స!. ౫౬౪

క॥ నినుఁ గాంచి నీదు నొడువులు, విను నది మొద లింతవఱకు ♦ వెత తలఁగెను నీ
చనినయది యరసి రక్కసు, లనువు సెడఁగ నెట్టి బాధ ♦ లందించెదరో. ౫౬౫

సీ॥ అని నొగిలినఁ గాంచి♦యమ్మ! నే నిను రాముఁ, జేర్తు నిప్పుడె యాజ్ఞసేయు మంటి
నది యనౌచితియొంటి♦నంట నెఱింగి దా, నవ్వుఁగూల్చి ననుఁ గొంచు♦నాథుఁడరుగ
నగు నన్న మే లని♦యందఱుఁ గొనివత్తు, ననిన నీ కగుఁగాక♦యన్యు లెట్లు
రానోపుదు రటంచు♦మానిని వలుకంగ, నను మించువారె యు♦న్నా రటంటి

నెట్లు సేర్చెదొ రాముఁనా♦యెడరుఁ బాపు, దెట్లొ యంతకు నీభార♦మింకవత్స!
పోయిర మ్మమరులు నిన్నుఁ♦బ్రోచుచుంద్రు,గావుత మటంచు సెలవిడఁ♦గాఁదలంగి.

—♦ హనుమ రామచంద్రునితో లంకలోఁ దా నొనర్చినవి చెప్పుట. ♦—

క॥ ఊరక పో నే మగు నని, సారతమం బసుగవనము♦సమయించి సుదు
ష్ప్రారబలులఁ గాఁపరులను, మారిమసఁగి యచటఁ గల వి♦మాన మగల్పన్.

ఆ॥ ఆతఁ డరసి కింక ♦ రాఖ్యుల వేలకొ, లంది కనుప వారి ♦ లావుమెయి మ
డంచినాడ మించు♦సంచుతోఁ బంచసై, న్యపుల మంత్రిసుతుల ♦ నడఁచినాడ.

క॥ అక్షుఁ డను కొడుకు ననిచిన, నక్షయు నాతనిఁ దెరల్చ♦నతిబలుఁడు మహా
దక్షుం డింద్రజిదాఖ్యుం, డక్షముఁ డై నన్నుఁ జేర♦నరుదెంచుటయున్. ౫౧౯

ఆ॥ వాని సైన్యరాజి ♦ వసుధ పా లొనరింప, వాఁ డెఱింగి యొంట ♦ వలనుపడమిఁ
బట్టు పట్టి నన్ను♦బ్రహ్మాస్త్రమునఁ గట్టి, యసురసభకుఁ గొంచు♦నరుగుటయును.

ఉ॥ వేగమె యస్త్రశక్తి నను ♦ వీడి చనె న్విధియాజ్ఞఁ దోడుతో
నేఁగితి దైత్యనాథుఁ గన ♦ నింత యెఱింగి యతం డదల్చినన్
నీగరిమంబు వాని కృతి ♦ నీచత నే వివరింపఁ జంప నై
సాగెను గూడ దిప్పని య ♦ సంగత మంచు వచించెఁ దమ్ముఁడున్. ౫౨౧

తే॥ ఆవిభీషణుఁ డటు దెల్ప♦నదరిపడుచుఁ, గాలవశమున నాతోఁకఁ♦గాల్చు మనియె
వా రటు లొనర్ప నయ్యగ్ని♦వలన లంక, నిరవశేష మొనర్చితి♦నిష్క్రియముగ.

ఆ॥ అగ్ని తోఁకఁ గాల్పఁ♦డటుగాక చందన, శిశిరుఁ డయ్యె ననుచుఁ♦జెప్ప నేల
నింక నెవఁడు నీదు♦కింకరుం డగు వాని, నాకృతాంతుఁడేని♦నరయఁగలఁడె. ౫౨౩

క॥ దేవిని మరలఁ గనుంగొని, దీవన గొని తెరువుఁగొంచు♦దేవర పదరా
జీవముల దరికిఁ జేరితి, నేవినిచిన తెఱఁగ రసిన♦నేర మొ వలనొ. ౫౨౪

ఆ॥ మదినిఁ జక్కఁగా వి ♦ మర్శించి యింకిటఁ
జేయు కర్జ మాజ్ఞ ♦ సేయుమయ్య

కింకరుండఁ గరుణ ♦ గీల్కొన దృక్ప్రసా
రముల నెఱపుమయ్య ♦ రామ! యనిన. ౧౭౭

ఉ॥ శ్రీమహితమ్ము నెమ్మొగము ♦ శీతమయూఖుని గేరిణి సేయ గీ
ర్వాభవిని చిద్విలాసము ద ♦ రస్మితవిస్ఫురణంబు దెల్ప హృ
ద్భూమి సహర్షవర్ష యయి ♦ దోహదసస్యముఁ దేర్ప సద్గుణో
ద్దాముఁడు రాముఁ డిట్టు లనెఁ ♦ దత్పరులై రవిజానుజుల్వినన్. ౧౭౮

—♦ శ్రీరామచంద్రుఁడు హనుమంతుని సన్మానించుట ♦—

ఆ॥ ఇతఁ డొనర్చినట్టి ♦ యీకృతి దుష్కర, దివిజులకును బ్రహ్మ ♦ దేవునకును
నింత సేయువాఁడె ♦ యెక్కటి చని యొండు, మనిచె వీఁడు జగము ♦ మనుకులమ్ము.

క॥ అన్నా! యిటు రార మ్మను, సన్నాహము సాంద్రతరర ♦ సప్రస్పృతము గా
నన్నేత హనుమ! నీకృతి, గన్న ఫలం బనుచు గ్రుచ్చి ♦ కౌఁగిటఁ జేర్చెన్.

ఆ॥ ఎవని దృక్ప్రసార ♦ మీరేడుజగముల, వారు గోరి నంత ♦ వలచు ముక్తి
కాంచె నట్టిదేవు ♦ గాఢపరీరంభ, మనిలజుండె ధన్యుఁ ♦ డచలతనయ!. ౧౭౯

క॥ ఆనందసాంద్రుఁడై పవ, మానాత్మజుఁ డొప్పెఁ బ్లవగ ♦ మండలి పొగడన్
దా నినజసహితుఁడై సీ, తానయనకృతిప్రసక్తి ♦ నధిపతి యుండెన్. ౧౮౦

ఆ॥ సురుచిరప్రవృత్తి ♦ సుందరకాండమ్ముఁ, జదివి విని నరుండు ♦ జయముతోడ
నెల్ల శుభము లందు ♦ నిలఁ గలకాల మ, య్యమృతపదము తత్క ♦ రామలకము.

వ॥ అని విశ్వాత్మకుఁ డగు చంద్రావతంసుండు శ్రీరామచంద్రు చరితం బపూర్వా
మృతస్రుతిభరితంబుగా వినిచిన నాచంద్రవదన యానందపారావారంబునం దోఁగి
యవ్వలని వృత్తాంతం బెఱిఁగింపవే యని వల్లభునిం బ్రార్థించుటయు. ౧౮౨

—♦ మం దా క్రాం త ♦—

సాహంకారోద్యతకరణదు ♦ ర్వ్యాప్తివిధ్వంసిదేశా
నేహస్సంధానియుతివిలస ♦ న్నిత్యలీలామహత్త్వా
ఊహాపోహాభ్యుదయకలనా ♦ యుక్తసంపద్విధాయి
స్వాహాకారప్రచయరచనా ♦ చారదత్తావధానా!. ౧౮౩

క॥ వైదికమార్గనిరోధకకృ, దాదిమసురహాననరతమ ♦ హాబలసంభూ
తోదారభావచారణ, మోదావహసర్వబంధ ♦ ముక్తిప్రసితా!. ౧౮౪

స్రగ్విణి॥ అక్షసంసాదసా ♦ ధ్యక్ష దేవేంద్రజి
త్పక్ష సంధుక్షితా ♦ పారసేనావలీ
కక్ష దావానలా ♦ క్రాంతిమల్లక్ష్మతా
లక్షితాత్మీయహే ♦ లాపురారిప్రథా !. ౫౮౫

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందు
సుందరకాండంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ






## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 26 | 20 | జ్ఞా | జ్ఞాన | 106 | 15 | అంగి | ఱంగి |
| 36 | 16 | భో | భోప | 121 | 19 | పయ | వయవ |
| 52 | 22 | లల్ప | ల్ప | 124 | 15 | పిం | పింపం |
| 56 | 15 | లలీ | లీల | 132 | 15 | ల్పాల్కి | ల్కాల్పి |
| 60 | 28 | తర | తల | 151 | 21 | ర్మ | ర్శ |
| 63 | 7 | దద | డఁద | 156 | 16 | కఁజ | కఁబ |
| 105 | 4 | డమ్మను | మ్మను | 165 | 22 | రడ్ప | ర్పడ |